# చింతా దీక్షితులు సాహిత్యం

సంపాదక వర్గం
డాక్టర్ వెలగా వెంకటప్పయ్య
రెడ్డి రాఘవయ్య
చింతా మల్లికార్జునమూర్తి
డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు
బుర్రా సుబ్రహ్మణ్యం
బుడ్డిగ సుబ్బరాయన్

ప్రచురణ
**చింతా దీక్షితులు శతజయంతి ఉత్సవ సమితి**
హైదరాబాద్

చింతా దీక్షితులు సాహిత్యం
సంకలనం - 1996


90 E, శాంతినగర్, అన్నానగర్
మద్రాసు - 40

ప్రచురణ :
చింతా దీక్షితులు శతజయంతి ఉత్సవ సమితి
హైదరాబాద్

టైప్ సెట్టింగ్ :
అనూ గ్రాఫిక్స్
హైదరాబాద్

పేజ్ లేఔట్ :
సుంకే సాంబశివరావు
అనూగ్రాఫిక్స్

ముద్రణ :
అనూ గ్రాఫిక్స్
మద్రాసు

ముఖ చిత్ర రచన :
ఏ.బి.వి.ఎస్. ఆనంద్

# ఈ సంకలనం...

బాలవాఙ్మయ బ్రహ్మ చింతా దీక్షితులు గారి శతజయంతి ఉత్సవాలను జరపాలని తెలుగు బాలల రచయితల సంఘ అధ్యక్షులు 'మద్దులూరి రామకృష్ణగారు' తరచు గుర్తుచేస్తూ వచ్చారు వాస్తవానికి ఈ ఉత్సవాలను 1991లోనే జరిపితే బాగుండేది మిత్రులు బుడ్డిగ సుబ్బరాయన్ గారి పట్టుదల, తోడ్పాటు పూనికతో ఇప్పటికైనా జరపగలుగుతున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాము ఇందుకు వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము

గ్రంధప్రచురణ ఈనాడు సామాన్యులు చేయగలిగింది కాదు దీక్షితులు గారి రచనలు వెలుగు చూడని ఉత్సవాల నవల ప్రయోజనం అంతగా ఉండదు ఈ దశలో దీక్షితులుగారి రచనలలో అధికభాగం ఈ సంకలనంగా పునర్ముద్రించి, మహోపకారం చేసినందుకు ప్రత్యేక ధన్యవాదాలు సమర్పిస్తున్నాము ఈ తోడ్పాటువలన దీక్షితులుగారి రచనలు మరికొన్ని దశాబ్దాల పాటు పిల్లలను ఉత్తేజపరచగలవని నమ్ముతున్నాము దీక్షితులుగారి రచనలు బాలవాఙ్మయంలో మణిపూసలనే విషయం గమనించదగినది

గత మూడు దశాబ్దాలుగా దీక్షితులుగారి రచనలు ముద్రణలో లేవు వీరి రచనలను పిల్లలు ఎక్కువగా చదవడం వలన దాదాపు అన్ని గ్రంధాలయాలలోనూ పూర్తిగా చిరిగిపోయి లభ్యంకావడం లేదు ఈ దశలో దీక్షితులుగారి రచనలు పూర్తిగా సేకరించడంలో విశేష శ్రమకోర్చి తోడ్పడిన మిత్రులు రెడ్డి రాఘవయ్య, లంకా సూర్యనారాయణ వెంకటేశ్వరరావు, కె వి జి మల్లిఖార్జునరావు (సారస్వత నికేతనం, వేటపాలెం), రుద్రరాజు సత్యనారాయణ రాజు (శ్రీరామచంద్రా గ్రంధాలయం, పోడూరు) ఆళ్ళ రాఘవయ్య, శ్రీమతి పి విజయశ్రీ (చీరాల) గారి సహకారానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము ఈ ప్రయత్నాన్ని వారి కుటుంబ సభ్యులు హర్షించి, సహకరించి వారివద్ద గల రచనలు, సమాచారాన్ని అందించిన వారి పుత్రులు మల్లిఖార్జున మూర్తిగారికి, మా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము

ఈ సంకలనాన్ని ఇంత సమగ్రంగా తీర్చి దిద్దడంలో తోడ్పడ.. సంపాదక మండలి సభ్యులు రెడ్డి రాఘవయ్య, డాక్టర్ అక్కిరాజురమాపతిరావు, చింతా మల్లికార్జునమూర్తి, చొక్కాపు వెంకటరమణ బుర్రా సుబ్రహ్మణ్యాం ప్రభృతులకు శతజయంతి సంఘపక్షాన మా అభినందనలు తెలియజేస్తున్నాను

**వెలగా వెంకటప్పయ్య**

# విషయసూచి

# బాలల గేయాలు

# లక్కపిడతలు

## 1. కమలాలు

చిట్టి చిట్టి కమలాలు
చెరువులోని కమలాలు
నవ్వేటి కమలాలు
నాకు తెచ్చిపెట్టే
అమ్మ తెచ్చిపెట్టే
ఆడుకొంటాను
తెల్లచీరె కట్టుకొని
మెల్లగాను నవ్వు తున్న
నీటిమీద పండుకొన్న
చిట్టి చిట్టి కమలాలు
అమ్మ తెచ్చి పెట్టె
ఆడుకొంటాను
బువ్వతినను బజ్జోను
నవ్వమంటే నవ్వను
నీకు ముద్దు పెట్టను
చిట్టి చిట్టి కమలాలు
తెచ్చి పెట్టితేగాని !
అమ్మ తెచ్చి పెట్టే
ఆడుకొంటాను

## 2. బాజాలు

బాజాలు రా నాన్న, బాజాలు
బాజాలు వచ్చాయి బాజాలు
అమ్మనీ పిలవరా బాజాలు
అక్కనీ పిలవరా బాజాలు
అందరినీ పిలవరా బాజాలు
అవిగోను చూడరా బాజాలు
బాజాలు ఇక్కడా బాజాలు
బాజాలు అక్కడా బాజాలు
కాగడాల్తో వచ్చె బాజాలు
ఖంగునా మోగాయి బాజాలు
బాజాలతో వచ్చె పల్లకీ అదుగో
పల్లకీలో ఉంది పార్వతీదేవి
బాజాలు వింటోంది పార్వతీదేవి
పార్వతీదేవికి జేజేలు పెట్టు
బాజాలు రా నాన్న బాజాలు
బాజాలు వచ్చాయి బాజాలు

## 3. వరహాల తల్లి

జుట్టులో పువ్వులు పెట్టుకొన్నావా
ముత్యాల జూకాలు పెట్టుకొన్నావా
గంటల్ల మొలతాడు కట్టుకొన్నావా
వచ్చి ముద్దియ్యవే, వరహాల తల్లి !
అద్దంలో పాపాయి ఆడుతూ ఉంది
పాపాయి నేనున్ను పాడుకొంటాము
తువ్వాయితో కూడ ఆడుకొంటాము
అమ్మ, ముద్దిస్తాను ఆడుకొనివచ్చి
బొజ్జనిండా వేడిబువ్వ తిన్నావా
కాళ్లకూ గజ్జల్లు కట్టుకొన్నావా
దోసగింజా బొట్టు పెట్టుకొన్నావా
వచ్చి ముద్దియ్యవే, వరహాలతల్లి !
పిల్లెమ్మ మ్యావనీ పిలచేను నన్ను
తోక ఆడిస్తోంది ఆ కుక్కపిల్ల
వాటితో కూడాను ఆడుకొంటాను
ఆడుకొని వచ్చాక అపుడు ముద్దిస్తా

రావ మ్మ ఇస్తాను లక్కపిడతల్లు
రావమ్మ ఇస్తాను చందన బ్బొమ్మ
రావమ్మ తాటాకు బొమ్మలిస్తాను
వచ్చి ముద్దియ్యవే వరహాల తల్లి !
లక్కపిడతలతోటి గుజ్జన్న గూళ్లు
ఆడుకొని వచ్చాక అపుడు ముద్దిస్తా
తాటాకు బొమ్మలకు పెళ్ళిళ్ళు చేసి
ఆడుకొని వచ్చాక అపుడు ముద్దిస్తా
వెళ్లకే నా తల్లి - వెళ్ళిపోతున్నా
నాతల్లిగా - నేను వెళ్ళిపోతున్నా
ముద్దిచ్చి వెళ్ళవే - నే వెళ్లిపోయి
ఆడుకొని వచ్చాక అపుడు ముద్దిస్తా

## 4. అమ్మణ్ణి

గంధం మెడకూ పూసుకుని
పసుపూ కుంఖం రాసుకొని
కంటికి కాటుక పెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణి !
కాళ్ళకు గజ్జెలు కట్టుకొని
చేతికి గొలుసులు పెట్టుకొని
దండలు మెడలో వేసుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణి !
పువ్వులు తలలో ముడుచుకొని
తిలకం నుదుటా దిద్దుకొని
బుగ్గన చుక్కా పెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణి !
నోట్లో బూరా పెట్టుకొని
చేత్తో ఢక్కా పట్టుకొని
పువ్వుల చొక్కా తొడుగుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణి !
గాజుల చేతులు తట్టూతు
బోసినవ్వులూ నవ్వూతు
చిటపట అడుగులు తొక్కూతు
ఆడవె ఆడవె అమ్మణ్ణి !
ముద్దులు కురిసే నీ ఆట
త్రిభువన మోహనకర మమ్మా !
సూర్య చంద్రులూ ఉండేదాకా
ఆడవె ఆడవె అమ్మణ్ణి !

## 5. కృష్ణమ్మ

చంకలో పిల్లవాడు
చల్లనైన పిల్లవాడు
నల్లటి ఆ పిల్లవాడు
నవ్వులొలికే పిల్లవాడు
నమ్మరాని పిల్లవాడు
వా డెవడె వా డెవడె
వా డెవడె గోపమ్మా !
చంకలోని పిల్లవాడు
చల్లనైన పిల్లవాడు
నల్లటి ఆ పిల్లవాడు
నవ్వులొలికే పిల్లవాడు
నమ్మరాని పిల్లవాడు
వాడేనే వాడేనే
వాడేనే కృష్ణమ్మ !

## 6. వీడేనమ్మా కృష్ణమ్మా

వీడే నమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
కాళ్ళకు గజ్జెలు చూడండి
మొల్లో గంటలు చూడండి
మెళ్ళో హారము చూడండి
తల్లో పింఛము చూడండి

వీడేనమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
వీడే అల్లరి కృష్ణమ్మా
శ్యామలదేహము చూడండి
తామరకన్నులు చూడండి
సుందరవదనము చూడండి
మందహాసము చూడండి
వీడే నమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
వీడే అల్లరి కృష్ణమ్మా
పొన్నలు ఎక్కే కృష్ణమ్మా
వెన్నలు మెక్కే కృష్ణమ్మా
వేణువు నూదే కృష్ణమ్మా
గోవులుకాసే కృష్ణమ్మా
వీడే నమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
వీడే అల్లరి కృష్ణమ్మా
అలుకుడు చెయ్యక నడవండి
అల్లరి కృష్ణుని పట్టండి
పట్టండీ పట్టండి
పట్టుక కృష్ణుని విడకండి
కరువు తీరగా చూడండి
కౌగిలిలో చెర పెట్టండి
వీడే నమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
వీడే ముద్దుల కృష్ణమ్మా

# 7. చిన్నికృష్ణుడు

చిన్ని కృష్ణుడు పుట్టాడు
చిటపట పువ్వులు కురిశాయి
చిన్ని కృష్ణుడు నవ్వాడు
తళతళ మెరుపులు మెరిశాయి
చిన్ని కృష్ణుడు నడిచాడు
తప్పట్లుకొట్టింది భూదేవి
చిన్ని కృష్ణుడు ఆడాడు
అప్పుడు ఆటలు పుట్టాయి
చిన్ని కృష్ణుడు పాడాడు
అప్పుడు పాటలు పుట్టాయి

# 8. నవ్వు

పక్కన సూర్యుడు నవ్వాడంటే
పట్టపగలు ఈ లోకముకు,
పక్కన చంద్రుడు నవ్వాడంటే
చల్లని వెన్నెల జగములకు,
పక్కన పాపాయి నవ్వాడంటే
పరమానందం నీకూ నాకూ,
నవ్వడమెందుకు నిజము పలకవే
అవునో కాదో అలివేణి !

# 9. తువ్వాయి

తువ్వాయి తువ్వాయి ఏమి తువ్వాయి?
తువ్వాయి తువ్వాయి మంచి తువ్వాయి
తువ్వాయి మెళ్ళోను ఏమి ఉన్నాయి ?
తువ్వాయి మెళ్ళోను మువ్వలున్నాయి
తువ్వాయి కాళ్లల్లో ఏమి ఉన్నాయి ?
తువ్వాయి కాళ్ళల్లో పరుగులున్నాయి
తువ్వాయి నోట్లోను ఏమి ఉన్నాయి ?
నోట్లోను తెలిపాల నురుగు లున్నాయి
తువ్వాయి తువ్వాయి ఎవరి తువ్వాయి ?
ఆవుగారి తువ్వాయి-అసలు మా
తువ్వాయి

## 10. చిట్టితల్లి

బంతిపూల, చా
మంతి పూవుల
బంతులు కట్టి
గంతులు వేస్తూ
సంతోషముతో
పిల్లలు ఆడిరి
నెత్తిమీదను చేతులు పెట్టి
గబగబ నడుస్తు గంతులు వేస్తూ
చల్లోయమ్మా చల్లో అంటూ
అరుగుమీదను అందరుచేరి
గొల్లపిల్లలై ఆడిరి పిల్లలు
కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్నది
తల దువ్వుకు జడ వేసుకొన్నది
జడలో పువ్వులు పెట్టుకొన్నది
పువ్వుల జుబ్బా తొడుగుకొన్నది
రంగుపరికిణీ కట్టుకొన్నది
పువ్వుల బంతులు విసురుతున్నది
పిల్ల లందరితొ చల్ల అమ్మినది
చిట్టితల్లి మా చిన్నమ్మాయి

## 11. తిన్నారు

చిన్నా పెద్దా తిన్నారు
పప్పూ బెల్లం తిన్నారు
చేగోణీలు తిన్నారు
అమ్మా దగ్గిరి కెళ్ళారు
ఇంకా కావా లన్నారు
అన్నారూ అన్నారు
మంకూపట్టూ పట్టారు
పట్టారూ పట్టారు
అమ్మకోపం వచ్చింది
వచ్చిందీ వచ్చింది
అప్పుడు తన్నులు తిన్నారు
తిన్నారోయ్ తిన్నారు

## 12. నెమలి కన్ను

ధగధగ మెరిసే కాంతినిచల్లే
కళ్లు నెమలి కెవరిచ్చారో ?
పురి విప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికి రాడా ?
మేఘాలందం నీలాలందం
కాంతల కాటుక కన్నుల అందం
అందా లన్నీ జీవం దాలిచి
నీలో నాట్యం చేసేనే ?
జ్ఞాపకముంటే చెప్పరాదుటే
కృష్ణుని బాల్యక్రీడలు మాతో
కృష్ణుని వేణికి నీవా అందం
నీకే అందం ఆ వేణా ?
చెప్పరాదుటే చిన్ని కృష్ణునీ
కూకటి ముడిలో తాండవమాడిన
నాటివైభవము నీదే అయితే
కృష్ణగాధలను కర్ణామృతముగ ?
ఆ నా డా మురళి లాలించితి వట
గోపాలోన్నత శిరమున నిలిచి
మురళీమోహన దివ్యగీతముల
ప్రతిబింబములా నీలో తళుకులు ?
నిన్ను బాలకులు నిత్యము కోరుతు
నీతో ఆటలు ఆడే వేళల
వారు కృష్ణులను భావము పుట్టును
నిజమంటావా ? కాదా ? చెప్పవె

## 13. కృష్ణమ్మ కొడుకు

కృష్ణమ్మ కోచిన్న కొడుకు పుట్టాడే
ఆ కొడుకు నెత్తుకుందాము రారమ్మ
కొడుకంటె కొడుకటే గారాలకూచి
ముత్యాలహారమే ముద్దుల్లమూటే
రకరకము విద్దెల్లు చూపుతున్నాడే
వికవికా వికవికా నవ్వుతున్నాడే
చిన్ని చేతులు తట్టి ఆడుతున్నాడే
బోసినవ్వులు వెళ్ళబోయుచున్నాడే
చల్లన్ని చూపుల్లు చల్లుతున్నాడే
ఇల్లంత వెన్నెల్లు కాయుచున్నాడే
ఆ కళ్ళు ఆ మొహం ఆ జుట్టు తీరూ
అచ్చంగ కృష్ణమ్మ పోలికేనమ్మా
పూలటోపీ నల్లి తీసుకూ రండి
పట్టుజుబ్బా కుట్టి పట్టుకూ రండి.
కృష్ణమ్మ పుత్రుడికి ముస్తాబుచేసి
అందరూ ఎత్తుకుని ముద్దాడుదాము
అందరూ ఈ కొడుకు నెత్తుకో రండి
ముద్దుల్లు కొల్లగా పెట్టుకోరండి
కొడుకు నెత్తుకొని ముద్దులాడేటివేళ
హృదయాలు ఉప్పొంగి ఉప్పొంగి పోవు
కృష్ణమ్మ కో చిన్న కొడుకు పుట్టాడే
ఆ కొడుకు నెత్తుకుందాము రారమ్మ

## 14. బూచాడు

చీకటి అమ్మా, చీకటి అమ్మా
చీకటిచూస్తే భయమే
ఇంట్లో చీకటి దొడ్లో చీకటి
అంతా చీకటి మయమే
చీకట్లోనూ బూచీవాడు
దాక్కొన్నాడమ్మా
బూచీవాడిని చూస్తే నాకూ
భయమేస్తుందమ్మా
నల్లటివళ్ళూ, ఎఱ్ఱటికళ్ళూ,
ఊచల్లా కాళ్ళూ
చేత్తో కత్తీ పట్టుకు వచ్చీ
ముక్కూ కోస్తాడు
బూచీవాడూ బుట్టా తెచ్చీ
ఎత్తుకు పోతాడు
బూచీవాడిని పొమ్మని చెప్పే
బబ్బుంటా నమ్మా
అమ్మా నేనూ నీ వళ్ళోను
బబ్బుంటా కానీ
నీ వళ్ళోనూ బబ్బుంటేనూ
బూచోడొస్తాడా ?
బబ్బున్నాకా మంచీ మంచీ
కధలూ చెప్పవుటే ?
బబ్బున్నాకా మంచీ జోలా
పాటలు పాడవుటే ?
కధలూ, జోలా పాటలు వింటూ
నిద్దర పోతాను
బబ్బుని నేనూ అల్లరి చెయ్యక
నిద్దర పోతాను
నిద్దరపోయీ తెల్లారాకా
కళ్ళు తెరుస్తాను
చీకటి పోయి అంతా తెల్లని
వెలుతురు వస్తుంది
బూచీవాడూ బుట్టా పట్టుకు
వెళ్ళిపోతాడు
అప్పుడు బొమ్మలతోటీ నేను
ఆడూకొంటాను

## 15. లేవే అమ్మా !

కావుకావు మని కేకలు వేస్తూ
లేచాయమ్మా కాకుల్లూ
కిలకిల కిలకిల మని అరుస్తూ
పలికాయమ్మా చిలకల్లూ
పెరటిదొడ్డిలో గంతులు వేస్తూ
పిలిచాయమ్మా పిచికల్లూ
లేవే అమ్మా, లేవే అమ్మా
నాకూ బువ్వా పెట్టమ్మా !
బువ్వ పెట్టితే వాటిని చూస్తూ
వాటికి బువ్వా పెడతాను
బు వ్వెగరేస్తే ఎగిరి పట్టుకొని
నాతో బువ్వా తింటాయి
పశువుల దొడ్లో అంబే అంటూ
అరుస్తున్నది తువ్వాయి
తువ్వాయిని వాళ్ళమ్మ దగ్గిరికి
పంపీ పాలు తాగిస్తా
తువ్వాయిని వాళ్ళమ్మ నాకుతూ
తలనీ ళ్ళోసిన తర్వాత-
మెళ్ళో మువ్వలు, గంటలు కట్టీ
పరిగెత్తిస్తూ పరిగెడతా
లేవే అమ్మా, లేవే అమ్మా
లేచీ బువ్వా పెట్టమ్మా !

## 16. బుల్లిపాపాయి

మా బుల్లిపాపాయి మంచి అమ్మాయి
అల్లరులు చెయ్యదు ఆడుకొంటుంది
మొండిపట్టూ పట్టి మూల కూచోదు
పొద్దున్న బళ్ళోకి పోక మానాదు
పద్యాలు నేర్చింది పాట నేర్చింది
ఇంటినిండా ముగ్గు లెట్ట నేర్చింది
పువ్వులతొ దండల్లు గుచ్చ నేర్చింది
దేవుడికి జేజేలు పెట్ట నేర్చింది
మా బుల్లి పాపాయి మంచి అమ్మాయి
మా చిట్టి పాపాయి మంచి అమ్మాయి

## 17. మల్లు

మల్లు వస్తున్నాడు
మల్లు వస్తున్నాడు
దాక్కోండి దాక్కోండి
పిల్లలంతా !
లక్కపిడతలు తీస్తాడు
కందిపప్పు బొక్కుతాడు
పుస్తకాలు చింపుతాడు
వద్దంటే గిల్లుతాడు
మల్లు వస్తున్నాడు
దాచుకోండి దాచుకోండి
బొమ్మ లన్నీ !
ఎగురుకొంటూ గంతులేస్తూ
పరుగు పరుగున వస్తాడు
మొగ్గల్లు వేస్తాడు
బొమ్మరిల్లు పీకుతాడు
బెల్లంముక్క తినేస్తాడు
ఆడతా నంటాడు
పాడతా నంటాడు
తాటాకు బొమ్మలూ
తాటాకు బూరాలు
చేస్తా నంటాడు
చేతకాదురా అంటె
అమ్మతోటి చెబుతాడు

మీద పడి కొడతాడు
గిల్లుతాడు రక్కుతాడు
మల్లు వస్తున్నాడు
మల్లు వస్తున్నాడు
పారిపోండి పారిపోండి
పిల్ల లంతా !

## 18. కావాలి

కావాలీ కావాలి
చందమామ కావాలి
నక్షత్రాలు కావాలి
కొండకు నిచ్చెన వెయ్యాలి
కొండా నేను ఎక్కాలి
ఎక్కి చుక్కలు కొయ్యాలి !
కావాలీ కావాలి
తువ్వాయి నాకూ కావాలి
తువ్వాయికి మువ్వలు కావాలి
తువ్వాయికి బండీ కావాలి
బండి క్కొరడా కావాలి
కొరడా క్కుచ్చులు కావాలి
బండీ నేనూ తోలాలి !
కావాలీ కావాలి
పువ్వులు నాకూ కావాలి
బంతీ పువ్వులు కావాలి
చామంతీ పువ్వులు కావాలి
ఎర్రటి పువ్వులు, పచ్చటి పువ్వులు
తెల్లటి పువ్వులు నీలం పువ్వులు
పువ్వులు నేనూ కొయ్యాలి
పువ్వులతోటి చుక్కలతోటి
దండలు నేనూ గుచ్చాలి
బండీలోనూ పెట్టాలి
దేవుడి గుళ్ళో కెళ్ళాలి
దేవుడి మెళ్ళో వెయ్యాలి !

## 19. హనుమంతుడి తోక

రాముని బంటు రాముని బంటు
హనుమంతులవారు
హనుమంతుడి కొక తోక ఉన్నది
అందమైన తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
పొడుగుపాటి తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
లావుపాటి తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
బలమైనది తోక
తోకను నడుముకు చుట్టుకు తాను
రాముని మొక్కాడు
తోకను ఎత్తి చెంగున ఎగిరి
సముద్రము దాటాడు
లంకలోపల అశోకవనమున
సీతను చూచాడు
తోకను ముడిచి చేతులు చేర్చి
సీతకు మొక్కాడు
ఆనవాళ్లను సీతకు చూపి
అభయ మిచ్చినాడు
సీతాదేవుల దీవన పొంది
తోక ఎత్తైనాడు
తోకను ఎత్తి ఎగిరి రాక్షసుల
మూకను కొట్టాడు
మేఘనాధుడికి దొరకాలంటూ
దొరికి పోయినాడు
రావణాసుర ని రచ్చకూటమునా

ప్రవేశించినాడు
రాములవారిని భూషించాడు
రావణు తిట్టాడు* * *
రావణాసురుడు కోపముతోను
కోతీ అన్నాడు
కోతిని బట్టి తోకను కాల్చి
తన్నం డన్నాడు
ముడిచిన తోక సాగదీసిరి
రాక్షసులంతాను
కోకలు తెచ్చి బట్టలు తెచ్చి
తోకకు చుట్టారు
ఎఱ్ఱబట్టలూ తెల్లబట్టలూ
నల్ల బట్టలున్నూ
ఉన్ని బట్టలూ పట్టు బట్టలూ
నార బట్టలున్నూ
సన్నటి బట్టలు ముదుగు బట్టలూ
జరీ బట్టలున్నూ
మోపులకొద్దీ బట్టలు తెచ్చి
తోకకు చుట్టారు
ఎంత చుట్టినా ఎంత చుట్టినా
తోక పెరగుతోంది
రాక్షసు లంతా విసిగీ విసిగీ
నూనెలు తెచ్చారు
కొబ్బరి నూనె నువ్వుల నూనె
వేరుసెనగ నూనె
[illegible] నూనె ఆముదమున్నూ
వేప నూనెయున్నూ
గానుగ నూనె యిప్ప నూనెయూ
[illegible] నూనెయున్నూ
చేపల నూనెలు [illegible]

పశువుల కొవ్వున్నూ
మంచి వాసనల నూనెలు తెచ్చి
మడ్డి నూనెలను తెచ్చి
కుండలకొద్దీ బిందెలకొద్దీ
తోకను తడిపారు
చెకుముకి కొట్టి నిప్పును పట్టి
బట్టల కంటించి
గంతులువేస్తూ చప్పట్లు కొడుతూ
గట్టిగ నవ్వారు
రాక్షసు లంతా కేకలు వేస్తూ
పరిహాసము చేసి
కోతికి శాస్తి అయినది అంటూ
గోల చేసినారు
రాముని తలుచుకు, సీతను తలుచుకు
హనుమంతులవారు
హుమ్మని ఆర్చి ఘమ్మున లేచి
రాక్షసులను చూచి
హనుమంతుడు తనదేహము పెంచి
తోకను పెంచాడు
గిఱ్ఱు గిఱ్ఱున తోకను వాళ్ళ
మొహాన్న తిప్పాడు
మొఱ్ఱో అంటూ రాక్షసు లంతా
పారిపోయినారు
ఆకాశానికి అవాయిలాగా
హనుమంతుడు ఎగిరి
అంటించాడు అంటించాడు
లంకా పట్టాన్ని
మేడల మీదిక మిద్దెల మీదికి
హనుమంతుడు ఎగిరి
అంటించాడు అంటించాడు

లంకా పట్నాన్ని
మంటలు మండే తోకను ఎత్తి
హనుమంతులవారు
రాచనగరులూ అంతఃపురములు
నాట్యశాలలూ యాగశాలలూ
స్నాన శాలలూ పణ్యశాలలూ
గుఱ్ఱపుశాలలు ఏనుగుశాలలు
పశువులశాలలు మండపంబులూ
అంటించాడు అంటించాడు
లంకా పట్నాన్ని
భగభగ భగభగ భగభగ భగభగ
మండుతోంది తోక
చురచుర చురచుర చురచుర చురచుర
అంటుకుంది లంక
భగ్గు భగ్గునా చుంయి చుంయి మని
మండుతోంది తోక
చిటపట పటపట భగ్గు భగ్గునా
మండుతోంది లంక
పొగలు సెగలతో బుస్సు బుస్సు మని
మండుతోంది లంక
హోరు హోరుమని పరేలు మంటూ
మండుతోంది లంక
పటపట పరేలు ఢామ్మ్మ ఢామ్మనీ
మండుతోంది లంక
పిడుగులు కురుస్తు, మెరుపులు మెరుస్తు
మండుతోంది లంక
వాయుదేవుడూ మంటలు పెంచె
లంక మండుతోంది
ఎఱ్ఱటి మంటలు తెల్లటి మంటలు
పచ్చ మంటలున్నూ

మంటలు మంటలు పొగలూ సెగలూ
మండుతోంది లంక
చిన్నలు పెద్దలు పురుషులు స్త్రీలూ
రాక్షసు లంతాను
ఇళ్ళను విడిచి బయటికి వచ్చి
గొల్లున ఏడ్చారు
మండే తోకను జెండా ఎత్తి
లంకను చూచాడు
బూడిదపోగులు పొగలూ మంటలు
అంతట చూచాడు
చంగున ఎగిరి సముద్రము దగ్గిరి
కాతడు వచ్చాడు
తోకను దింపి నీటను ముంచి
మంటలు ఆర్పాడు
తోకను ఎత్తి మళ్ళీ ఎగిరి
సముద్రము దాటేడు
తోకను నడుముకు చుట్టబెట్టుకొని
రాముని మొక్కాడు
తోకకు చుట్టీ రాళ్ళను తెచ్చి
వంతెన కట్టాడు
తోక వెంబడే వాళ్ళంతాను
వంతెన దాటారు
రాక్షసవీరులు చూచారండీ
హనుమంతుడి తోక
తోకనుచూచీ భయపడ్డారు
రాక్షసు లంతాను
మళ్ళీ వచ్చె మళ్ళీ వచ్చె
హనుమంతుడి తోక
అదిగో తోక అదిగో తోక
అమ్మయ్యో తోక !

తోక కొట్టినది తోక మట్టినది
తోక చంపె నయ్యో !
చచ్చా నయ్యో ! చచ్చా నయ్యో !
తోక తగిలె నయ్యో !
ఇదుగో తోక అదుగో తోక
హనుమంతుడి తోక
పారిపొండిరా దుమికి పొండిరా
పైకి ఎగిరి పొండి
ఇదుగో చెట్టు అదుగో గొయ్యి
పదండి దాక్కోండి
తోక కాదురా శంభుడి శూలం
ఖస్సున పొడిచింది
తోక కాదురా విష్ణుని చక్రం
గిర్రున తిరిగింది
తోక కాదురా ఇంద్రుని వజ్రం
పరపర నరికింది
తోక కాదురా యముని దండమూ
దబదబ మొత్తింది
ఇదుగో తోక అదుగో తోక
అల్లదిగో తోక
అమ్మయ్యో అమ్మయ్యో అదె
హనుమంతుడి తోక
తోకను చూచి రాక్షసు లంతా
హడలిపోయినారు
తోకను చూచి రాక్షసు లంతా
బెదిరి చెదిరినారు
తోకదెబ్బకే రాక్షసు లంతా
చచ్చిపోయినారు
తోక ముడిచి హనుమంతుడు వచ్చి
రాముని మొక్కాడు
తోకా నుదురూ చేతులు రాముని
పాదాలను చేర్చి
తోకను ఎత్తి చేతులు ఎత్తి
రాముని మొక్కాడు
తోకతోడను గొడుగును పట్టీ
సీతారాములకు
రామా రామా అంటూ ఉండెను
హనుమంతుల వారు

## 20. చిన్న

చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్నులుంటే
గచ్చకాయల్ తెచ్చుకొంది
అరుగుమీద పోసుకొంది
ఒక్క ఓ చెలియా అంటు
చేతు లెత్తి ఆడుతోంది
చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్నులుంటే
లక్కపిడతల్ తెచ్చుకొంది
కందిపప్పు తెచ్చుకొంది
నిప్పు లేక నీళ్ళు లేక
బువ్వ వండి పెడుతోంది

చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్నులుంటే
తాటాకులు తెచ్చుకొంది
పెళ్ళికూతురిని చేసింది
పెళ్ళికొడుకును చేసింది
పసుపు కుంఖం కాటు కెట్టి
బట్ట కట్టి చీర కట్టి
మెళ్ళోను దండ వేసి
పల్లకీ లేకుండ
బాజాలు లేకుండ
బ్రాహ్మలూ లేకుండ
పెళ్ళిళ్లు చేస్తోంది
చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్నులుంటే
నవ్వులెన్నో నవ్వుతోంది
బువ్వ లెన్నో వండుతోంది
పెళ్ళిళ్ళెన్నో చేస్తోంది
ముద్దుల్లు కురుస్తోంది
వెన్నెల్లు కాస్తోంది
చిన్న ఆడుకొంటోంది
చిలక ఆడుకొంటోంది
పొన్న ఆడుకొంటోంది
పొట్టి ఆడుకొంటోంది
చూడ రండి చూడ రండి
కన్నులుంటే

## 21. అమ్మాయి అల్లరి

అమ్మాయి

నాన్నా, నాన్నా, నేనూ అమ్మా
పేరంటానికి వెడితేను,
పేరంటానికి మాతోకూడా
వద్దంటూంటే వచ్చింది,
ఎవరో చెప్పుకో చూస్తాను ?

నాన్న

ఎవరా ? ఎవరా ? ఎవరంటేను
పక్కయింటి వారమ్మాయా ?

అమ్మాయి

కాదు ! కాదులే ! దానికి వాళ్లు
కాళ్ళకు పారాణి పెట్టే లేదు
మొహాన కుంఖం పెట్టేలేదు
ఎవరో చెప్పుకో చూస్తాను ?

నాన్న

నాకు తెలియదే ! నువ్వే చెబుదూ ,
పరికిణీ కట్టుకు వచ్చిందా ?
దానికి వాయనం ఇచ్చారా ?

అమ్మాయి

పరికిణీ కట్టుకు వస్తేమాత్రం
వాయనం దానికి ఇస్తారా ?
ఏమీ నాన్నకు తెలియదులే !
ఎవరో నాన్నకు తెలియదులే !

నాన్న

తెలియకపోతే చెప్పరాదటే
అలరి ఎందుకు అమ్మాయీ ! అమ్మాయి

చెబితే నాన్నా ఏమిస్తావో
ముందర చెబితే చెబుతాను !

నాన్న

చెబితే మెళ్ళో కాసుల పేరా ?

అమ్మాయి

అమ్మది నాదే ! అది నాకొద్దు

నాన్న

పోనీ గాజులు చేయించాలా ?

అమ్మాయి

నాకున్నాయిగ, అవి నాకొద్దు

నాన్న

అయితే చెబితే బుగ్గకు నీకూ
చక్కని నగలూ పెడతానే !

అమ్మాయి

మన ఇంట్లోనే పెరిగే పిల్లా
పేరంటానికి వచ్చింది,
పరికిణీ కట్టదు, కుంఖం పెట్టదు
దానికి వాయనం ఇవ్వరు నాన్నా !

నాన్న

అయితే తెలిసిందమ్మాయీ ! అది
కుక్కపిల్లటే కూడావస్త ?

అమ్మాయి

మంచి నగలు నాకిస్తా నంటివి
చప్పున ఇయ్యి ! నాన్నా ఇయ్యి !

నాన్న

నే నెందుకు నీ కియ్యాలమ్మా ?
నేనే కాదా చెప్పుకొంటిని ?

అమ్మాయి

చూశావా ! చూశావా ?
నాన్నవి అన్నీ పిక్రీలే !

నాన్న

అయితే పోనీ తీసుకోవమ్మా !
ముద్దులు ఇవిగో బుగ్గలమీద !

అమ్మాయి

మంచి నాన్నవే ! నాన్నా నీకు
ఏమీ తెలియదు , ముద్దులు నగలా ?

## 22. పాప

చుక్కను నేనే పాపకంటిలో
తళుకు తళుకు మని మెరయుచుందును
తెల్లని చల్లని చంద్రుడ నేనే
పాపాయి ముఖమై పాట పాడుదును
ఎర్రటి మెత్తటి తామర నేనే
పాప అడుగులై ఆట లాడెదను
ఘుమ ఘుమలాడే పనసపండును
నేను పాపనై ఒళ్ళో చేరి
అమ్మ ముద్దులకు ఘుమ ఘుమ ఇస్తా
అమ్మ పాటలను కమ్మగ చేస్తా

## 23. ముద్దులు

పాపాయి ముద్దుల్లు పంచి బెడుతున్నాడు
పరుగు  పరుగు రండి పడతులంతాను
నుదిటిపై ముద్దుల్లు చంద్ర ఖండాలు
బుగ్గపై ముద్దుల్లు వెన్న ముద్దల్లు
పెదివిపై ముద్దుల్లు కెంపు తళుకుల్లు
కళ్ళపై ముద్దుల్లు ఇంద్ర నీలాలు
నవ్వుల్లు ముద్దుల్లు ముత్యాల పేర్లు
పాదాల ముద్దుల్లు పద్మ మధువుల్లు
పాపాయి మాటల్లొ బంగారు ముద్దుల్లు
పాపాయి కృష్ణమ్మ పంచి బెడుతున్నాడు
ముద్దుల్ల పండుగను చేసుకో రండి
పరుగు పరుగున గొల్లభామలంతా రండి

## 24. తాండవ కృష్ణుడు

నవ్వు వెన్నెలలు కలకలలాడా
మకరకుండలాల్ తళతళలాడా
ముక్తాహారాల్ గలగలలాడా
చిరుమొలగంటలు గణగణ మోగా
కాళ్ళ గజ్జియలు ఘల్లు ఘల్లుమన
నాట్యము చేసెను చిన్ని కృష్ణుడు
యమునా సైకతమందు !
నాట్యము చేసెను చిన్ని కృష్ణుడు
గోపీ హృదయములందు !!

## 25. మంచి - చెడ్డ

* * * *

అమ్మా, చూడవే అన్నయ్యా
తమ్ముడు చెడ్డని అంటాడు
నేనా చెడ్డ, అన్నయ్యా ?
అన్నే చెడ్డ, నేనే మంచి

అవును గాని చిన్నబ్బాయీ,
నువ్వూ మంచే అన్నా మంచే
అన్నా, నువ్వూ పలకా పుల్లా
తీసుక్కు బళ్ళోకెళ్ళండి
వెళ్ళను అమ్మా, నే బళ్ళోకి
ఎందుకు బళ్ళో కెళ్ళడమమ్మా ?
బళ్ళోకెడితే పంతులునీకు
పాఠాలన్నీ చెప్పునుగా

బళ్ళోకెడితే పాఠాలన్నీ
పంతులు బాగా చెబుతాడా ?
పంతులు కేమీ రాదే అమ్మా,
అ ఆ లొకటే చెబుతాడే

పోనీ లేరా బళ్ళోకెళ్ళి
అ ఆ లేనా నేర్చుకు రారా
అ ఆ ల్లాంటి పిచ్చిగీతలూ
నాకూవచ్చును లేవే అమ్మా
ఇంట్లో కూచుని మేకపిల్లకీ
నేనే చెబుతా అ ఆ లు
అమ్మమ్మనడిగి కధలు చెప్పమని
ఎన్నో కధలు వింటాను
నేను వెళ్ళను బళ్ళోకమ్మా
అన్న వెళ్ళును కావలిస్తే
పాటలు రావు ఆటలు రావు
కధలూ రావు పంతులికి
అ ఆ లేమిటి వెధవ అ ఆ లు
బళ్ళోకెందుకు వెళ్ళడమమ్మా ?

ఇంట్లో కూచుని రావణా అల్లరి
చేస్తుంటే నే పడలేనమ్మా
అల్లరి చెయ్యను లేవే అమ్మా,
ఆటలు ఆడుతూ కూచుంటా
బళ్ళో కెళ్ళకపోతే నువ్వే
చెడ్డని అంటా రందరు నిన్ను
అన్నని మంచని అంటారు
బళ్ళోకెడితే నువు బంగారం

బళ్ళో కెళ్ళను, వెళ్ళకపోయినా
నేనే మంచి, అన్నే చెడ్డ
చెబుతానుండు నాన్నగారితో
నన్ను చెడ్డని అమ్మ అన్నదని

# బాలగేయములు

## 1

రమణమహర్షికి
జేజేలు
అరుణమూర్తికి
జేజేలు
పరంధామునకు జేజేలు
మా పెన్నిధికి
జేజేలు

## 2

కొండ మీదా
ఉండు వెలుగెవరు?
లోకమంతా
నిండు వెలుగెవరు?
గుండెలోనా
మండు వెలుగెవరు?
పార్వతీ పతి
ముద్దుకొడుకెవరు?
నా అండ నిలిచి
యుండు రమణుండె

## 3

అడుగో రమణుడు
అరుణాచలమున
అరుగో భక్తులు
రమణుని పజ్జను
ఆ భక్తులతో
ఆ రమణుని కడ
ఆడుట  పాడుట
ఎన్నటికో?

## 4

చిన్న పిల్లలము
చేతులనెత్తి
జేజే లంటూ
చెప్పుచుంటిమి,
చిన్న పిల్లలను
చేతులనెత్తి
చెంత చేర్చుకో
శ్రీ రమణా!
చిన్న పిల్లలను
చెంత చేర్చుకొని
సంరక్షించుము
ఓ రమణా!

## 5

ఆటలు నీవే
పాటలు నీవే
అన్నీ నీవే
అవునా రమణా?
ఆటల నాడి
పాటలు పాడి
నిన్ను కొలిచెదము
రారా రమణా!

## 6

ఎంతపిలిచినా
ఓ యని పలుకవు
ఏమి చేతురా
ఓ రమణా!

ఎక్కడ నుందువో?
ఎట్లు పిలుచుటో
చెప్పరాదురా
ఓ రమణా?

**7**

అరుణా చలశివ
అరుణా చలశివ
అరుణా చలశివ
అరుణా చలా!
రమణ మహేశా
రమణ మహేశా
రమణ మహేశా
ఓ రమణా!
శివ స్వరూపా
అరుణాద్రీశా
దండము దేవా
దండము రమణా!

**8**

పాహి రమణ ప్రభో
పాహి రమణ ప్రభో
పాహి శోణాద్రి
సంవాస రమణ ప్రభో!
రార రమణ ప్రభో
రార రమణ ప్రభో
నేనెంతో వేచి యు
న్నార రమణ ప్రభో!
రార రమణ ప్రభో
రార కరుణామూర్తి
వచ్చి నన్నెత్తుకొని
లాలించరా ప్రభో

**9**

కొమ్మల మీద కూర్చుని పాడే
పక్షుల గుంపేనా శ్రీ రమణుడు
కొండల నుండి జల జల పారే
సెలయేళ్లేనా భగవాన్ రమణుడు
ఆటలలో ఆనందము వెదికే
బాలకులేనా భగవాన్ రమణుడు
అక్కున బిడ్డను అదుముకొన్న ఈ
తల్లేనా మా భగవాన్ రమణుడు
అందరి హృదయములను విహరించే
ఆ వెలుగేనా రమణుడు రమణుడు

**10**

అరుణాచలమను కొండ ఒక్కటి
అలరు చున్నది దక్షిణంబున
అరుణాచల మొక కొండ మాత్రమే
అనుకొన బోకుము అబ్బాయీ!
అరుణాచలమున ఆదిదేవుడు
కొలువున్నాడుర అబ్బాయీ!
అతని పెజ్జనే జగజ్జనని శ్రీ
అంబ ఉన్నదిర అబ్బాయీ!
ఆది దేవుని చిన్న కుమారుడు
అక్కడ వెలిసెను అబ్బాయీ!
కొండ మొదటను [illegible]మున
కొలువున్నాడుర అబ్బాయీ!
[illegible]
భక్తుల [illegible] అబ్బాయీ!
సేవా భక్తుల తోడచేరి శ్రీ
రమణుని కొలువుము అబ్బాయీ!

# పిల్లల కథలు

1. 'సాహితికి' కథ
2. పాఠము
3. ఎన్నో చేస్తాను !
4. నేను పెద్దవాడనైనాక!
5. మా అబ్బాయి
6. నీతిపాఠాలు
7. సూరి, సీత, వెంకి (11 కథలు)
8. బంగారు పిలక (పెద్దకథ)

# 'సాహితికి' కథ

తక్షణం కథ రాసి పంపవలసిందని 'సాహితి' సంపాదకుడు ఫర్మానా పంపినాడు రాతాము, రాయవచ్చును అని రెండు మూడురోజులు ఎలాగో గడపినాను ఇంక తప్పదు గదా అనుకొని ఒకనాటి రాత్రి వెన్నెట్లో పరుపు వేసుకొని, తమలపాకులు పక్కను పెట్టుకొని, దీపానికి ఎదురుగా కాగితాలు పెట్టుకొని, కూచుని ఆలోచించడం మొదలుపెట్టినాను కథ సాంఘికం చేతామా, చారిత్రకం చేద్దామా, అపరాధ పరిశోధకం చెయ్యడమా అని ఆలోచనలోకి దిగినాను ఎంతకూ తెగడం లేదు ఇంతలో పరుగెత్తుకొంటూ వచ్చినాడు మా చిట్టిబాబు, వచ్చి పక్కను కూచున్నాడు

కూచుని 'నాన్నా, నాన్నా, అమ్మేం నిద్దరోయింది' అన్నాడు చిట్టిబాబు

నేను ఆలోచనలో మునిగివుండి 'ఉహూఁ' అన్నాను

'నాన్నా, మరి నా పేరెవరు?'

'నీపేరా ? చిట్టిబాబు '

చిట్టిబాబు సమాధానానికి సంతోషించి పరుపుమీద వెల్లకిలా పండుకొని ఆకాశం కేసి చూస్తున్నాడు నేను సాంఘిక కథ వ్రాతామని దృఢపరుచుకుని ఏంపేరు పెట్టితే బాగుంటుందని ఆలోచించాను. పేరును బట్టి ఇతివృత్తమంతా బోధపడవలె, మర్రిగింజలో చెట్టంతా ఇమిడి వుండవలె ఏంపేరు పెట్టను? కమల అంటే బాగుంటుంది అయితే కమల కథకంతకూ నాయిక కావలసి వుంటుంది. కమలను చిన్నపిల్లను చెయ్యడమా, కాపరం చేస్తూ వున్న

'నాన్నా!'

ఊఁ

'మరీ, నా పేరు చిట్టిబాబంటే బుల్లెమ్మ ఆక్షేపించిందేం?'

'ఊఁ' అని ఊహా సూత్రాన్ని అందుకొందామనుకొన్నాను

'ఏం నాన్నా, ఆక్షేపించిందేం?'

'ఎవరూ?'

'చెల్లాయి

'ఏమని?'

'పేరు బాగుంది కాదుట

'బాగుందమ్మా! మాట్లాడకు రవంతసేపు

అయితే కమలను కాపరం చేస్తూ వున్న స్త్రీని చేస్తే బాగుంటుందా? అప్పుడు కథలో ఏమి

చేయించాలి ఆవిడచేత? ఆత్మత్యాగమా? ఈ కాలంలో సర్వసాధారణమై పోయింది సహగమనమా? దానికోసం శతాబ్దులు వెనక్కు వెళ్ళాలి అయితే విషాదసూచకమైన కధకు కమల అనే ముద్దుపేరు బాగుంటుందా? బాగుండదు పేరు మార్చాలి ఏమంటే బాగుంటుంది?

'నాన్నా!'

'ఓ'

'చందమామ ఎక్కడున్నాడో చెప్పుకో'

'అడుగో!'

'నాన్నా!'

'ఓ'

'చందమామ అక్కడెందుకున్నాడు నాన్నా!'

'వూరికేనే!'

'నాన్నా!'

'ఓ'

'చెల్లాయికి చందమామ లేదు కాదూ?'

'అవునమ్మా, పడుకో మాట్లాడకు'

మాట్లాడకుండా చూస్తూ పడుకొన్నాడు చిట్టిబాబు కమల పేరు తీసివేసి వీరమతి అంటే? వీరమతి ఆట్టే నచ్చడం లేదు పూర్వకాలపు పేర్లు ఏవైనా పెట్టితే కధ నిజమయినట్టు తోస్తుంది పూర్వపు పేర్లు ఏమున్నాయి? ఏదీ, అహల్య - ఊహుఁ నాయకురాలు - చ్ గంగమ్మ - ఉహుఁ. ఏకవీర - బాగుంది శక్తిపేరూ అయినట్టుగా వుంది పూర్వకాలపు పేరూ అవును కధపేరు ఏకవీర పెట్టుకోవచ్చును అయితే ---

'నాన్నా!'

'ఓయి'

'నాకు దాహమవుతోంది'

'లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తాగు'

'అమ్మ నిద్దర పోతున్నది'

'నువ్వు వెళ్ళి బిందెలో నీళ్ళు ముంచుకు తాగు'

'నాకూ నిద్దరొస్తూంది'

మంచినీళ్ళు ఇవ్వకుంటే కొరుక్కుతింటాడని లేచి మంచినీళ్ళు తీసుకు వచ్చి యిచ్చి నిద్రపొమ్మన్నాను కాకితాలముందర మళ్ళీ కూచుని ఆలోచన ఏకవీరచేత పురుష వేషం వేయించి యుద్ధం చేయిస్తే ఎలా వుంటుందో కాక పోతే ఏకవీరకు దుర్మార్గుడైన భర్త వున్నట్టూ, అతను భార్యను

అనాదరణ చేస్తూ వున్నట్టూ -

'నాన్నా!'

'మళ్ళీ యెందుకూ?'

'చెల్లాయికి మురుగులు చేయిస్తున్నావు నాకో '

'నీకూనూ'

' మరి, ఇందాక నువ్వు చెల్లాయిని ఎత్తుకుని ముద్దెట్టుకున్నావు కదా నన్ను ఎత్తుకోలేదేం?

'నిన్నూ ఎత్తుకుంటా'

'నాన్నా ! నన్నిప్పుడెత్తుకోవూ?'

'ఉహుం.'

'ఎత్తుకోవు నాన్నా?'

'రేపు ఈవాళకి నిద్దరో '

'నిద్దరపోతే నాకేం కొనిపెడతావు?'

'మిఠాయి '

'నాకొద్దు '

'పోనీలే '

'నాకూ, నాకూ, నువ్వెక్కుతావే అలాంటి బైస్కిల్ కావాలి '

'అలాగే, నిద్దరో'

'కొనిపెడతావా?'

'ఆ '

చిట్టిబాబు కళ్ళు మూసినాడు గడియారంలో పది గంటలయింది అయితే అయింది, కథ రాసి పడుకోవచ్చు ననుకొన్నాను అన్నట్టు ఎక్కడ వున్నాము-ఏకవీరకు దుర్మార్గుడైన భర్త భర్త అనాదరణ పడలేక పడలేక ఏమిటి చెయ్యడం? నూతిలో పడితే? కథ చాలా పొట్టిదైపోతుంది తిరగబడితే - నాయికాలక్షణాలకు భంగం పుట్టింటికి వెళ్ళిపోతే-వెళ్ళిపోయి? అవును,చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోతే, భర్తఇంటికి వచ్చి-

'నాన్నా!'

'ఓ ఇంకా నిద్రపోలేదూ?'

'పోయాను కాని నాకు ఓనమాలు వచ్చాయి '

'వస్తే సంతోషమే '

రాత్రి పదిగంటలకు ఓనమాల గొడవయెందు కనుకొన్నాను

'నాన్నా, నాకు అ ఆలు చెప్పుతానన్నావు చెప్పవూ?'

'ఇప్పుడు కాదు పడుకో '

'ఎప్పుడు నాన్నా?'

'రేపు '

'రేపు బళ్లోకి వెళ్ళేదీ నాన్నా?'

'వెళ్ళు '

'ఆఁ వెళ్ళను '

'పోనీ, మానెయ్యి '

'మానేస్తే అమ్మ కొట్టదూ?'

'కొట్టదులే '

'కొడుతుంది నాన్నా!'

'కొట్ట దంటూంటే నిద్ర పో '

మళ్ళీ రవంత సేపటికి చిట్టిబాబు నాన్నా అన్నాడు

'ఓ '

'నువ్వేమిటి రాస్తున్నావు?'

కథ

'నేనుకూడా రాయనా?'

'ఇప్పుడు కాదు '

'నాకు కథ చెప్పవు నాన్నా?'

'నిద్దరోతే చెప్పుతాను '

'చెపితే నిద్దరోతాను '

చిట్టిబాబు పట్టు మంకుపట్టు! పైగా నాదగ్గిర చనువు ఇంక చేసేదేమిటి! కాకితాలు బొ స్తపెట్టి, ఒకమూల పడవేసి, దీపం ఆర్పి, పడుకొని, నూటపన్నెండోమారు . అనగా అనగా ఒక రాజు ఆ రాజుకు ఏడుగురు కొడుకులు ఏడుగురు కొడుకులు వేటకు వెళ్ళి కథ కంచెకు వెళ్ళింది, మనం ఇంటికి వచ్చాము అనే కథ చెప్పినాను. చీమ దగ్గిరికి వచ్చేటప్పటికి నూటపన్నెండోమాటు చిట్టిబాబు నవ్వినాడు తరవాత ఒక కాలు నా మీద వేసి ఒక చెయ్యి నా ముఖం మీద వేసి ఇంతలో నిద్రపోయినాడు

సాహితికి కథ రాయలేదని సంపాదకుడు కోపపడతాడు కథ వ్రాయడం ఈ వరసను వున్నది!

# పాఠము

ఒక సంవత్సరము చెన్నపట్టణములో కాపురముచేసి కొత్తబోధన పద్ధతులను నేర్చుకొన్నాను అవి శల్యగతము లగుటవల్ల మనపూర్వుల విద్యాభ్యాసక్రమముపైన నాకు గౌరవము లేకపోయింది ఈ నేర్చిన పద్ధతులన్నీ కొంత మట్టుకు క్లాసులలో ప్రయోగం చేయ మొదలుపెట్టాను కాని దానివిలువ విద్యార్థులు గ్రహించకపోవడం చేత 'ఓగు నోగు మెచ్చు' అనే వేమన్న పద్యం జ్ఞాపకం చేసుకొని మాట్లాడక వూరుకున్నాను ఈ పద్ధతులను ఉపయోగించడానికి సమయము రాకపోతుందా అని ధైర్యం.

ధైర్యం ఎందుచేతనూ అంటే, నాకు మూడేళ్ళయీడు గల కొడుకు వాడికి చదువు నేర్చుకోవడానికి తగినవయస్సు- అనగా నాలుగుసంవత్సరములు వచ్చినట్లయితే సక్రమంగా పుస్తకాలలో వున్నరీతిగా బోధనపద్ధతులను ప్రయోగించి తద్వారా ఉత్తమవిద్య కరపించవలెనని,నే నభ్యసించిన మానసిక శాస్త్రమును పురస్కరించుకొని పనిజరిపినట్టయితే నాకొడుకు ప్రతిభాశాలి అవుతాడనీ నాధైర్యం

విద్యాభ్యాసమును ఓనమాలతో మొదలుపెట్టరాదు వస్తువుల యధార్ధగుణ గ్రహణము జ్ఞానేంద్రియములు చేస్తున్నవో చేయడం లేదో తెలిసికోవలెను అట్లు చేయని యెడల వాటిని అభ్యాసపరిచి సరిగా గుణములు గ్రహించే లాగుచేయవలెను అనగా బాలుడు, తొలుదొల్త ఓనమాలను దిద్దుకొనడం మాని వేర్వేరు రుచులను దెలిసికొనుట వేర్వేరు రంగులను దెలిసికొనుట, వేర్వేరు వాసనలు తెలిసికొనుట వేర్వేరు శబ్దములు గుర్తుపట్టుట పదార్ధముల స్థితులను తాకి తెలిసికొనుట నేర్చుకోవలెను అట్లు నేర్చుకోవడం వల్ల వారి జ్ఞానేంద్రియాలు వస్తువుల యధార్ధగుణాలను గ్రహించగలిగి వుంటవి

ఈ వుద్దేశముతో నేను ఒకనాడు నిమ్మకాయ,బెల్లం ముక్క, వక్కపొడి, పచ్చిమిరపకాయ ఇత్యాదులు రుచులు నేర్పుటకున్ను, గన్నేరుపువ్వు, పచ్చగడ్డి, మల్లెపువ్వు, దేవకాంచనము, మసిబొగ్గు, పసుపుకొమ్ము ఇత్యాదులు రంగులు నేర్పుటకున్ను సంతరించుకొని మావాడిని దగ్గిర కూచోబెట్టుకున్నాను మా అమ్మ దూరంగా కూచుని పత్తి బుట్ట దగ్గిర పెట్టుకుని వత్తులు చేసుకుంటున్నది

నేను చదువు చెప్పడం మొదలుపెట్టాను ఏకాగ్రచిత్తముతో విషయగ్రహణము చేయగలిగి వుండడానికి మా వాడిని బాసినపట్టు వేసుకొని కూచోమన్నాను విద్యాభ్యాస సమయాన బాలుర స్వేచ్ఛను అరికట్టడం మంచిపద్ధతి కాదు అందుచేత బాసినపట్టు వేసుకొమ్మని చెప్పినా మావాడికి స్వేచ్ఛ నేను తగ్గించలేదు రవంతసేపు బాసినపట్టు రవంత సేపు పండుకోవడం రవంతసేపు మొగ్గలు వెయ్యడం రవంతసేపు గంతులు వెయ్యడం మొదలైన పనులన్నీ చదువు చెప్పుకొనేటప్పుడు మావాడు చేస్తూనే వున్నాడు మొట్టమొదట గన్నేరుపువ్వు పుచ్చుకొని 'నాన్నా, ఇదేమి?'టన్నాను

'ఇది పువ్వు '

'దీనిపేరేమిటి?'

'దీనిపేరేమిటి న్నా౯ా?'

'నువ్వు చెప్పు?'

'నువ్వు చెప్పవు నాన్నా?'

'నేను చెప్పకూడదు నువ్వు చెప్పుకోవాలి

'నేను చెప్పవచ్చునా నాన్నా?'

'ఆ, చెప్పు '

'నేను చెప్పను, నువ్వు చెప్పుకో నాన్నా!'

'నాకూ తెలియదు నువ్వు చెప్పు '

'అయితే చెప్పుతాను విను ఇది గన్నేరుపువ్వు '

'ఇది గన్నేరుపువ్వా నాన్నా?'

'అవును '

'నువ్వు ఎక్కడ తెచ్చావు నాన్నా దీన్ని?'

'దేవాలయం తోటలోంచి '

'నేనూ వెళ్ళి తీసుకురానా నాన్నా!'

'వద్దు, నువ్వు అట్టే మాట్లాడకు నే చెప్పేది విను '

'మరీ, గన్నేరుపువ్వు ఎందుకు తెచ్చావు నాన్నా?'

'చెప్పుతాను గాని-ఇది ఎలా వుంది?'

'మరి, నాకాపువ్వు ఇవ్వవు నాన్నా?'

'ఇంద , పుచ్చుకో, పుచ్చుకొని దానిరంగు ఏమిటో చెప్పుకో '

'దీనిరంగా నాన్నా?'

'అవును అదిగో రేకులు లాగివెయ్యకు ఆలాగ నలిపి వెయ్యకురా!'

'నలపను, గాని ఇంకోపువ్వు ఇవ్వవూ?'

'ఇది అయినతరవాత ఇస్తాను, నే నడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు '

'ఏమి చెప్పను నాన్నా?'

'దీనిరంగు'

'దీనిరంగా?'

'అవును '

'నువ్వు చెప్పవు నాన్నా?'

ఈ మాటు నే చెప్పను నువ్వు చెప్పుకోవాలి '
'ఏమి చెప్పుకోవాలి నాన్నా?'
'దీని రంగు '
'అంటే ఏమిటి నాన్నా?'
'ఇది తెలుపా,పసుపా, ఎరుపా, నలుపా చెప్పు '
'ఇదా నాన్నా?'
'అవును'
'ఇది తెల్లగా వుంది?'
'ఇది తెల్లగా వుందా? పోనీ యీ మల్లెపువ్వెలా వుంది?'
'ఇదా నాన్నా? ఇది ఎం చక్కుంది!'
'దీనిరంగు?'
'తెల్లగా వుంది?'
' ఈ రెండూ తెల్లగానే వున్నాయా?'
'తెల్లగా లేవు నాన్నా!'
'లేవు గన్నేరుపువ్వు ఎరుపు, మల్లెపువ్వు తెలుపు, మళ్ళీ చెప్పు,'
'ఇది ఎరుపు, ఇది తెలుపు '
'సరే, యీ మసిబొగ్గు ఎలా వుంది?'
" ఇదా, ఇది ఎర్రగా వుంది'
" ఇది ఎర్రగా వుందిట్రా ?'
" మరిఎలా వుంది నాన్నా ?'
" నల్లగా వుంది'
" మసిబొగ్గు నల్లగా వుంది"
" సరే, ఈ పచ్చ గడ్డి ? '
" ఇదీ ? ఇదినల్ల గా వుంది '
" ఇది మసిబొగుగ్గలాగ వుందిరా!"
'ఎలా వుంది మరి?'
'ఇది ఆకుపచ్చగా వుంది '
'ఆకుపచ్చగా వుంది '
'సరే, యీ మాటు మళ్ళీ చెప్పు గన్నేరుపువ్వు ఎలా వుంది?'
'ఎర్రగా వుంది '

'మసిబొగ్గు?'

'నల్లగా వుంది,

'మల్లెపువ్వు?'

'ఆకుపచ్చగా వుంది '

'ఆకుపచ్చ కాదు, తెలుపు'

'ఆకుపచ్చకాదు, తెలుపు'

'పచ్చగడ్డి?'

'పచ్చగడ్డీ ఆకుపచ్చ కాదు-'

'ఆకుపచ్చే '

'ఆకుపచ్చగా వుంది '

'సరే ఇది జ్ఞాపకం వుంచుకుంటావు కాదూ?'

'ఆలాగే, నాన్నా నాకా బెల్లంముక్క పెట్టవూ?'

'ఇంద మరి అదంతా తినెయ్యకు!'

ఇంతట్లో యింటిలోంచి నాభార్య కేక వేసింది

'అవునుగాని, కచేరీకి వేళయినట్టు వుంది మీ అమ్మ వుండలేరు కుఱ్ఱాడితో ఆడుకొనేబదులు స్నానం చెయ్యకూడదూ?'

'ఇదిగో లేస్తున్నా '

లేస్తూండగా మాఅమ్మవత్తులు, పత్తిబుట్టలో పెట్టి మూతవేస్తూ అన్నదిగదా 'అబ్బాయీ, ఎప్పటికప్పుడు వాడితో అలాగ ఆడుతావు వాడికి రెండుముక్కలు చెప్పుతూ వుంటేగాని వాడికి చదువు వచ్చేవిధం ఎలాగ?'

మొత్తం మీద ఆడవాళ్ళు - ఏమనడానికీ నోరు రాదు!

# ఎన్నో చేస్తాను!

వీధి అరుగు మీద కూచోబెట్టి పలకా పలక పుల్లాచేతి కిచ్చి ఓనమాలు దిద్దుకుంటూ వుండమన్నాడు నాన్న 'వీధులంపట తిరుగుతూ అల్లరిచేస్తే తంతాను నేను చూస్తూనే వుంటాను సుమా' అన్నాడు

నాన్నే చూడకుండా వుంటేనా!

గడ్డి మేస్తూవున్న ఆమేకపిల్లను నిమ్మళంగా వెనకాలేవెళ్ళి పట్టుకుంటాను చెవులు పట్టుకుని యింటికి లాక్కువస్తాను తాడు దానిమెడకు కట్టి ఆ తాడు గుమ్మా నికి కడతాను అమ్మ చూడకుండా బెల్లం ముక్కా చేగోణీలూ తీసుకువచ్చి దానికి పెడతాను తరవాత చిన్నకొరడా ఒకటి

కట్టి ఆ కొరడాతో దాన్ని చెల్‌చెల్ అని తోలుతాను ఆ తరవాత దాన్ని పడుకోబెట్టి పక్కను కూచుని దువ్వుతాను దువ్విదువ్వి దాని మెడమీద నేను నిద్దరోతాను ఎంచక్క!

నాన్నే చూడకుండ వుంటేనా!

సన్నసన్నంగా నాన్న గదిలోకి వెడతాను నాన్న నన్ను ఎప్పుడూ ఒక్క వుత్తరమేనా రాయనిచ్చేవాడే కాడు నాన్న రెండుకలాలూ రెండు చేతులతోటి పుచ్చుకుటాను రెండుకవర్లు ముందు పెట్టుకొని ఆ రెండు కవర్ల మీదా ఉత్తరం రాస్తాను నాన్నకో ఉత్తరమూ, అమ్మకో ఉత్తరమూ, కుక్కపిల్లకీ, మేకపిల్లకీ యింకో రెండుత్తరాలు రాస్తాను ఈ ఉత్తరాలు కుక్కపిల్లకీ మేకపిల్లకీ నేనే తీసుకువెళ్ళి యిస్తాను నాన్న ఉత్తరమూ అమ్మఉత్తరమూ పోష్టులో పడవేస్తాను

మధ్యాన్నము పోష్టుజవాను అమ్మకీ నాన్నకీ ఉత్తరాలు ఇస్తాడు

ఈ ఉత్తరాలు ఎవరు రాశారు చెప్మా' అంటారు నాన్నా అమ్మాను నేను ఉలక్కుండా పలక్కుండా ఊరుకుంటాను

నాన్నే చూడకుండా ఉంటేనా?

ఒకగా వంచా కట్టుకొని యింకోగావంచా బుజం మీద వేసుకొని కాలవకు వెడతాను వెళ్ళి ఎవరూ చూడకుండా నీళ్ళల్లోపడి నీళ్ళ మీద తేలుతాను మునుగుతూ తేలుతూ ఎంతోసేపు ఆడుకుంటాను నీళ్ళల్లో మునిగి అడుగున ఏముందో చూస్తాను ఆలిచిప్పలూ బొమ్మరాళ్ళూ గావంచాలో మూటకట్టుకుంటాను ఆపాళంగా ఒడ్డుకు వచ్చి ఒళ్ళు తుడుచుకుని యింటికి వస్తాను అప్పుడు అమ్మ అంటుందిగదా 'నాన్నా, యింతసేపూ ఎక్కడకు వెళ్ళి ఏం చేస్తూన్నావు?'

అప్పుడు నేనంటాను గదా, 'అమ్మా, అమ్మా, వాళ్ళబ్బాయి రబ్బరుబొమ్మ కొనుక్కున్నాడు నాక్కూడా కొనిపెట్టమనవుటే నాన్నని!'

నాన్నే చూడకుండా వుంటేనా!'

నాన్నగదిలోకి పిల్లిపిల్లలాగ చప్పుడు చెయ్యకుండా వెడతాను ఆపళంగా లోపలతలుపు గడియవేస్తాను నాన్నపంచకట్టుకుంటాను నాన్న పెద్దకోటు వేసుకుంటాను పెద్దబూట్సు జోడూ సులోచనాలూ పెట్టుకుంటాను చేత్తో కఱ్ఱ పుచ్చుకుంటాను నాన్న వాచీ తీసి చెవిదగ్గిర పెట్టుకుని చూసి దాన్ని ఒక్కమారు గిఱ్ఱున తిప్పేస్తాను అప్పుడు కోటుజేబులో పెట్టుకుంటాను గది తలుపు తీసి వీధిలోకి షికారు వెడతాను తిన్నగా బొమ్మలదుకాణం దగ్గిరకు వెళ్ళి ఆ బొమ్మలన్నీ కొనేస్తాను బ్రాహ్మణ దుకాణం మీదకు వెళ్ళి అక్కడ కారప్పూస అంతాకొనేస్తాను అప్పుడు, ఈ బొమ్మలూ కారప్పూసా ఎక్కడివిరా! అంటుంది అమ్మ 'నే బజారుకు వెళ్ళి కొన్నాను!' అంటాను

నాన్న చూడకుండా వుంటేనా!

నాన్న నడవలో పెట్టిన బైసికిలు వీధిలోకి తీసుకువచ్చి ఎవరూ చూడకుండా ఎక్కుతాను ఎక్కి రంయిమని రోడ్డుమీద సవారిచేస్తాను తిన్నగా వెళ్ళివెళ్ళి ఎదరుగుండా వున్న ఆకాశాన్ని ముట్టుకుంటాను

ఆకాశానికి బైసికిలు జేర్లాబెట్టి అక్కడ పువ్వులూ పళ్ళూ జేబునిండా వేసుకుంటాను కొంతసేపు నిద్దరోయి మళ్ళీ బైసికిలు ఎక్కి యింటికి వచ్చేస్తాను వచ్చి అమ్మకు పువ్వులూ నాన్నకు పళ్ళూ యిస్తాను అమ్మ ముద్దెట్టుకుంటుంది, గాని నాన్న తంతాడేమో!

నాన్నే చూడకుండా వుంటేనా!

పెరట్లో నూతిదగ్గిర జామిచెట్టు ఎక్కుతాను ఎక్కి కొమ్మమీద నుంచి నూతులో ఏముందో చూస్తాను జామకాయలు తుంపి నూతిలోకి విసురుతాను బుడుంగు బుడుంగుమని దాంట్లో పడుతూంటే చూస్తాను ఆ తరువాత జామకాయలు జేబునిండా వేసుకొని దిగివచ్చి పశువులశాల లోకివెళ్ళి అన్నీ తినేస్తాను అమ్మకీ నాన్నకీ ఒక్కకాయేనా పెట్టను

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్నగదిలో బొమ్మల పుస్తకాలన్నీ తీస్తాను అందులో బొమ్మలన్నీ చింపుతాను చింపి దారంతో వాటి నన్నింటినీ దండలాగ గుచ్చుతాను గుచ్చి ఆదండతువ్వాయి మెడలో వేస్తాను వేసి ఆ తువ్వాయిని కొరడా పుచ్చుకొని వీధులంపట పరుగెత్తిస్తాను లేకపోతే ఆ కాగితాలన్నీ పడవలు కట్టి తూముకాలవలో వేస్తాను పడవల్లో చీమలని ఎక్కించి వదుల్తాను అవి రంయిన పడవల్తో వెళ్ళిపోతాయి. ఎంచక్కా!

నాన్నే చూడకుండా వుంటేనా!

పెరట్లో గోడపక్కని నీళ్ళుపోసి మన్నంతా తవ్వుతాను తవ్వి ఆ మన్నుతో పిచ్చికగూళ్ళు కడతాను కట్టి ఆ గూళ్ళల్లో బెల్లం ముక్క పెట్టి చక్కావస్తాను పొద్దున్నే లేచివెళ్ళి ఆ గూళ్ళల్లోకి పిచ్చికలు వచ్చేయేమో చూస్తాను

నాన్నే చూడకుండా వుంటేనా! పలకా పలకపుల్లా అవతల పారేసి ఇంకా ఎన్నో చేస్తాను!

# నేను పెద్దవాడ నైనాక!

రెండెద్దులూ ఒకబండీ కొంటాను ఒక కొరడా కట్టుతాను దానికి పువ్వులు కడతాను ఎద్దుల మెడనిండా గంటలు కట్టుతాను ఎద్దులను బండికట్టి కొరడా చేత్తో బుచ్చుకొని సాయంత్రందాకా తోలితోలి కొండలవతలికి వెళ్ళి పోతాను కొండలవతల నక్షత్రాలూ అవీ ఉన్నాయి వాటితో అక్కడ ఆడుకుంటూ కూచుంటాను నాన్నలాగ ఎప్పుడూ కచ్చేరీకి వెళ్ళను

నేను పెద్దవాడనయినాక!

పేద్దనిచ్చెన ఒకటి చేయిస్తాను ఆ నిచ్చెన భూమిలో పాతుతాను ఆ నిచ్చెన ఎంతో పేద్దది అది ఎక్కి ఆకాశం దగ్గిరదాకా వెళ్ళుతాను వెళ్ళి ఆకాశాన్ని ముట్టుకుంటాను నిచ్చెనచివార నిలబడివ నక్షత్రాలని కోస్తాను, కోసి జేబులో వేసుకొని ఆడుకుంటాను ఎప్పుడూ అక్కడే వుండి పోతాను కిందకు యెప్పుడూ దిగిరాను నయినా!

చేతిలో ఉన్న సిరాబుడ్డి నా మీదికి విసిరి, 'నాన్నాన్న, నాన్నాన్న' అన్నాడు నా బట్టలనిండా సిరాచుక్కలు పడ్డవి. 'ఎంత అల్లరి చేస్తున్నావు! రావణా అల్లరి! అన్నా!' అని నేనంటే కుఱ్ఱవాడు నా వైపు తిరిగి 'అన్నా ! " అన్నాడు నా కోపము ఎగిరిపోయింది సిరా అంటిన వాడి బుగ్గ ముద్దు పెట్టుకున్నాను ముద్దు పెట్టుకుంటుంటే వాడు సిరాచేతులు నా ముఖాన పూసినాడు ముఖము పైకెత్తి గుమ్మము కేసి చూతునుగదా అసిస్టెంటు పోలీసు సూపరింటెండెంటుగారు అక్కడ నిలుచుని వున్నారు

## 2

నేను ఉద్యోగములో ప్రవేశించింది మొదలు నేటి వరకూ అధికారుల మెప్పుదల పొందుతూ ఉన్నాను. ఎందరో అధికారులు వచ్చినారు, వెళ్ళినారు అందరూ నన్ను ప్రీతితో చూచేవారు గిట్టనివాళ్ళు నన్ను గురించి అనేక విధాలుగా చెప్పుకొంటారు. ఎవ్వరేమి అనుకొన్నా నాకేమీ లోటులేదు వంగి వంగి సలాములు చేస్తూ నేను అధికారుల వెంట తిరుగుతానట పెద్దమనుష్యులను మర్యాద చేయడము వంగి వంగి సలాములు చెయ్యడమా? నే నేమో బిరుదులు ఆశిస్తూ, ఉన్న డబ్బంతా అధికారుల కోసము ఖర్చుపెట్టుతూ, స్వాతంత్ర్యము లేనివాడనని బంధువులూ, స్నేహితులూ దెప్పిపొడవడము న్యాయము కాదు నిజము ఎదుటివారికి తెలియదు

ఏ మయినా సరే అని కొత్తగా వచ్చిన పోలీసు దొరను కాఫీ పుచ్చుకొనడానికి మా యింటికి ఆహ్వానము చేశాను తెల్లవాళ్లు మా యింటికి స్నేహభావముతో రావడము చూసి నా బ్రాహ్మణ్యము పాడయిపోయినదని చుట్టుపక్కలవాళ్ళు అనుకొనేవాళ్ళు అయితే నేను వాళ్ళను లక్ష్యము చేసేవాడను కాను

ఎనిమిది గంటలకు ఆయన వస్తాడని నేను కనిపెట్టుకొని వుండి, ఊరికే కూర్చోకుండా నవల చదువుతూ ఉంటిని మావాళ్ళు లోపల కాఫీ కాస్తూ ఉంటే కుఱ్ఱవాడు తల్లి దగ్గర ఉండక నా దగ్గిరికి వచ్చినాడు పోనీ అని ఊరుకొన్నాను పుట్టక పుట్టక పుట్టిన పిల్లవాడు కావడము చేత వాడు చేసే అల్లరిమూలానే నాకూ వాడి తల్లికీ రెండు మూడుసార్లు జగడము సంభవించింది జగడము లేనియిల్లు ఉన్నదా? ఈ క్షణము భార్యతో దెబ్బలాడి పరక్షణము మళ్ళీ మాట్లాడనివారెవరు? కాని నేను మాత్రము దెబ్బలాడిన తరువాత రెండు మూడు రోజుల దాకా మాట్లాడేవాడను కాను

ఒకనాడు నేను పుస్తకము చదువుతూ ఉంటే మా వాడు గదిలోకి వచ్చినాడు నేను చదివేవేళా, వాడు అల్లరిచేసే వేళా సామాన్యముగా ఒకటే నేను చదువుతూఉంటే వాడు దగ్గిరికి వచ్చి చఱ్ఱున పుస్తకము లాగితే కొన్ని కాకితాలు చినిగినవి నాకు చాలాకోపము వచ్చినది అటుమీద వాడిని తల్లి దగ్గిరికి ఈడ్చుకు పోయినాను తల్లి కూడా వాణ్ణి రెండు తిట్టింది మళ్ళీ గదిలోకి వెళ్ళిన తరువాత నాకు పశ్చాత్తాపము కలిగింది ఇంతలో కుఱ్ఱవాడు గదిలోకి వచ్చి నా చెయ్యి పట్టుకొని ఇంట్లోకి లాగుకొని పోయినాడు ఎందుకో అనుకొన్నాను వాడు తన తల్లి చెయ్యి రెండోచేత్తో పట్టుకొని మా ఇద్దరి చేతులూ కలిపినాడు మూడేళ్ళ పిల్లవాడు ఇటువంటిపని చేయడము ఇతరులకు శమ్మశక్యము

కానిదైనా, వింతగా కనిపించినా, మాకు మాత్రము సంతోషము కలిగించింది కలహాలు కల్పించడానికీ చేతులు కలపడానికీ తగినవాడవయినావా అనుకొని ఇద్దరమూ వాణ్ణి చూసి నవ్వినాము

దొరకోసము ఎదురు చూస్తూ, నవల చదువుకొంటూ ఉంటిని మావాడు అల్లరి చెయ్యడమూ, నేను సద్దడమూ వీటితో కొంత కాలక్షేపము అయింది ఇంతలో దొరవచ్చి, గుమ్మము దగ్గర నిలబడినాడు నా బట్టలనిండా సిరా, ముఖమునిండా సిరా, చేతిలో పిల్లవాడు! ఇటువంటి వికారపు వేషముతో ఆయనకు కనబడ్డాను గదా అని చిన్నపోయినాను అందులో ఆ పెద్దమనిషి మనవాడైనా కాడు, తెల్లదొర!

దొర గుమ్మము దగ్గిర నిలుచుని చిరునవ్వు నవ్వినాడు ఇంకేమున్నది! నామోటుతనము చూచి ఆయన నవ్వినాడనుకొన్నాను మనఃపూర్వకంగా క్షమాపణ చెప్పుదామనుకొన్నాను. నోరు తెరవబొయ్యేటప్పటికి 'మీ పిల్లవాడా!' అని దొర అన్నాడు 'కాడు!' అని చెప్పదలచుకొన్నాను నా కొడుకు ఇలాటి అవకతవక పనులు చేస్తాడని అనుకుని పోతాడని కాదు అనబోతిని నాలిక చివరకు కూడా వచ్చింది అయితే ఇతరుల పిల్లవాడు నా గదిలో ఇంతల్లరి చేయడానికి నేను సహిస్తానా? అంతమాత్రం దొర గ్రహించలేడా అని ఆలోచించి, ముందు క్షమాపణ చెప్పి, నా పిల్లవాడే అనక తీరింది కాదు ఎంతో నొచ్చుకొని, మిక్కిలి దీనముగా జవాబు చెప్పినాను దొర మళ్ళా నవ్వి ' అల్లరి పిల్లవాడు లాగు వున్నాడే!' అన్నాడు ఇంకే మున్నది! అన్నందాలా బిడియమే అనుకొని ఆయన కేమి జవాబిత్తునా అని ఆలోచించినాను అల్లరి పిల్లవాడే అంటే హిందువులు పశువులను కొంటాడేమో, నన్నేమనుకొంటాడో కాడంటే అల్లరి చేసినట్టు కనిపిస్తున్నదే! 'చిత్తము, క్షమించండి అల్లరి పిల్లవాడే' అంటిని అన్నప్పుడు నీతి చంద్రికలో మాట జ్ఞాపకము వచ్చింది 'గంపెడు గులక రాళ్ళకంటే ఒక్కమాణిక్యము చాలు'నని ఇస్తూ ఇస్తూ భగవంతుడు ఈ గులకరాయే నాకియ్యవలెనా? అనుకొన్నాను దొర విసుగుకొని మొగము చిట్లించుకొని వెళ్లిపోతాడేమోనని భయంవేసింది కాని ఆయన నెమ్మదిగా నా కొడుకు దగ్గరకి వచ్చి వేలుతో వాడిబుగ్గమీద నవ్వుతూ కొట్టినాడు ఆ మాత్రము చనువు ఇచ్చిందే చాలునని కాబోలు మావాడు దొరమెడలో పట్టి (టై) పట్టుకుని గట్టిగా లాగివేసినాడు నేను చాలా సిగ్గుపడ్డాను దొరకు కోపం రాలేదు పైగా ఆయన కుర్రాడని ముద్దాడినాడు ఈయనకు మతిపోయిందా అకున్నాను తర్వాత ఆయన మావాడి చేతిలో పదిరూపాయల నోటుపెట్టి కుర్చీలో కూచుని చక్కనికొడుకు అదృష్టవంతులు మీరు' అన్నారు సమయం దొరికందే చాలునని మా వాడిగుణాలన్ని ఆయన ఎదుట ఏకరువు పెట్టినాను చుట్టుపక్కల ఉన్న పిల్లవాళ్లకంటే మావాడు చక్కనివాడు బుద్ధిమంతుడు - ఏమీకాడు ! అని గబగబా చెప్పినాను దొర నా మాటలకు నవ్వినాడు.

" నాకు ముగ్గురు పిల్లలు ఉన్నారు ? వాళ్లూ ఇలాగే అల్లరి చేస్తారు' అని దొర అన్నాడు.' ఏమిటి? దొరల పిల్లలు కూడా అల్లరి చేస్తారా? అల్లరి చేయడము అనాగరికుల లక్షణము కాదా?

'చురుకుగా అల్లరి చేసే పిల్లలని చూస్తే నాకిష్టము అన్నాడు దొర మా అబ్బాయి మరింత

అల్లరిచేస్తే బాగుండును అనుకొంటిని దొరకు కాఫీవేళ దాటిపోతున్నదని నేను మొగము చేతులు కడుగుకొని మంచి బట్టలు వేసుకుని రావడానికి ఆయనను సెలవుఅడిగితే వద్దని ఆయన నన్ను కూర్చోబెట్టి తన బిడ్డల సంగతి చెప్పనారంభించాడు మావాడు ఊరుకోక దొరవొళ్లో కూర్చున్నాడు చాలాసేపు ఇష్టాగోష్టి జరిగింది కాఫీతాగి దొర వెళ్లబోతూఉంటే ఆయన దుస్తులకు మావాడు సిరాచేతిలు రాసినందుకు క్షమాపణ చెప్పబోతిని

ఫరవాలేదు, కుర్రవాడి చేతినుంచి సిరా నాకోటు మీదికి వచ్చినందుకు గర్వపడుతున్నాను అని దొర వెళ్లిపోయినాడు ఇంటిలోకి వెళ్లి నేను ఈ సంగతులు మావాడి తల్లితో చెప్పినాను ఇద్దరమూ ఇంతసేపు నవ్వుకొన్నాము

# నీతి పాఠము

ఈ కాలంలో కుర్రాళ్లకి పాఠశాలలో నీతిబోధ చేయకపోవడం చాలా పొరపాటని చాలాకాలం బట్టి మా ఉద్దేశ్యం చదువయిపోయిన తరువాత కుర్రవాణ్ణి ప్రపంచకంలో వదిలిపెట్టినప్పుడు వాడికి ఎక్కువ సహాయకారిగా ఉండి సంసార సాగరాన్ని ఈదడానికి గాని దేశ పురోభివృద్ధికి తోడ్పడడానికి గాని అర్హతకలిగించేది నీతిబోధ అవుతుందిగాని - ఈ గణిత శాస్త్రాలు దేశచరిత్రలు, భూగోళ ఖగోళ చరిత్రాదులు కానేరవు దైవభక్తి, పితృభక్తి, దేశభక్తి ఇత్యాది భక్తులు కుర్రతనంలోనే నూరిపొయ్యక పోయినట్లయితే పిల్లవాడు ప్రపంచకంలో ప్రవేశించడంతోనే వ్యసనాలకి లోబడిపోతాడు నీతిబోధ లేకపోవడం వల్లనే ఈ కాలపు కుర్రవాళ్లు తల్లిదండ్రులకు లొంగక ఇష్టంవచ్చినట్లు సంచరిస్తూ దేహాన్నీ బుద్ధినీ పాడుజేసుకుంటున్నారు తల్లిదండ్రులు చెప్పినట్లే ప్రపంచకంలో కుర్రవాళ్లందరూ నడుచుకున్నట్లయితే ఈ ప్రపంచకం ఇప్పుడున్న విధంగా ఉండక సీదాగా క్రొత్త ప్రపంచమై ఉండేది ఈ కొత్త ప్రపంచంలో జైళ్ళ అవసరం లేదు సంఘ సంస్కర్తల అవసరం లేదు మతబోధకులుండక్కరలేదు కోర్టులు అసలే అక్కరలేదు కానీ యీకాలం కలికాలం కదా అందుచేతనే పితృవాక్య పరిపాలకులు చాలా అరుదుగా ఉన్నారు అయినప్పటికీ నీతిబోధ తల్లిదండ్రులు చెయ్యకపోవడం చాలా తప్పు. పోనీ వాళ్ళు చెయ్యకపోతే పోయిరి, బడులలోనైనా చెయ్యక్కరలేదూ? ఈ లోపం తీర్చడానికనే కొందరు ప్రముఖులు, దేశభక్తిచే పురిగొల్పబడి, విద్యార్థులకోసమని కొత్తకొత్త పత్రికలు పెట్టీ, ఉపన్యాసాలిచ్చీ పాటుపడుతున్నారు వీరివంటివారే మరి కొందరు పనిపాటలు లేక వుద్యోగాలు దొరక్క ఏమి చెయ్యడానికీ తోచక-పోనీ విద్యార్థుల కీ నీతిబోధేనా చెయ్యవచ్చును దానివల్ల పుణ్యం పురుషార్థం కూడా - అనుకొని, కొత్త కొత్త విద్యార్థి పత్రికలు లేవనెత్తి దేశ సేవ చేస్తున్నారు దేశ సేవతో బాటు వీరు భాషాసేవ కూడా చేస్తూన్నట్లు అనుకొంటున్నారు 'ఏకా క్రియా ద్వ్యర్థకరీ బభూవ' అన్నట్లు వీరిని ప్రజలు మెచ్చుకుంటున్నారు గాని కుర్రాళ్ళు వీరి పత్రికలు చదవకపోవడం చాలా నీచమైన పని వీరికోసమని ధన ప్రయాసలకు వెనుదియ్యక, పత్రికలు పెట్టితే

వాటిని వీరుచదవకపోవడం కన్న తప్పుపని మరి ఏమున్నది? చదువక ఈ కుర్రవాళ్ళు యధాప్రకారం కాఫీ హోటల్సుకి వెడుతున్నారు గ్రామ్యాన్నే గ్రంధాలు వ్రాస్తున్నారు క్రాఫింగు లుంచుకుంటున్నారు భావగీతాలు వ్రాస్తున్నారు నవలలు చదువుతున్నారు నాటకాల్లో వేషాలు వేస్తున్నారు పెద్ద పిన్న తారతమ్యం తెలియకుండా ప్రవర్తిస్తున్నారు ఈ పత్రికలు చదవకపోవడానికి కూడా కారణం యుక్తవయస్సులో నీతిబోధ చెయ్యకపోవడమే కాని మరి ఒకటి గాదు ఈ సంగతి గుర్తెరిగి మా కుర్రవాళ్ళకి ఏడాది వెళ్ళినప్పటినుంచీ నీతి బోధచెయ్యడానికి పూనుకొని ఆ విధంగా చేస్తున్నాను నేను చేస్తూన్న యీ వుత్తమకార్యమును మెచ్చుకొని వాళ్ళూ కృతజ్ఞత చూపడంలేదు, లోకమూ చూపడం లేదు నిజంగా దేశాభివృద్ధికి తోడ్పడే వారికి యీ కాలంలో మెప్పు లేదు.

ఒకనాడు మా చంటబ్బాయి-రెండేళ్ళవాడు - కొంచెము అల్లరి చెయ్యడం మొదలు పెట్టేడు ఆ సమయంలో నేను కొంత వాఙ్మయపరిశోధన చేసుకుంటూ తదేక దీక్షతో వున్నాను ఆ పరిశోధన ఏమిటీ అంటే పూర్వము మనదేశము నేలిన 'మల్కిభరాముడు' ఎవరూ అని కొందరితడు నబాబంటారు గాని అది విశ్వసనీయము కాదు క్షత్రియుడే అయితే సూర్యవంశపువాడా, చంద్రవంశపు వాడా? ఒకవేళ బ్రాహ్మణుడైతే నియ్యోగా వైదీకా? అని ఇంత వరకూ కవి చరిత్రకారులు ఆంధ్రకవులను సాధ్యమయినంత మట్టుకు నియోగ్యులనుగా పరిగణించినారు ఆ కవులను పోషించిన రాజుల విషయమై వారు ఆట్టే వ్రాయలేదు నేను ఆ పనికి పూనుకొని ఆ యేలికలు కూడా నియ్యోగులే అనడానికి ప్రబలమైన కారణాలు సంపాదిస్తున్నాను 'మల్కిభరాముడు' నామతంలో నియ్యోగి కావచ్చు నేమో అని తోస్తుంది ఈ పరిశోధన కార్యానికి నేను రెండు పద్యములు సంపాదించినాను

క ఆకుండ గల్పవృక్షము
వీకుండన్ లోభివగుదు విహపరములకున్
మీకుండగ మాకిచ్చుట
మాకుండగ నడుగబోము మల్కిభరామా!

ఉ ఓరి విధాత యోరి వినరా కనరా తలకొట్లమారి ని
స్సారపులోభిరాజులను జంపక మల్కిభరామచంద్రునిన్
సారయశోనిధిన్ ఘనుని జంపితి వందున నేమి? దక్కెనీ
చేరువనింతరాజును సృజింపగ నీతరమే వసుంధరన్!

ఈ పద్యములను ఆధారముగా చేసుకొని నా వాదం నిలవబెట్టుకోడానికి ప్రయత్నం చేస్తూంటే మా రెండేండ్ల పిల్లవాడు శ్రీనాధుని కాశీఖండం తీసుకొని, దానిలో పేజీలన్నీ ఒకదాని వెనుక నొకటి చింపివెయ్యడం మొదలుపెట్టి నాడు కొంతపుస్తకం కాళీ అయిన తర్వాత ఆ సంగతి నేను గ్రహించి సయమం వచ్చినప్పుడు ఊరికే పోనియ్య కూడదనుకొని వాడికి నీతి బోధచెయ్య

తలుచుకొన్నాను నా కెదురుగా వాడిని మరంచేయించి కూచోబెట్టి చేతులు కట్టించి ఈ రీతిగా వుపన్యాసం ప్రారంభించేను 'నీవింకా కుర్రవాడవు వస్తువు యొక్క సరియైన విలవ నీకు తెలియడం లేదు శ్రీనాధుడు మహాకవి. ఆ మహాకవి వ్రాసిన గ్రంధమును చింపడము చాలా తప్పు అదిగాక పుస్తకం సరస్వతీ దేవి రూపము ఈ పని నీవు చేయడం వల్ల మహాకవి యెడలా సరస్వతియెడలా అపరాధం చేసినవాడవయినావు కాబట్టి యింక ముందెప్పుడూ పుస్తకాలు చింపబోకు అది గాక నీకు సంసారకష్టాలు యింకా ఏమీ బోధపడలేదు రూపాయిన్నరయిచ్చి కొన్న పుస్తకాన్ని నీవు తృణప్రాయంగా చూచి చింపివేయడం వల్ల ధనవిషయమున నీకు సరియైన అభిప్రాయం లేనట్లు స్పష్టము 'ధనమూల మిదం జగత్త'ను ఆర్యోక్తి నీవు మరచిపోకు ఎంత కష్టపడితే వస్తుంది రూపాయిన్నర! చెమట ఊడ్చి ఈ డబ్బు సంపాదించిన నాపై కూడా నీకు గౌరవంలేనట్లు నాకు తోస్తూంది 'పితృదేవోభవ' అనేమాట ఎప్పుడూ మరచి పోకు వెళ్ళు' అని మావాడిని పంపివేసినాను మావాడు వంటింట్లోకి వెళ్ళి అక్కడ మజ్జిగతప్పేలా కిందకు పడదోసినాడు ఇంతబోధాచేస్తే యిలాగ చేస్తాడా అని వాడిని రెండుతన్ని ఎన్నటికైనా ఈనా నీతిబోధ ఫలించకపోతుందా అని వూరుకొన్నాను.

అడపా తడపా మాచంటి కుర్రవానికి నీతిబోధన చేస్తూవుంటాను గాని మా పెద్ద కుర్రవాడి విషయంలో మాత్రం ఎక్కువ జాగ్రత్తతీసుకొని ప్రతీదినం ఏదో వొక విధంగా సమయంచూచి సూక్తిరత్నములు నాలుగయిదు యిస్తూవుంటాను సాధారణంగా సాయంకాలం భోజనాలు చేసిన పిమ్మట ఆరుబయట మావాడిని కూచోబెట్టి నీతిబోధ చెయ్యడం నా అలవాటు వాడు అప్పుడే కునికిపాట్లు పడడం వాడి అలవాటు నీతిబోధ చెయ్యడానికిగాని, ఒకపారము మొదలుపెట్టడానికి ముందుముందుగా కుర్రవాడి మనస్సు కొంత దోహదంచేసి పిమ్మట నీతిబీజాలు నాటవలెను భూమికి దున్నడం ఎటువంటిదో బోధకు ఈ దోహదము అటువంటిది ఈ నాటి విద్యాబోధకు యిదికీలకము - మూలసూత్రము ఆ సంగతి గ్రహించినవాడనగుటచేత నేను ఒకనాడు మావాడిని కూచోబెట్టి నీతిబోధకు దోహదం ప్రారంభించేను అసలు మావాడికి చెప్పదలచుకొన్న నీతిపారము మాతృభక్తిని గురించి, మావాడు తరుచు తన తల్లితో భోజనం చేసేటప్పుడూ, బళ్ళోకి వెళ్ళమన్నప్పుడూ, ఏదేనాపని చెప్పినప్పుడూ యతి అంటే ప్రతంటూ వాదంచేస్తూవుంటాడు. ఆ దురభ్యాసం మానిపించాలనే వుద్దేశంతో యీ పారం మొదలు పెట్టేను ఏమంటారా-ఫలానా శీతారామయ్యగారి అబ్బాయి నీతిమంతుడూ, బుద్ధిమంతుడు అనిపించుకుంటే తండ్రిగారికి ఘనతగాని వట్టి అల్లరి పిల్లవాడనిపించుకుంటే తండ్రికేమి ఘనత? బాల్యంలో పిల్లవాడు చేసినతప్పులన్నీ తండ్రివేగా!

'అబ్బాయీ, - మనవూళ్లో పెళ్ళిళ్ళు అవుతున్నాయి చూస్తున్నావురా?'

'ఆ, నేచూస్తున్నా, నాన్నా, - ఎంచక్కవాళ్ళంతా-'

'ఏమిటి చెప్పు'

'నాన్నా, వాళ్ళంతా పల్లకీ ఎక్కి ఊరేగుతూంటే చూశాను '

'ఇంకేమేమి చూశావు చెప్పు '

'నాన్నా, పల్లకీలో ఎక్కితే ఎలాగవుంటుంది?'

'బాగానే వుంటుందిగాని, ఇంకా ఏమేమి చూశావో చెప్పు '

'నాన్నా-మరి-పల్లకీలో ఎక్కాలంటే -మరి- పల్లకీలో ఎక్కడం ఏలాగ?

'పల్లకీలోనా-పెళ్ళిచేసుకుంటే సరి కాని నీవింకా ఏమేమి చూశావు చెప్పు '

'నాన్నా, మరి నేను పల్లకీలో ఎక్కాలని వుంది. నాకు పెళ్ళిచెయ్యవు?'

'ఆఁ, ఆఁ, ఏమిటీ అంటున్నావు'

'నాన్నా, నాకు పెళ్ళిచేస్తే నేను అయిదురోజులు పల్లకీలో కూచుంటా కాదూ'

' తప్పు, తప్పు, విను పెళ్ళంటే నీవు పల్లకీలో కూచోవడం అనుకుంటున్నావు. పెళ్ళి జీవితంలో ఒక పరమపవిత్రకార్యము దానిని చుల్కనగా చూడకూడదు. నీకింకా ఆరేండ్లు నిండలేదు అప్పుడే పెళ్ళా?'

'ఏం నాన్నా!'

'నాకెప్పుడైందో పెళ్ళి ఎరుగుదువా? నాకుజీవిత యాత్ర జరిపించడానికి శక్తిసామర్థ్యాలు కలిగిన పిమ్మటనే పెళ్ళయింది

'నీ పెళ్ళికి నన్ను పల్లకీలో కూచోబెట్టుకున్నావా, నాన్నా!'

'ఏమిటీ?'

'అప్పుడు నేను చిన్నవాణ్ణికాదు నాన్నా!'

'కుర్రవాళ్ళు ఆట్టే పెండ్లిసంగతి మాట్లాడగూడదు చూడు ఆకాశంకేసి చూడు. దానిమీద ఏముందో చెప్పు '

'నాన్నా, దాన్ని ఆకాశం అంటావేం, అది కొండగాదూ?'

'రెండూ వొకటే ఆకాశం మీద ఏముందో చెప్పు '

'మరీ నాన్నా, నాన్నా! మొన్న నన్ను అన్నవరపు కొండమీదికి తీసికెళ్ళావు కాదూ '

"అవును"

"మరి నాన్నా, అక్కడికొండ చేతికందింది గాదే?"

'కొండంటే పర్వతమన్నమాట '

'మరి నాన్నా, ఆ కొండమీద మరి చందమామా వాళ్ళూ వుండరూ?'

'పర్వతం మీద వుండరు ఆకాశంమీద వుంటారు చూడు ఈ మాటు చూసి చెప్పు ఏముందో ఆకాశంమీద '

'చందమామ వుంది చుక్కలున్నాయి మేఘాలున్నాయి '

'ఆఁ, మేఘాలసంగతికేంలే, మరి చందమామ ఎప్పుడగుపిస్తాడు మనకి?'

'బయటికి వచ్చి చూస్తేను '

'అదిగాదురా, పగలా, రాత్రా?'

'నాన్నా, మరి రాత్రిగాదూ చందమామ వచ్చేది?'

'మరి పగలు ఎవరుంటారు?'

'పగలా నాన్నా, సూర్యుడు '

'సరే మరి ఇద్దర్లోకి ఎవరికెక్కువ వెలుగుంది?'

'నాన్నా, నాన్నా చంద్రుడిలోకి వెలుగేలాగవచ్చింది '

'సూర్యుడిలో కెలాగవచ్చిందో మొదట చెప్పు '

'నాన్నా, చంద్రుడిలో సూర్యుడు దీపంపెట్టాడా?'

' అవునుగాని మనకు రాత్రి చంద్రుడు పగలు సూర్యుడు ప్రత్యక్షదైవాలు '

'అంటే యేమిటి నాన్నా '

'అంటే దేవుళ్ళన్నమాట '

'మనం దండంబెట్టాలా నాన్నా!'

'ఆఁ వీళ్ళిద్దరూకాక ఎప్పుడూ మన కగుపించే దేవుళ్ళెవరు?'

'దీపం, గౌరీదేవి '

'అదిగాదురా, ఎపడూ నీతో తిరిగేవాళ్లు '

'నువు చెప్పవూ నాన్నా!'

' ఆలోచించి నువు చెప్పుకోవాలి '

'కొంచెం చెప్పు నాన్నా!'

' మీ అ '

'ఇంకా కొంచెం చెప్పు నాన్నా '

'మీ అమ్మ వొకటిరా '

'మా అమ్మ ఏవిటే నాన్నా,'

'మీ అమ్మ వొకదేవుడు '

'అమ్మ దేవుడా నాన్నా?'

'ఆఁ నాన్న ఒక దేవుడు.'

'నువ్వా దేవుడవే నాన్నా!'

'ఆ, మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అతిధిదేవోభవ, అన్నమాట జ్ఞాపకం వుంచుకో '

'మరి నాన్నా మీరిద్దరూ దేవుళ్ళయితే మరీ . '

'నేను చెప్పేది కొసాకీ విను తొమ్మిది మాసములూ మోసి కనీ పెంచీ, నిన్ను పెద్దవాణ్ణిచేసిన మీ అమ్మదేవుడు కాదటరా? ప్రజయాపితృభ్యః అనేవాక్యం వినలేదూ?'

'మీరిద్దరూ దేవుళ్ళయితే మరీ '

'ఛట్ ఉండు మీ అమ్మని ఎప్పుడూ పూజిస్తూ వుండు తెల్లవారగట్టేలేచి, లేచీ లేవడంతోనే, మీ అమ్మ ముఖంజూసి మీ అమ్మకుదండం బెట్టినట్లయితే భూప్రదక్షిణం చేసినంత పుణ్యం!'

'మరీ నీకు దండం పెట్టొద్దూ నాన్నా!'

నాసంగతి చెబుతాను ముందుగా వినూ, మీ అమ్మ మాటకెప్పుడూ ఎదురాడగూడదు చెప్పినట్టల్లాచేస్తూండాలి '

'మరి నాన్నా! అమ్మ అస్తమానవున్నూ కుంకుడు కాయలు గొట్టమంటూంది నీళ్ల పొయిలో కఱ్ఱలెగసన తొొమ్యమంటుంది కాళ్లు కడుక్కోటానికి నీకస్తమానం చెంబుతో నీళ్లు అందివ్వమంటుంది తమ్ముణ్ణి ఆడించమంటుంది అన్నంలో మావిడిపండు వెయ్యకుండా ఆవకాయ వేసుకొని తినమంటూంది మరి'

'ఓహోహో, మీ అమ్మయేం చెప్పితే అది చెయ్యవలసిందే మీ అమ్మ వొకదేవుడు, నేనొకదేవుణ్ణి తెలిసిందా?'

'నాన్నా మరి, మీరిద్దరూ దేవుళ్ళయితే, మరి నేనో '

'నువ్వా? నువ్వు భక్తుడివి '

'కాదు నాన్నా! మీరిద్దరూ పెద్ద దేవుళ్ళూ నేనో చిన్నదేవుణ్ణి కాదూ నాన్నా!'

ప్రపంచకంలో ఆశలేందే యెవడూ బతకలేడు నానీతిబోధకు ప్రతిఫలం వుండకపోతుందా అనే ధైర్యమే నన్ను నిలబెడుతూంది



# సూరి, సీతి, వెంకి



## పేరంటం

**సూ**రి అరుగు చివర కూర్చుని కాళ్లు వేళ్లాడవేసుకొని ఊపుతూ, ఎదురుగుండా గడ్డి మేస్తున్న మేకపిల్లల కేసి చూస్తూ పాడుకుంటోంది

'అమ్మా నాకు తలదువ్వే
కాళ్ళకు గజ్జెలు కట్టవుటే
పేరంటానికి వెడతాను
కాళ్ళకు పసుపూ పూస్తారు
చుట్టూ పారాణి పెడతారు
శనగల వాయనం ఇస్తారు
అప్పుడు ఇంటికి వస్తాను,
పశువులు ఇంటికి వచ్చాక
పాలూ బువ్వా తింటాను '

సూరి తెల్లపువ్వుల ఎఱ్ఱపరికిణీ కట్టుకొంది తెల్ల జుబ్బా తొడుక్కొంది మెడలో ఒక చిన్న కాసులపేరు , కాళ్ళకు వెండికడియాలు పెట్టుకుంది చేతులకి బంగారం మురుగులున్నాయి అప్పుడే తల దువ్వుకొని, కాటుకా, బొట్టూ పెట్టుకొంది

ఇంట్లో వాళ్ళమ్మ వాళ్ళ చెల్లాయి లిద్దరికీ తలదువ్వుతోంది సూరికి ఎనిమిదేళ్ళ వయస్సు, చామనచాయగా, బక్కపలచగా ఉంటుంది అసలు సూరిపేరు సూర్యకాంతం తను బళ్ళో చదివే రెండోవాచక పుస్తకం మీద 'సూరెకాంతం' అని తనపేరు వ్రాసుకొంది అసలుపేరు సూర్యకాంతం అయినప్పటికీ వాళ్ళమ్మ దాన్ని ఎప్పుడూ 'సూరి' 'సూరి' అని పిలుస్తూ ఉంటుంది వాళ్ళమ్మ పిలవడం చూచి వాళ్ళ నాన్న కూడా 'సూరి సూరి' అనే పిలుస్తూ ఉంటాడు

వాళ్ళమ్మ వంట చేసుకొనేటప్పుడూ, నీళ్ళకు వెళ్ళినప్పుడూ సూరి తన చెల్లెళ్ళనిద్దరినీ ఆడిస్తూ ఉంటుంది

ఆవేళ పేరంటానికని అందరూ ముస్తాబు అవుతున్నారు ముందుగా సూరి ముస్తాబై అరుగుమీద కూర్చుని పాట పాడుకొంటూ ఉంది

ఇంతట్లోకే గుమ్మంలో నిలబడి ఒక పిల్ల

'సూరీ సూరీ చుంచెలక
మా ఇంటికొస్తే మంచెలక
సూరీ సూరీ చుంచెలక
మా ఇంటికొస్తే మంచెలక'

అని పాడుతూ చేతులు తట్టుతూ నవ్వుతూ సూరిని ఉడికించింది

ఈ పిల్ల సీతి

సీతి అసలు పేరు సీతారాముడు వాళ్ళ నాన్నా అమ్మా ముద్దుకోసం 'సీతి' అని పిలుస్తూ ఉంటారు సీతికి ఆరేళ్ళ వయస్సు, తీరైన ముఖము, చేరెడేసి కళ్ళు, ఎఱ్ఱగా ఉంటుంది కొత్త తెల్లపరికిణీ కట్టుకొని, పువ్వుల చొక్కా తొడుక్కొని, గళ్ళ రుమాలు చేత్తో పట్టుకొని పేరంటానికి సిద్ధంగా ఉంది

సీతికి మెళ్ళో చిన్న కంటే, చేతులకు గాజులూ, కాళ్ళకు కడియాలూ ఉన్నవి అందాకా వాళ్ళమ్మ కాసుల పేరు మెళ్ళో వేసుకొంది

"సూరీ సూరీ చుంచెలక
మా ఇంటికొస్తే మంచెలక'

అని సీతి సూరిని చూచి అనడం సూరి విని మూతి ముడిచి, 'అమ్మతో చెప్పనా' అంది

'చెప్పు నాకేం భయమా ఏమిటి?'

'సరేలే, జ్ఞాపకం ఉంచుకో, నిన్ను పేరంటానికి తీసుకొని వెళ్ళుతానేమో ఉండు' అంది సూరి

'నేను అమ్మతోనే వెడతాను' అంది సీతి

సూరి నవ్వి 'నేను మాత్రం అనలేననుకున్నావా ఏమిటి?' అని,

'సీత పీత
ముంజకాయ మూత
కొడవలెట్టి కోత
సీత పీత
ముంజకాయ మూత
కొడవలెట్టి కోత'

అని సీతిని ఉడికించడం మొదలుపెట్టింది సీతికి ఉడుకుబోత్తనం వచ్చి, అమ్మా, చూడవే, అక్కా చూడవే ' అంది

'నన్నెందు కనాలి ముందు' అంది సూరి

'నన్నెందుకు పేరంటానికి తీసుకెళ్ళనన్నావు?' అంది సీతి

'చూశావా, చూశావా అబద్ధాలు ముందు నేను తీసుకెళ్ళ నన్నానా?'

సీతి నవ్వి పారిపోయింది  ఇంతట్లోకే ఇంట్లోంచి మూడేళ్ళ చిన్నపిల్ల వచ్చి సూరి వెనక్కాల నిలబడింది  దీనిపేరు వెంకి  అసలుపేరు వెంకటరమణ  వాళ్ల అమ్మా, నాన్నా 'వెంకి' అని పిలుస్తారు అంచేత అందరూ 'వెంకి' అని పిలుస్తారు  వెంకి పొట్టిగా ఉంటుంది  ఎఱ్ఱగా ఉంటుంది  మెళ్ళో చిన్ని కంటె పెట్టుకుంది  చేతులికి గాజులూ, కాళ్ళకు కడియాలూ ఉన్నవి  ఎఱ్ఱపువ్వుల తెల్లపరికిణీ కట్టుకొంది  పట్టుజుబ్బా తొడుక్కుంది  బొట్టూ కాటుకా పెట్టుకొని పేరంటానికని గళ్ళరుమాలు చేత్తో పట్టుకొని వచ్చింది

'రావే, వెంకీ, ఇక్కడ కూచో' అని సూరి తన పక్కను వెంకిని కూచోబెట్టుకుంది  వెంకి పరికిణీ మాసిపోకుండా పొందికగా ఎత్తి పట్టుకొని సూరి పక్కని కూర్చుంది

ఇంతట్లోకే సీతి మళ్ళీ వచ్చి గుమ్మంలో నిలబడి వెంకిని చూచి

'వెంకి డొంకి
ఏడు మూళ్ళ దుప్పటి
కప్పుకుంటె చాలదు
కందిపప్పు పచ్చడి
వెంకి డొంకి
ఏడు మూళ్ళ దుప్పటి
కప్పుకుంటె చాలదు
కందిపప్పు పచ్చడి' అని వెంకిని ఉడికించింది
వెంకికి పాపం ఉడుక్కోవడం తెలియదు
'ఎందుకే, గయ్యాళి, దాన్నంటావూ? అమ్మతో చెపుతా నుండు' అంది సూరి
'చెప్పు, చెప్పు, నా కాళ్ళకు బంగారు చెప్పులు కుట్టించు' అంది సీతి
'అలాగే ఉండు  అమ్మ రానీ' అంది సూరి.
'సూరి సూరి చుంచెలక
మా ఇంటికొస్తే మంచెలక'

అంది సీతి

'సీత పీత
ముంజకాయ మూత
కొడవలెట్టి కోత'

అంది సూరి.

'వెంకి డొంకి
ఏడు మూళ్ళ దుప్పటి

కప్పుకుంటె చాలదు
కందిపప్పు పచ్చడి’

అంది సీతి

‘సీత పీత
ముంజకాయ మూత’

అంది వెంకి

ముగ్గురూ కలిసి ఒకళ్ళ కంటె ఒకళ్లు గట్టిగా అనడం మొదలుపెట్టారు

‘అన్నా, అన్నా, ఏమిటర్రా ఆ అల్లరి’ అంది, లోపలనుంచి వాళ్ళమ్మ

‘చూడవే అమ్మా మరి, నేనూ వెంకీ ఇక్కడ కూచుంటే ఈ సీతి’ అంది సూరి

‘అవునే సీతీ?’ అంది వాళ్ళమ్మ

‘కాదే, అమ్మా, నన్నే ముందస్తిగా అందే సూరి’ అని సీతి నవ్వింది.

‘సూరీ, నువ్వుకూడా అల్లరి చేస్తున్నావా’ అంది వాళ్ళమ్మ

‘కాదే అమ్మా, సీతివి అన్నీ అబద్ధాలే నేను ఇక్కడ కూచుంటేను తనొచ్చి నన్ను సూరీ సూరీ అందే’ అంది సూరి

‘లేదే అమ్మా, అన్నీ ఉత్తమాటలే’ అంది సీతి

‘మరి వెంకి నెందుకన్నావు’ అంది సూరి

‘వెంకి నన్నెందుకంది, మఱి’ అంది సీతి

‘పాపం, అదందా, ముందరనువ్వన్నావా? అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారులే’ అంది సూరి

‘నీకే అందరూ ఆడపిల్లలు పుడతారు’ అంది సీతి

‘ఊరుకోరు గాదూ, వస్తున్నా ఉండండి’ అని వాళ్లమ్మ కేకేసింది

అందరూ ఊరుకొన్నారు వాళ్లమ్మ కూడా ముస్తాబై వచ్చింది సీతి మెళ్ళో కాసులపేరు తన మెళ్లో వేసుకొంది

‘అబ్బాయీ మే మొచ్చిందాకా ఇంటిదగ్గిర ఉంటావు కాదూ’ అని వాళ్లమ్మ వాళ్ళన్నతో చెప్పి పేరంటానికి బయిలుదేరింది

వాళ్ళమ్మ ముందు నడుస్తోంది ఆవిడ వెనకే సూరి నడుస్తోంది సూరి కుడిచెయ్యి సీతి పట్టుకుంది. ఎడమ చెయ్యి వెంకి పట్టుకుంది ‘ఎత్తుకోనా వెంకీ’ అంది వాళ్ళమ్మ ‘నే నడుస్తా’ నంది వెంకి అందరూ కలిసి అవతల వీధిలో ఇంటికి వెళ్ళారు వాళ్ళింట్లో వాళ్లమ్మాయి పుట్టినరోజు ఆ అమ్మాయికి రెండో ఏడు తలంటి నీళ్లోసి పట్టుగౌను తొడిగి ముస్తాబు చేసి కుర్చీలో కూచోబెట్టారు పేరంటాళ్ళందరూ వచ్చారు. సూరీ సీతీ, వెంకీ ఆ అమ్మాయి కేసి చూస్తూ నిలబడ్డారు

ఆ అమ్మాయి తల్లి పేరంటాళ్ళందరికీ పసుపూ, పారాణి రాసింది  సూరికీ, సీతికీ కూడా రాసింది  వెంకికి చిన్నపిల్లని రాయకపోతే సూరితో చెప్పి రాయించుకొంది

తరవాత ఆ అమ్మాయికి అందరూ కలిసి హారతి ఇచ్చారు. హారతి పళ్ళెం సీతీ, వెంకీ కూడా పట్టుకుంటామని పట్టుకొన్నారు  పేరంటాళ్ళు మంగళారతి పాటలు పాడారు  సూరిని కూడా పాడమన్నారు గాని సూరి సిగ్గుపడి పాడింది కాదు  తరవాత అందరికీ శనగలవాయనం, తాంబూలం ఇచ్చారు  సీతికీ, వెంకికీ కూడా ఇచ్చారు  సీతి శనగలూ, వెంకి శనగలూ సూరి మూటలు కట్టి పెట్టింది తన శనగలు కూడా మూట కట్టుకొంది  తరవాత వాళ్లందరూ ఇంటికి ప్రయాణమయ్యారు  'అమ్మా, మన వెంకికెప్పుడే పుట్టినరోజు' అంది సీతి

'శ్రావణమాసం' అంది వాళ్ళమ్మ

'అమ్మా, వాళ్ళమ్మాయి మరి మన వెంకిలాగ నడవలేదేమే' అంది సూరి

'వాళ్ళమ్మాయి మన వెంకి కన్న చిన్నది కాదుటే' అంది వాళ్ళమ్మ.

'అమ్మా నన్నెత్తుకోవూ' అంది వెంకి

'రా, అమ్మా, రా ఎత్తుకుంటాను  రా  ఎంతదూరం నడిచిందో నా చిట్టితల్లి' అంది వాళ్ళమ్మ

'అమ్మా నన్ను కూడా ఎత్తుకోవూ' అంది నవ్వుతూ సీతి

'నిన్ను కూడా ఎలా ఎత్తుకోనే? ఆ మాత్రం నడవలేవుటే' అంది వాళ్లమ్మ

అందరూ వాళ్లింటికి చేరారు  వాళ్ళ నాన్నగారు కూడా అప్పుడే కచేరీ నుంచి ఇంటికి వచ్చారు

'నాన్నగారికి కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యవే సూరీ' అంది వాళ్ళమ్మ

సూరి కంటె ముందుగానే సీతి పరుగెత్తుకు వెళ్ళి వాళ్ళ నాన్నగారికి నీళ్ళు తీసుకువచ్చి ఇచ్చింది  వెంకి కూడా చిన్ని చెంబుతో వాళ్ళ నాన్నగారికి నీళ్ళు తెచ్చి పెట్టింది

"వెంకిమీకు కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళు తెచ్చింది చూశారా?" అంది వాళ్ళమ్మ

వాళ్ళ నాన్నగారు 'నువ్వూ తెచ్చావుటే వెంకీ' అని వెంకిని ఎత్తుకొని ముద్దెట్టుకొన్నారు

'నాన్నా, నాన్నా, మేమేం, పేరంటానికి వెళ్ళి శనగలు తెచ్చాం' అంది సూరి

'మీ అమ్మ అన్నం వండుతుంది గాని నువు శనగలు నేతిలో వేయించి ఉప్పూ, కారం చల్లగలవా' అన్నాడు వాళ్ళ నాన్న

'వేయిస్తా వేయిస్తా' అని సూరి సంతోషంతో గంతులేసింది

'అదెందుకూ? చెయ్యి కాల్చుకొంటుంది  నే వేయిస్తాలెండి' అంది వాళ్ళమ్మ

'చెయ్యి కాల్చుకోను, నాన్నా, నే వేయించొద్దూ' అంది సూరి

'దాన్ని వేయించనియ్యవే, పాపం' అన్నాడు వాళ్ల నాన్న

'సరే మీ ఇష్టం' అంది వాళ్ళమ్మ

సీతీ, వెంకీ పక్కనే కూచున్నారు  సూరి కుంపటిమీద శనగలు వేయించింది  అందరూ

అన్నాలు తిన్నాక సూరి వేయించిన శనగలు ఫలహారం చేశారు ఎంత నిద్రవచ్చినా వెంకి నిద్రపోకుండా ఆగి, శనగలు తిని మరీ నిద్రపోయింది సూరీ, సీతీ ఒక మంచం మీదే పడుకొన్నారు కథలు చెప్పుకొంటూ నిద్రపోయారు వెంకి వాళ్లమ్మ దగ్గిర నిద్దరోయింది.

# తీర్థం

'రేపుకాదుటే అమావాస్య?' అని సీతి సూరిని అడిగింది

'రేపేనే అమావాస్య తెల్లారకుండానే నాన్న బండి తీసుకొస్తాట్ట ఆ బండిలో ఎక్కి మనం అంతా సముద్రానికి స్నానానికి వెళ్లాలిట' అంది సూరి

'అక్కడే కాదుటే తీర్థం సూరీ' అంది సీతి

'అక్కడేనే, సీతోయి, అక్కడికేం ఎన్ని దుకాణాలు వస్తాయనుకొన్నావు! బొమ్మలూ, బూరాలూ, బుడగలూ అన్నీ ఉంటాయి' అంది సూరి

'ఎంచక్క, ఎంచక్క' అంది సీతి చంకలు గుద్దుకుంటూను

'నేనూ వత్తా' అంది వెంకి

'మరి నేనేం నాన్ననడిగి ఇన్ని డబ్బులుచ్చుకొని అన్నీ కొనేసుకుంటాను' అంది సీతి

'నాన్న నాకు మాత్రం ఇవ్వడా ఏమిటి?' అంది సూరి

'నాకూ ఇత్తాలు' అంది వెంకి

'సాగరాలమావాస్య కాదుటే సూరీ' అంది సీతి

'అవునే అంది సూరి

'ఒసే, మరీ సముద్ర మెలా ఉంటుందే అక్కయ్యా' అంది సీతి.

'నీళ్ళు ఉప్పగా ఉంటాయి కెరటాలొచ్చి తోసేస్తాయే బయమేస్తుందమ్మా నాకు' అంది సూరి

సీతి ఆలోచించడం మొదలెట్టింది

'మనం స్తానంచేస్తాంకాదుటే' అంది సీతి

'నాన్నా, అమ్మా, అన్నయ్యా, నువ్వూ, నేనూ, వెంకీ అందరూ స్తానం చేస్తాము' అంది సూరి

సూరీ, సీతీ, వెంకీ కలిసి పెరట్లో తులసెమ్మ కోట దగ్గిర కూర్చుని మాట్లాడుకుంటున్నారు వాళ్ళమ్మ వాళ్ళ దగ్గిరే కూర్చుని బియ్యంలో బెడ్డలేరుతోంది వాళ్ళ తువ్వాయి దొడ్లో గంతులేస్తూ ఆడుకొంటోంది వాళ్ళ నాన్నగారు కచేరీ కెళ్లారు వాళ్లన్నయ్య ఆడుకోబోయాడు 'అమ్మా మరి నన్ను కూడా తీర్థానికి తీసుకెళ్ళవుటే' అంది సీతి

'అందరం వెడదాము సూరోయి, మీరే పాత పరికిణీలతో స్తానం చేద్దురుగాని, ఉతికిన

పరికిణీలూ, జుబ్బాలూ తలొకటి తీసుకోండి తీసుకొని చిన్నమూట కట్టుకోండి తుడుచుకోడానికి నే తెస్తాలే' అంది వాళ్ళమ్మ

'మరి నీ బట్టలో అమ్మా' అంది సూరి

'నావీ, నాన్నగారివీ, అన్నయ్యవీ నే మూట కడతానులే' అంది వాళ్లమ్మ

సూరి, సీతి, వెంకి లోపలికి పరిగెత్తుకు వెళ్లారు ఒక ఎఱ్ఱపరికిణీ తీసుకొని సీతికి ఒక ఎఱ్ఱపరికిణీ తీసి ఇచ్చింది

'దానికి చిరుగులున్నాయే, అది వద్దు' అంది సూరి ఇంకో పరికిణీ బాగులేదంది సీతి చివరికి ఒక పరికిణీ సీతికి తీశారు వెంకికి ఒక పుట్ట పరికిణీ తీశారుగాని 'అమ్మ కొడుతుంది' అని అది మళ్ళీ పెట్టెలో పెట్టి ఒక గళ్ళ పరికిణీ తీశారు తరవాత ముగ్గురికీ చార్ల జుబ్బాలు తీసుకొన్నారు అవన్నీ కలిపి ఒక గుడ్డలో మూటకట్టుకొని ఆ మూట వాళ్ళ నాన్నగారి బల్లమీద దాచుకొన్నారు

తరవాత వాళ్ళమ్మ వాళ్ళ ముగ్గురికీ జడలు విప్పి , చమురురాసి తలదువ్వింది తరవాత ముడివేసింది

'ముడేస్తావేమే అమ్మా, జడెయ్యవుటే' అంది సూరి

'రేపు స్నానాలు కాదూ' అంది వాళ్ళమ్మ

దీపాలు పెట్టాక వాళ్ళ నాన్నా, అన్నయ్యా కూడా వచ్చారు

అందరూ కలిసి భోజనాలు చేసి పడుకొన్నారు. సూరీ, సీతి రాత్రి ఒక మంచంమీదే పడుక్కొన్నారు మధ్యమధ్య లేచి 'తెల్లారిందే అక్కయ్యా' అని అడిగేది 'ఇంకా లేదే పడుక్కోవే' అనేది సూరి

తెల్లారింది రెండెడ్ల బండి గుమ్మంలో నిలబడి ఉంది. నారాయణ వాళ్ళమ్మ ఇచ్చిన బట్టలసంచీ మూట పట్టుకొని బండి ఎక్కి కొరడా పుచ్చుకొని 'చల్ చల్' అంటున్నాడు తరవాత వాళ్ళమ్మ వెంకినీ, సీతినీ బండి ఎక్కించి తను కూడా బండెక్కింది సూరి తన బట్టలమూట పట్టుకొని బండెక్కింది వాళ్ళ నాన్నగారు తలుపులు తాళము వేసి వచ్చి బండి చివర ఎక్కి కూర్చున్నారు

బండివాడు బండితోలాడు

సూరీ, సీతీ ఒకచోటే కూర్చుని పక్క ఇళ్ళూ, రోడ్లూ తొంగి తొంగి చూస్తున్నారు వెంకి వాళ్లమ్మ పక్కని కూర్చుని బండి ఎద్దులకేసి చూస్తూ ఎద్దుల మెళ్లో గంటల మోత వింటోంది నారాయణ 'చల్ చల్' అంటున్నాడు

అబ్బాయిా లోపల కూచో, బండి తోల్తారురా నిర్భాగ్యుడా' అన్నాడు వాళ్ళ నాన్న నారాయణ లోపలికి వచ్చాడు

'ఈ మూట ఎవరిదే' అన్నాడు వాళ్ళ నాన్న 'ఇది మాది' అంది సూరి

'ఇది కూడా ఆ సంచిలో పెట్టుకోరాదూ' అన్నాడు వాళ్ళ నాన్న

'ఇలా తేవే సంచిలో పెడతాను' అని వాళ్లమ్మ పుచ్చుకొని సంచిలో పెట్టింది

సముద్రానికి ఎన్నో బళ్ళు వెడుతున్నాయి ఆ బళ్ళతో పాటు ఈ బండీ వెడుతోంది త్రోవలో బొమ్మల దుకాణాలూ, మేడలూ, బట్టల దుకాణాలూ, మిఠాయి దుకాణాలూ, ముష్టివాళ్లూ అందరూ వాళ్లకి కనిపించారు సీతీ, వెంకీ అందరినీ వింతగా చూస్తున్నారు తాళాలూ, తప్పెట్లూ వాయించుకొంటూ కొందరు వెడుతున్నారు కొందరు అచ్చు కాకితాలు పంచిపెట్టుతున్నారు కొందరబ్బాయిలూ, అమ్మాయిలూ ముస్తాబై నడిచి వెళ్ళుతున్నారు

'చూడవే సూరీ, ఆ అమ్మాయి మిఠాయి ఉండ తింటూ వాళ్ళమ్మ వెనక్కాలే నడిచివెళ్ళుతోంది' అంది సీతి

'చూడొసే ఆ అమ్మని పిల్లకు పాలిస్తూనే నడిచి వెళ్ళుతోంది' అంది సూరి

'ఊరుకో' అన్నాడు వాళ్ళ నాన్న సీతి నిమ్మళంగా వాళ్ళ నాన్నకు వినబడకుండా సూరిని గిల్లి పిలిచి 'చూడొసే, ఆ అబ్బి, కొరడా పుచ్చుకు ఎలా కొట్టుకుంటున్నాడో, ఆ పెట్టెలో దేమిటే' అంది సీతి

'అదేదో అమ్మవారే వాళ్ళు అడుక్కునేవాళ్ళు' అంది సూరి

'ఇంకా ఎంతదూరమే సముద్రం' అంది సీతి

'నాకు తెలియదమ్మా, నాన్న కోప్పడుతాడూరుకో' అంది సూరి

కొంతసేపటికి వాళ్ళ బండి సముద్రం దగ్గిరికి వచ్చింది అందరూ అక్కడ స్నానం చేస్తున్నారు బండివాడు బండాపి దిగమన్నాడు అందరూ దిగారు సీతి నేను దిగగలనని బండిలోంచి ఉరికింది. వాళ్ళ నాన్న కోప్పడ్డాడు వెంకిని వాళ్ళమ్మ దింపింది. బట్టల సంచీ బండిలోనే ఉంచ చూస్తూ ఉండమని బండివాడితో చెప్పి వాళ్ళు స్నానం చెయ్యడానికి సముద్రం దగ్గిరికి వెళ్ళారు

'ఇదేనుటే సముద్రం అమ్మయ్యో! నాకు భయమేస్తోందే' అంది సీతి వెంకి వాళ్ళమ్మ బట్ట గట్టిగా పట్టుకొంది వాళ్ళమ్మ చేతితో కంచెంబు పట్టుకొని వెంకిని రెండో చేత్తో పట్టుకొని స్నానం చెయ్యడానికి సముద్రంలో దిగింది

సీతి, సూరి చెయ్యి పట్టుకొని సముద్రాన్ని చూచి నవ్వుతూ 'నాకు భయమేస్తోందే' అంది వాళ్ళ నాన్నగారు 'దిగండి ఈపాటి స్నానం చెయ్యండి' అన్నారు

నలుగురైదుగురు బ్రాహ్మలు 'నేను స్నానం చెయ్యిస్తానంటే నేను స్నానం చేయిస్తా'నని వాళ్ళ మట్టూ మూగారు

వాళ్ళమ్మ మోకాలిలోతు నీళ్ళల్లోకి వెళ్ళింది. వెంకి వాళ్ళమ్మ వెనక్కాల నిలబడింది బట్ట గట్టిగా పట్టుకొని, వాళ్ళమ్మ వెనక్కాలే పరికిణీలు పైకి పట్టుకొని సూరీ, సీతీ నిలబడ్డారు కొంగున మూట కట్టుకొన్న పసుపు పొట్లం తీసి వాళ్ళమ్మ పసుపు నీటితో తడిపి తన మొహానికీ రాసింది తరవాత సూరినీ సీతినీ నీటిలో కూర్చోబెట్టి జుట్టు ముడివిప్పి చెంబుతో నీళ్ళుముంచి వాళ్ళ నెత్తిమీద పోసింది అలాగే వెంకిని కూడా స్నానం చెయించింది నీ ళ్ళెల వుంటాయో అని సీతి ఎవరికీ

చెప్పకుండా కొంచెం నోట్లో పోసుకొని ఉప్పగా ఉండడంవల్ల ఉమ్మి వేసింది

సముద్రపు కెరటాలు చిన్నవి ఒకదాని వెనుక ఒకటి వచ్చి వాళ్ళను ఉక్కిరిబిక్కిరి చేశాయి వాళ్ళు భయపడి గట్టుమీదకు వెళ్ళి నిలబడి గచ్చులా ఉన్న ఇసుకమీద కాళ్ళదుముతూ తీస్తూ నవ్వుతున్నారు

వాళ్ళమ్మకూడా నీళ్ళల్లో కూర్చోని చెంబుతో నీళ్ళు ముంచి నెత్తి మీద పోసుకొని స్నానం చేసి గట్టుకు వచ్చింది

వాళ్ల చుట్టూ బ్రాహ్మలు మూగారు వాళ్ళఅమ్మకు స్నానం చేయించారు వాళ్ళమ్మ కొంగుమూట విప్పి సూరి చేత ఒక డబ్బూ వెంకిచేత ఒకడబ్బూ బ్రాహ్మల కిప్పించింది తనుకూడా ఇచ్చింది.

వాళ్లనాన్నా అన్నయ్యా దూరంగా పెద్ద కెరటాలలో స్నానం చేసివచ్చారు అందరూ మళ్ళీ బండిదగ్గిరికు వచ్చారు

వాళ్ళమ్మ అందరితలలూ తుడిచి సూరిమూటతీసి పరికిణీలూ జుబ్బాలూ తొడుక్కోమని ఇచ్చింది. సూరీ, సీతీ, వెంకీ తడిపరికిణీలు వదిలివేసి కొత్త పరికిణీలూ జుబ్బాలూ తొడుక్కున్నారు తడిజుత్తు విరబోసుకొన్నారు. ఆరడానికి మొహం మీద కుంఖంబొట్టు పెట్టింది వాళ్ళమ్మ ముగ్గురికీని

వాళ్ళమ్మ తడిబట్ట వదిలేసి పట్టుచీర కట్టుకొంది వాళ్ళ నాన్నా అన్నయ్యా కూడా కొత్త బట్టలు కట్టుకొన్నారు

తరువాత వాళ్ళన్నయ్య అరటిపళ్ళూ, కొబ్బరికాయా, హారతికర్పూరం తేవడాకి వెళ్లాడు 'అమ్మా, మరి ఎక్కడికి వెళ్లడం' అని సూరి అడిగింది

'దేముడిగుళ్ళోకి' అంది వాళ్ళమ్మ

'దేముడి గుళ్ళోకి వెడదామే, వెంకీ?' అంది సీతి

'ఊఁ' అంది వెంకి

ఆ దారిని ఒక ముసలమ్మ స్నానం చేసి తడిబట్టలతోనే వోడెతే వాళ్లమ్మను చూచి ఆగింది, ఆగి వాళ్ళమ్మకేసి నిదానించి చూస్తోంది వాళ్ళమ్మ ఆవిడకేసి చూచి, 'దొడ్డమ్మా' అంది

'నువ్వటే నా తల్లీ, అవునో కాదో అని చూస్తున్నాను ఎన్నాళ్ళక్కనిపించావమ్మా తల్లీ' అంది

సూరీ, సీతీ, వెంకీ ఆవిడకేసి చూచి నవ్వుకొంటున్నారు

'స్నానానికొచ్చావా, దొడ్డమ్మా' అంది వాళ్ళమ్మ

'అవునే నా తల్లీ, ఇలారా అమ్మా, ఇలారా, ఎప్పుడో చిన్నప్పుడు చూడ్డమే. మళ్ళీ చూడనేలేదు నన్నోమాటు చూచుకోనియ్యి, ఇలారా' అంది ఆవిడ

వాళ్ళమ్మ ఆవిడ దగ్గిరికి వెళ్ళింది ఆవిడ వాళ్ళమ్మ ఒంటిమీద చెయ్యివేసి తడుముతూ, 'ఈ వేళ ఎంత పుణ్యమమ్మా, నా తల్లిని చూశాను మీ ఆయన ఏడే అమ్మా' అంది ఆవిడ

'అరుగో బండి దగ్గిర ఎవరితోనో మాట్లాడుతున్నారు' అంది వాళ్లమ్మ.

'ఏం, నాయనా, బాగున్నావా, ఒకమాటు తల్లినీ, పిల్లలనూ తీసుకురమ్మంటే తీసుకొచ్చావు కాదు గదా చచ్చీ ముసలిదాన్ని ఒక మాటు చూడాలని ఎంతో మనస్సు పీకుతూ ఉంది పోనీ ఇక్కడైనా కనిపించారు' అంది ఆవిడ

'బాగున్నా అత్తయ్యా, ఏదో తీరుబడిలేక పిల్లల్ని తీసుకురాలేదు' అన్నాడు వాళ్ళ నాన్న

'ఒసే, నర్సమ్మా, నీకెంతమందే పిల్లలూ' అంది ఆవిడ

'ఒక మగపిల్లాడూ, ముగ్గురు ఆడపిల్లలూను అబ్బాయి పళ్ళు తేవడానికి వెళ్లాడు అమ్మాయిలు వీళ్లే' అంది వాళ్ళమ్మ

'వీళ్లేనటే, చెప్పావు కావు రత్నాల్లాగ ఉన్నారమ్మా పిల్లలూ, రా అమ్మా ఎత్తుకుంటా రా' అని వెంకిని పిలిచింది వెంకి రాలేదు

'నీ పేరెవరే' అంది సూరిని ఆవిడ.

'సూరి, మా చెల్లాయి పేరు సీతి, చిన్ని చెల్లాయి పేరు వెంకి' అంది సూరి.

'మా అమ్మే, ఎంత బుద్ధిమంతురాలో, చచ్చి నీ కడుపున పుడతా? అవునే నర్సమ్మా, పెద్దమ్మాయికి మీ అమ్మ పేరేనే ఏమిటే పెడత' అంది

'అవును దొడ్డమ్మా' అంది వాళ్ళమ్మ

'ఏదో పది పువ్వులూ, పది కాయలూ కాసి పదికాలాల పాటు అయిదోతనంగలిగి బతకడం కావాలి' అంది ఆవిడ

వాళ్లన్నయ్య పళ్లూ అవీ తెచ్చాడు వాళ్ల నాన్నా, వాళ్ళ అమ్మా, దొడ్డమ్మా అందరూ కలిసి దేముడు గుళ్ళోకి వెళ్ళి కొబ్బరి కాయా, అరిటిపళ్లూ, హారతి కర్పూరం దేవుడి కిచ్చారు సూరికీ, సీతికీ, వెంకికీ దేవుడు కనిపించనే లేదు అంతా జనమే లోపలికి వెళ్ళడానికి స్థలమే లేదు ఎలాగో వాళ్ల నాన్న లోపలికి తీసుకెళ్లాడు కొబ్బరికాయ ముక్కా, అరటిపండూ దేవుడు ప్రసాదం ఇచ్చాడు పూజారి అందరికీ శరగోపం పెట్టాడు

'నాకూ టోపీ పెట్టాడే' అంది సీతి

'నాకూను' అంది వెంకి

'టోపీ అనకూడదు శరగోపం అనాలి' అంది సూరి

'దేవుడు గుళ్ళో నుంచి వచ్చిన తరవాత వాళ్లమ్మ వాళ్ల దొడ్డమ్మతో, 'దొడ్డమ్మా, వెడతామే, బండొచ్చింది బండి మీద వెడతాము పోనీ నీవొకమారు రాకూడదూ, ఒక నెల్లాళ్ళపాటు మా ఇంట్లో ఉండవచ్చును గదా' అంది వాళ్ళమ్మ.

'అమ్మకు కూడా అమ్మ ఉంటుందా' అని సీతి సూరిని అడిగింది

'అమ్మకి అమ్మేంతీ' అంది వెంకి సూరి నవ్వింది

దొడ్డమ్మ అంది కదా 'ఇప్పుడు వెళ్ళడమేమిటే నా తల్లీ పిల్లలుండగలరా వద్దు, వద్దమ్మా ఎండలో వెళ్ళకండి ఇక్కడికి అరకోసేగా మా ఇల్లు అక్కడికి రండి పిల్లలకు కడుపునిండా అన్నం పెట్టుకొంటాను మీరూ తిందురుగాని, తరవాత తీర్థంచూచి సాయంత్రానికి ఇంటికి వెడుదురుగాని' అంది ఆవిడ

'మాకు ఉపోష్యం కాదు దొడ్డమ్మా' అంది వాళ్ళమ్మ

'పోనీ పిల్లలే తింటారు అయినా కనీ పెంచీదానవు నీ కుపోష్యం ఎందుకు తల్లీ' అంది ఆవిడ

'నాకు రావడానికేమిటే దొడ్డమ్మా నే వస్తాను మా ఆయనతో కూడా చెప్పు' అంది వాళ్ళమ్మ వాళ్ల నాన్న కూడా దొడ్డమ్మగారింటికి వెళ్ళడానికి ఒప్పుకొన్నాడు

అందరూ కలిసి వాళ్ళ ఇంటికి వెళ్లారు దొడ్డమ్మా, వాళ్ళమ్మా కలిసి మడికట్టుకొని వంట చేశారు

సూరీ, సీతీ, వెంకీ, వాళ్ళన్నయ్యా, వాళ్ళ నాన్నా మాత్రం భోంచేశారు వాళ్లమ్మ ఉపోష్యం ఉండి ఫలారం చేసింది దొడ్డమ్మా, వాళ్లమ్మా కలిసి చాలాసేపు కబుర్లు చెప్పుకొన్నారు

సూరీ, సీతీ, వెంకీ నిద్రపోయారు వాళ్ళన్నయ్య ఊరు చూడ్డానికి వెళ్లాడు వాళ్ళ నాన్న వీధరుగుమీద తాటాకు చాప మీద కూర్చుని ఆ వూరి మునసబుతో మాట్లాడుతున్నాడు చల్లబాటు వేళని మళ్ళీ బండి కట్టించుకొని అందరూ తీర్థానికెళ్లారు

'అమ్మా, మరి ఆవిడెవరే' అని సీతి అడిగింది

'నాతల్లి నాతల్లి నేనెవరని అడుగుతున్నావా' అంది డొడ్డమ్మ

'ఏమే అమ్మా' అంది సీతి

'ఆవిడ మా అమ్మ పెత్తల్లి కూతురే నాకుదొడ్డమ్మవుతుంది' అంది వాళ్లమ్మ

'అమ్మా నీకు కూడా అమ్ముందా' అంది సీతి

'నాకు మాత్రం అమ్మలేదూ!' అంది వాళ్లమ్మ నవ్వుతూ

బండి తీర్థపు దుకాణాల దగ్గిరకి వచ్చి ఆగింది. అందరూ దిగారు వాళ్ళమ్మ రవికల గుడ్డలూ, పసుపు, కుంకుం అన్నీ కొంటోంది సూరీ, సీతీ, వెంకీ వాళ్ళమ్మ వెనకాలే అన్నీ చూస్తూ బయలుదేరారు వాళ్ళ నాన్న, అన్నయ్యా ఇంకో దుకాణం మీద ఒక చాకూ, ఒక ఈలా కొనుక్కొన్నారు

దొడ్డమ్మా, వాళ్ళమ్మా, వాళ్ళన్నయ్యా కలిసి గరిటెలూ, గొచ్చిస్పలూ కొనుక్కోడానికెళ్ళారు

వాళ్ళ నాన్నా, సూరీ, సీతీ, వెంకీ బొమ్మలు అవీ కొనుక్కోడానికి ఇంకోవేపు వెళ్ళుతున్నారు 'నాన్నా నాకేమేనా కొనుక్కోడానికి డబ్బులియ్యవూ' అని సూరి అడిగింది.

'నాకో నాన్నా' అంది వెంకి వాళ్ళ నాన్న ముగ్గురికీ తలో పావలా ఇచ్చి 'పారేసుకోకండి సుమా' అన్నాడు పావలా పుచ్చుకొని చేతుల్లో గట్టిగా పిటకరాయిలాగ పెట్టుకున్నారు. వాళ్ళ నాన్న

దుకాణాలన్నీ చూపెడుతున్నాడు  అన్నీ చూస్తున్నారు  ఒక చోట దొమ్మరివాళ్ళు మొగ్గలు వేస్తూంటే కొంతసేపు నిలబడి చూశారు  దొమ్మరి అబ్బి తాడుని పాము చేశాడు  వాళ్ళు ఆశ్చర్యపోయారు ఒక దొమ్మరి అమ్మి ఒక పెద్ద వెదురుగడ ఎక్కి ఆ గడ మీద బోర్లాపడుక్కొని గిర్రున తిరిగింది సూరీ, సీతీ, వెంకీ చూచి ఎంతో నవ్వారు  వాళ్ళ నాన్న దొమ్మరి వాళ్లకు ఒక డబ్బు ఇచ్చాడు

ఇంకోచోట రంకుల రాట్టము ఉంది  లక్క గుర్రాల మీద కూచుని అందరూ గిర్రున తిరుగుతున్నారు  సూరీ, సీతీ, వెంకీ కూడా కూచుంటామన్నారు  'వద్దమ్మా పడతారు' అన్నాడు వాళ్లనాన్న  వాళ్ళు మారాం చేశారు  అప్పుడు వాళ్ళ నాన్న ఊరికే ఒక మాటు గుర్రాల మీద కూచోబెట్టాడు  లక్కగుర్రంమీద కూచుని సీతి "చల్ చల్ గుర్రం' అంది  వెంకిని వాళ్ళ నాన్న పట్టుకొన్నాడు  సూరి ఇనప ఊచ గట్టిగా పట్టుకొని నవ్వుతూ కూచుంది  ఒక్కమాటు రాటం తిప్పించి వాళ్ళ నాన్న దింపేశాడు  వాళ్ళు ఎంతో సంతోషించారు

ఇంకోచోట ఒక అబ్బి ఒక పెట్టె నిలబెట్టి అందులో కన్నాల్లోంచి బొమ్మలు చూపిస్తున్నాడు

'చూడు తమాషా వింత తమాషా
కాశీపట్నం చిత్రం చూడు
మధురా పట్నం చిత్రం చూడు
చూడు తమాషా చిత్రం చూడు
చూడు తమాషా వింతలు చూడు'

అంటూ డబ్బామీద వాయిస్తున్నాడు

'అదేమిటి నాన్నా' అంది సూరి

'అది చూపించవు నాన్నా' అంది సీతి

'అది బాగుండదు  అది వ'ద్దన్నాడు వాళ్ళ నాన్న

కొంతదూరం వెళ్ళాక వాళ్ళ నాన్నని ఎవరో ఆపి, 'ఏమిరోయి రామ్మూర్తీ, పిల్లలిని వేసుకు ఎక్కడికి బయలుదేరావు' అన్నారు

'పిల్లలకి తీర్థం చూపుతున్నానురా' అన్నాడు వాళ్ల నాన్న

'వాళ్ళకు చూపించేదేమిటి  ఒక అరుగుమీద కూచోబెట్టవోయి, వాళ్ళే చూస్తారు. మనం ఒక మాటు అలా తిరిగి వద్దామురా' అన్నా డాయన

'ఎక్కడ కూచోబెట్టడం' అన్నాడు వాళ్ళ నాన్న

సూరీ, సీతీ, వెంకీ కొత్తాయన్ని చూచి మంచివాడు కాడనుకొన్నారు

'అదిగో మా వాళ్ళగుమ్మే అది  అక్కడ కూచోబెట్టు. మా వాళ్ళు చూస్తూ ఉంటారులే' అన్నాడు

'సరే' అని వాళ్ళ నాన్న ఒప్పుకొన్నాడు  సూరీ, సీతీ, వెంకీ అరుగుమీద కూర్చున్నారు  వాళ్ళ నాన్న 'నే వచ్చేదాకా కదలకండేం' అని చెప్పి వెళ్ళి పోయాడు  ఆ యింటి వాళ్ళు చూస్తూ

కూచోండమ్మా భయంలేదు' అని లోపల పనిచేసుకుంటున్నారు

సూరీ, సీతీ, వెంకీ కబుర్లు చెప్పుకుంటూ అరుగుమీద కూర్చున్నారు ఆ దారినిపోయే నెత్తి కోతలవాణ్ణి చూచి భయపడ్డారు కాని వాడు దూరంగా పోయాడు వాళ్లు చాలాసేపు కూచున్నారు ఎంత కూచున్నా వాళ్లనాన్న రాలేదు ఆదారిని డక్కీలు అమ్మేవాణ్ని చూచి 'నాక్కొనిపెత్తు' అంది వెంకి ఆ అబ్బిని పిలిస్తే వచ్చాడు కాడు మళ్ళీ అరుగుమీదకు రావచ్చనుకొని ముగ్గురూ చేతులు పట్టుకొని డక్కీల వాడి దగ్గిరికి వెళ్ళారు ముగ్గురూ మూడు డక్కీలు కొనుక్కొన్నారు డక్కీలబ్బి మూడు డబ్బులూ తీసుకొని మిగిలిన డబ్బులు ఇచ్చాడు వాళ్ళు డక్కీలు వాయించుకొంటూ రాబోతూంటే 'మంచి ఖర్జూరం తియ్య ఖర్జూరం మంచి ఖర్జూరం' అని ఒక దుకాణం అబ్బి కేకలు వేయడం చూచి అక్కడకు వాళ్ళు ముగ్గురూ వెళ్ళారు ముగ్గురూ మూడు డబ్బులిచ్చి మూడు పొట్లాలు పుచ్చుకొని అవి విప్పి తింటూ చుట్టూ చూస్తూ నిలబడ్డారు దూరాన్ని లక్కపిడతల దుకాణం కనిపించింది

'రావే లక్కపిడతలు కొనుక్కుందాం' అంది సీతి

'నాన్న వస్తాడేమో' అంది సూరి

'మళ్ళీ ఇప్పుడే వద్దాం' అంది సీతి

సూరీ, సీతీ, వెంకి లక్కపిడతల దుకాణం దగ్గిరికి వెళ్లారు

సూరి ఒక లక్క మరచెంబూ, రెండు గంధం గిన్నెలూ కొనుక్కొంది సీతి రెండు లక్కపిడతలూ, ఒక గంధం గిన్నీ, పెద్ద దొండకాయా కొనుక్కొంది వెంకి ఒక గంధం గిన్నె, రెండు దొండకాయలు, రెండు లక్కపిడతలూ కొనుక్కొంది లక్క పిడతలన్నీ వెంకి రుమాలులో పోసి మూటకట్టి సూరి పట్టుకొంది ఖర్జూరం తింటూ వాళ్ళు మిగిలిన డబ్బులు పట్టుకొని అరుగు కోసం తిరిగారు అరుగు కనిపించింది కాదు అక్కడ ఒక పాములాడు పాములని నాగస్వరం ఊది ఆడిస్తూంటే కొంచెంసేపు దూరంగా నిలబడి పాము కేసి చూశారు తరువాత వాళ్లు ఒక గంగిరెద్దును చూశారు గంగిరెద్దు అబ్బి 'డూడూ వెంకన్నా, డూడూ అప్పన్నా' అంటూ పాడుకొంటూ వెడుతున్నాడు గంగిరెద్దును చూస్తూ వాళ్ళు కొంతదూరం దానితో నడిచి వెళ్లారు గంగిరెద్దునిండా గంటలూ బట్టలూ చూచి వాళ్ళు సంతోషించారు మళ్ళీ వాళ్ళు కూర్చున్న అరుగు కోసం వెతికారు కనిపించింది కాదు.

చాలాసేపు తిరిగారు అరుగు అవుపించింది కాదు వాళ్ళు ఏడుస్తూ రోడ్డుపక్కని నిలుచున్నారు వాళ్ళ నాన్న తిరిగి తిరిగి అరుగు దగ్గిరికి పిల్లలకోసం వచ్చాడు పిల్లలు అరుగుమీద లేరు ఇంటివాళ్ళ నడిగితే 'ఇప్పటిదాకా ఇక్కడే కూర్చున్నారండీ ఎక్కడికి వెళ్ళారో కాని' అన్నారు

వాళ్ళ నాన్న వాళ్ళ బండి ఉన్న చోటికి వెళ్ళాడు అక్కడ వాళ్ళమ్మా, అన్నయ్యా, దొడ్డమ్మా ఉన్నారు గరిటెలు, రాచ్చిప్పలూ పెట్టుకు కూచున్నారు

వాళ్ళ నాన్నను చూచి వాళ్ళమ్మ నిలబడి 'పిల్లలేరీ' అంది

'పిల్లలిక్కడకు రాలేదూ' అన్నాడు వాళ్ళ నాన్న

'అయ్యో అయ్యో తప్పిపోయారా ఏమిటి కొంపములిగింది ఏమిటి తోవ' అని వాళ్ళమ్మ బిక్కమొహం వేసింది

'తప్పిపోయారు కాబోలే తీర్థంలోనూ రావే చూద్దాము' అని వాళ్ళ దొడ్డమ్మ అంది

'మీరిక్కడే కూచోండి నేను వెళ్ళి చూస్తాను' అన్నాడు వాళ్ళ నాన్న.

'నేనూ వస్తాను అయ్యో నా పిల్లలేమైపోయారో అమ్మో' అని వాళ్ళమ్మ ఏడ్చింది

'అబ్బాయీ నేనూ వెడతాం మీరిక్కడుండండి' అని చెప్పి వాళ్ళ నాన్న వాళ్ళన్నయ్యను తీసుకొని వెళ్ళాడు

ఉండబట్టలేక వాళ్ళమ్మా, దొడ్డమ్మా ఆ చుట్టుపట్ల వెదుకుతున్నారు

వాళ్ళ నాన్నా, అన్నయ్యా దుకాణాలన్నీ వెదుకుతున్నారు ఒక చోట ఒక పెద్దమనిషి వాళ్ళకగపడి,

'ఎవరికోసం అండీ వెదుకుతున్నారు' అన్నాడు

'మా అమ్మాయిలు ముగ్గురు తప్పిపోయారండీ తీర్థంలోను' అన్నాడు వాళ్ళనాన్న

'మీపేరు రామమూర్తిగారా' అన్నాడాయన

'అవును' అన్నాడు వాళ్ళ నాన్న

'ఎవరో రామ్మూర్తిగారి పిల్లలమని చెప్పారు ముగ్గురు పిల్లలు ఏడుస్తూ రోడ్డు ప్రక్కన నిలబడ్డారు' అన్నాడాయన

'ఎక్కడ' అని వాళ్ళ నాన్న అడిగాడు

'అదిగో అక్కడ నూకాలమ్మ గుడిదగ్గిర' అని వెళ్ళిపోయాడు

నూకాలమ్మ గుడిదగ్గిరికి వెళ్ళి వాళ్ళు కనుక్కొన్నారు అప్పుడే ఎవరో ముగ్గురు పిల్లలు ఏడుస్తూ ఉంటే వచ్చి తీసుకువెళ్ళారని చెప్పారు వాళ్ళు వెళ్ళినదారిని వెళ్ళి వాకబు చెయ్యగా చెయ్యగా ఒక గృహస్తు యింట్లో వాళ్ళు ఉన్నట్లు తెలిసింది అక్కడ ఆ యింట్లో ఆడవాళ్ల దగ్గిర సూరీ, సీతీ, వెంకీ ఉన్నారు

వాళ్ళ నాన్నను చూడ్డంతోనే వెంకి ఏడ్చింది సూరీ, సీతీ నవ్వారు

రోడ్డు పక్క ఏడుస్తూ ఉంటే ఆ యింటి ఆయన అక్కడకు తీసుకువచ్చి బొమ్మలూ, మిఠాయీ పెట్టి 'మీ నాన్నను తీసుకువస్తానన్నా'డని చెప్పారు

'మా అమ్మాయిలిని మళ్ళీ మాకిచ్చారు మీ మేలు మరిచిపోలేను' అని వాళ్ల నాన్న చెప్పి ముగ్గురు పిల్లలనూ తీసుకొని బండి దగ్గిరికి వచ్చారు బండి దగ్గిర వాళ్ళమ్మ ఏడుస్తోంది దొడ్డమ్మ ఊరుకోబెట్టుతోంది

పిల్లలను చూడడంతోనే వాళ్ళమ్మ గబగబా వచ్చి వాళ్ళను ఎత్తుకొని కౌగలించుకొని ముద్దు

పెట్టుకొంది

'వచ్చారా నాతల్లులు  తప్పిపోయారా నా తల్లీ' అంది దొడ్డమ్మ  వాళ్ళమ్మ పిల్లకోసం కొన్న బొమ్మలు, జిలేబీ పొట్లాలూ వాళ్ళకు పెట్టింది  దొడ్డమ్మ కూడా కారప్పూస పొట్లాలు వాళ్లకు ఇచ్చింది వాళ్లా పొట్లాలు తీసుకొన్నారు  బొమ్మలూ, పొట్లాలూ చేతుల్లో ఇమడకపోవడం వల్ల వాళ్ళమ్మ అన్నీ మూటకట్టి పెట్టింది  వాళ్లు కొనుక్కొన్న లక్కపిడతలూ డక్కీలు అవన్నీ వాళ్లమ్మకు చూపించారు సూరీ, సీతీ, వెంకీని

'అయ్యో మీ బొడ్డు పొక్కా! మీరే కొనుక్కున్నారట్రా ఇవన్నీని' అంది వాళ్ళమ్మ

'మేమే కొనుక్కున్నాం' అంది సీతి

'నే కొనుక్కున్నా' అంది వెంకి  వాళ్ళు ఏమేమి చేశారో, ఎలా తప్పిపోయారో అంతా వాళ్ళమ్మతో చెప్పారు

తరవాత వాళ్ళందరూ బండి ఎక్కారు  దొడ్డమ్మ మాత్రం బండెక్కలేదు

'వెడతా దొడ్డమ్మా' అంది వాళ్ళమ్మ

'ఉంటానే నా తల్లి  పిల్లల సంగతి ఓ ఉత్తరం రాస్తూండుమా' అంది దొడ్డమ్మ

'వెడతా అమ్మమ్మా' అన్నాడు వాళ్ళన్నయ్య

'మంచిది నాయనా, బాగా చదువుకో' అంది దొడ్డమ్మ

'వెడుతున్నా అత్తా' అన్నాడు వాళ్ళ నాన్న

'ఉత్తరం రాస్తూండుమా నాయనా' అంది దొడ్డమ్మ

'వెడుతున్నా అమ్మమ్మా' అంది సూరి

'వెడతా అమ్మమా' అంది సీతి

'వెలతా అమ్మమ్మా' అంది వెంకి

'మాతల్లులు మాతల్లులు వెళ్లండమ్మా  అల్లరి చెయ్యకుండా బాగా ఆడుకోండి  బదికి బాగుంటే సూరి పెళ్ళికి రావాలి' అంది దొడ్డమ్మ  బండి కదిలింది

'సూరి పెళ్ళి' అని సీతి నవ్వింది

'చూరి పెల్లి' అని వెంకి నవ్వింది

సూరి సిగ్గుతో తనలో తాను నవ్వుకొంది



# పొడుపుడు కథలు

సూరి, సీతీ, వెంకీ వాళ్లనాన్న రాకముందే, దీపం పెట్టడంతోనే భోజనము చేశారు వాళ్ళ నాన్నా, అన్నయ్యా అప్పుడే భోజనము చేసి వచ్చారు వాళ్లనాన్న కుర్చీ మీద కూర్చుని ఏదో పుస్తకం చదువుకోవడం మొదలుపెట్టాడు వాళ్లన్నయ్య దీపం పుచ్చుకొని వసారాలో చదువుకోడానికి వెళ్లాడు. వాళ్లమ్మ వంటిట్లో అన్నం తింటోంది

సూరీ, సీతీ నడవలో పట్టె మంచంమీద దుప్పటీ వేసుకు పడుక్కున్నారు వాళ్లమ్మ వచ్చేదాకా వెంకి కూడా ఆ మంచంమీదే పడుక్కొంది ముగ్గురు ఇరుకుగా పడుక్కున్నారు సూరి కథలు చెప్తుతోంది సీతీ, వెంకీ ఊకట్టుతున్నారు సూరి కోతికథ అప్పుడే చెప్పేశింది చివరకు వచ్చేటప్పటికి కోతి డోలు భుజానికి వేసుకొని చెట్టుకొమ్మమీద కూర్చుని

ముల్లు పోయి కత్తి వచ్చె ఢాంఢాం
కత్తిపోయి పుల్లలు వచ్చె ఢాంఢాం
పుల్లలు పోయి అట్టు వచ్చె ఢాంఢాం
అట్టు పోయి కడవ వచ్చె ఢాంఢాం
కడవ పోయి కన్నె వచ్చె ఢాంఢాం
కన్నె పోయి డోలు వచ్చె ఢాంఢాం

అని పాడుకొంటూ కూచుందని సూరి చెప్పినప్పుడు అందరూ గట్టిగా నవ్వారు. వెంకికి మరీ సంతోషమయింది

ఢాంఢాం కత్తి పోయి ఢాంఢాం
ఢాంఢాం డోలు వత్తె ఢాంఢాం

అంటూ కూచుంది

"ఊరుకోవే వెంకీ అక్కయ్యా ఇంకో కథ చెప్పవుటే' అంది సీతి

"ఢాంఢాం కత్తి పోయి ఢాంఢాం
ఢాంఢాం డోలు వత్తె ఢాంఢాం" అని వెంకి దీర్ఘాలు తీసింది "

"ఊరుకోమంటే నీకు కాదూ ఏమే అక్కయ్యా ఇంకో కథ చెప్పవుటే" అంది సీతి

"వెంకీ ఇంకో కథ చెప్పనా" అంది సూరి

'తెప్పు, ఇంకోకద తెప్పు" అంది వెంకి

"కథకాదే, సీతి, పొడుపుడు కథలు పొడుచుకుందామా సీతీ" అంది సూరి

"ఆఁ, ఆఁ, పొడుపుడుకథలే, పొడుపుడు కథలే" అంది సీతి

"కద తెప్పవుతే" అంది వెంకి

“ఇది కధే  విను వెంకీ, ఇది కధేనమ్మా” అంది సూరి

“నువ్వు పాడవ్వే ముందు” అంది సీతి

“పాడవనా పాడవనా’ అంది సూరి

“నే పాడిచేదా” అంది సీతి

“పాడు అమ్మా మరి” అంది సూరి

“తీసినకొద్దీ పెరిగేదేమిటి?” అంది సీతి

“చెప్పనా, చెప్పనా, అదేమిటి చెప్మా నుయ్యి  అవునా” అంది సూరి

“కాదు మళ్ళీ చెప్పుకో” అంది సీతి

“నుయ్యేనమ్మా” అంది సూరి

“కాదు నే చెప్పనా” అంది సీతి

“చెప్పు మరి’ అంది సూరి

‘గొయ్యి’ అంది సీతి

‘చూశావా, చూశావా, నే చెప్పలేదూ, నే చెప్పలేదూ’ అంది సూరి

‘ఆఁ ఆఁ నువ్వు చెప్పావా ఏమిటి? నువ్వు నుయ్యన్నావు’ అంది సీతి

‘నుయ్యి మాత్రం పెరగదా ఏమిటి?’ అంది సూరి

‘పోనీ పోనీ మరి, నువ్వు పాడు ఈ మాటు’ అంది సీతి.

‘పాడవనా? వెండి గొలుసులు వెయ్యడమే గాని తియ్యడం లేదు  ఏమిటి చెప్పుకో’ అంది సూరి

‘ఏమిటి చెప్మా, ఏమిటి చెప్మా’ అని సీతి ఆలోచిస్తూ ఉంది.

‘నే తెప్పనా’ అంది వెంకి

‘చెప్పమ్మా మహ’ అంది సూరి

‘ధాంధాం’ అంది వెంకి  అందరూ నవ్వారు

‘చెప్పుకోవే మరి సీతీ’ అంది సూరి.

‘ఉండు మరీ, ఆలోచించుకోవాలా’ అంది సీతి

‘చెప్పు మరి చప్పుని’ అంది సూరి

‘గోడ’ అంది సీతి

‘కాదు, కాదు, కాదులే’ అంది సూరి

‘గోడ కడతారుగాని తీస్తారా ఏమిటి?’ అంది సీతి

‘గోడ వెండిగొలుసులా ఏమిటి?’ అంది సూరి

‘మరి నే చెప్పుకోలేనమ్మా నువ్వు చెప్పు’ అంది సీతి

'చెప్పనా, చెప్పనా, ముగ్గులు' అంది సూరి
'అవునే అన్నట్టు మరిచిపోయాను' అంది సీతి
'ఈమాటు నువ్వు' అంది సూరి
'ఈమాటు నే పొడవనా' అంది సీతి
'పొడు చప్పునీ' అంది సూరి
'ఉండు మరీ, అదేమిటి చెప్మా, ఊఁ ఊఁ, ఈ మాటు ఈ కథ చెప్పుకో
'అంబరా అంబరా అప్పన్న
కింద పడేస్తే ధుప్పన్న
చర్మం తీస్తే కెంపన్న
నోట్లో వేస్తే తియ్యన్న'
'ఏమిటో చెప్పుకోమరి' అంది సీతి
'చెప్పనా చెప్పనా, పటికి బెల్లం' అంది సూరి
'పటికబెల్లం ఎర్రగా ఉంటుందా ఏమిటీ' అంది సీతి
'పోనీ అరటిపండు' అంది సూరి
'అరటిపండు ఎర్రగా ఉంటుంది కామోసు' అంది సీతి
'ఆఁ ఆఁ, ఈ మాటు తెలిసింది ఈ మాటు తెలిసింది మావిడి పండు అవునా' అంది సూరి
అవును ఈ మాటు నువ్వు పొడు' అంది సీతి
'నూరు చిలకలకొకటే ముక్కు చెప్పుకో' అంది సూరి.
'చెప్పుకోనా, ఉల్లిపాయ' అంది సీతి
'ఉల్లిపాయకి ముక్కుంటుందా ఏమిటి?'' అంది సూరి
'పోనీ మరీ ఏమిటి చెప్మా ఊఁ' అని సీతి ఆలోచిస్తూ ఉంది
'చెప్పు మరి చప్పునీ' అంది సూరి
'ఉండు మరీ' అంది సీతి
'ఎంతసేపేమిటి?' అంది సూరి
'నాకు తెలియదమ్మా నువ్వు చెప్పు' అంది సీతి.
'చెప్పనా చెప్పనా' అంది సూరి
'చెప్పమంటూంటేనే' అంది సీతి.
'పళ్ళగుత్తి' అని చెప్పింది సూరి.
'పళ్లగుత్తా. పళ్లగుత్తి అయితే ముక్కేదమ్మా' అంది సీతి
'ముక్కు లేకపోతే పళ్ళు ఎలాగుంటాయమ్మా' అంది సూరి.

‘ఈ మాటు నే పొడవనా’ అంది సీతి
‘పొడు’ అంది సూరి
‘అడివిలో నెత్తురు బొట్టు   ఏమిటో చెప్పుకో’ అంది సీతి
‘నాకు తెలుసు   గురివిందగింజ’ అంది సూరి
‘ఆఁ అమ్మా, చెప్పేసింది   ఈమాటు నువ్వు’ అంది సీతి
‘అయితే చెప్పుకో మరి’ అంది సూరి
‘పొడు మరీ’ అంది సీతి
‘ఢాంఢాం’ అంది వెంకి
‘ఊరుకోవే వెంకీ మరి’ అంది సీతి
‘పచ్చచొక్కావాడు బట్టవిప్పుకు నూతిలో పడ్డాడు’ అంది  సూరి
వెంకి సీతి నవ్వారు
‘నూతిలో పద్దాదు’ అంది వెంకి
‘చెప్పుకో’ అంది సూరి
‘జామిపండు’ అంది సీతి
‘నూతిలో పడుతుందా ఏమిటి జాంపండు’ అంది సూరి
‘నూతిదగ్గిర చెట్టుంటే పడదా ఏమిటి?’ అంది సీతి.
‘పోనీ అమ్మా మరీ, సరిగ్గా చెప్పుకో’ అంది సూరి
‘నూతిలో పద్దాదు’ అంది వెంకి
‘పసుపుకొమ్ము’ అంది సీతి
‘కాదు’ అంది సూరి
‘పోనీ నువ్వు చెప్పు’ అంది సీతి
‘అరటిపండు’ అంది సూరి
‘అరటిపండు నూతిలో పడుతుందా ఏమిటి’ అంది సీతి
‘అరటిపండు తినేప్పుడు తొక్క తీస్తామా, తరవాత నోట్లో వేసుకుంటామా’ అంది సూరి
‘మరి నుయ్యేదీ’ అంది సీతి
‘నోరే నుయ్యి’ అంది సూరి
‘పోనీ ఇంకో కథ పొడు’ అని సీతి అడిగింది
‘అది అసలు చెప్పుకోనేలేవు’ అంది సూరి.
‘పొడమ్మా మరి’ అంది సీతి
‘విను మరి, ఇంట్లో కలి, వంట్లో కలి, వాకిట్లో కలి, వీధిలో కలి, ఏమిటో చెప్పుకో’ అంది సూరి

'ఏమిటీ' అంది సీతి

'కలి' అంది వెంకి

'ఇంట్లో కలే' అంది సూరి సీతి చాలాసేపు ఆలోచించింది చివరకు

'ఒక్కటి చెప్పవే ముందు మిగిలినవి నే చెప్పుకుంటాను' అంది సీతి

'చెప్పనా, ఇంట్లో కలి - రోకలి, మిగిలినవి చెప్పుకో ఈ మాటు' అంది సూరి

'ఇంకోటి ఏమిటీ అసలు' అని సీతి అడిగింది

'వంట్లో కలి, వాకిట్లో కలి, వీధిలో కలి' అంది సూరి

'వీధిలో కలేం, వీధులో కలేం ఏమిటి చెప్మా' అంది సీతి

'చెప్పనా' అంది సూరి 'వద్దు వద్దు, వీధులో కలేం - ఆఁ వచ్చింది చాకలి కాదూ' అంది సీతి

'అవును మిగిలినవి కూడా చెప్పుకో' అంది సూరి

'వంట్లో కలేమిటమ్మా, నాకు తెలియదు నువ్వు చెప్పు' అంది సీతి

'పోనీ వాకిట్లో కలి చెప్పుకో' అంది సూరి

'వాకిట్లో కలి - వాకలి' అంది సీతి

'అవును మరి వంట్లో కలో' అని సూరి అడిగింది

'నాకు రావడంలేదు నువ్వు చెప్పు' అంది సీతి

'చెప్పనా వంట్లో కలి - ఆకలి' అంది సూరి

'అవునే మరిచిపోయాను' అంది సీతి

'ఇంకా పడుక్కోరుటర్రా మీరు' అని వాళ్ళమ్మ కేకేసింది

వాళ్ళన్నయ్య దీపం ఆర్పివేసి నడవలో ఇంకో మంచంమీద పడుక్కున్నాడు వాళ్ళ నాన్న మంచంమీద పడుక్కొని ఇంకా చదువుకొంటున్నాడు

'మరి నువ్వు పాడు ఈ మాటు' అంది సూరి

'చూస్తే చూపులు, నవ్వితే నవ్వులు, గుద్దితే బద్దలు చెప్పుకో' అంది సీతి

సూరి చెప్పకముందే వాళ్ళన్నయ్య 'అద్దము' అని చెప్పాడు

'ఆఁ అమ్మా! చెప్పకురా అన్నయ్యా' అంది సూరి

'పోనీ ఇంకోటి పొడవనా' అంది సీతి

'పొడు' అంది సూరి

'చెరువు దగ్గిర ఎద్దు రంకెవేస్తే ఆవుకు పిల్లలు పుట్టాయి - ఏమిటో చెప్పుకో' అంది సీతి

మళ్ళీ వాళ్ళన్నయ్య 'కుక్కగొడుగులు' అని చెప్పేశాడు

'పోనీ అమ్మా మరీ, ఊరుకోరా అన్నయ్యా' అంది సూరి

'ఈ మాటు చెపితే ఒట్టు' అంది సీతి

'ఈ మాటు నే పొడవనా' అంది సీతి
'పొడు' అంది సూరి
'అడివిలో నెత్తురు బొట్టు ఏమిటో చెప్పుకో' అంది సీతి
'నాకు తెలుసు గురివిందగింజ' అంది సూరి
'ఆఁ అమ్మా, చెప్పేసింది ఈమాటు నువ్వు' అంది సీతి
'అయితే చెప్పుకో మరి' అంది సూరి
'పొడు మరీ' అంది సీతి
'ఢాంఢాం' అంది వెంకి
'ఊరుకోవే వెంకీ మరి' అంది సీతి
'పచ్చచొక్కావాడు బట్టవిప్పుకు నూతిలో పడ్డాడు' అంది సూరి
వెంకి సీతి నవ్వారు
'నూతిలో పద్దాదు' అంది వెంకి
'చెప్పుకో' అంది సూరి
'జామిపండు' అంది సీతి
'నూతిలో పడుతుందా ఏమిటి జాంపండు' అంది సూరి
'నూతిదగ్గిర చెట్టుంటే పడదా ఏమిటి?' అంది సీతి.
'పోనీ అమ్మా మరీ, సరిగ్గా చెప్పుకో' అంది సూరి
'నూతిలో పద్దాదు' అంది వెంకి
'పసుపుకొమ్ము' అంది సీతి
'కాదు' అంది సూరి
'పోనీ నువ్వు చెప్పు' అంది సీతి
'అరటిపండు' అంది సూరి
'అరటిపండు నూతిలో పడుతుందా ఏమిటి' అంది సీతి
'అరటిపండు తినేప్పుడు తొక్క తీస్తామా, తరవాత నోట్లో వేసుకుంటామా' అంది సూరి
'మరి నుయ్యేదీ' అంది సీతి
'నోరే నుయ్యీ' అంది సూరి
'పోనీ ఇంకో కథ పొడు' అని సీతి అడిగింది
'అది అసలు చెప్పుకోనేలేవు' అంది సూరి.
'పొడమ్మా మరి' అంది సీతి
'విను మరి, ఇంట్లో కలి, వంట్లో కలి, వాకిట్లో కలి, వీధిలో కలి, ఏమిటో చెప్పుకో' అంది సూరి

‘ఏ చిట్ట?’
‘సరిచిట్టా’
‘ఏ సరి?’
‘దాసరి’
‘ఏ దాసు?’
‘కాళిదాసు’
‘ఏ కాళి?’
‘భద్రకాళి’
‘ఏ భద్ర?’
‘తుంగభద్ర’
‘ఏ తుంగ?’
‘నీళ్ళతుంగ’
‘ఏ నీళ్ళు?’
‘ఉప్పునీళ్ళు’
‘ఏ ఉప్పు?’
‘పెట్లుప్పు’
‘ఏ పెట్లు?’
‘గుర్రపు పెటు’’
‘ఏ గుర్రం?’
‘పటాణి గుర్రం’
‘ఏ పటం?’
‘గాలిపటం’
‘ఏ గాలి?’
‘సుడిగాలి’
‘ఏ సుడి?’
‘అరటిసుడి’
‘ ఏ అరటి?’
‘బొంతరటి’
‘ఏ బొంత?’
‘కంబళి బొంత’

‘ఏ కంబళి?’

‘రత్నకంబళి’

‘ఏ రత్న?’

‘నవరత్న’

‘ఏ నవ?’

‘గోరునవ’

‘ఏ గోరు?’

‘పులిగోరు’

‘ఏ పులి?’

‘కొండపులి’

‘ఏ కొండ?’

‘బెల్లంకొండ’

‘ఏ బెల్లం?’

‘తాటిబెల్లం’

‘ఏ తాడు?’

‘ఉరితాడు’

‘ఏ ఉరి?’

‘తీగ ఉరి?’

‘ఏ తీగ?’

‘గుమ్మడి తీగ’

‘ఏ గుమ్మడి?’

‘పెళ్ళిగుమ్మడి’

‘ఏ పెళ్ళి?’

‘పూల పెళ్లి’

‘ఏ పూలు’

‘మా పూలు’

‘ఏ మా?’

‘అమ్మా’

‘అమ్మా’ అని గట్టిగా సీతి అంది సీతితో కూడా సూరి ‘అమ్మా’ అంది వెంకి వాళ్ళిద్దరినీ చూచి ‘అమ్మా’ అంది మళ్లీ ముగ్గురూ కలిసి ఒక్కమారు ‘అమ్మా’ అన్నారు

'ఎందుకర్రా పిలుస్తారు' అని వాళ్లమ్మ వంటింట్లోంచి వచ్చి అడిగింది.

'మేం పిలవందే' అన్నారు వాళ్ళు

'ఇప్పుడు 'అమ్మా' అనలేదుటర్రా' అంది వాళ్లమ్మ

'వాళ్ళు నిన్ను పిలవలేదే కధలు చెప్పుకుంటున్నారు' అన్నాడు వాళ్ళ నాన్న

'అయ్యో మీ కధలు బంగారం కానూ ఈ పాటికి పడుక్కోండి' అని వాళ్ళమ్మ చెప్పి వెంకిని ఎత్తుకొని తన దగ్గిర పడుక్కోబెట్టుకోటానికి తీసుకువెళ్ళింది సూరీ సీతీ కౌగిలించుకొని ఒకరిమీద ఒకళ్ళు చేతులూ, కాళ్ళూ వేసుకొని కధలు తలుచుకొంటూ నిద్రపోయారు



# బొమ్మరిల్లు

సూరికీ, సీతికీ, వెంకికీ ఆవాళే వాళ్ళమ్మ తల నీళ్లోసి కాటికా, బొట్టూ పెట్టి చాకలి తెచ్చిన పరికిణీలు కట్టి 'అల్లరి చెయ్యకుండా నడవలో ఆడుకోండి' అని పంపించింది

ఆడుకోడానికి వెంకి తన లక్కపిడతలూ, దొండకాయలూ తెచ్చుకొంది సీతి బొమ్మలూ, నాగవిల్లి పిడితలు పట్టుకు వచ్చింది సూరి తాటాకు బొమ్మలు తీసుకొచ్చింది

వాళ్ళ నాన్న కూరలు తేవడానికి బజారుకు వెళ్ళాడు వాళ్ళమ్మ అప్పుడే నీళ్లోసుకొని మడి కట్టుకొంటోంది

'సూరీ, సూరీ, నాకో తాటాకు బొమ్మ చేసిపెట్టవూ' అంది సీతి

'నాకో' అంది వెంకి

'తాటాకు లెక్కడున్నాయేమిటి చెప్మా ఇప్పుడు బొమ్మలు చెయ్యడానికి!' అంది సూరి

'నేను తాటాకులు తెచ్చుకోనా' అంది సీతి

'తెచ్చుకో' అంది సూరి

'నాకో' అంది వెంకి

'అక్కయ్య తాటాకులతో నీకూ చేసిపెడతాలే అమ్మా' అంది సూరి

'నా తాటాకులివ్వను' అంది సీతి అప్పుడే నాలుగు తాటాకు ముక్కలు పరికిణీలో దాచి తెచ్చి

'ఇంకో రెండు తేవే పాపం వెంకికి కూడా చేసిపెడదాము' అంది సూరి

'తాటాకు లెక్కడున్నాయమ్మా ఇంకాను' అంది సీతి

'ఇవెక్కడివే సీతీ' అని సూరి అడిగింది

'నేను నాన్న మంచంకింద దాచుకొన్నానూ' అంది సీతి

'పోనీ నీకు బూరాలు చేసిపెడతానులే' అంది సూరి

'బూరాలికి కొబ్బరాకు లెక్కడున్నాయమ్మా ఇప్పుడు' అంది సీతి

'నే తెచ్చిపెడతాలే దానికి కొబ్బరాకులు' అని సూరి వీధిలో కొబ్బరిచెట్టు దగ్గిరికి వెళ్ళి కాళ్లెత్తి మట్ట అందుకోబోయింది అందింది కాదు అప్పుడే ఆ దారిని ఒక అబ్బి వెడుతూంటే, 'అబ్బీ, అబ్బీ నాకో రెండు కొబ్బరాకులు కోసివ్వవూ' అని అడిగింది

'ఎవరమ్మాయివమ్మా నువ్వు' అని నాలుగు కొబ్బరాకులు కోసి ఇచ్చాడు

'రామ్మూర్తిగారమ్మాయిని' అని చెప్పి సూరి ఇంట్లోకి పరుగెత్తుకు వెళ్ళింది

అందరూ నడవలో కూర్చున్నారు సూరి పరికిణీలో కొబ్బరాకులూ, తాటాకులూ పోసుకొని తాటాకు బొమ్మలు చేస్తోంది సీతి బొమ్మకి బట్టలు కట్టడానికని పాతగుడ్డల కోసం ఇల్లంతా వెదుకుతోంది వెంకి సూరి పక్కను కూచుని బొమ్మలు చెయ్యడం చూస్తోంది రెండు తాటాకు బొమ్మలయ్యేయి

ఆ బొమ్మలు అక్కడ పెట్టి కొబ్బరాకులతో ఒక పెద్ద బూరా, ఒక చిన్న బూరా వెంకికీ, సీతి కోబూరా, తన కో బూరా చేసుకొంది

సీతి పాత గుడ్డపీలికలతోటీ, కాటిక్కాయలతోటీ, కుంఖంభరిణతోటీ వచ్చి,

'ఏవే సూరీ నాబొమ్మలు' అంది

'అవిగోనే తీసుకో' అంది సూరి సీతి ఆ బొమ్మలకి కాటికెట్టింది పసుపు రాసి కుంఖం పెట్టింది పాత గుడ్డలతో పమిటివేసి బట్ట కట్టింది

'సూరీ, నాకో పూసలదండ ఇవ్వవుటే దీనికి వేస్తాను' అంది

' నాబొమ్మలకో అంది' సూరి

'నీకు రెండున్నాయిగావుటే' అంది సీతి

'నువ్వు పాడుచేస్తావమ్మా నీకివ్వను' అంది సూరి.

'పాడుచెయ్యనే, అక్కయ్యవుకాదూ? నాకో దండివ్వవు?' అంది

సూరి తన బొమ్మమెడలో ఒక నల్లపూసల దండ తీసి సీతి కిచ్చింది సీతి ఆ దండ తన బొమ్మ మెళ్లో వేసింది

కొబ్బరి బూరాలు రెండూ వెంకి పుచ్చుకొని ఊదబోయింది ఊదేయి కావు

'అలాగ్గాదే వెంకీ, ఆపీపి, నోట్లో పెట్టుకొని గట్టిగా ఊదు' అంది సూరి

'నే ఊది పెట్టనా నీకు వెంకీ?' అంది సీతి

'వత్తు' అని వెంకి బూరా ఊదింది.

సీతి కూడా తన బూరా తీసుకొని ఊదింది బాగా ఊదలేదు కీచుమంటూ ఊదింది

'సూరీ నా బూరా పీపి బాగాలేదు మంచిది పెట్టి పెట్టవుటే' అంది సీతి

'అంతేనే అది అదేమిటి బాగా ఊదుతుంటేనే' అంది సూరి

ముగ్గురూ బొమ్మలు ఒళ్ళో పెట్టుకొని బూరాలు ఊదడం మొదలుపెట్టారు

ఇంతట్లోకి వాళ్ళనాన్న బజారునుంచి వచ్చాడు కూరలూ, అరటిపళ్ళూ, దోసకాయలూ, వెలక్కాయలూ తెచ్చాడు సూరి ఒక వెలక్కాయ పరికిణీలో దాచుకొని ఒక అరిటిపండు పుచ్చుకొంది వెంకికి వాళ్ళనాన్న ఒక అరిటిపండు పెట్టాడు

'నడవనిండా ఏమిటమ్మా ఈ ఆకులన్నీనీ' అన్నాడు వాళ్ళనాన్న

బొమ్మలూ, బూరాలూ చేసుకుంటున్నాము నాన్నా' అంది సీతి

'నాన్నా, నాన్నా, ఇదో బూరా' అంది వెంకి

'ఊదు వెంకీ బూరా ఊదు' అన్నాడు వాళ్లనాన్న

వెంకి బూరా నోట్లో పెట్టుకొని గట్టిగా ఊదింది వాళ్ళనాన్న నవ్వాడు. సూరీ సీతీ కూడ నవ్వారు

ఈ చిన్న బూరా బాగా ఊత్తుంది పెద్దబూరా బాగా ఊత్తు నాన్నా' అంది వెంకి

'ఆడుకో అమ్మా ఆడుకో' అన్నాడు వాళ్ళనాన్న

నడవలో ఆకులన్నీ సూరి ఎత్తివేసి వీధిలో పారేసింది

అందరూ కలిసి వసారాలోకి వెళ్లిపోయారు

వెంకి అరటిపండు సగం కొరికేసుకు తింటోంది.

'అరటిపండు తినకే వెంకీ, మనము బొమ్మరిల్లు కట్టుకొందాం, కట్టుకొన్నాక గుజ్జనగూళ్ళొండుకుందా'మంది సీతి

'అమ్మకోప్పడుతుందే సీతీ' అంది సూరి

'అమ్మ చూడకుండా ఇక్కడ కట్టుకొందాం' అంది సీతి

'అమ్మతో చెప్తాను' అంది వెంకి

'నీకు అరటిపండెడతానులే అమ్మతో చెప్పకు' అంది సీతి

'ఊఁ' అంది వెంకి

ముగ్గురూ కలిసి గోడమూల బొమ్మరిల్లు కట్టడం మొదలెట్టారు మంచినీళ్ళు కావాలని వాళ్లమ్మనడిగి సీతి చెంబెడు నీళ్ళు తెచ్చింది వెంకి పెంకులూ, బెడ్డముక్కలూ తెచ్చింది నల్ల మన్ను సూరి పోగోసి అదంతా నీళ్ళతో కలిపింది సూరీ, సీతీ కలిసి ఆ రాళ్ళతోనూ, మన్నుతోనూ చిన్నగోడలు లేవదీసేరు ఆ గోడల మధ్య రెండు ఇటిక ముక్కలు నిలబెట్టి ఇంకో ఇటిక అడ్డంగా పెట్టి వాటినిండా మన్ను పట్టించి అలుకుతున్నారు

వెంకి ఓ మూలా, సీతి ఓ మూలా, సూరి ఓ మూలా గోడలూ ఇల్లూ అలికివేశారు అందరి చేతులూ మన్ను అయ్యేయి

తరవాత దానిముందు కూడా మన్నుతో అలికారు ముగ్గు పెట్టాలని అనుకొన్నారు ముగ్గు తెస్తే వాళ్ళమ్మ కొడుతుందేమోనని భయమేసింది అందుకని గోళ్లతో మన్ను మీద ముగ్గుల్లాగ గీతలు గీశారు

'చూడవే, సూరీ, చూడు, నాగోళ్ళు ఎంత బాగున్నాయో, నిన్నను ఆకాశం మీద కొంగలు వెడుతూంటే,

'కొంగా కొంగా
నాగోళ్ళుచ్చుకు
నీ గోళ్ళియ్యి
నా గోళ్ళుచ్చుకు
నీ గోళ్ళియ్యి'

అని కేకవేశాను. అప్పుడు కొంగ తన గోళ్ళు నాకిచ్చి నా గోళ్ళు పట్టుకుపోయింది' అంది సీతి

'అన్నీ అబద్ధాలే' అంది సూరి

'అక్కా, నాగోళ్ళు తూడు' అంది వెంకి

'బాగున్నాయమ్మా ముగ్గు పెట్టు' అంది సీతి.

'పిల్లకి అంతా గోటు' అంది సూరి సీతిని చూచి

'నీకే గోటు' అంది సీతి

'చిట్టి చిట్టి గోళ్ళు
సింగరాయిడి గోళ్ళు
మాతాత గోళ్ళు
మండాపరాళ్ళు'

అని పాడుతూ సూరి గీతలు గీస్తోంది

'చిన్ని చిన్ని గోళ్ళు
సింగరాయిడి గోళ్ళు
మా సూరి గోళ్ళు
మండాపరాళ్ళు'

అని సీతి సూరిని ఆక్షేపించింది

'చిన్ని చిన్ని గోళ్ళు
సూరేకాంతం గోళ్ళు
మా సీతి గోళ్ళు

మండాపరాళ్ళు'

అని సూరి మళ్ళీ ఆక్షేపించింది

'చిన్ని చిన్ని గోళ్ళు
సీతారాముడి గోళ్ళు
మా వెంకి గోళ్ళు
మాసూరి గోళ్ళు
మండాపరాళ్ళు'

అని మళ్ళీ సీతి అంది

'మంచి పిల్లవే! ఊరుకుంటావా ఒక్కటెయ్యనా? పాపం వెంకి నెందుకంటావు' అంది సూరి. సీతి ఊరుకొంది

ముగ్గులు పెట్టాక మన్ను చేతులతో నలుపుకొని దులిపివేసుకొన్నారు ఇంట్లో తాటాకు బొమ్మల్ని పెట్టారు. నైవేద్యం అని వెంకి తిన్న సగం అరటిపండూ, ఇంకో అరటిపండూ వెలక్కాయలూ పెట్టారు తరవాత బూరాలు పుచ్చుకొని గట్టిగా ఊదారు.

బొమ్మలికి నైవేద్యం పెట్టి అరిటిపళ్ళూ, వెలగపళ్ళూ ఆ మట్టిచేతులతోనే తినేశారు తరవాత సూరీ, సీతీ కలిసి బొమ్మరిల్లు పాట పాడారు

'చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుకింద పోగోసి
పుట్టమన్ను తెచ్చి
బొమ్మరిల్లు కట్టి -'

'అల్లాగ్గాదే సూరీ' అని సీతి నవ్వుతూ ఇలాగ పాడింది

'చిట్టి చిట్టి మిరియాలు
వసారాలో పోగోసి
నల్లమన్ను తెచ్చి
'బొమ్మరిల్లు కట్టి'
బొమ్మరిల్లు బిడ్డనుకంటే
సూరి తలకు నూనె లేదు
వెంకి తలకు చమురులేదు'

'నన్నూ వెంకినీ ఎందుకంటావూ? నేనూ పాడుకుంటాను' అని సూరి పాడింది

'సీతి తలకు నూనె లేదు
సీతి తలకు చమురు లేదు'

సీతికి ఉడుకుమోత్తనం వచ్చింది వెంకి కూడా 'పుత్తమన్ను తెత్తీ బొమ్మరిల్లు కత్తీ' అంటూ కూచుంది

'నన్నెందుకు ముందరనాలి' అంది సూరి

'నేనన్నానా ఏమిటి? నే పాడుకొన్నానూ' అంది సీతి

'నేనూ పాడుకొన్నానూ! నీకెందుకు ఉడుకుమోత్తనం' అంది సూరి

'పుత్తమన్ను తెత్తీ,

బొమ్మరిల్లు కత్తీ,

సూరితలకీ నూనె లేదు,

సీతి తలకీ చమురులేదూ '

అని వెంకి పాడుతోంది సూరీ, సీతీ దానిని చూచి నవ్వారు

తరవాత సూరి బొమ్మకీ, సీతి బొమ్మకీ పెళ్ళిచేతామనుకొన్నారు

సూరి ఆడపెళ్ళివారు

సీతి మగపెళ్ళివారు

వెంకి నా జట్టు అంటే నా జట్టు అని ఇద్దరూ దెబ్బలాడుకొన్నారు ఇద్దరికీ తగవు పరిష్కారం కాలేదు వెంకినే అడుగుదామనుకొన్నారు

'వెంకీ నీకు నే కావాలా, సీతి కావాలా' అంది సూరి

'నే కావాలి కాదమ్మా నీకు' అంది సీతి

'అలా అడక్కూడదు' అంది సూరి

'అడగనులే అయితే వెంకి నాతోటే జట్టు కడుతుంది' అంది సీతి

'వెంకీ చెప్పవే నే కావాలా, సీతి కావాలా' అంది సూరి

'నువ్వా సీతీని' అంది వెంకి

'నాపేరు ముందు చెప్పింది నేనే' అంది సూరి

'అమ్మా అమ్మా నా పేరూ చెప్పిందీ' అంది సీతి

ఇలాగ తగువు పరిష్కారం అయింది కాదు

సూరీ, సీతీని ఒకరి బుజంమీద ఒకరు చేతులు వేసుకొని ఉజ్జీలు కట్టుకు వెంకిదగ్గిరికి వచ్చి, 'వెంకీ నీకు కంటె కావాలా, కాసులపేరు కావాలా' అని సీతి అడిగింది

'కంటె' అంది వెంకి

కంటె సీతి కాసులపేరు సూరి అందుచేత సీతీ, వెంకీ మగపెళ్ళివారయ్యారు సూరి ఒక్కర్తె ఆడపెళ్ళివారు సీతీ, వెంకీ చేతులు పట్టుకొని దూరంగా నిలబడ్డారు

సూరి వాళ్ళకు దూరంగా నిలబడి వాళ్ళకేసి తిరిగి పాడింది

'చిన చిన చితుల్ చిటారి దొంతుల్
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మేం పిల్లనిస్తామే
చిలకా మేం పిల్లనిస్తామే
దాయీ మేం పిల్లనిస్తామే
తామర మొగ్గల్లా తామరమొగ్గల్లు'
సీతి వెంకి ఇలాగ పాడారు
'చిన చిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కామేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మీరేయింటివారే
చిలకా మీరేయింటివారే
దాయీ మీ రేయింటివారే
తామరమొగ్గల్లా తామర మొగ్గల్లా'
అప్పుడు సూరి మళ్ళీ పాడింది
'చిన చిన దొంతుల్ చిటారి దొంతుల్
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మేం మంచి బ్రాహ్మలమే
చిలకా మేం మంచి బ్రాహ్మలమే
దాయీ మేం మంచి బ్రాహ్మలమే'
తామర మొగ్గల్లా, తామరమొగ్గల్లా' అప్పుడు మళ్ళీ సీతి ఇలాగ పాడింది.
'చిన చిన దొంతుల్ చిటారి దొంతుల్
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ నగలేం పెట్టాలి
చిలకా నగలేం పెట్టాలి
దాయీనగలేం పెట్టాలి
తామరమొగ్గల్లా తామర మొగ్గల్లు' సూరి ఇలా చెప్పింది
'చిన చిన దొంతుల్ చిటారి దొంతుల్
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మాకు కాసులు కావాలి
చిలకా మాకు కాసులు కావాలి
దాయీ మాకు కాసులు . .

''అమ్మాయీ, ఒసేవు సూరీ, ఏమేవు సీతీ, ఒకరూ పలకరేమిటమ్మా' అని వాళ్ళమ్మ కేకవేసింది

'ఇక్కడాడుకుంటున్నామే' అంది సీతి  ఇంతట్లోకే వాళ్ళ అమ్మ వచ్చి చూచింది

'ఏమిటర్రా ఇది  ఇల్లూ వళ్లూ మన్నే  ఈవాళ పొద్దున్నేనా తలంటి నీళ్ళోస్తె? చెపుతా ఉండండి మీపని' అని వాళ్ళమ్మ కోప్పడింది

వాళ్ళమ్మ మాట విని వాళ్ళ నాన్న కూడా వచ్చి చూచాడు

సీతి ఏమీ అనకుండానే ఏడ్చింది  సూరి బిక్క మొగం వేసింది

వెంకి వాళ్ళన్న కాళ్ళు కౌగలించుకొని 'నాన్నా నన్నెత్తుకోవూ' అంది

వాళ్ళ నాన్న వెంకిని ఎత్తుకొన్నాడు

'చేతులు కడుక్కొని నాన్నగారు స్నానం చెయ్యడానికి నీళ్ళు తొరపవే సూరీ' అంది వాళ్ళమ్మ సూరీ సీతీ నీళ్ళు తొరపడానికి వెళ్ళారు



# భట్రాజు

వెంకి వాళ్ళమ్మతో కూడా లేచి అప్పుడే మొహం కడుక్కొంది  సూరీ సీతీ మరి రవంత సేపటికి లేచారు  ఇద్దరూ చెంబూ పుల్లా పుచ్చుకొని దొడ్లో కబుర్లు చెప్పుకుంటూ పళ్లు దోముకొని మొహం కడుక్కొన్నారు

వాళ్ళమ్మ ముగ్గురికీ పెరుగేసి చద్దివణ్ణం పెట్టింది  'నాకు ఆవకాయ నంచుకోవడానికి కావా'లని సూరి  అంది  'నాకు రాత్రి చేసిన గోంగూర పచ్చడి కావా'లని  సీతి అంది  'నాకేం, నాకేం గోంగూర కావాలి' అని వెంకి అంది  అందరూ నవ్వారు  'గోంగూర తింటారుటే వెంకీ' అంది సీతి 'పచ్చడి తినరా ఏమిటమ్మా' అంది సూరి  'పత్తడి' అంది వెంకి  వాళ్ళమ్మ రోంత గోంగూర పచ్చడి ముగ్గిరికీ వేసి తినమంది  ముగ్గురూ గబగబా తింటున్నారు

'నిమ్మళంగా తినండి  గొంతుక పడుతుంది' అంది వాళ్ళమ్మ

'ఈవాళ సూరిమీద నే సొద్దేస్తాను' అంది సీతి

'నీమీద నే సొద్దేస్తాను' అంది సూరి

'నే నేత్తాను సొద్దు' అని వెంకి కూడా గబగబ తినడం మొదలెట్టింది.  కాని వెంకికి పలకమారి దగ్గు వచ్చింది

'చెప్పలేదూ, నిమ్మళంగా తినమని' అంది వాళ్ళమ్మ

సూరి ముందస్తిగా తినేసి లేచింది  సీతి ఇంకా అన్నం ఉండగానే లేవబోయింది  కాని

వాళ్ళమ్మ కోప్పడి కూచోబెట్టి మిగిలిన అన్నం తినిపించింది

'సీతి మీద సొడ్డు వెంకి మీద సొడ్డు సీతి మీద సొడ్డు వెంకి మీద సొడ్డు' అంటూ నవ్వుతూ అంటచెయ్యి సీతి కంచం పక్కా, వెంకి కంచం పక్కా తిరగా మరగా అద్దీ లేచి పెరట్లోకి వెళ్ళింది

'చూడవే అమ్మా మరి నామీద సొడ్డుట' అంది సీతి

'సీతి మీద సొడ్డోయి ఓయి ఓయి' అంది మళ్ళీ సూరి

'రాత్రి నీమీద సొడ్డేస్తానుండు' అని సీతి లేచి ఎంగిలి చెయ్యి నాకుతూ దొడ్లోకి వెళ్లి చెయ్యి కడుక్కుంది వెంకి కూడా అన్నవి తిని లేచి 'సూలి మీద సీతి మీద సొద్దోయి' అంటూ వెళ్ళి చెయ్యి కడుక్కుంది

ముగ్గురూ కలిసి నడవలో కూర్చున్నారు సూరి రెండోతరగతి వాచకము, సీతి ఒకటో తరగతి వాచకము, వెంకి పలకా పలకపుల్లా పట్టుక్కూచున్నారు సూరి పుస్తకం జాగ్రత్తగా అట్ట వేసుకుంది కొత్త బట్టలమీది బొమ్మలు అట్టలమీద అంటించుకొంది పుస్తకంలో ఒక నెమలికన్నూ దాని దగ్గర పువ్వారము పెట్టింది 'సీతోయి చూడవే చూడవే, ఈ నెమలికన్నెంత పువ్వారం తినేసిందో, ఒక పిల్లనైనా పెట్టదు - పాడు' అంది సూరి సీతి తన పుస్తకంలో నెమలికన్ను పేజీ తీసి, 'నా పువ్వారం కొంచెం తింది నెమలికన్ను చూడే అక్కా చూడే, ఎంత చిన్న పిల్లని పెట్టిందో! చూడే ఒసే' అంటూ సీతి ఒక చిన్న నెమలివెండ్రుక సూరికి చూపించింది

'అది పిల్లేమిటమ్మా?' అంది సూరి

'కాదేమిటమ్మా' అంది సీతి

'నా కదియ్యవూ' అంది వెంకి

వెంకిని మభ్యపెట్టి సీతి కన్ను దాచేసుకుంది సీతి పుస్తక మంతా నలిగి చిరిగి ఉంది

'అక్కయ్యా పారము చెప్పవుటే నాకు' అంది సీతి

'ఏం పారం' అని సూరి అడిగింది 'కుక్కపారం' అంది సీతి. 'కుక్క పారమేమిటి అసయ్యం ఇంకా పారాల్లేవూ' అంది సూరి 'పిల్లిపారం, ఏనుగపారం, సోమరి పిల్లవాడి పారం ఉన్నాయి' అంది సీతి

'అవేం పారాలే పాడు పారాలు - కథలు లేవూ' అని సూరి అడిగింది

'నృగు కథ, హరిశ్చంద్రుని కథ - ఈ కథలున్నాయే' అంది సీతి

'అవేం కథలే? ఎంచక్కటి కథలేమీ లేవూ, మనం చెప్పుకునే లాంటివి' అంది సూరి

'ఏమోనమ్మా నాకు తెలియదు' అంది సీతి

'పోనీ పద్యం చదువు' అంది సూరి

'చివరున్నాయే పద్యాలూ చదవనా?'

'క్షేత్రంబు పురుషకారము

ధాత్రీశ్వర బీజమరయ దైనములు రెండున్
సూత్రపడగూడ నేనియు - '
అని నట్టుతూ చదివింది సీతి
'ఏమోనమ్మా ఆ పద్యాలు నాకు తెలియవు అవేం పద్యాలోగాని' అంది సూరి
'సూరోయి, ఇదేం నాలుగోవాచకం' అంది సీతి
'ఆసి దొంగా! నీ పుస్తకం అనుకుంటున్నాను' అంది సూరి
'పోనీ నీ పుస్తకంలో కథలు చదవవే' అంది సీతి
'నా పుస్తకమూ అలాగే ఉందమ్మా పాడు' అంది సూరి
'ఒకటి చదవ్వే పోనీ' అంది సీతి
'అయితే చదువుతాను విను' అని సూరి ఇలాగ చదివింది.
'పూర్వంబు నుజ్జయిని అను నా బట్టణం బొండు కలదు '
'బొండు, బొండేమిటి సూరీ' అందిసీతి
'వినవే మరి' అని సూరి చదవడం సాగించింది
'అందు వీరసేనుండను భూతలేంద్రుడు రాజ్యంబు సేయుచుండెను అతనికి చంద్రకళ యను పేరంబరగు కళత్రంబున సకల గుణోపేత
'పేత, పేతేమిటి పీత' అంది సీతి
'పోనీ అమ్మా నే చదవను' అంది సూరి పుస్తకం మూసేసింది
'నా పుస్తకంలోనూ లేవే మంచి పారాలు' అంది సీతి
'నా పుస్తకమూ అంతే' అంది సూరి
'పేత పేత పీత' అంటూ కూచుంది వెంకి
ఇంతట్లోకే వాళ్ళింట్లో గుమ్మం దగ్గిరికి ఒక ముసిలబ్బి వచ్చి నిలబడ్డాడు తలకు రీవిగా తలపాగా చుట్టుకొన్నాడు కుడితినీ తొడుక్కొన్నాడు చేతిలో కర్ర ఉంది చెవులకు ఎర్రరాళ్ళ కమలాలున్నాయి ఎర్ర కుంకుమబొట్టు నిలువుగా బెట్టుకొన్నాడు వచ్చి గుమ్మంలో నిలబడి సూరీ, సీతీ, వెంకీ వీళ్ళని చూచి నవ్వి, 'అమ్మాయిగార్లు కూచున్నారా' అని ఇంట్లోకి చూచాడు
'బూచాడు' అంది వెంకి
'బూచాడ రార, బుట్టల్లుకోరా
ఏడ్చేటి మా వెంకి నెత్తుకుపోరా' అని సీతి పాడింది
వాళ్ళు ముగ్గురూ అబ్బికేసి చూస్తూ కూచున్నారు
'శుభోజయం, శుభోజయం, సకల విద్వజ్జనాధారా, సకల విద్యా విశారదా, సకల భోగ పురందరా, సకల కళాప్రవీణ, సంగీత రత్నాకర, సాహిత్య భువనమండల, సాహసవిక్రమార్క,

సత్యభాష హరిశ్చంద్ర - జయ విజయీభవ దిగ్విజయీభవ - శుభోజయం శుభోజయం అమ్మగారూ' అని కేకవేశాడు

'అమ్మ దొడ్లో ఉంది' అంది సీతి

'నాన్నగారో తల్లీ' అన్నాడు భట్రాజు

'నాన్నేం గదిలో రాసుకుంటున్నాడు' అంది సూరి

వెంకి సూరి వళ్లో కూర్చుంది అప్పుడు భట్రాజు గొంతుకెత్తి గట్టిగా

'రాజిత కీర్తిశాలియగు రాయని బాచ! భవద్యశంబు ది

క్ప్రాజిత మౌచు మించె సురభూధర భూధర బూధరేంద్ర కాం

తాజసుగోత్రరుక్సిధురధాంగ రధాంగ రధాంగశేఖ భా

షా జలజాహితాహిత తుషార తుషార తుషార ధాములన్

'గగనమండల మదే గంటి నేడోయమ్మ

గగనంబు కాదది గజము కొమ్మ

గజమైన నక్షత్ర గణములం దేమమ్మ

నక్షత్రములుగావు నవ్యమణులు

మణులైన అరుణాభ్ర మండలం బేమమ్మ

అరుణాభ్ర మదికాదు సురకజాలు

సురకజా లదియైన మెరపులం దేమమ్మ

మెరపులు జలతారు సరుకులమ్మ

సరుకులవి యైనచో నిండుచంద్రుడేల

సాటి ఘనమేటి శ్రీ పూసపాటి విజయ

రామరాజేంద్రు సుతుడు నారాయణ గజ

పతి సుమీ రాజచంద్రుడే పద్మగంధి '

అని చదివి, 'శుభోజయం శుభోజయం' అని మళ్ళీ కేవేసి ఇలాగ చదివాడు

'పసముత్యమొకటి చాలును

కస వూడ్చిన చిడిపెరాలు గంపెండేలా

రసికుండొక్కడె చాలును

రసహీనులు పలువు రేల రాయని బాచా

డాబాపై కూర్చున్నా

డే బాలుడు ముద్దుగుమ్మ! ఎవరే చెపుమా

శాబాసు నీ వెరుంగవె

బాబాజీ బుచ్చితిమ్మ బహదరు చెలియా'
'శాబాసు, శాబాసేమిటీ శాబాసుట' అంది సీతి
'ఇంకో పద్యం చదువు అబ్బీ' అంది సూరి
అమ్మాయిగారు - చదువుతాను '
'కలిమి గలవాడె మనుజుడు
విలసిత సత్కీర్తి చేత వెలయగ వలయున్
కలిమేమి ఎల్లకాలము
కులగిరులా కదలకున్న గువ్వలచెన్నా'
'అవేం పద్యాలే చదువుతాడూ' అంది సీతి.
'మంచివీ చదువుతా డుండు' అంది సూరి
'పాటలు చదువు అబ్బీ' అంది సీతి.
'పాటలు రావు తల్లీ, పద్యాలు చదువుతాను' అన్నాడు భత్రాజు.
'మా సీతి మీద పద్యం చదువు' అంది సూరి.
'చదువుతా తల్లీ :
'సీతమ్మలు ధర నెందరొ
ఖ్యాతిని గన్నట్టివారు గలరట డొక్కా
సీతమ్మగారి వితరణ
నా తరమా కీర్తిచేయ నలువకు తరమా'
'మళ్ళీ చదువు అబ్బీ మళ్ళీ చదువు' అంది సూరి.
భత్రాజు మళ్ళీ చదివాడు.
'డొక్కా సీతమ్మ కాదు. సీతి' అంది సూరి.
'అవును తల్లీ అవును' అన్నాడు భత్రాజు.
'అవునైతే ఇంకో పద్యం చదువూ' అంది సూరి.
'చదువుతా తల్లీ:
త్రవ్వట బాబా తలపై
పువ్వట జాబిల్లి మేన బూదట విషమే
బువ్వట చూడగను హుళ
క్కవ్వట అరయంగ నట్టి హరునకు జేజే'
'ఉళక్కి ఉళక్కి' అని సీతి నవ్వింది వెంకి కూడా నవ్వింది
'అదికాదు సీతి మీద పద్యం' అంది సూరి

'ఆలాగే తల్లీ - అమ్మాయిగారూ చదువుతా
'సీతమ్మలు ధరనెందరొ
ఖ్యాతిని గన్నట్టివారు కలరట డొక్కా
సీతమ్మగారి వితరణ
నా తరమా కీర్తి చేయ నలువకు తరమా' అని చదివాడు.
'మళ్ళీ ఆ పద్యమే చదువుతాడేం' అంది సూరి.
'ఈ అబ్బికి పద్యాలూ రావు పాటలూ రావు' అంది సీతి
'డొక్కా సీతమ్మోయి' అంది సూరి. సీతికి ఉడుబోత్తనం వచ్చి.
'మా సూరిమీద ఓ పద్యం చదువబ్బీ' అంది
'అమ్మాయిగారూ అమ్మగారి నడిగి బియ్యం తెచ్చిపెట్టండి' అన్నాడు భట్రాజు.
'సూరి మీద పద్యం చదివతే నీకు బియ్యం వేస్తా' నంది సీతి.
'సూరమ్మ వంటి బాలిక
ఊరంతా తిరిగితేను ఉంటుందమ్మా
సూరమ్మా నిను బోలగ
ఏరమ్మా మంచిపిల్ల లీకాలమునన్'
అని భట్రాజు చదివేటప్పటికి సీతీ, వెంకీ చప్పట్లు కొట్టి నవ్వారు.
'అయిందా, అయిందా మరి' అంది సీతి సూరిని చూచి.
'నాన్నగారితో చెప్పి బియ్యం వేయించండి అమ్మాయిగార్లు' అన్నాడు భట్రాజు.
'ఇంకా పద్యాలు చదువూ' అంది సీతి.
'బియ్యం తెండి, అలాగే చదువుతాను' అన్నాడు భట్రాజు.
మా వెంకి మీద పద్యం చదవవూ అబ్బీ' అంది సూరి.
'ఆలాగే తల్లీ :
'ఒక్కడు మాంస మిచ్చె మరి
యొక్కడు చర్మము కోసి ఇచ్చె వే
రొక్కరు డస్థినిచ్చె మరి
యొక్కడు ప్రాణము నిచ్చె వీరిలో
నొక్కొక పట్టునన్ బ్రదుక
నోపక యిచ్చిరొ కీర్తి కిచ్చిరో
చక్కగ చూడు మంత్రికుల
సంభవ రాయన మంత్రి భాస్కరా
పడుచు నిడినవాని పద్యమిచ్చినవాని

కడుపు కిడినవాని నడుపవలయు
నడువలేనివాని నయవిదు లెంతురా
భువిని భాస్కరేంద్రు పుత్రకొండ'
'అవి చదువుతాడేం అవికాదు వెంకి మీద పద్యం' అంది సూరి
'వెంకి మీద పద్యం చదువబ్బీ' అంది సీతి
'చదువుతాలే తల్లీ
'నవ నవలాడే దేహము
చవులూరే పలుకుతీరు సంపదలోనన్
ప్రవిమల దానగుణంబున
భువిలో వెంకమ్మతల్లి బోలంగలరే'
అని భట్రాజు చదివాడు సూరీ, సీతీ, వెంకీ చప్పట్లు కొట్టి నవ్వారు
ఇంతట్లోకీ వాళ్లనాన్న గదిలోనుంచి నడవలోకి వచ్చి భట్రాజును జూచి,
'ఎవరవోయి నువ్వు' అని అడిగాడు
'మేం భట్రాజులం అన్నదాతా ఇది మా కులవిద్య తండ్రీ'
పలువిద్య లెన్ని నేర్చిన
కులవిద్యకు సాటిగావు కుంభినిలోనన్
వెలకాంత లెందరైనను
కులకాంతను బోలరన్న గువ్వలచెన్నా'
'అమ్మాయిగార్లకు పద్యాలు చదివి వినిపిస్తున్నాను అన్నదాతా' అన్నాడు భట్రాజు
'సూరీ, బియ్యం వేసి పంపించవే' అన్నాడు వాళ్లనాన్న

'తండ్రీ తమరు తొడిగి విడిచిన వస్త్రం ఒకటి దానం చేస్తే కలకాలమూ చెప్పుకుంటాను' అన్నాడు భట్రాజు. వాళ్ళనాన్న చొక్కా యిచ్చాడు భట్రాజుకి సూరి సోలతో బియ్యం తెచ్చి భట్రాజు వళ్లోపోసింది 'నేనూ బియ్యం పెడతా' నని సీతి కూడా సోలెడు బియ్యం పోసింది

'నేనూ పెత్తా' అని వెంకి రెండు గుప్పిళ్ళతోటే బియ్యం వళ్లో పోసింది. 'ఇక వెళ్లు' అన్నాడు వాళ్ల నాన్న 'అయిదోతనం కలిగి, ఐశ్వర్యంగలిగి, ఆరోగ్యం గలిగి నూరేళ్ళు వర్ధిల్లండి అమ్మాయిగార్లూ నూరేళ్ళు వర్ధిల్లండి' అని చెప్పి భట్రాజు వెళ్లిపోయాడు 'బియ్యం అన్నీ పోసేస్తున్నారర్రా' అని వాళ్లమ్మ పెరట్లోంచి కేకవేసింది 'లేదే' అన్నారు సీతీ, సూరీని

'లేదులే నే చూస్తున్నా' అన్నాడు వాళ్ల నాన్న

సూరి సీతిని చూచి 'డొక్కా సీతమ్మోయి' అంది

సీతి సూరిని చూచి 'ఊరంతా తిరిగేను ఉంటుందమ్మా సూరమ్మా' అంది

సూరీ సీతీ వెంకిని చూచి 'వెంకమ్మతల్లీ బోలంగలరే' అన్నారు వాళ్ళ నాన్న నవ్వాడు

# సంకురాత్రి

'ఓ తాయిల్లాగారి నెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడుపాప
చెపితే నీ కళ్ళోతాయి'
అని నవ్వుతూ,చప్పట్లు కొడుతూ సూరినిచూచి సీతి అంది

సూరి తలమీద ఉన్న గడ్డిపరకచేత్తో తీసేసుకుంది

'మొగుణ్ణి వెతుక్కుందోయి, మొగుణ్ణి వెతుక్కుందోయి' అని సీత మరీ నవ్వుతూ చప్పట్లు కొడుతూ గంతులేసింది

'అమ్మతో చెపుతానుండు అస్తమానూ ఏమిటది అసయ్యం,' అంది సూరి

వెంకి వాళ్లమ్మ పచ్చడి రుబ్బుతూంటే చేతిలో వేయించుకొని నాకుతూ వాళ్ళదగ్గిరికి వచ్చి, 'ఆయి బెల్లం, ఆయి,ఆయి, నాకోయి ఆయి' అని ఊరించింది సీతి 'నేను మాత్రం తెచ్చుకోలేనా ఏమిటమ్మా' అంటూ ఇంట్లోకి పరుగెత్తుకు వెళ్ళి పచ్చడి చేతిలో వేయించుకువచ్చి 'ఆయి బెల్లం, ఆయి బెల్లం ఆయి, ఆయి' అంటూ సూరిని ఉడికించింది సూరి, 'నేను కూడా తెచ్చుకోలేనా' అంటూంటే 'రావే నీకూ పెడతాను' అని పిలిచి, 'ఆయి ఆయి' అని మళ్ళీ ఊరించి తరవాత సగం సూరికి పెట్టింది ముగ్గురూ పచ్చడి చేతులు కడుక్కున్నారు

'సంకురాత్రి నెలపట్టారుట గాదుటే సూరీ' అంది సీతి

'అమ్మ చెప్పింది కాదూ రేపటినుంచని' అంది సూరి,

'మరోసే రేపటినుంచే కాదుటే ముగ్గులెట్టడం' అంది సీతి

'అవునే, గొబ్బిళ్ళుకూడా రేపటినుంచేనే' అంది సూరి

సూరికి ముగ్గులెట్టడం వచ్చును తెల్లారకుండానే వాళ్ళమ్మతో కూడా లేచారు సూరీ, సీతీ, వెంకీని వాళ్ళమ్మా, సూరీ కలిసి చిన్నచిన్న పేడ ముద్దలుచేసి, వాటికి పసుపు చుక్కలూ, కుంఖం చుక్కలూ పెట్టి గుమ్మడి పువ్వులు గుచ్చి వాటిని ఆముగ్గులమీద పెట్టి పసుపూ, కుంఖం చల్లేవారు

వాళ్ళమ్మ పెద్ద పెద్ద ముగ్గులు పెట్టేది గుంటల కోనేళ్ళూ, గంటల రధాలూ వాళ్ళమ్మ పెడుతూ ఉంటే సూరి చిన్న ముగ్గులు వాటి చుట్టూ పెట్టేది తాంబేళ్ళూ,పాములూ, మిరాయి పొట్లాలూ, తులసికోటలూ మొదలైనవి

గొబ్బిళ్ళు పెట్టింతరువాత ముగ్గురూ కలసి గొబ్బిళ్ళ పాట పాడేవారు సీతి పెంకితనానికి సూరిమీద గొబ్బి పాట కట్టిపాడేది

'సూరికి గొబ్బెమ్మా
మొగలీ పువ్వంటీ
మొగుడీ నియ్యావే'

అంటే సూరికూడా ఉడుకుమోత్తనంతో-

'సీతికి గొబ్బెమ్మా
మొగలీ పువ్వంటీ మొగుడీ నియ్యావే '
అని పాడేది
వెంకి-
'సూరికీ,సీతికీ గొబ్బెమ్మా
మొగలీ పువ్వంటీ
మొగుడీనియ్యావే'
అని పాడుతుంటే సీతి ' ఊరుకో వెంకీ' అని కోప్పడేది

గొబ్బిపాటలు పాడిం తరువాత బెల్లంముక్క నైవేద్యం పెట్టి అది ముగ్గురూ తినేవారు

ప్రతిరోజూ ఈ రీతిగా గొబ్బిళ్ళుపెట్టి కొంతసేపున్న తరువాత వాటిని తీసి చిన్న చిన్న చిల్లిపిడకలుచేసి ఎండించి దండలుగుచ్చి వాళ్ళు ఆదండలన్నీ వసారాలో వేళ్ళాడవేసుకొనేవారు

ప్రతిదినమూ వాళ్ళ ఇంటివాకిలి కలకలలాడుతూ ఉండేది సాయంత్రం అయ్యేటప్పటికి గొబ్బిళ్ళపాట పాడుతూ కొంతమంది ఆడపిల్లలు వచ్చేవారు వాళ్ళ గంపకింద పెట్టుకొని వంగుని చప్పట్లు కొడుతూ ఆగంప చుట్టూ తిరుగుతూ గొబ్బిళ్ళపాట పాడితే సూరీ, సీతీ, వెంకీ విని సంతోషించేవారు. వాళ్ళు చెరో పిడకా ఆపిల్లలకి ఇచ్చేవారు

ఆడపిల్లలు వెళ్ళిపోయిన తరువాత మగపిల్లలు భోగికర్రలకోసం పాడుకుంటూ వచ్చేవారు

'కాముడోయి భీముడోయి
కందిపప్పు దేముడోయి
చెన్నపట్నం చెరుకుముక్క
నీకోముక్క , నాకోముక్క'

అని వాళ్ళు అరుస్తూంటే సీతి ఒకచిన్న కర్రముక్కో, లేకపోతే ఒకపిడక ముక్కో ఇచ్చేది వాళ్ళు పాడుతూ ఇంకో ఇంటికి పోయేవారు

సుద్దముక్క పుచ్చుకొని వెంకి ఇల్లంతా ముగ్గులు పెట్టడం నేర్చుకుంటోంది సూరి నేర్పుతోంది సీతికీ, వెంకికీని సీతికి కొంచెం ముగ్గులుపెట్టడం, మిరాయి పొట్లం ముగ్గుపెట్టడం వచ్చింది వెంకికి సుద్దముక్కతో గీతలు గీయడం తప్ప అసలు ముగ్గులేమీరావు

## 2

ఇక సంక్రాంతి వారంరోజు లుందనగా సూరీ, సీతీ, వెంకీ అరుగుమీద కూర్చుని గచ్చకాయ లాడుతున్నారు అసమయంలో వాళ్ళింట్లో వాళ్ళమ్మకీ,నాన్నకీ చిన్న యుద్ధం జరుగుతోంది

'నాదగ్గిర డబ్బులేదు నేను కొన్ను' అంటున్నాడు వాళ్ళ నాన్న

'అయ్యో! కొనకపోతే ఎలాగ! పండుగని ఎంతో ముచ్చట పడుతున్నారు వాళ్ళు పాపం' అంది వాళ్ళమ్మ

'ఇంకో పండుక్కి చూసుకోవచ్చులే ఇప్పు డప్పుచేసి కుట్టించను, వాళ్ళకి కొత్తబట్టలు '

'అయ్యో!అలా అనకండి వాళ్ళకెంత కావాలి? ఏడాది కొక్కసారి వచ్చే పండుగాయెను'

'అన్ని పండుగలూ ఏడాది కొకసారే వస్తాయి నెలనెలకీ ఏదో ఒక పండుగ వస్తూనే ఉంటుంది చేతులో డబ్బు ఉన్నప్పుడు కుట్టిస్తాలే '

'ఇది పెద్దపండుగ అలా అనకండి పిల్లలు చిన్న పుచ్చుకుంటారు పొరుగు పిల్లలందరూ కొత్తపరికిణీలూ, కొత్త చొక్కాలూ వేసుకుతిరుగుతూ ఉంటే మనపిల్లలు మాసిన బట్టలు కట్టుకు తిరగడానికి యేమంత ఖర్మం వచ్చింది! ఊరుకోండి, ఎవరేనా వింటేనవ్విపోతారు '

'మరేం నవ్వరు లెద్దూ'

'ఇదేమిటమ్మా ఈ మొండిపట్టు? ఎంత చెప్పినా వినరు పిల్లలకి కొత్త బట్టలే లేకపోతే ఈ పండుగలు చేసుకోడా లెందుకు? ఈ పిండివంటలు వండుకోడా లెందుకు?' అని బుగ్గలు వేళ్ళతో నొక్కుకుంది

వాళ్ళ నాన్నకి కోపంవచ్చి కేకలేశాడు

వీధిలో ఆడుతున్న ముగ్గురూ పిల్లలూ కేకలు విన్నారు

అప్పుడు సీతి వెంకితో అంది గదా 'వెంకీ, వెంకీ, నాన్నేం, మనకేం, కొత్త పరికిణీలు కుట్టించనంటున్నారు నీ విప్పుడేం చేస్తావా అంటే నాన్న దగ్గిరకు వెళ్ళి నాన్న కాళ్ళు రెండూ గట్టిగా పిటకరాయిలాగ పట్టుకో పట్టుకొని అంటావు గదా 'నాన్నా, నాన్నా, నాకూ, అక్కయ్యలకీ కొత్త పరికిణీలు కుట్టించవూ అని '

అపుడు సూరి అంది గదా 'ఒసే సీతీ, అలా చేస్తే నాన్నకి కోపం వస్తుందేమోనే అమ్మ చెపుతుందిలే, నాన్నతో కుట్టించమని'

'ఉండొసే నీకు తెలీదు ఊరుకో సూరీ! వెళ్ళవే వెంకీ, వెళ్ళు '

వెంకి గబగబ పరుగెత్తికెళ్ళి వాళ్ళ నాన్న కాళ్ళు రెండూ గట్టిగా పట్టుకుంది. పట్టుకొని 'నాన్నా, నాన్నా, కొత్త పలికినీలూ ఊ ఊ ఊ ' అని మూలగడం మొదలెట్టింది

కొంతసేపయాక సూరీ, సీతీ వచ్చారు సూరి అంది గదా 'నాన్నా, నాన్నా, వాళ్ళమ్మాయే ఉల్లిపువ్వుల పరికిణీ కుట్టించుకొంది నాన్నా, యెంచక్కుంది! మాక్కూడా కుట్టించిపెట్టవూ?'

సీతి అందిగదా 'పోనీలేనాన్నా, నీవెప్పుడూ యింతే! కుట్టించి పెట్టమంటే కుట్టించవు ఇప్పుడు వెడదాంరా నాన్నా బజారుకి '

వెంకి నాన్న పంచలాగుతూ 'రానాన్నా బజారూ, రా నాన్నా బజారూ' అని అనడం మొదలెట్టింది వాళ్ళు ముగ్గురూ కలిసి నాన్నని బజారుకు లాక్కుపోయారు వాళ్ళమ్మ వంటిట్లోంచి చూచి నవ్వుకుంటోంది

## 3

'ధర్మసంవర్ధనీ మాయమ్మా
నమ్మితీ నమ్మా
దాసునీ దయజూడవలె. నమ్మా

ఎన్ని జన్మము లెత్తితిని తల్లీ! కల్పకవల్లీ!

ఎన్నిజన్మము లున్నవో మళ్ళీ '

అంటూ సాతాని కాషాయవస్త్రాలు కట్టుకొని గుమ్మడిపండు చెంబు నెత్తిమీద పెట్టుకొని తంబురా, చిరతలూ చేతులతో పట్టుకొని వాయిస్తూ భోగినాడు వాళ్ళింటికి వచ్చాడు తలంటు నీళ్లోసుకొని, కొత్తపరికిణీలు కట్టుకొని, కొత్త జుబ్బాలు తొడుక్కొని, కాటుకా బొట్టూ పెట్టుకొని,బుట్టెడు బియ్యం అరుగుమీద పెట్టుకొని సూరీ, సీతీ, వెంకీ ఇంటికి వచ్చిన బిచ్చగాళ్లందరికీ గుప్పెడు గుప్పెడు బియ్యం వేస్తున్నారు

ఆ రోజున వాళ్ళందరూ తెల్లారకుండానే లేచారు తలనీళ్ళు పోసుకున్నారు వసారాలో వేల్లాడదీసిన చిల్లి పిడకలన్నీ పెరట్లోనే పోగేసి భోగిమంట వేసుకొన్నారు సీతి వాళ్ళ నాన్న రూళ్ళకర్ర తెచ్చి భోగిమంటలో పడేసింది వాళ్ళమ్మ అప్పడాల కర్ర వెంకి పడేసింది వాళ్ళన్నయ్య ప్రక్కవాళ్ళ దళ్ళో వెదురుకర్ర తీసి భోగిమంటలో పడేశాడు భోగిమంట దగ్గర వాళ్లెంతోసేపు చలికాచుకొన్నారు

'అబ్బీ, అబ్బీ, నీ కింకా పాట లొచ్చునా?' అంది సూరి

'వచ్చునమ్మా' అని-

'ఘుమ్ముమ్మ ఘుమ్మున పెరుగు తరచగ

కోరి విని ప్రార్థించి కృష్ణుడు

అమ్మ వెన్నా అనుచు కవ్వము

అణచి పెట్టగను

నమ్మరా కృష్ణమ్మ! పెరుగులో

నడుమ గుమ్మడు తిరుగు లాడును

నమ్మకున్నను ఘుమ్ము ఘుమ్మను

నాద మిటు వినుమీ

కృష్ణా! గుమ్మా డిడుగో!'

పాడాడు. సూరీ, సీతీ, వెంకీ గుమ్మడిపండు చెంబులో తలో గుప్పెడు బియ్యం పోశారు సాతాని పాడుకొంటూ ఇంకోఇంటికి పోయాడు

ఇలా ఎంతోమంది పాటలు పాడుకుంటూ వచ్చారు వారిచేత రకరకాల పాటల పాడించుకొని వారికి సూరీ, సీతీ, వెంకీ తలోగుప్పెడు బియ్యం పెడుతూనే ఉన్నారు కాకులూ పిచికలూ అప్పుడప్పుడు వాళ్ళదగ్గరకు వచ్చేవి వాళ్ళు కాసిని బియ్యం చల్లితే అవి తినేసి పోయేవి ఇలా మధ్యాహ్నందాకా వాళ్లు బిచ్చగాళ్లకీ, కాకులకీ, చిలకలకీ బియ్యం వేస్తునే ఉన్నారు.

ఇంతట్లోకే వాళ్ళమ్మ 'నాన్నగారు మడి కట్టుకున్నారు లేండర్రా బువ్వ తిందురుగాని' అని కేకేసింది

'వస్తున్నామే' అని వాళ్ళు అరుగు మీదనుంచి లేచారు. అడుక్కునే ముసిలమ్మ అలా

పోతోంటే దాన్ని పిల్చి, బుట్టలో బియ్యం దాని వళ్ళో పోసింది సీతి

ముగ్గురూ ఇంట్లోకి వెళ్లిపోయారు

ఇంట్లోకి వెళ్లి ముగ్గురూ కాళ్ళు కడుక్కుని భోజనానికి కూర్చున్నారు వాళ్ళమ్మ వడ్డిస్తోంది

'అమ్మాచ నాకేం వండిపెట్టావు' అంది సీతి

'నీకు పులిహోర చేసి పెట్టానులే' అంది వాళ్ళమ్మ

'నాకో అమ్మా' అంది వెంకి

'నీకు బొబ్బట్లు ఇష్టమేగా?'

'మరి నాకో ! పరమాన్నం చేసిపెట్టావా అమ్మా' అంది సూరి

'ఇన్నుంటే ఇంకా పరమాన్నం ఎందుకే' అన్నాడు వాళ్ళ నాన్న

'రేపు చేస్తానులే' అంది వాళ్ళమ్మ

సూరి ధుమధుమ లాడుతూంటే 'నీ కానక ఓ తాయిలం పెడతానులే' అంది వాళ్ళమ్మ.

'నాకూ పెట్టాలి తాయిలం, నాకూను' అన్నారు సీతీ, వెంకీని

తరువాత ముగ్గురూ కబుర్లు చెపుతూ ఒకళ్ళమీద ఒకళ్ళు సొడ్డు వేసుకుంటూ భోజనాలు చేశారు

# 4

పెద్ద పండుగనాడు సూర్యుడు ఉత్తర దిశాభిముఖుడై ఉదయాన్నే ప్రకృతి కంతకూ బంగారు నీరు పూశాడు దేశం లోనివాళ్ళంతా కొత్త బట్టలు కట్టుకున్నారు చెట్లుకూడా కొత్త బట్టలు కట్టుకున్నట్టే ఉన్నాయి బీదవాళ్ళు కూడా కొత్తబట్టలు కట్టుకున్న భావంతోనే ఉన్నారు ఆ ఉదయాన్ని లోకము పెదవులలో నుంచి వెలువడిన మందహాసము సాయంకాలానికి పెద్ద నవ్వుగా మారబోతోంది

ఉదయాన్నే వినిపించాయి జేగంటలు భాస్కరుని బంగారు కాంతికి మెరుగు బెడుతున్నాయి దేవుడు పల్లకీలో ఎక్కి భక్తుల దర్శనం కోసం, భక్తుల కానుక లందుకోడం కోసం వీధివీధులా ఊరేగడానికి బయలుదేరాడు పూల దండలతో, మంగళ వాద్యాలతో, స్వస్తి వాక్యాలతో, వాత్సల్య సౌరభాలతో

ఆ పెద్ద పండుగనాడు దుఃఖచ్ఛాయల్ని వేటాడి తరుమ గొట్టడానికి దేవుడు బయలు దేరాడు

సూరీ, సీతీ, వెంకీ కొత్త బట్టలు కట్టుకున్నారు వాళ్ళమ్మ వాళ్ళ నలంకరించింది దేవుడి బాజాలు వినిపిస్తున్నాయి దేవుడికి హారతివ్వడానికి ముగ్గురూ ఉబలాట పడుతున్నారు పెద్ద పళ్లెంనిండా బియ్యం పోశారు తాంబూలం పెట్టారు హారతి కర్పూరం పెట్టారు అరటి పళ్ళ అత్తం ఒకటి పెట్టారు అన్నయ్య నాలుగు అగరొత్తులు పడేశాడు

కాగడాలతోటి, బాజాలతోటీ దేవుడు వాళ్ళింటి ముందరికి వచ్చాడు

సూరీ, సీతీ, వెంకీ ముగ్గురూ పళ్ళెం పట్టుకువచ్చి పూజారి కిచ్చారు పూజారి బియ్యం, పళ్ళూ

అన్నీ దేవుడి ముందు పోసి, కర్పూరం వెలిగించి దేవుడికి హారతిచ్చాడు. హారతిస్తూంటే వాళ్ళమ్మ లెంపలు వాయించుకొని దేవుడికి దణ్ణం పెట్టింది. వాళ్ళమ్మను చూచి సూరీ, సీతీ, వెంకీ కూడా దేవుడికి దణ్ణం పెట్టారు పూజారి హారతిపళ్ళెం సూరి చేతికిచ్చాడు. అందరికీ శఠగోపం పెట్టి పువ్వుల ప్రసాదం ఇచ్చాడు. అందరూ కళ్లకద్దుకున్నారు. అద్దుకుంటూ వాళ్లమ్మ అందికదా, 'దేవుడి పుణ్యాన్ని మా సూరికి మంచి సంబంధం వచ్చి చప్పున పెళ్ళి అయితే బావుండేది ' అంటే సూరి సిగ్గుపడింది సీతీ, వెంకీ సూరికేసి నవ్వారు. సూరికి ఉడుకుమోత్తనం వచ్చి ఇంట్లోకి పారిపోయింది.

ఆ రోజల్లా వాళ్ళు ముగ్గురూ బిచ్చగాళ్ళకి బియ్యం వేస్తూ ఆడుకుంటూ, పాడుకుంటూ ఖులాసాగా కాలం గడిపారు.

## 5

కనుమునాడు తెల్లారకుండానే లేచి వాళ్ళమ్మా, సూరీ, సీతీ కలిసి పెద్ద పెద్ద ముగ్గులు పెట్టారు. వాళ్ళమ్మ పెద్దరథర పెట్టింది. వాళ్ళు దానిచుట్టూ చిన్న చిన్న ముగ్గులు పెట్టారు. ఆ రథాన్ని పక్క ఇంటి రథంతో కలిపారు. ఈ విధంగా ఊళ్ళో ఉన్న ముగ్గులన్నీ కలిసి ఒక ముగ్గు అయాయి. సౌందర్య దేవత కౌగిలిలో ఆ ఊరంతా ఆనాడు ఒదిగింది.

వాళ్ళనాన్న ఓ గడ్డిమోపు కొని వాళ్ళింటి ముందర పడేశాడు. పశువులకు కూడా ఆనాడు పండుగే. యథేచ్ఛగా ఎవరింటికేనా వెళ్ళి అవి కావలసినంత గడ్డి తినవచ్చు

తాళాలు వాయిస్తూ, ఆంబోతులకు అచ్చువేసి కాపులు వీధుల్లో ఊరేగిస్తున్నారు. వ్యవసాయదారులు తమ పశువుల కొమ్ములకు రంగులువేసి వాటిని అలంకరిస్తున్నారు.

కనుమునాడు కాకికూడా మునుగుతుందని చెప్పి వాళ్ళమ్మ, అన్నయ్యకీ, సూరీకి, సీతీకీ, వెంకీకీ తలనీళ్లు పోసింది.

'అమ్మా! ఇవ్వాళ ఏం వండుతావే' అంది సీతి.

'కనుమునాడు మినుము తినాలి కాదుటే' అంది సూరి.

'అయితే అమ్మా! ఈవాళ ఆవడలు చేసిపెట్టు' అంది సీతి.

'మీ నాన్నగారి నడిగి చేస్తానులే' అంది వాళ్ళమ్మ.

'నాన్నా నాన్నా, నీకు ఆవడలు కావాలి కాదూ' అంది సీతి.

'సరే మీ యిష్టం' అన్నాడు వాళ్ళ నాన్న.

సూరీ, సీతీ, వెంకీ అరుగుమీద కూర్చున్నారు. ఆదారిని పోయే పశువులు వాళ్ళింటి ముందరి గడ్డి తింటున్నాయి. అన్ని రకాల బిచ్చగాళ్ళకీ బియ్యం పెడుతున్నారు వాళ్ళు. బియ్యం పుచ్చుకొనే ఆనందం బిచ్చగాళ్ళదీ, బియ్యం పెట్టే ఆనందం పిల్లలదీ, పిల్లలు పెడుతున్నారనే ఆనందం తల్లిదండ్రులదీ!

ఆ పెద్ద పండుగ మూడురోజులూ ఎవరు ఏ పనిచేసినా ఆ పనులలో ఆనందాన్నే వారి వారి మనస్సులు చూస్తున్నాయి

# సూరీ సీతీ వెంకీ జైలు ప్రవేశం

**సూ**రి రాటం తిప్పి నూలు తీస్తోంది సీతి వాళ్లన్నయ్య రాటం తీసి ఒక యేకు పుచ్చుకొని ముద్దలు ముద్దలుగా దారం లాగుతోంది. వెంకి యేకులు సూరికి అందిస్తోంది. వాళ్లన్నయ్య బళ్లోకి వెడతానని చెప్పి ఎక్కడికో వెళ్లిపోయాడు

"ఏవిఁటమ్మా యీరాట్నం. అస్తమానం దారం తెగిపోవడమే" అంది సీతి.

"అంత విసుగైతే ఎల్లాగ దారం తీస్తావే, ఓ తల్లీ" అంది సూరి

"నువ్వు మహా తీస్తున్నావు లెద్దూ, నన్నాక్షేపించడానికి" అంది సీతి.

"ఇంతట్లోకే ఆక్షేపించాననుటే అమ్మా! పోనీ, నీ యిష్టం వచ్చినట్లే తియ్యి ముద్దలు ముద్దలుగా! నాకేం కావాలా ఏమిటి?" అంది సూరి.

"నీకు ముద్దలు రావడం లేదు కామోసు" అంది సీతి.

"నాకెందుకమ్మా! అన్నయ్య వచ్చి చూస్తే సరి" అంది సూరి.

"అన్నయ్య నన్నేమీ అనడు లే! నాన్న నన్ను అన్నయ్య రాటం మీద తీసుకోమన్నాడు" అంది సీతి.

వెంకి రాటం తిరుగుతూ ఉంటే

"తిరుగూ తిరుగూ చెల్లప్పా,
తిరుగూ తిరుగూ చెల్లప్పా"

అంటూ కూచుంది.

"చక్రం ముట్టుకోకే వెంకీ! దెబ్బ తగులుతుంది" అంది సూరి.

"ముట్టుకోవే వెంకీ! దెబ్బా తగలదు; ఏమీ తగలదు" అంది సీతి నవ్వుతూను.

వాళ్లమ్మ వంట వండి మడిగట్టుకు కూర్చుంది.

అప్పుడే రెండు జాములైంది. వాళ్ల నాన్నా, అన్నయ్య కూడా ఇంటికి ఇంకా రాలేదు.

"మీరు తింటారుటర్రా, ఉండలేరేమో?" అంది వాళ్లమ్మ.

"నాన్న వస్తేనే కాని మేం తినం" అన్నారు సూరీ, సీతీని.

"నాన్నొత్తేనే గాని తినం" అంది వెంకి.

"అయితే మీ ఇష్టం" అంది వాళ్లమ్మ. సూరీ, సీతీ చాలాసేపు రాటం తిప్పి ఇంక చెయ్యి నొప్పెడుతోందని మానుకొన్నారు. వెంకి రాటం పిడి పట్టుకొని సరదాగా దాన్ని గిర్రున తిప్పుతోంది.

"కదురు పాడైపోతుందే. అలా తిప్పకే" అంది సూరి.

"ఆఁ, ఆఁ, ఒక్కటెయ్యనా" అంది సీతి.

"అమ్మతో చెబుతా" అంది వెంకి

అని ఇంకోమాటు గిర్రున తిప్పి వదిలిపెట్టి

"అమ్మా! అమ్మా!-నా కాకలవుతోంది పెత్తవూ" అంది.

"అమ్మా! నాకు ఆకలౌతోంతే" అంది సూరి

"అయితే కంచాలు తెచ్చుకు పెట్టుకోండి  అన్నాలు పెడతా" అంది వాళ్లమ్మ

సూరీ, సీతీ, వెంకీ అన్నాలు తింటూంటే వాళ్ల నాన్న కూడా వచ్చాడు

"ఇంతాలస్యమైందేం?" అంది వాళ్లమ్మ.

"ఊరేమీ బాగాలేదు  ఎక్కడబడితే అక్కడ ఎవళ్లని బడితే వాళ్లని పోలీసులు కొడుతున్నారుట  అబ్బాయి ఎక్కడి కెళ్లాడో కనిపించక తిరుగుతున్నాను" అన్నాడు వాళ్ల నాన్నగారు

"ఏడీ, అబ్బాయి ఏడీ?" అంది వాళ్లమ్మ

"ఏమో ఎక్కడికెళ్లాడో? బళ్లోకి వెళ్లలేదుట" అన్నాడు వాళ్ల నాన్న

"రెండు జాములైంది  ఇంకా ఎక్కడ తిరుగుతున్నాడో? స్వరాజ్యం వాళ్లలోగానీ కలవలేదుగదా?" అంది వాళ్లమ్మ

"ఏమో" అన్నాడు వాళ్ల నాన్న

""మీరు కూడా మడికట్టుకోండి  వాడెప్పుడు వస్తాడో?" అంది వాళ్లమ్మ.

వాళ్ల నాన్నా, సూరీ, సీతీ, వెంకీ భోజనాలు చేశారు

"అన్నయ్య జండా పట్టుకొని గాంధీటోపీ పెట్టుకొని తిరుగుతున్నాట్టే  మనం కూడా జండా పట్టుకు తిరుగుదామా?" అంది సీతి

"అమ్మో, నాకు భయమేస్తుందమ్మా" అంది సూరి.

"నాకో జండా యియ్యవు? అక్కా!" అంది వెంకి

"భయమెందుకే సూరీ!" అంది సీతి

"వాళ్లని చూస్తే నాకు భయమే" అంది సూరి.

"ఎవళ్లని? ఏదో టోపీ పెట్టుకుంటారు వాళ్లనా?"

'అవునే  కనిష్టీబుల్ని చూస్తే నాకు భయం" అంది సూరి

"వాళ్లు కనిష్టీబులు కారు  కనిష్టీబులికి ఎఱ్ఱటోపీ లుంటాయి "

"వీళ్లకీ టోపీలున్నాయే!"

"ఇవి ఏఱ్ఱటోపీలు కావే  అవోమోస్తరు టోపీలే" అంది సీతి

"అవునే అవునే" అంది సూరి

"నాకో జండా యియ్యవూ?" అంది వెంకి

వాళ్లమ్మ భోజనము చేస్తూ ఉంటే జండా పట్టుకొని ఒక అబ్బాయి వాళ్లింటికి వచ్చి వాళ్ళన్నయ్యని పోలీసులు కొట్టి ఖయిదులో పెట్టారని చెప్పాడు

"ఎందుకూ" అన్నాడు వాళ్ళ నాన్న

"ఎవళ్లో విదేశీబట్టలు కొంటూంటే కొనవద్దని అడ్డంగా నిలబడ్డాడు. అందుకని పోలీసులు కొట్టి తీసుకుపోయారు" అని చెప్పాడు ఆ అబ్బాయి

"అయ్యో, అయ్యో కొడకా, ఖయిదులో కెళ్లావురా కొడకా" అని వాళ్ళమ్మ తింటూ తింటూన్న అన్నం వదిలిపెట్టి లేచి ఏడ్చింది

"నీకు తెలియదూరుకో" అని వాళ్ళ నాన్న కేకేశాడు

వాళ్లమ్మను చూచి సూరీ, వెంకీ కూడా ఏడ్చారు సీతి బిక్క మొహం వేసింది

"ఎక్కడికి తీసుకెళ్లారు వాడిని?" అని వాళ్ల నాన్న అడిగాడు

"మీ అబ్బాయినీ, ఇంకో నలుగురినీ కలిపి తీసుకుపోయి ప్రస్తుతం పోలీసుస్టేషనులో పెట్టారు" అన్నాడు ఆ కొత్తబ్బాయి

వాళ్లనాన్న ఆలోచిస్తూ కూచున్నాడు వాళ్లమ్మ ఊరుకోమంటే ఊరుకోకుండా ఒకటే ఏడవడం మొదలెట్టింది

"ఎందుకండీ అలా విచారిస్తారూ? మీ అబ్బాయి ఖయిదులోకి వెళ్లినందుకు సంతోషించాలిగాని! ఎప్పుడెప్పుడని చెప్పి మేం కూచున్నాం?"

"నీకేం నాయనా! నువ్వు అలాగే అంటావు కన్న కడుపు కాబట్టి ఉండబట్టక " అంటూ ఏడ్చింది వాళ్లమ్మ

"అలా అంటారేవిటండీ అమ్మా! మా అమ్మా, మా అక్కయ్యా, మా నాన్నా అప్పుడే ఖయిదులోకి వెళ్లిపోయారు ఎవరి మట్టుకు వారు ఈ గౌరవం తమ కెప్పుడు కలుగునని చూస్తూన్న కాలంలో అలాగ విచారించవచ్చునా? మీ అబ్బాయితో పాటు మీరందరూ కూడా వెళ్లారంటే ఎంత కీర్తి, ఎంత పుణ్యం!" అని "నే వెడతానండీ బాబుగారూ!" అని వాళ్ల నాన్నతో చెప్పి "గాంధీమహాత్మకీ జే" అని గట్టిగా కేకేసి ఆ అబ్బాయి జండా ఆడిస్తూ వెళ్లిపోయాడు

సీతి "గాంధి మహాత్మకీ జే" అని నిమ్మళంగా అంది

సూరీ, సీతీ, వెంకీ కలిసి గట్టిగా "గాంధి మహాత్మకీ జే" అని కేకలు వేశారు వాళ్ల నాన్న వాళ్లను చూచి చిరునవ్వు నవ్వాడు వాళ్లమ్మ కళ్లు తుడుచుకొని ఇంట్లోకి వెళ్లిపోయింది

ఆరోజు మొదలుకొని సూరీ, సీతీ, వెంకీ, వాళ్ల నాన్నా, వాళ్లమ్మా అందరూ కలిసి మీటింగులికి వెళ్లేవారు విదేశవస్త్రాలు కట్టవద్దని దుకాణాల దగ్గిర బోధించేవారు కల్లుపాకల దగ్గిర కూర్చుని కల్లు తాగవద్దని వచ్చీపోయీవాళ్లకి చెప్పేవారు ఈ విధంగా కొన్నాళ్లు జరిగింది

సూరీ, సీతీ, వెంకీ రోజూ ఖద్దరు బట్టలు కట్టుకొని జండాలు చేత్తో పట్టుకొని అత్యుత్సాహంగా బజారుల్లో పని చేస్తున్నారు

ఒకనాడు వాళ్ల నాన్న ఒక బట్టలకొట్టు మీదా, వాళ్లమ్మ ఒక బట్టల కొట్టు మీదా, సూరీ, సీతీ, వెంకీ కలిసి ఒక బట్టల కొట్టు మీదా కూర్చుని విదేశీ బట్టలు కొనేవాళ్లు వస్తే వాళ్లకు కొనవద్దని బోధ చేస్తున్నారు

సూరీ, సీతీ, వెంకీ కూర్చున్న కొట్టు దగ్గిరికి ఒక అబ్బాయి వచ్చాడు. గ్లాసుగోమల్లు కట్టుకొన్నాడు పట్టు టఫారం వేసుకొన్నాడు దానిమీద ఊదా కోటు తొడుక్కొని బంగారు బొత్తాము ఒకటి పెట్టుకొన్నాడు మెడ చుట్టూ ఒక చుక్కల గుడ్డ చుట్టుకొని ముందు భాగాన్ని

ముడివేసుకొన్నాడు ముక్కు మీద ఉండుండీ ఊడిపోయే సులోచనాలు పెట్టుకొన్నాడు మీసం సగం యిటూ సగం అటూ తీయించివేసుకొన్నాడు ముందు జుట్టు గొర్రె కొమ్ములాగ మెలివేసుకొని ఉంది ఈ మనిషిని చూచి సీతి "చూడే, చూడే వెంకీ! బూచాడొస్తున్నాడు" అని వెంకితో చెప్పింది

వెంకి ఆ మనిషి కేసి వేలు చూపిస్తూ "బూచాడు, బూచాడు" అంది

"సూరీ! చూడే, అల్లా ఉన్నాడేమిటే, ఆ అబ్బి?" అంది

"దొరకాబోలే ఆ అబ్బి" అంది సీతి

"దొరకాడే దొరైతే పంచ కట్టుకొంటాడా?" అంది సూరి

"అవునే, నల్లగా మసిబొగ్గులా క్కూడా ఉన్నాడే" అంది సీతి

ఇంతట్లోకే ఆ మనిషి కొట్టు దగ్గిరికి వచ్చి కొట్టులో ప్రవేశించబోతూంటే సూరీ, సీతీ, వెంకీ ఒకళ్లచేతులొకళ్లు పట్టుకొని అడ్డంగా నిలబడ్డారు

"విదేశీబట్టలు కొన కబ్బీ! ఖద్దరు బట్టలు కట్టుకో" అంది సూరి

"చెబితే వినిపించదూ, నీకే" అంది సీతి

"నీకే, నీకే" అంది వెంకి

పిల్లల్ని తోసుకొని లోపలికి వెళ్లిపోబోయేడు ఆ మనిషి. కొట్టు ముందర జనం మూగి ఈ వింత చూస్తున్నారు ఉండుండీ "గాంధి మహాత్మకీ జే" అని కేకవేస్తున్నారు

"అడ్డంలెండి, నా యిష్టం" అన్నాడు ఆ మనిషి.

"చెబితే వినిపించదు కామోసు, ఈ అబ్బికి" అంది సీతి

"అలా తోసుకు వెడతావేం? కొనవద్దంటే నీకు కాదూ?" అంది సూరి

"నీకే నీకే" అంది వెంకి

ఆ అబ్బి మోటతనంగా పిల్లలిని తోసివేశాడు సీతి కింద పడింది కొట్టు ముందర జనం అంతకంతకి ఎక్కువైపోతున్నారు "జే జే" అని అదే అరవడం

సీతి కింద బడి ఆ అబ్బి మోకాళ్లు గట్టిగా పట్టుకొంది సూరి రెండు చేతులూ అడ్డంగా చాపి ఎదురుగా నిలబడింది; వెంకి కోటు పట్టుకొని వెనక్కి లాగుతోంది

"ఆ పిల్లలిని అలా తోసుకుపోతావేం? మనిషివి కావూ?" అన్నారు గుంపులో ప్రజలు ముగ్గురు పిల్లలూ మూడు వేపులా దుయ్యబుచ్చుకోవడం మూలాన్ని ఆ మనిషి తెల్ల మొహం వేసి గుంపులోకి తప్పించుకొన్నాడు "మంచివాడవే" అంటూ సీతి లేచినిలబడింది సూరీ, సీతీ, వెంకీ నవ్వుతూ చప్పట్లు కొడుతూ "అయింది అబ్బాయికి శాస్తి అయింది" అన్నారు

గుంపులో ఉన్నవాళ్లందరూ "గాంధీజీకీ జే" అని కేకలేశారు

పెద్దగోల అయింది

ఈ గోలలో నుంచి "కొడుతున్నారు, కొడుతున్నారు" అని కేకలు బయలుదేరాయి అందరూ అన్ని వైపులకీ పారిపోతున్నారు కర్రలు పుచ్చుకొని పోలీసువాళ్లు అందరినీ చెదరకొట్టేరు

సూరి, సితి, వెంకి ఇదంతా చూస్తూ కొట్టు మొగదల నిలబడ్డారు

అందరినీ తరుమగొట్టింతరువాత పోలీసువాళ్లు బట్టల కొట్టూ దగ్గిర ఉన్నవాళ్లందరినీ పట్టుకొన్నారు ఒక పోలీసువాడు వచ్చి సూరీ, సీతీ, వెంకీ దగ్గిరున్న జండాలు లాక్కో బోయేడు వాళ్లు గట్టిగా పట్టుకు యివ్వలేదు

"అల్లా లాగుతాడేమిటి ఈ అబ్బి, వదులబ్బీ ఇస్తాను" అంది సీతి

సీతి చెయ్యి వదలి ఆ పోలీసువాడు సూరి దగ్గిర జెండా వెంకి దగ్గిర జండా బలవంతంగా లాక్కున్నాడు వెంకి ఏడవడం మొదలెట్టింది "ఇంకో జండా ఇస్తాలే, ఊరుకో, వెంకీ!" అంది సూరి

ఆ పోలీసువాడు సీతి కోసం యిటూ అటూ చూచాడు సీతి దూరంగా పారిపోయి నవ్వుతోంది వాడు పరుగెత్తుకు వెళ్లాడు పట్టుకొందామని

"రా, రా, ఇంద జండా" అంటూ సీతి వాడిని ఊరించి వాడు దగ్గిరికి రాగానే ఒక కొట్టులో దూరింది వాడు కొట్టులోకి వెళ్లాడు సీతి "దా, దా" అంటూ పక్క కొట్టులోకి వెళ్లి తలుపువేసుకొంది పోలీసువాడు చుట్టు తిరిగి వచ్చి పక్కకొట్టులోకి వెళ్లడానికి ముందే సీతి ఆ కొట్టులో నుంచి పారిపోయి బయటికి వచ్చి "దా, దా అబ్బీ! ఇంద, జండా, జండా అక్కర్లేదూ?" అంటూ పరిగెత్తింది

పోలీసువాడికి కోపం బదులు నవ్వు వచ్చింది వాడూ పిల్లలు గలవాడే! సీతి పరుగెత్తి వాళ్లమ్మ దగ్గిరికి వెళ్లింది పోలీసువాడు కూడా అక్కడికి వెళ్లి జండా యివ్వమన్నాడు

"ఎందుకబ్బీ! పిల్ల నల్లా భయపెడతావు? జండా కావలిస్తే అడిగిపుచ్చుకోరాదూ? ఏమిటా మోటతనం, చిన్నపిల్లల మీద" అని వాళ్లమ్మ సీతి చేతిలోనుంచి జండా తీసుకొని పోలీసుమీద పారేసింది సూరీ, వెంకీ కూడా వాళ్లమ్మ చుట్టూ చేరుకొన్నారు పట్టుకొన్న వాళ్లందరినీ పోలీసులు జైలులోకి తీసుకు వెళ్లారు

* * *

కటకటాలవతల సూరీ, సీతీ, వెంకీ కంకరరాళ్లతో గచ్చకాయ లాడుకొంటూంటే ా రంగా ప్రజలు నిలబడి "వాళ్ళే, వాళ్లే" అని ముగ్గురు పిల్లలినీ చూపించి ఏమో చెప్పుకొంటున్నారు

ఆ వేళ మధ్యాహ్నం మేస్రీటు కోర్టులో విచారణ సూరీ, సీతీ, వెంకీ, వాళ్ల నాన్నా, అమ్మా, ఇంకా ఆడవాళ్లూ, మగవాళ్లూ అందరూ మోటారు బస్సు ఎక్కి మేస్ట్రీటు కోర్టుకు వెళ్లారు

* * *

విచారణ జరుగుతోంది మగవాళ్లకు రెండేళ్లు కఠినశిక్షా, ఆడవాళ్లకు ఆరునెలలు విడిఖైదూ వేస్తున్నాడు మేస్ట్రీటు

వాళ్ల నాన్నా, అమ్మా - మేస్ట్రీటు ఏమడిగినా కిక్కురుమనలేదు అది సూరీ , సీతీ, వెంకీ చూచారు మేస్ట్రీటు వాళ్లకేసి తిరిగి "ఎవరమ్మాయీ మీ పేరు?" అన్నాడు

"నే మాట్లాడను" అంది సూరి.

"మాపేరు ఏ భాషలోనైనా చెప్పొచ్చా?" అంది సీతి

"నీ కెందుకూ?" అని మూతి ముడిచి అడిగింది వెంకి

సీతికేసి చూచి "నీ కొచ్చిన భాషలో చెప్పొచ్చు  చెప్పమ్మాయీ" అన్నాడు మేజిస్ట్రేటు

"అయితే నా పేరు క-సీ-క-తి, మా అక్కయ్య పేరు క-సూ-క-రి, మా చెల్లాయి పేరు క-వెం-క-కి "

కోర్టులో ఉన్నవాళ్లందరూ నవ్వారు

"అదేం భాష అమ్మాయీ!" అన్నాడు మేజిస్ట్రేటు

"అయ్యో తెలివా, ఆ భాషే రాదూ?" అంది సూరి

"ఈ అబ్బికి కా భాషే రాదుట" అంది సీతి

మేజిస్ట్రేటుకు కోపం వచ్చిందో, కోపం నటించాడో "జాగర్తగా మాట్లాడు, అమ్మా! ఇది కోర్టు ఎరుగుదువా?" అన్నాడు

"క-ఎ-క-రు-క-గు-క-దు" అంది సీతి

"మీరు బజారులో బట్టల కొట్టు దగ్గిర ఏంచేశారు?" అన్నాడు మేజిస్ట్రేటు

"క-ఖ-క-ద్ద-క-రు-క-క-క-ట్టు-క-కో-క-మ-క-ని  " అని సీతి గబగబ చెప్పబోతూంటే మేజిస్ట్రేటు కోప్పడి రాసుకోడం మానేశాడు

"నువ్వు చెప్పు అమ్మాయి" అని సూరికేసి తిరిగి అడిగాడు

"క-ఏ-క-మో" అంది సూరి

"క-ఏ-క-మో" అంది వెంకి కూడా

మేజిస్ట్రేటుకు కోపం వచ్చి యిక మాట్లాడక పోలీసుసాక్ష్యం తీసుకొని, తల్లితోపాటు వెంకి ఉండాలనీ, సూరీ, సీతీ ఆరునెలలు విడిఖైదు తల్లితో కూడా అనుభవించాలనీ శిక్ష విధించి లేచిపోయాడు

* * *

పాపం ఆ మేజిస్ట్రేటుకు సీతిలాంటి కూతురుందట  అతను యింటికి వెళ్లకముందే అతడు ముగ్గురు ఆడపిల్లలని శిక్షించాడనే వార్త అతని యింటికి వెళ్లింది  ఎంతమట్టుకు నిజమో తెలియదుగాని, ఆయనకీ, ఆయన భార్యకీ ఆరోజు రాత్రి పెద్ద యుద్ధం జరిగిందని లోకులు చెప్పుకొన్నారు  లోకులు పలుగాకులు!

ఆ రాత్రి ఆయనకు యింట్లో తిండి లేదట  కొన్నాళ్లదాకా వాళ్లమ్మాయిని పిలిచి ముద్దు పెట్టుకోడానికి మనస్సు ఒప్పింది కాదట! కొన్నాళ్లైన తరవాత తన కూతురుని పిలిచి "అమ్మాయీ! కా భాష ఏమిటమ్మా" అని అడిగాడట

'కాభాషే రాదు, నాన్నా నీకు?" అని ఆ అమ్మాయి ఆక్షేపించిందట

* * *

వేల్పూరు జైలుకి కళకాంతులు సూరీ, సీతీ, వెంకీ వల్ల వచ్చినవని నేటివరకూ చెప్పుకుంటారు.

తన పిల్లని యింటివద్ద దిగబెట్టి జైలుకు వచ్చిన ఒక ఇల్లాలు యీ పిల్లలిని రోజూ చూస్తూ తన పిల్లని కూడా తీసుకురాలేకపోతిని గదా అని కంట తడిపెట్టేదిట

# గుజ్జెన్నగూడు

వాళ్ళ నాన్నగారు కచేరి సావిట్లో కూచుని ఏమో రాసుకుంటున్నారు వాళ్ళమ్మ పెరట్లో నూతి దగ్గిర బట్టలు ఉతుకుతోంది

సూరి ఇంట్లో చెంబులన్నీ ముందర పడేసుకుని చింతపండు గుజ్జు కలిపి వాటికి పట్టించి తోముతోంది సీతి వెంకి అప్పుడే చద్దివణ్ణం తిని తూర్పువేపు వసారాలోకి వచ్చారు

'వెంకి జడ విప్పేసి మళ్ళీవేసి పెట్టనా' అంది సీతి కూచుని 'అమ్మకొత్తుంది' అంది వెంకి, 'కొట్టదులే ఈలా రా నీకు ఎంచక్కా బాగా జడేసి పెడతాను ఏం' అని వెంకి, చెయ్యిపట్టుకుని దగ్గిరిగా లాక్కుంది 'నాకు జడెయ్యొద్దు' అని వెంకి మూతి ముడిచి ఏడవబోయింది

'ఇంతట్లోకే యేడవాలిటే అమ్మా మాట్లాడితే నెత్తిమీద కొస్తుంది నీళ్ళకుండ' అంది సీతి

వెంకి మాట్లాడకుండా యింట్లోకి వెళ్ళి వాళ్ళ నాన్న పరుపుకింద దాచుకున్న లక్క పిడతలు రెండూ, విరిగిపోయిన దొండకాయ ఒకటీ, చింతగింజలూ, కుండపెంకులు రెండూ తెచ్చి వసారాలో ఒకమూల కూర్చుని అవన్నీ ఒకదాని మీద ఒకటి పెట్టి ఆడుకుంటోంది

'నన్ను కూడా ఆడుకోనియ్యవుటే వెంకీ' అది సీతి

'ఊహు' అంది వెంకి

'నా లక్క పిడతలు కూడా నేను తేనా' అంది సీతి

'ఊఁ' అంది వెంకి

సీతికూడా ఇంట్లోకెళ్లి గూట్లో దాచుకున్న నాలుగు లక్కపిడతలూ, ఒక గాజు బొమ్మా, ఒక పేడబొమ్మా, రెండు నాగవిల్లి కుండపిడతలూ, ఒక రంగు గుడ్డ పీలికా తెచ్చింది

'వెంకీ, ఇవన్నీ పెట్టి మనిద్దరం ఆడుకుందావేఁ' అంది సీతి

'ఆడుకుందావేఁ' అంది వెంకి

సీతి ఆ లక్కపిడతలూ ఒక దానిమీద ఒకటి పేర్చి గోడదగ్గరే పెట్టింది. కుండపిడతమీద ఒక దొండకాయ పెట్టి పెంకు మూత పెట్టింది 'నీకు అన్నం వండిపెట్టనా' అంది సీతి.

'అన్న మేదీ' అంది వెంకి

నాలుగు చింతగింజలు కుండపిడతలో వేసి 'ఇదుగోఅన్నం, వెంకీపొయ్యూదమ్మా' అంది సీతి

వెంకి బుగ్గలు బూరటించి పొయ్యూదుతోంది

'కుతకుత గుజ్జెన్నా

"కుత కుత గజ్జెన్నా"

అని సీతి పాడటం మొదలు పెట్టింది కొంతసేపు పాట అయిన తరువాత సీతి వెంకిని దగ్గిరకి పిలిచి 'వెంకీ, వెంకీ నువ్వేం, అమ్మదగ్గరకెళ్ళి కందిపప్పు అడుగు, గుజ్జెన్న గూళ్ళు వండుకుందాం' అని అంది

'వెంకి గబగబ పరిగెత్తుకెళ్ళింది వాళ్ళమ్మదగ్గిరికి, వెళ్ళి అమ్మా, ఊ, ఊ' అంటూ కూచుంది

వాళ్ళమ్మ ఉతికిన బట్టలు పిడుస్తూ, 'ఎందుకే వెంకీ వఅలా మూలుగుతావు' అంది

'నాక్కందిపప్పెత్తవూ' అని వెంకి మరీ మూలిగింది

'ఇప్పుడేకాదుటూ అన్నాలు తిన్నారు అప్పుడే కందిపప్పా' అంది వాళ్ళమ్మా

'ఊ, ఊ నాక్కందిపప్పెత్తవుతే అమ్మా' అని వెంకి మూలుగుతూనే ఉంది.

'కడుపునెప్పి వస్తుంది మధ్యాప్నం పెడతాలే అమ్మా' అంది వాళ్ళమ్మ

'నాకిప్పుడెత్తవూ నాకిప్పుడెత్తవూ' అని వెంకి మారాం పెట్టింది

" ఇప్పుడు మడి కందిపప్పు ఏలా మట్టుకొంటూనే అంది వాళ్లమ్మ.

'ఊ, ఊ కందిపప్పెత్తవ్' అని వెంకి మూలుగుతూనే ఉంది సూరి చెంబులు తోమి తొలుస్తూ 'అమ్మా ఆగూట్లో బుట్టలో ఉంది కాదుటే కందిపప్పు అది మడికాదు' అంది

'అయితే చెయ్యికడుక్కొల్లి దానికి రెండుబద్దలు పెట్టు' అంది వాళ్ళమ్మ

గబ గబా చేతులు కడుక్కొని సూరి లేచింది

'పరికిణీ ఏలా తడిసిపోయిందో చూడొసే చెంబులు తోమేటప్పుడు. పరికిణి వెనక్కి కట్టుకోమని చెప్పలేదూ' అంది వాళ్లమ్మ.

సూరి ఇంట్లోకి వెళ్ళింది సూరి పరికిణీ పట్టుకొని వెంకి కూడా ఇంట్లోకి వెళ్ళింది.

గుప్పెడు కందిపప్పు తాను తీసికొని వెంకికి, చేతి నిండా కందిపప్పు పోసింది

వెంకి కందిపప్పు పట్టుకొని వసారాలోకి సీతి దగ్గిరికి వచ్చింది

వెంకి చేతిలో కందిపప్పు సీతిపుచ్చుకొని కుండ పిడతలోపోసి 'ఇక్కడే చూస్తూ ఉండు వెంకీ' అని చెప్పి వాళ్ళమ్మ దగ్గిరికి సీతి పరుగెత్తుకు వెళ్ళింది

'అమ్మా, అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ? అంది సీతి.

'చెయ్యూరుకోలేదమ్మా అయినా ఇప్పుడు బెల్లమ్ముక్కేమిటి' అంది వాళ్ళమ్మ

'వెంకికీ సూరికీ కందిపప్పెట్టేవు కాదూ ఇప్పుడు' అంది సీతి

'నీకూ కందిపప్పెడుతుందిలే సూరి దాన్నడుగు' అంది వాళ్ళమ్మా

'ఊ , నాక్కందిపప్పక్కల్లేదు. అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ?' అంది సీతి

'చెయ్యూరుకోలేదంటూకాదూ' అంది వాళ్ళమ్మ

'ఊ, ఊ అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ' అని సీతి మూతిముడిచింది

'నే పెట్టలేనమ్మా ఇప్పుడు' అంది వాళ్ళమ్మ సీతి వాళ్ళనాన్న దగ్గిరికి ఏడుస్తూవెళ్ళి, 'నాన్నా నాన్నా అమ్మేం, నాకు బెల్లమ్ముక్క పెట్టనంటోంది వెంకికి కందిపప్పెట్టింది కాని' అని చెప్పింది

'ఎందుకే అమ్మా ఇప్పుడు బెల్లంముక్కా' అన్నాడు వాళ్ళనాన్న

'నాకు బెల్లమ్ముక్కెట్టమనవు నాన్నా, నే నాడు కుంటాను' అంది సీతి

'ఏమే, ఒసేవ్, దీనికి కొంచెం బెల్లమ్ముక్కెట్టూ' అని వాళ్ళనాన్న కేకేశాడు
సీతి లోపలికి పరుగెత్తి కెళ్ళింది వాళ్ళ అమ్మదగ్గిరికి
'ఇందమ్మో , బెల్లంముక్కా, ఆరోజు కారోజు అల్లరెక్కువౌతోంది' అంది వాళ్ళమ్మ.
బెల్లం ముక్క తీసుకొని సీతి వసారాలోకి వచ్చింది
వెంకి కందిపప్పు ఒక్కొక్కబద్దే తింటూ కూచుంది
'కందిపప్పంతా తినేస్తున్నావా వెంకీ' అంది సీతి.
వెంకి మాట్లాడలేదు
ఇంతట్లోకే సూరికూడా వచ్చింది అక్కడికి.
ఆడొద్దుటే' అంది సూరి
"సీతీ, ఒసేయ్ నేను కూడా'
'నీకు కందిపప్పేదీ' అంది సీతి.
'ఇదుగో అంది సూరి '
కందిపప్పంతా కలబోసుకొని ఒక కుండపిడతలో పోశారు. చిల్లపెంకు మూతెట్టారు.

మూడుచింతగింజలు పొయ్యిలాచేసి దాని మీద కుండపిడత పెట్టారు వెంకి పొయ్యిఊదుతోంది బెల్లం ముక్క ఒక లక్కపిడతలో వేసి దాన్ని ఇంకోపొయ్యిమీద పెట్టారు సూరి ఆ పోయ్యి ఊదుతోంది. మిగిలిన లక్కపిడతలూ, దొండకాయలూ, చింతగింజలూ, బొమ్మా గోడ పంచనే పెట్టారు

'సీతీ, నువ్వెళ్ళి దొడ్లో బాదంఆకులు తేవా' అంది సూరి

సీతి గబగబ పరుగెత్తుకు వెళ్ళి బాదం ఆకులు తెచ్చింది.

'ఇది అన్నయ్యకీ, ఇది వెంకికీ, ఇది సీతికీ, ఇది సూరికీ, ఇది బొమ్మకీ, అని అన్ని ఆకులూ వేశారు

'ఇంకా అన్నం ఉడకలేదే' అంది సూరి ఒక కందిబద్ద పట్టిచూచి
సూరీ సీతీ వెంకీ చప్పట్లుకొడుతూ కొంతసేపు పాడారు
"కుతకుత గుజ్జెన్నా
కుతకుత గుజ్జెన్నా
వండీ కందిపప్పు
తినీ బెల్లం"
అని చాలా సేపు పాడారు.

తరువాత అన్ని ఆకులలోనూ సూరి వడ్డించింది. కొంచెం కందిపప్పూ ఒక పిసరు బెల్లమున్నూ, సూరి విస్తరి దగ్గిర సూరి కూర్చుంది, సీతి విస్తరిదగ్గిర సీతి, వెంకి విస్తరిదగ్గిర వెంకీ కూర్చున్నారు

బొమ్మవిస్తరిదగ్గిర బొమ్మను నిలబెట్టేరు అన్నయ్య విస్తరి కాళీగా ఉంచారు కూర్చోబోయేటప్పుడు అందరూ ఒకరి కొకరు

"అక్కలికర్రా మొక్కలిపీటా

కూచోకూచో వదినా వదినా

అక్కలికర్రా మొక్కలిపీటా

కూచోకూచో వదినా వదినా"

అని అనుకొన్నారు

తరువాత ఎవరికందిపప్పు వారూ ఎవరి బెల్లం వారూ తినేశారు అన్నయ్య విస్తరిలోదీ, బొమ్మ విస్తరిలోదీ అలా ఉండిపోయింది అన్నయ్య విస్తరిలోది సీతి తీసుకుంటానని తగువు పెట్టింది

'బొమ్మ నాదిగదా ఏమిటమ్మా' అంది సీతి

'బొమ్మ నీదైతే మాత్రం' అంది సూరి

'కందిపప్పూనాదే' అంది సీతి

'అవునుపాపం కందిపప్పునీదేం? అంది సూరి

ఇంతట్లోకే వాళ్ళన్నయ్య ఇంట్లోంచి వచ్చాడు

'చూశావురా, అన్నయ్యా, ఈ కందిపప్పు దీందిట' అంది సూరి

'ఈ బొమ్మ నాదికాదురా అన్నయ్యా, అంచేత కందిపప్పూ నాదే' అంది సీతి

'మరి నాకేదీ కందిపప్పు' అన్నాడు వాళ్ళన్నయ్య

'ఇదుగోనురా నీవిస్తరీ, ఈ బొమ్మముందర కందిపప్పు అందరమూ పంచుకొందాము' అంది సూరి

సీతి పనికిరాదంది

అప్పుడు వాళ్ళన్నయ్య తన విస్తట్లో కందిపప్పు, బొమ్మవిస్తట్లో కందిపప్పు ఒక్కమాటు తీసుకొని నోట్లో పోశేసుకొని పారిపోయాడు నవ్వుతూను

సీతికి ఉడుకుబోత్తనం వచ్చింది సూరిక్కూడా కోపం వచ్చింది ఇద్దరూ కలిసి వాళ్ళన్నయ్యని

'నారాయణ నారాయణ

నక్కతోక

కూర్చొనిలేస్తే

కుక్కతోక'

అని అంటూ నవ్వుతూ పాడారు

వాళ్ళన్నయ్యపేరు నారాయణ

వెంకికూడా వాళ్ళతోటి కలిసి

'నారాయం నారాయం
నక్కతోకా
కూతుని లేతే
కుక్కతోకా'
అని పాడింది
'ఏమిటర్రా ఆ అల్లరి' అని వాళ్ళ నాన్నగారు సావిట్లోంచి కేక వేశారు.
అందరూ నాలిక్కరుచుకొని ఉలక్కుండా పలక్కుండా ఊరుకున్నారు

# వెధవుత్తరం

వర్షాకాలం, ముగియవచ్చింది నీళ్ళబరువుతో మేఘములు ఆకాశంమీద కదిలిపోతున్నవి భూమిమీద పిల్లలు ఆడుకొంటున్నారు చంద్రుడామేఘమాళికలనూ, ఈ పిల్లలనూ, ఒక్కమాదిరిగా వెన్నెలలో ముంచుతున్నాడు

ఒక చోట ఇసుకతిన్నెలు వెన్నెలలు కుప్పలు పోసినట్లున్నవి. అక్కడ సూరీ సీతీ వెంకీ కూర్చున్నారు ఎదురుగా వారిల్లు కనిపిస్తూ ఉంది వాళ్ళ జడలో చామంతి పువ్వులూ దమనమూ పెట్టుకొన్నారు ఇంతట్లో వాళ్ళన్నయ్య కూడా వచ్చి చేరాడు.

'అన్నయ్యా, నేను వెళ్ళిన చోటికల్లా చంద్రుడొస్తాడేమిట్రా' అంది సూరి.

'నేను వెళ్ళిన చోటికీ వస్తాడు' అంది సీతి

'నిజంగా!' అన్నాడు అన్నయ్య

'ఆ, నిజంగానే!'

'మరి, నువ్విక్కడుండు - నేనలావెడ్తాను నాతో వస్తాడో లేడో?'

'వెళ్ళమ్మామరి '

'అన్నయ్యా, నాతో వస్తున్నాడు చంద్రుడు నీదగ్గిర కూడా ఉన్నాడ్రా?'

'ఇడుగో, కదలకుండా ఇక్కడే ఉన్నాడు కావలిస్తే చూడు'

'ఆ, ఆ, ఉత్తది, నాతో వస్తూంటే నీదగ్గిరెలా ఉన్నాడమ్మా!'

'నా దగ్గిరే కదలకుండా మెదలకుండా ఉంటే నీతో ఎలావస్తున్నాడమ్మా!'

'పోనీ నీవలా వెళ్ళు చూదాము నీతోవస్తాడేమో'

'ఇడుగో నాతోనూవస్తున్నాడు!'

'పోనీ నాన్ననడుగుదాముండు నీతోనూ నాతోనూ కూడా ఎలావస్తాడో?'

'అన్నయ్యా, మరీ , నాన్న చెప్పాడు కాదురా చంద్రుడి కధ' అంది సీతి

'ఏంకధ?' అంది వెంకి.

'అప్పుడెప్పుడో ఎవరోగాని కడుపునిండా తిని వెడుతూంటే చంద్రుడు నవ్వాట్ట ఆపాళంగా పొట్టపగిలి పోయిందిట!' అంది సూరి

'అదా, అది వినాయకుడికథ, వినాయకుడేమోను కడుపునిండా ఉండ్రాళ్ళూ జిల్లేడుకాయలూ తినివెడుతూంటే చంద్రుడు నవ్వాట్ట' అన్నాడు అన్నయ్య

'మరి, అన్నయ్యా, పొట్ట ఎలాగ మళ్ళీ కుట్టార్రా?

'వాళ్ళనాన్నొచ్చి సన్నటిదారంలాటి పాముతోటి కుట్టేశాట్ట!'

'ఎవర్రా వాళ్ళనాన్న?'

'నాన్న చెప్పాడుగాదూ? వాళ్ళనాన్న శివుడు '

'మీద జడలుంటాయిట, ఒంటినిండా పాములు పాకుతుంటాయిట ఒంటినిండా తెల్లనిబూడిద రాసుకుంటాట్ట, తలమీద గంగ చంద్రవంకా ఉంటాయిట '

'అన్నయ్యా, మరి ఆపాములు శివుణ్ణి కరవ్వా' అంది వెంకి

'పెంచేపాములు కరుస్తాయా ఏమిటమ్మా' అంది సీతి

'నాగసరం ఉత్తే కరవ్వ' అంది సూరి

'మరి, అన్నయ్యా, వినాయకుడి అమ్మ ఎవర్రా?

'అమ్మ పూజ చేసుకుంటుంది చూళ్ళేదూ? గౌరీదేవి ఆవిడే వినాయకుడి అమ్మ, ఆవిడ పచ్చగా బంగారంలా ఉంటుంది పసుపు రాసుకుని కుంఖంబొట్టు పెట్టుకుంటుంది

'మరి అన్నయ్యా రేపేకాదుట్రా వినాయక చవితి,

'అవును, నాన్నతో చెబుదాంరండి పాలవెల్లీ, పువ్వులూ, పత్రీ, కాయలూ, పళ్ళూ అన్నీ తెమ్మని చెబుదాం

'రారా అన్నయ్యా, చెబుదాం రా '

## 2

వాళ్ళనాన్న అరుగుమీద పచారుచేస్తున్నాడు

పిల్లలు రావడంతోనే 'అయిందర్రా ఆడుకోవడం? ఈవాళ ఆదివారమనా చదువుకోకుండా ఆడుకొంటున్నారు వెళ్ళి భోంచేసి, కొంచెం సేపు చదువుకొని మరీపడుకోండి

'మరినాన్నా, రేపుమాకు పాలవెల్లీ, తామరపువ్వులూ, కలవపువ్వులూ అన్నీ తెచ్చి పెట్టవు?'

'అలాగేలేండి '

'మరి, వెలక్కాయలూ, మారేడుకాయలూ కూడా తేవునాన్నా?'

అలాగే, వెళ్ళి భోంచెయ్యండి

పిల్లలు ఇంట్లోకి వెళ్ళారు వాళ్ళమ్మ "ఒంటినిండా ఇసిక పోసుకోలేదుగదా? ఇలారండి చూస్తాను ఇదేమిటర్రా,తలనిండా ఇసిక! ఈ పువ్వులుచూడు ఎలా ఊడిపోతున్నాయో? ఇందాకనే

గాదుటే తలదువ్వి జడేశాను! ఎంతో అందంగా ఉండేలాగ పువ్వులు గుచ్చితే తల రేపేసుకొని తలనిండా ఇసకపోసుకుంటారా?

ఇలారండి చేతులు కాళ్ళూ కడుక్కొని బువ్వతిందురు గాని '

వాళ్ళు భోజనానికి కూర్చున్నారు వాళ్ళమామ్మ వడ్డిస్తోంది 'ఏమేసుకు తింటారర్రామీరు?' అంది ఆవిడ

'నాకేం, నాకేఁ చింతకాయ పచ్చడి కావాలి' అంది సూరి

'నాకు ఆవకాయ కావాలి' అన్నాడు వాళ్ళన్నయ్య

'నాకూ చింతకాయపచ్చడే' అన్నారు సీతీ వెంకి

వాళ్ళు పచ్చళ్ళతో తిని చారేసుకొని మజ్జిగోసుకొని, బువ్వతినడం పూర్తి జేశారు

వాళ్ళు దీపం దగ్గిర కూచున్నారు చదువుకోడానికి పుస్తకాలు విప్పారు

సీతి నట్టుకొంటూ చదువుతోంది

'దశరధు డయోధ్య నేలుచుండెను ఆతనికి ముగ్గురు భార్యలుండిరి, అందు కౌసల్యకు రాముడును, కైకేయికి భరతుడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును జన్మించిరి '

'ఒరే అన్నయ్యా మరి నేనోటి అడుగుతాను చెపుతావురా'అంది సీతి

'ఏమిటి, అడుగు '

'మొదటి అక్షరం ' అ' చివరక్షరం 'ల్లి' అయిదక్షరాల మాట, ఏమిటో చెప్పుకో'

'చెప్పుకోనా - అమ్మాయిపెళ్ళి!'

'ఛా కాదు, 'లీ' కింద 'లా' వత్తు ఆఖరిఅక్షరం'

'అద్దంలోపిల్లి'

'ఛాకాదు - నే చెప్పెయ్యనా?'

'చెప్పుమరి'

'అనకాపల్లి'

'నేనొకటడగ్తనా' అంది సూరి

'అడుగు' అంది వెంకి

'దడిపల్చన, ధాతువుతెల్లన, మహీపతి నల్లన ' మహారాజెర్రన '

'ఎవరికి రాదమ్మా అది ' అంది సీతి

'చెప్పుమరీ'

'తమలపాకూ చెక్కలూ సున్నం '

'ఆ, అమ్మా చెప్పేసుకుందీ '

'ఇంతట్లోకే వాళ్ళనాన్న ఇంట్లోకి వచ్చాడు వాళ్ళు ఏమీ ఎరగనట్లు చదువుకోవడం మొదలెట్టారు

# 3

తెల్లారగట్ట వాళ్ళమ్మ లేచింది పిల్లల్ని లేపి తలంటి నీళ్ళోయ్యడం మొదలెట్టింది

'అమ్మా తెల్లవారకుండానే నీళ్ళోస్తున్నావేమే' అన్నారు వాళ్ళు.

'తెల్లారితే చెయ్యేరుకోదమ్మా! మీకు పోసేటప్పటికల్లా తెల్లారిపోతుంది నాన్నగారు బజారుకు వెళ్ళి అన్నీ తెస్తారు, విఘ్నేశ్వరుడి పూజచేసుకుందురుగాని, అల్లరి చెయ్యకుండా కూర్చోండి'

'అమ్మా మరి ఈవేళ్ల ఏం చేస్తావే?' అంది సీతి

'ఉండ్రాళ్ళూ, జిల్లేడుకాయలూను,

'నాకవివద్దు, నాకే మిరాయికావాలి' అంది సూరి

'నాకు మిరాయివద్దు' అన్నాడు అన్నయ్య

'ఈ వేళ మిరాయి చేసుకోరమ్మా'

'ఊఁఊఁ నాకు మిరాయి కావాలి' అంది వెంకి

'అలాగే చేస్తానులెండి'

తల నీళ్ళోసి వాళ్ళమ్మ కాటుకపెట్టి బొట్టు పెట్టింది అమ్మాయిలతికి అగురు బొట్టు పెట్టింది అబ్బాయికి కొత్త బట్టలు కట్టి అరుగుమీద ఆడుకొంటూ ఉండమంది

వాళ్ళిద్దరూ అరుగుమీద కూచున్నారు

'సీతారామాభ్యాం నమః - ఈ వేళ భాద్రపద శుద్ధ చవితీ సోమవారం, స్వాతీ నక్షత్రం రాత్రి వార్జలమ్మా' అని యాయవారపు బ్రాహ్మడొచ్చి కేకవేశాడు సూరి దోసెడు బియ్యం తెచ్చి బ్రాహ్మడికి వేసింది

'ఏమండీ ఈ వేళ మరి వినాయకచవితి కదాండీ' అంది సూరి

'అవునమ్మా' అన్నాడు యాయవార బ్రాహ్మడు

'మరి ఈ వేళ వినాయకుణ్ణి పూజ చేసుకుంటారు కాదండీ' అంది సీతి

'అవునమ్మా అవును, మొగాళ్ళు వినాయకుణ్ణి, ఆడపిల్లలు సరస్వతినీ'

'సరస్వతి నెలాగండి పూజచెయ్యడం' అంది సీతి

'పుస్తకాలికి పూజచేస్తే చాలమ్మా' అని యాయవార బ్రాహ్మడు వెళ్ళిపోయాడు

'మరి, అన్నయ్యా! నేనేం పుస్తకాలు పూజచేస్తానురా?'

'నా ఇంగ్లీషు పుస్తకం యివ్వవా'

'ఛా, వెధవ ఇంగిలీషు పుస్తకం ! ఇంగిలీషు పుస్తకాలు పూజచేసుకుంటారా ఎక్కడైనా' అంది సీతి

'పోనీ, నీ తెలుగువాచకం చేసుకో' అంది సూరి

'నాకేం ! తెలుగువాచకం, ప్రపంచ జ్ఞానం, సివిక్సు, ఎక్కాల పుస్తకం ఉన్నాయి ఇవన్నీ

పూజచేసుకోనా' అంది సీతి

'అమ్మనడుగుదాం ఉండు' అన్నాడు అన్నయ్య

వాళ్ళమ్మ నడిగారు, 'అలాంటి పుస్తకాలు పూజ చేయకూడదమ్మ' నాన్నగారి రామాయణమో, భాగవతమో పూజచేసుకోండమ్మా' అంది

వాళ్ళ నాన్నగారు తెచ్చిన పాలవెల్లి పిల్లలిద్దరూ అలంకరిస్తున్నారు నాన్నగారు స్నానానికి లేచారు మామ్మ కుడుములు జిల్లేడు కాయలూ చేస్తోంది వాళ్లమ్మ మిరాయి చేస్తోంది

పురోహితుడొచ్చాడు చేతిలో పంచాంగమూ, వ్రతకల్పమూ ఉన్నవి

'లెండి, అందరూ పుజుకులెండి కాలాతీతమైంది అప్పుడే'

వాళ్ళనాన్నగారు స్నానం చేసి మడికట్టుకుంటున్నాడు పిల్లలు ఆరేసిన బట్టలు కట్టుకుని పూజచేసుకోవడానికి ఆత్రపడుతున్నారు ఇంతట్లోకే వీధిలోంచి కేక వినబడ్డది 'ఉత్తరాలండీ' అని పోస్టు జవాను యిచ్చిన ఉత్తరం వాళ్ళ నాన్న చదువుకొన్నాడు 'మా తమ్ముడికి కొడుకు పుట్టాడట ! ఇంకా పురుడు వెళ్ళలేదు' అన్నాడు వాళ్ళమ్మతో

'అయ్యో పిల్లలు సరదాపడుతున్నారు పాపం పూజ లేదర్రా' అంది మామ్మ

ఎవరిని ఏమనడానికి తోచక అందరూ మాట్లాడక ఊరుకొన్నారు.

ఉత్తరం యిచ్చిన పోస్టుజవాన్ని మనస్సులో తిట్టింది మామ్మ ఉత్తరంవ్రాసిన తమ్ముణ్ణి మనస్సులో తిట్టాడునాన్న

పండుగూ పబ్బం లేకుండా కన్నందుకు తోడికోడల్ని మనస్సులో తిట్టింది వాళ్ళమ్మ

తన్ను తాను తిట్టుకొని ఎవరితోను చెప్పకుండా లేచి పోయాడు పురోహితుడు

పిల్లలు బహిరంగంగా ఉత్తరాన్ని తిట్టారు. 'వెధవుత్తరం!'

# అమ్మ నన్నెందుకు కొట్టాలి?

ఇంట్లో వానకురిసి వెలిసినట్టయింది సీతీ వెంకీ ఒక్కమాటు ఏడుపు మొదలుపెట్టి గోలగా ఏడ్చి క్రమక్రమంగా ఏడ్పు తగ్గించారు

సీతి ఏడ్పును సణుగుకోండం కింద మార్చింది గోడమూల చేరి గోళ్ళు గిల్లుకుంటూ తనలోతను అనుకుంటోంది

'అమ్మ నన్నెందుకు కొట్టాలి? నేనేం జేశానేమిటి? నన్నెందుకు కొట్టాలి?నాన్నొచ్చాక చెప్పనా ఏమిటి? 'నాన్నా, నాన్నా, అమ్మేం, నన్ను కొట్టింది ఊరికే ఉత్తి పుణ్యాన్నే కొట్టింది నేనేం చెయ్యందే కొట్టింది నాన్నా' అని చెప్పుతాను

'అప్పుడు నాన్నంటాడుగదా 'ఊరుకో అమ్మా సీతీ, ఊరుకో, నేను మీ అమ్మను కోప్పడుతానులే, ఊరుకో' అంటాడు

'అమ్మ నన్నెందుకు కొట్టాలి? సూరినీ వెంకీనీ ఎందుకు కొట్టలేదూ? వాళ్ళని కోప్పడనేనా కోప్పడదుకాని నన్నెందుకు కొట్టాలి అమ్మ? నేనేం జేశానేమిటి? పొద్దున్నే చద్దెన్నం తిని చెయ్యి కడుక్కొని నడవలోకి రావడంతోనే 'సీతీ సీతీ ఈ వాళ మనం పెద్దపులివేషం వేద్దామే ఎంచక్క' అని సూరి అంటే నేన్నానుగదా, 'ఒసే,ఒసే, అక్కయ్యా, మనం వెయ్యేద్దే పెద్దపులివేషం వెంకిచేత వెయ్యిద్దామే అన్నాను వెంకికూడా పెద్దపులివేషం వేస్తానని గంతులేసింది అసలు సూరి పెద్దపులి వేషం వేద్దామని నాతో ఎందుకు చెప్పాలి? వెంకి పెద్దపులి వేషం వేస్తానని ఎందుకు ఒప్పుకోవాలి? అమ్మ నన్నెందుకు కొట్టాలి? నేనేంజేశానేమిటి? అమ్మ సూరినీ వెంకినీ ఏమీ అందు కాని

అప్పుడు నేను అమ్మచూడకుండా మసిబొగ్గులూ పసుపుకొమ్మూ, నామ సుద్దా తెచ్చి వసారాలో పెట్టాను సూరి నీళ్ల చెంబూ సానాతెచ్చి పెట్టింది వెంకి అమ్మ నడిగి తొడుక్కుంటానని చెప్పి చిన్నలాగు తెచ్చుకొంది నే నొక్కత్తెనే తెచ్చానా ఏమిటి అన్నీని? సూరీ వెంకీ మాత్రం తేలేదా ఏమిటి? అమ్మ నన్నెందుకొట్టాలి? నేనేంజేశానేమిటి?

అన్నీ తెచ్చి నడవలో పెట్టాక సూరి నన్నెందుకు అడగాలి 'సీతీ, సీతీ ఎలాగే పెద్దపులి వేషం వెయ్యడం' అని?

అప్పుడు నేను వెంకి పరికిణీ విప్పేసి లాగుతొడిగాను సూరి పసుపుకొమ్ము అరగదీస్తుంటే నేను పసుపు గంధం తీసి వెంకి ఒంటిమీద చారల్లా పెట్టాను పచ్చటి చారలు ఎంచక్క, వెంకికి పెట్టుతూంటే సూరి చూచి ఎందుకు నవ్వాలి? వెంకి ఎందుకు గంతులెయ్యాలి? తరవాత సూరి మసిబొగ్గు అరగదీస్తుంటే వెంకే చారలుపెట్టుకొంది నేనేం పెట్టానా ఏమిటి? నామసుద్ద అరగదీసి సూరి తెల్లచారలు వెంకి ఒంటినిండా పెట్టలేదు కామోసు! నన్ను పెట్టనియ్యకుండా అన్ని చారలూ వాళ్లే పెట్టుకున్నారు కాని నేను ఎంచక్క పెడతానంటే నన్ను పెట్టనిచ్చారు కారు గాని! అమ్మ నన్నెందుకు కొట్టాలి?

ఒంటినిండా తెల్లచారలూ, నల్లచారలూ, పచ్చచారలూ పెట్టింతరవాత వెంకి అచ్చంగా పెద్దపులి లాగే వుంది

అప్పుడు నేనన్నాను గదా, 'వెంకీ , వెంకీ అలాగ్గాదే, నువ్వునోరు తెరిచి గాండ్రు గాండ్రు మనవే, అచ్చంగాపెద్దపులిలాగ ఉంటావు' అంటే వెంకి నే చెప్పినట్లు చేసిందా ఏమిటి? చెయ్యకుండా 'తోకేదీ?' అంది

'అవునే సీతీ తోక మరచిపోయామే' అంది కాదా ఏమిటి సూరి?

అప్పుడు నే నన్నాను కదా, 'ఉండొసే నేను తోక తీసుకొస్తాను' అని అన్నయ్య పొత్తుపంచ తీసుకొచ్చాను అన్నయ్య పొత్తుపంచ తోక కింద పెడితే అది పెద్దదయిందని దాన్ని నిలువునా చింపి మాంచితోక చేశాను

అమ్మ నన్నెందుకు కొట్టాలి? కొత్త పొత్తుపంచ చింపానని అమ్మ కొట్టిందిట అసలది కొత్త

పొత్తుపంచా ఏమిటి? పాత పొత్తుపంచ చింపితే కొత్త పొత్తుపంచ అని అమ్మెందుకనాలి? నేనేం జేశానేమిటి? అసలు వెంకి తనకి తోక కావాలని చెప్పొచ్చు కామోసు తోక మరిచి పోయామని సూరి? మాత్రము అనలేదా ఏమిటి? పెద్దపులికి తోక లేకపోతే బాగుంటుంది కాబోలు! మరి పెద్దపులకి తోక లేకపోతే పెట్టడం తప్పు కామోసు? అమ్మనన్నెందుకు కొట్టాలి? అప్పుడు మళ్ళీ నేను వెంకితో గాండ్రు గాండ్రు మనవే అని చెప్పితే సూరి అననిచ్చిందా ఏమిటి? అనవ్వకుండా అంది కదా 'సీతీ, సీతీ, మరీ పెద్దపులిని మన మిద్దరమూ పట్టుకోవద్దుటే' అంది అంటే నేనన్నాను గదా 'అక్కయ్యా, అక్కయ్యా, మనింట్లో గొలుసు లెక్కడున్నాయమ్మా' అని.

అప్పుడు నాన్న పరుపుకు కట్టుకొనే తాడు తెచ్చి వెంకి నడుముకి బిగించాము ఒక కొస నేను పట్టుకుంటే సూరి మాత్రం పట్టుకో లేదు కామోసు ఇంకో కొస? అమ్మనన్నెందుకు కొట్టాలి? నేనేం జేశానేమిటి?

అప్పుడు వెంకి 'జణక జంజం జణక జంజం' అని ఆడింది మేము తాళ్ళతో దాన్ని ఇలాగా అలాగా లాగాము ఎంతో గమ్మత్తుగా ఉంది

అప్పుడు మళ్ళీ వెంకి అంది కదా 'చెవులేవీ?' అని,

'అవునే, సీతీ, మరి పెద్దపులి తలడితేనే గాని పెద్దపులి ఎలా అవుతుందే?' అని సూరి అంది

అప్పుడు నేను అన్నయ్య టోపీ తెచ్చి దానికి తెల్ల చారలూ పచ్చచారలూ పెట్టి రెండు గుడ్డపీలికలు చెవుల కింద పెట్టి వెంకి తలమీద పెట్టాను, టోపీ తగలేశానని అమ్మ కొట్టిందట సూరి తగలెయ్య లేదుకామోసు అమ్మనన్నెందుకు కొట్టాలి? నేనేమన్నా పెట్టుకొన్నానా ఏమిటి ఆ టోపీ? వెంకి పెట్టుకుంటే వెంకి నేమీ అనలేదు గాని , నేనేమన్నా పెద్దపులి వేషం వేశానా ఏమిటి?

అమ్మనన్నెందుకు కొట్టాలి? నేనేం జేశానేమిటి?

టోపీ పెట్టుకొని వెంకి గాండ్రు గాండ్రు మంటూ మా మీద పడబోతుంటే మేం తప్పించుకొన్నాం ఇలాగ ఆడుకొంటూంటే అమ్మకి వినిపించింది వెంకి గాండ్రు గాండ్రు మంటూంటే అమ్మ విని వచ్చింది వచ్చి నన్నెందుకు కొట్టాలి అమ్మ? నేనన్నానా ఏమిటి గాండ్రు గాండ్రు మని? వెంకి అంటే దాన్నేమీ అనలేదుగాని

అమ్మ రావడంతోనే సూరి పారిపోయింది నేను పారిపోకుండా ఉన్నానుగదా అని అమ్మ నన్నెందుకుకొట్టాలి?

నాన్నొచ్చాక చెప్పనా ఏమిటి? నాన్నొచ్చాక నాన్న దగ్గిరి కెళ్ళి అంటాను గదా 'నాన్నా, నాన్నా, అమ్మ నన్ను కొట్టింది నాన్నా, నేనేం జెయ్యలేదు నాన్నా, ఊరికే ఉత్తిపుణ్యాన్నే కొట్టింది నాన్నా, అని నాన్నతో చెప్పనా ఏమిటీ?

అమ్మ నన్నెందుకు కొట్టాలి?

# సూపరెంటు కూతురు

జైలులో సూరికీ సీతికీ వెంకికీ ఏమీ పని చెప్పలేదు పొద్దున్నే లేవడంతోనే వాళ్ళమ్మ తలదువ్వేది తరవాత వాళ్ళు ఆడుకొంటూ ఉండేవారు

ఒకనాడు పొద్దున్న సూరీ సీతీ వెంకీ జైలులో తమ కొట్టుముందర రావిచెట్టుకింద నీళ్ళు చల్లి ఇసుకతో ముగ్గులెట్టి అక్కడ చెమ్మచెక్క ఆడుకొంటున్నారు

అప్పుడే జైలు 'సూపరెంటు' వాళ్ళ చిన్నమ్మాయిని తీసుకొని జైలులోకి వచ్చాడు సూపరెంటు కూతురికి ఎనిమిదేళ్ళు పట్టుగౌను వేసుకొంది రిబ్బనుతో జడ వేసుకొంది కాలికి మేజోళ్ళు జోళ్ళూ తొడుక్కొంది మొహానికి తెల్లగుండ పూసుకొంది

వాళ్ళు ఆదారిని వెడుతూంటే ఆ అమ్మాయి, సూరీ సీతీ వెంకీ ఆడుకోవడం చూచింది చూచి అక్కడే ఆగిపోయింది

వాళ్ళనాన్న రమ్మంటే 'నువ్వెళ్ళు నువ్వు వచ్చేదాకా నేనిక్కడుంటాను' అంది

'సూపరెంటు' పిల్లను చూస్తూ ఉండమని ఒక నౌకరుతో చెప్పి తన పనిమీద వెళ్ళిపోయాడు

ఆ పిల్ల వాళ్ళకేసే చూస్తూ క్కడే నిలబడిపోయింది సీతి ఆ పిల్లను చూచింది

'ఆడుకుందాం వస్తావా అమ్మాయీ' అంది సీతి

ఆ అమ్మాయి మాట్లాడలేదు

'భయం లేదులే అమ్మా, ఆడుకొందాం, రా' అంది సీతి

ఆ పిల్లకి వాళ్లింట్లో ఆడుకునేందుకు తన ఈడు పిల్లలెవళ్ళూ లేరు ఈ పిల్లలిని చూడ్డంతోనే ఆ అమ్మాయికి ప్రాణం లేచి వచ్చింది కాని రమ్మంటేమాత్రం సిగ్గుపడి మాట్లాడకుండా ఊరుకొంది

'నీకు దాగుడుమూత లొచ్చునా?' అంది సూరి

వచ్చునని తల తిప్పింది ఆ పిల్ల

సూరీ, సీతీ, వెంకీ ఆ పిల్ల చుట్టూ చేరారు ఆ అమ్మాయి పట్టుచొక్కా పట్టుకుచూచి, 'ఈ పువ్వుల పట్టు చొక్కా చూడొసే, ఎంత బాగుందో' అంది సూరి

'జోళ్ళు కూడా వేసుకుందే ఈ అమ్మాయీ, ఈ జోళ్ళు చూడొసేసూ ఎలాగ మెరిసిపోతున్నాయో' అంది సీతి

'ఆడుకుందాం, దా' అని ఆ అమ్మాయి చెయ్యి పట్టుకొని వెంకి లాగింది చివరికి ఆ అమ్మాయి చెయ్యిపట్టుకొని వెంకి లాగింది చివరికి ఆ అమ్మాయి ఆడుకోవడానికి వప్పుకుంది కొంతసేపు నలుగురూకలిసి దాగుడుమూత లాడుకొన్నారు

'సూపరెంటు' కూతురుపేరు కమల కమల 'తల్లి'గా ఉండి సీతి కళ్ళుమూసింది సూరీ, వెంకీ చెట్టు వెనక్కాలా, పువ్వులకుండు వెనక్కాలా దాక్కున్నారు

'సంయ్యేనా?' అంది సీతి

'సంయి, సంయ్యి' అంది సూరి

సీతి వాళ్ళకోసం యిటూ అటూ చూచి వాళ్ళను కనుక్కొని వాళ్ళను ముట్టుకోడానికి పరిగెత్తింది సీతి ముట్టుకోకముందే సూరీ,వెంకీ తల్లిని ముట్టుకొన్నారు

కొంతసేపు సూరి తలైంది కొంతసేపు వెంకీ, సీతీ తల్లయ్యారు. ఇలాగ కొంతసేపు ఆడుకొన్నారు నలుగురు పిల్లలూ కలిసి గట్టిగా,

'నెల్లికాయదొంగ నేరేడుదొంగ

పందిట్లో చిన్న పాపాయిదొంగ'

అని పాడి ఆడుతున్నారు చాలాకాలంనుంచి ఆటలు ఆడకపోవడం వల్ల కమల మనస్సులో ఉన్న బెంగ అంతా ఆ రోజున ఎగిరిపోయింది

వీళ్ళు ఇల్లాగ ఆడుకుంటూ ఉంటే పనిచూచుకొని సూపరెంటు తిరిగివచ్చాడు పిల్లలు ఆడుకొవడం చూచాడు ఖైదీలతో కూడా తనపిల్ల ఆడుకోవడం చూచి మనస్సు చివుక్కుమంది

కోపంవచ్చింది పక్కనున్న నౌఖరిని తిట్టాడు కొట్టేటంతపనిచేశాడు

'కమలా, రా, ఇంటికి వెడదాము' అన్నాడు కోపంగా

'నేరాను, నువెళ్ళు' అంది కమల తండ్రికేసి తిరిగి చూడకుండానే! కమలకు వాళ్లింట్లో ఎంతో గారం తల్లీ తండ్రీ భయం లేదు

సూపరెంటుకి ఏమిచెయ్యడానికీ తోచలేదు ఖైదీ పిల్లలిని కూకలేస్తాడా?తన పిల్లలని కోప్పడతాడా?

'తప్పమ్మా, ఇక్కడాడుకోకూడదు ఇంటికి వెడదాం, రా' అన్నాడు మళ్ళీని, కొంతకోపం అణచుకొని

'నేరాను' అంది కమల

'ఇక్కడ మాతో ఆడుకుంటుంది లెండి మీరెళ్లండి' అంది సీతి సూపరెంటు కమల చెయ్యిపట్టుకొని రమ్మని లాగాడు, 'నేరాను, నాన్నా! నేనాడు కొంటాను' అని చదికిలపడి ఏడ్చింది

కమలనెప్పుడూ ఏడ్పించి ఎరగరు తల్లీ తండ్రీని

'సరే కొంచెం సేపు ఆడుకో, నేనిక్కడే ఉంటానులే' అని సూపరెంటు, తనకూతురు చెయ్యివదలి దూరంగా నిలబడి చూస్తున్నాడు

సూపరెంటుకి ఖైదీపిల్లలు ముగ్గురి మీదా చాలా కోపం వచ్చింది కాని కమలకు వాళ్ళవల్ల సంతోషం కలుగుతోందన్న కారణంచేత ఆకోపం దిగమింగాడు

నలుగురుపిల్లలూ చెట్టాపట్టాలు వేసుకొని కబుర్లు చెప్పుకొంటూ కొంతసేపు రావిచెట్టుచుట్టూ తిరిగారు కొంతసేపు పచ్చాకు ఆడుకొన్నారు

ఎంతసేపు నిలబడ్డా కమల రాలేదని సూపరెంటుకు కోపంవచ్చింది కమలను కోప్పడితే

లాభం లేదనుకొని వాళ్ళదగ్గిరికి వచ్చి సూరీ సీతీ వెంకీ కేసి చూసి, 'వెళ్ళండి, అమ్మాయిలూ, వెళ్ళండి, మీకొట్టులోకి వెళ్ళి కూచోండి అస్తమానం ఆటలే? వెళ్ళండి' అని గదిమాడు

'మేం వెళ్ళం, మేం ఆడుకొంటాం' అంది సీతి

'మేం వెళ్ళం, మేం ఆడుకొంటాం నీకెందుకూ?' అంది కమల

'నీకెందుకూ?' అంది వెంకి

'నువ్వు కాదమ్మా కమలా, నువ్వు నాతోరా, మనింటికెడదాం, రా, అమ్మా రా' అన్నాడు సూపరెంటు

'నే రాను, నేనాడుకొంటాను ' అంది కమల

సూపరెంటుకి ఏమి చెయ్యడానికీ తోచలేదు ఆడనౌఖర్ని పిలిచి ఆ ముగ్గురుపిల్లలినీ కొట్టులోపెట్టి తాళం వెయ్యమని ఆజ్ఞాపించాడు ఆడ నౌఖరు వచ్చి ముగ్గురుపిల్లలినీ బలవంతంగా కొట్టులోకి తీసుకుపోయింది

సూపరెంటు కమలని బలవంతంగా ఇంటికి లాగుకు పోయాడు కమల అదేఏడవడం

ఇంటికి వెళ్ళాక సూపరెంటు భార్య అతన్ని చూచి, 'కమల నెందుకు ఏడ్పిస్తున్నారూ? అని కోపంతో అడిగింది "నేనేడ్పించడంలేదు అదే ఏడుస్తోంది అన్నాడు విసుగుతో సూపరెంటు

'ఊరికే అది ఏడవబోయిందా? మీరేమీ అనకుండా' అని సూపరెంటు భార్య నిలదీసి అడిగింది

'చెప్పినమాట వినడం లేదు కమల ఖైదీపిల్లలతో ఆడుకొంటానంటుంది వద్దంటే మానదు ఎంత చెప్పినా వినదు, నేను బలవంతాన్ని తీసుకువచ్చానని ఏడుస్తోంది' అన్నాడు సూపరెంటు

కమల ఆగకుండా ఏడుస్తూనే ఉంది

ఖైదీపిల్లలసంగతీ, వాళ్ళతో ఆటలాడినసంగతీ యావత్తూ తన భార్యతో సూపరెంటు చెప్పాడు

'పోనీ, అమ్మాయి అంత ఏడుస్తూంటే ఆ పిల్లలినే ఇక్కడికి తీసుకురాలేక పోయారా?' అంది భార్య

'ఖైదీపిల్లలని మనింటికి తీసుకురమ్మన్నావూ!' అన్నాడు సూపరెంటు తన ప్రతిష్ఠతలుచుకొంటూ

'వాళ్ళేం దొంగతనంచేశారా, దోపిళ్ళు చేశారా? వాళ్ళు ఖైదీలేమిటి? ఏదో గ్రహచారం చాలకో, కాలాన్ని బట్టో ఖైదులో పడ్డారు కాని? ' అంది భార్య

సూపరెంటు ఆలోచనలో పడ్డాడు

కమల ఏడుస్తూనే ఉంది

'పోనీ, నౌఖరిని పంపించి ఆ పిల్లలిని తెప్పించండి' అంది అతని భార్య

నౌఖరిని పంపించి ఆ పిల్లలిని తెప్పించాడు సూపరెంటు

కమల ఏడ్పు చాలించింది నవ్వింది

నలుగురు పిల్లలూ ఒక్కబంతిని ఆరోజున సూపరెంటుగారింట్లోనే భోజనం చేశారు

వాళ్ళనాన్న కొనిపెట్టిన రకరకాల బొమ్మలన్నీ కమల చూపించింది సూరికీ, సీతికీ, వెంకికీని

ఆరోజు సూపరెంటు ఇల్లు కలకల లాడింది సూపరెంటుభార్య ముఖమూ కలకలలాడింది ఆరోజు సూపరెంటు ముఖం కలకలలాడింది ?

భోజనముచేసి కొంతసేపు నలుగురూ సూపరెంటు పందిరిపట్టెమంచం మీదే పడుకొన్నాడు సూపరెంటు భార్యే వాళ్ళనక్కడ పడుక్కోబెట్టింది సూపరెంటు ఆ రోజు భార్యతో ఘోరంగా యుద్ధం చేయవలెనని అనుకొని తొందరపడడం వివేకం కాదని ఊరుకొన్నాడు పిల్లలు నిద్రపోయి లేచి వాళ్ళ ఇల్లంతా ఎగిరిపోయేటట్లు గోలచేస్తూ పాటలుపాడుతూ ఆడుకొంటున్నారు

సాయంత్రం అయింది

ఖైదీలకు భోజనాలు పెట్టి కొట్లలోకిపంపించేవేళయింది సూపరెంటు ఏమిచెయ్యాలో తెలియక ఆలోచిస్తున్నాడు

ముగ్గురు పిల్లలినీ కొట్లలోకి చప్పున పంపించాలనుకొన్నాడు భార్య ముఖంచూచి ఊరుకొన్నాడు

ఎప్పటికైనా పిల్లల ఆట ముగుస్తుందేమో అని కనిపెట్టి చూస్తున్నాడు ఎంతకీ ముగియడం లేదు

చివరికి ధైర్యంపూని నౌఖరిని పిలిచి ఆ ముగ్గురు పిల్లలినీ వాళ్ళకొట్టులో అప్పజెప్పిరమ్మన్నాడు

కమల తానుకూడా వాళ్ళతో కొట్టులోకి వెడతానంది!

సూపరెంటు భార్య వచ్చింది

సూపరెంటు మతిపోయింది

'తీసుకువెళ్ళవేం?' అని నౌఖరిని గదిమాడు సూపరెంటు

నౌఖరు 'చిత్తం' అని ఖంగారుపడి నిలబడ్డాడు

'నువ్వూ కొట్టులోకి వస్తావుకదూ కమలా? అంది సీతి

'కొత్తులోకి దా' అది వెంకి

'పోనీ వాళ్ళని ఇక్కడే ఉండనియ్యరాదూ' అంది సూపరెంటు భార్య

'ఇది మనఇల్లు, చెరసాల కాదు' అన్నాడు కోపంతో సూపరెంటు

'అయినా ఆడుకోనీ పాడుకోనీ పిల్లలకి ఖైదేమిటీ' అంది భార్య

'నన్నేం చెయ్యమన్నావు?' అన్నాడు సూపరెంటు

'పోనీ పైకివ్రాసి కనుక్కోండి' అంది భార్య

సూపరెంటుకు కోపంవచ్చి 'టెన్నిసుబాటు' తీసుకొని భార్యని రమ్మని పిలవకుండానే మోటారు కారెక్కి పారిపోయాడు

నౌకరు సూపరెంటు భార్యకేసి చూచి మాట్లాడుకుండా జారాడు.

సూరీ,సీతీ, వెంకీ, కమలా ఆవేళ రాత్రికూడా సూపరెంటు ఇంట్లోనే భోజనం చేసి వాళ్ళ పందిరిపట్టె మంచమీదే నిద్రపోయారు

ఇంటికి రాగానే సూపరెంటుభార్య సూపరెంటు నడిగింది ' పైకి రాశారా' అని

'రాస్తా' అన్నాడు సూపరెంటు

'వ్రాశామన్నారుగదా, ఏమిసమాధానం వచ్చింది?' అని అడిగింది సూపరెంటుభార్య సూపరెంటుని

# 2

'వ్రాయడం ఏమిటి?' అన్నాడు సూపరెంటు

'ఈ ముగ్గురిపిల్లలినీ గురించి '

'అదా! నేను వ్రాయకముందే వచ్చింది'

'ఏమని?'

'చిన్నపిల్లలిని శిక్షించవలసిన అవసరము లేదనీ, వాళ్ళను వదలిపెట్టమనీ'

'అయితే వాళ్ళని వదలిపెట్టినట్లేనా?'

'మనింటిలో ఉన్నాక వదలి పెట్టినట్లు కాక ఇంకేమిటి?' అని హేళనగా అన్నాడు సూపరెంటు

'ముగ్గురినీనా' అన్నది భార్య

'చంటిపిల్ల తల్లిదగ్గర ఉంటుందిట మిగిలిన యిద్దరు పిల్లలినీ పంపించివేస్తాను'

'ఎక్కడికి?'

'వాళ్ళమ్మగారి ఊరికి ఉత్తరం వ్రాయించాను

'పోనీ వాళ్ళు మనింట్లో ఉండకూడదూ కమలతో ఆడుకొంటూ ఉంటారు పాపం'

'పనికిరాదు'

'వాళ్ళు ఖైదీలుకారుగా?'

'నీయిష్టం' అని చెప్పి సూపరెంటు కోపం పట్టలేక కారులో కుక్క నెక్కించుకొని షికారు వెళ్ళిపోయాడు

కొంతసేపు జైలులోనూ కొంతసేపు కమలంగారిట్లోనూ సూరీ సీతీ వెంకీ కమలతో ఆడుకొంటున్నారు

వాళ్ళమ్మ ఈ సంగతి విని ఇందువల్ల ఏమి ముప్పు వస్తుందో అని భయపడుతూ ఉంది సాధ్యమైనంత మట్టుకు ముగ్గురు పిల్లలినీ తన కొట్టులోనే ఉంచుకోవడానికి ప్రయత్నిస్తోంది

ఇట్లా ఉండగా ఒకనాడు ఒక ముసలమ్మ జైలు గేటు దగ్గిరికి వచ్చి నిలబడిందనీ, సూరినీ సీతినీ పంపించి వెయ్యమన్నారనీ ఒక జవాను సూపరెంటు దగ్గర నుంచి సూపరెంటు భార్యకు వర్తమానం తీసుకువచ్చాడు

సూపరెంటు భార్య మాట్లాడకపోవడం వల్ల ఏమి చేయడానికి తోచక జవాను తట పటాయిస్తున్నాడు

సూరి కమలకి జడేస్తోంది అప్పుడు ఒక కాగితం ముక్క ఎవరూ చూడకుండా సీతి కమల నెత్తిమీద పడేసి ఓ తాయిల్లాగారి నెత్తిమీద గోరింక, చెప్పకు, చెప్పకు చెడు పాప, చెపితే నీకళ్లోతాయి' అని నవ్వుతూ చప్పట్లు కొడుతూ అంటోంది

వెంకికూడా 'ఓ తాయిల్లాగారి నెత్తిమీద గోలింకోయి' అంటోంది.

కమల తలమీద తడుముకొని కాగితం ముక్క తీసివేసింది

'మొగుణ్ణి వెతుక్కుందోయి, మొగుణ్ణి వెతుక్కుందోయి' అని సీతి గోల చేసింది వెంకి గంతులేసి నవ్వింది

వాళ్ళమ్మ యిదంతా చూస్తూ ఆనందించింది

ఈ సమయంలోనే ఎవరో ఆ ముసలమ్మ నీకు తెలుసునా?'

అంది సూపరెంటుభార్య సూరికేసి తిరిగి

'చెప్పుకోగలవే, సీతీ' అంది సూరి

'నే తెప్పనా' అంది వెంకి

'చెప్పమ్మా మరీ ' అంది సీతి

'ఒ తాయిల్లాగారు' అంది వెంకి అందరూ నవ్వారు.

'ఎవరు చెప్మా' అంది సీతి

'జ్ఞాపకం లేదుటే మనం ... తీర్థంవెళ్ళినప్పుడే '

అని అందించింది సూరి

'ఆఁఆఁ అమ్మమ్మ' అంది సీతి

'అమ్మమ్మంటే ఎవరు?' అంది సూపరెంటు భార్య

'మా అమ్మ దొడ్డమ్మ' అంది సూరి

సీతి సూపరెంటు భార్యతో, ' మా దొడ్డమ్మే, ఎంతమంచిదనుకొన్నారు మేం తీర్థాని కెళ్లినప్పుడు ఎన్నో బొమ్మలూ, మిఠాయిలూ అన్నీ కొనిపెట్టింది కాదుటే సూరీ?' అంది

'దొడ్డమ్మ మంచిది' అంది వెంకి.

'ఏమండోయి మేం తీర్థానికెళ్ళినప్పుడేం, మా దొడ్డమ్మ మమ్మల్నందరినీ వాళ్ళింటికి తీసికెళ్ళి మా కన్నీవండిపెట్టిందండీ' అంది సూరి

'అమ్మా మనకిలేదుటే దొడ్డమ్మా' అని కమల వాళ్ళమ్మ నడిగింది

'వాళ్ళదొడ్డమ్మే మన దొడ్డమ్మాను' అంది నవ్వుతూ వాళ్ళమ్మ

ఎంతకీ సమాధానం చెప్పకపోవడంవల్ల జవాను వెళ్ళిపోయాడు

కొంతసేపటికి సూపరింటేవచ్చాడు చెండుకుంటూ,

'ఆ అమ్మాయిలిని పంపించెయ్యమంటే ఎందుకు-పంపావుకావూ?'అన్నాడు భార్యతో

'ఎక్కడికీ పంపించడం?' అంది అతని భార్య

'వాళ్ళమ్మమ్మ వచ్చిందని కబురు చేశానుగా' అన్నాడు

'వాళ్ళమ్మమ్మవస్తే జైలుగేటు అవతల నిలుచోబెట్టకపోతే యిక్కడికే పంపలేకపోయారా? ఆవిడ ఖైదీ కాదుగా' అంది అతనిభార్య

'వీల్లేదు' అన్నాడా అధికారి

'వీల్లేకపోతే మీరే పిల్లలిని పంపించివెయ్యండి' అంది ఆవిడ

సూపరెంటు భార్యకేసి కొంతసేపు కోపదృష్టితో చూచాడు కొతసేపు కిందా మీదా చూచాడు కొంతసేపు తన ఉద్యోగాన్నీ అధికారాన్నీ తలుచుకున్నాడు సూరికేసీ సీతికేసీ తిరిగి, వెళ్ళండి అమ్మాయిలూ, మీ అమ్మమ్మ వచ్చిందిట' అన్నాడు గద్దిస్తూ

'ఎక్కడికి వచ్చిందండీ మామగారూ?' అంది సీతి

'వెళ్ళండి జవాను తీసుకెడతాడు' అన్నాడు సూపరెంటు

'మరి మా వెంకో?' అంది సీతి

'వెంకిని మీ అమ్మగారి కొట్టులోనికి పంపిస్తా' అన్నాడు

'నన్నో నాన్నా, నన్ను కూడా పంపించవూ?' అంది కమల

'వెళ్ళు మీ అమ్మదగ్గిరికి కెళ్ళు' అని కూతురిని కోప్పడ్డాడు సూపరెంటు

'రావే, వెడదాం' అంది సూరి

సూరీ, సీతీ, వెంకీ చెయ్యీ చెయ్యీ పట్టుకొని గుమ్మందగ్గరకు వచ్చారు

'పదవే భద్రాద్రికీ పాపిష్టి ఘటమా ఎన్నాళ్ళు బ్రదికీన ఇదినీకు స్థిరమా' అని సీతి ఎవళ్ళో బూచాళ్ళు పాడుతూంటే విని జ్ఞాపకం ఉంచుకొన్నపాట పాడుతోంది

వాళ్ళనాన్న కోప్పడ్డాడనీ, సూరీ, సీతీ, వెంకీ వెళ్ళి పోతున్నారనీ వాళ్ళమ్మకాళ్ళు పట్టుకొని కమల గొల్లున గోలపెట్టింది

'ఊరుకో' అన్నాడు వాళ్ళనాన్న

'దాన్నెందుకు కోప్పడతారూ' అని అతని భార్య యుద్ధసూచకంగా పలికింది

సూపరెంటు భార్యముఖం చూచాడు లోపల లేచనుకొన్నాడు ధుమధుమలాడుతూ కాస్సేపటికి క్లబ్బుకు లేచి పోయాడు

సూరీ, సీతీ, వెంకీ గుమ్మంలో నుంచున్న వాళ్ళు మళ్ళీ ఇంట్లోకి వచ్చారు

'ఆవిణ్ణి ఇక్కడికి తీసుకురా' అంది సూపరెంటు భార్య జవానుతో

'రా, అమ్మా, రా, రా, కమలా ఆడుకొందాం' అంది సీతి

'దా కమలా దా' అంది వెంకి కమల చెయ్యిపట్టుకొని లాగింది. కమలని కూచోబెట్టి సూరి కమల జెడలో పువ్వులు గుచ్చుతోంది సీతీ వెంకీ పువ్వులందిస్తున్నారు కమల అమ్మ సాలోచనగా వాళ్ళను చూస్తోంది కొంతసేపట్లో దొడ్డమ్మ జవాను వెనకే వచ్చింది వచ్చి సూరీ, సీతీ, వెంకీ ఆడు కొంటూంటే చూచింది చూచి కంటతడిపెట్టుకొని, 'అయ్యో, అయ్యో, నాతల్లుల్లారా, మీకెంత అనుభవం వచ్చిందర్రా, మీకెంత అనుభవం వచ్చిందర్రా నే బతికి ఉండగాను' అని వెంకిని ఎత్తుకొని ఏడ్చింది

సూరీ సీతీ లేచి దొడ్డమ్మ కాళ్ళు కాగలించుకొన్నారు

'తిని కూర్చోలేక ఇది ఎందుకు తెచ్చిపెట్టుకొన్నారర్రా నా వెర్రితల్లులూ అయ్యో మీ అమ్మేదర్రా అంది దొడ్డమ్మ

'అమ్మ ఇక్కడలేదు అమ్మమ్మా' అంది సూరి

'ఇది జైలుకాదుటర్రా?' అంది దొడ్డమ్మ

'ఇది జైలు కాదు, కమలగారిల్లూ' అంది సీతి

'మరి మీ అమ్మ ఎక్కడ?' అంది దొడ్డమ్మ

'తెల్లలాగులూ తెల్లటోపీలూ పెట్టుకొంటారూ అక్కడ జైలు' అది సీతి

'మరి మీరిక్కడున్నారేం' అంది దొడ్డమ్మ

సూరీ సీతీ కమలఅమ్మకేసి చూచారు

'వీల్ళు ఖైదులో లేరమ్మా వీళ్ళని వదలిపెట్టారు మా అమ్మాయితో ఆడుకొంటూ ఉంటారని ఇక్కడికి తీసుకొచ్చాము

'ఈ అమ్మాయేనా, మీ అమ్మాయి? బంగారుతల్లి, రా, అమ్మా ఎత్తుకుంటాను రా' అంది కమలతో దొడ్డమ్మ,

కమల వాళ్ళమ్మ చీర పట్టుకు నిలబడి వచ్చింది కాదు

'ఎవరమ్మా మీరు? అంది దొడ్డమ్మ

'ఇది సూపరెంటుగారిల్లు నీకు తెలియదూ డొడ్డమ్మా?' అంది సీతి

'నాకేం తెలుసునే నాతల్లీ' అంది దొడ్డమ్మ

'కూచోండమ్మా! మా కమలకూడా ఎవరూ ఆడుకొనేవాళ్ళు లేక బెంగపెట్టుకొంది ఈ అమ్మాయిలు వచ్చినప్పటినుంచీ మా కమలకి అవి ఆటలు కావు అవి పాటలు గావు' అంది కమలఅమ్మ

దొడ్డమ్మ కూచుని సూరిని, సీతిని, వెంకినీ చుట్టూ కూచోబెట్టుకొని వాళ్ళను చూచుకుంటోంది కమల కూడా సీతిపక్కని కూచుంది కమల అమ్మ బయటికి వెళ్ళి జవానుతో ఏదో చెప్పి మళ్ళీ వచ్చి కూర్చుంది

'అమ్మమ్మా, మాకోకథ చెప్పవు? అంది సీతి,

'అయ్యో తల్లీ! నాబతుకో కథలాగ వుందేతల్లీ! మీనాన్నా మీ అమ్మా, మీఅన్నయ్య మీరు ఇంటిల్లిపాదీ ఇక్కడ ఈ జైల్లో కూచుంటే ఇంక కథేమిటే నావెఱ్ఱితల్లీ విన్నారమ్మా, నాకు రోంత తెలియనైనా తెలిసింది కాదు మామనమడైనా నా ఒక్క కాగితంముక్క రాశాడు కాదూ' అంది దొడ్డమ్మ

'ఏదో గ్రహచారం' అంది కమల అమ్మ

'గ్రహచారమే లేకపోతే వీళ్ళకీ పాట్లేమిటీ అయినా యిదేమిటమ్మా?చోద్యం, అందరూ శ్రీకృష్ణ జన్మస్థానం అంటూ జైల్లోకెళ్ళి కూచోవడమే! ఇవేంరోజు లొచ్చాయోగాని!'

వాళ్ళు మాట్లాడుకొంటూంటే జవాను వాళ్ళమ్మను తీసుకువచ్చాడు

'దొడ్డమ్మా, నువ్వెందుకొచ్చావే, పాపం ముసలిదానవు?' అంది వాళ్ళమ్మ

'అయ్యోనాతల్లీ, నర్సమ్మా! మీకింత అనుభవం కలిగితే నేరాకపోతే ఎలాగమ్మా! రా, నాతల్లి, రా, ఎంత చిక్కిపోయావో?' అంది దొడ్డమ్మ

సూరీ సీతీ వెంకీ వెళ్ళి వాళ్ళమ్మ కాళ్ళు చుట్టూరా కాగలించుకొన్నారు

కొత్త వదిలింది కాబోలు కమల దొడ్డమ్మవళ్ళో కూర్చొంది

దొడ్డమ్మ పక్కనే వాళ్ళమ్మ కూచుంది ముగ్గురమ్మాయిలూ వాళ్ళమ్మవళ్ళో ఇరుకుగా కూచున్నారు.

'ఇంకా ఎన్నాళ్లే మా అమ్మా ఇది మీకు?' అంది దొడ్డమ్మ.

'ఎన్నాళ్ళయితే ఏమిటి?' అంది నరసమ్మ

'అయ్యో అలా అంటావేమేతల్లీ' అంది దొడ్డమ్మ

'మాకిక్కడ బాగానే ఉంది దొడ్డమ్మా ముగ్గురు పిల్లలూ ఆయిల్లాలు ధర్మమా అని ఇంట్లో ఉన్నట్లే ఇక్కడున్నారుగదా' అంది నర్సమ్మ

'ఆవిడ మహదొడ్డయిల్లాలు చూస్తున్నాగా' అంది దొడ్డమ్మ

'ఏమిటో అవ్వగారూ పిల్లలన్నతరవాత ఆమాత్రం ఉండకపోతే ఎలాగ' అంది కమలగారి అమ్మ

( అసంపూర్ణం )

  

# బంగారు పిలక

## (పెద్ద కథ)

"తాతయ్యా, నాకో కథ చెప్పవూ?"

"బువ్వ తిన్నావా?"

"తిన్నా, తాతయ్యా!"

"అయితే ఏం కథ చెప్పమంటావు?"

"పిలక కథ తాతయ్యా!"

"అయితే విను

"అనగాఅనగా ఒకఊళ్ళో ఒకబ్రాహ్మడుండేవాట్ట ఆబ్రాహ్మడికి బంగారు పిలక ఉండేదిట "

"అదేమిటి తాతయ్యా, బంగారు పిలక లుంటాయా ఎవరికేనా?"

"అవునురా - చెప్పడం మరిచిపోయాను వెనకటి కాలంలో ఎవరికే పిలక కావలిస్తే వాళ్ళు ఆ పిలక చేయించుకొనేవారట "

"అదేమిటి తాతయ్యా - పిలకలు చేయించు కొంటారా ఎక్కడైనా?"

"ఆ కాలంలో చేయించుకొనేవారట! ఇప్పటికి మల్లె అప్పుడు పిలకలు తలకు అంటుకొని ఉండేవి కావట ఎవరి పిలక వారు తీసుకొని, మంచి మంచి నూనెలు రాసి దువ్వి, జడలు వేసుకొని తలకు అంటించుకొనేవారట కొందరు బంగారు పిలకలూ, కొందరు వెండివీ, కొందరు రాగివీ చేయించుకొనేవారట ప్రతిరోజూ అవి తీసి తోముకొని మళ్ళీ అందంగా తలకు తగిలించుకొనేవారట

ఒకనాడు బ్రాహ్మడు అత్తారింటికెళ్ళాలని ముస్తాబై బంగారుపిలక అంటించుకొని వెడుతున్నాట్ట తోవలో ఓ అడివి ఉంది ఆ అడివిలోంచి వెడుతూంటే ఒకచోట ఓ గొర్రెల మందను కాసుకుంటూ ఒక గొల్లవాడు నిలబడ్డాడు గొల్లవాడు పరధ్యానంగా ఉండడం చూచి ఒక నక్క గొర్రెపిల్ల నొకదాన్ని పట్టుకుపోవడానికి పొంచుండి చూస్తోంది దాన్ని గొల్లాడు చూడలేదు బ్రాహ్మడు చూచి "గొల్లాడా గొల్లాడా! నీ గొఱ్ఱెపిల్లని పట్టుకుపోవాలని చూస్తోంది ఆ నక్క -- చూశావా?" అన్నాడు గొల్లవాడు తిరిగిచూచి కఱ్ఱ పుచ్చుకొని నక్కమీదకు విసిరాడు కఱ్ఱ నక్క కాలికి తగిలింది. అది పారిపోయింది బ్రాహ్మడిమీద నక్కకు కోపం వచ్చింది గొల్లాడితో చెప్పి తనకు గొర్రెపిల్ల లేకుండా చేశాడనిన్నీ, కఱ్ఱతో కొట్టించాడనిన్నీ కోపగించి బ్రాహ్మడి మీద కసితీర్చుకోవాలనుకుంది నక్క

బ్రాహ్మడు అడివిలోంచి వెడుతున్నాడు అతనికి కనిపించకుండా నక్క అతని వెనకనే వెడుతోంది ఇంతట్లో సాయంత్రం అయింది.

బ్రాహ్మడు సంధ్య వార్చుకోవాలనుకొన్నాడు అక్కడో చెరువుంటే ఆ చెరువులోకి దిగి సంధ్య

వార్చుకోవచ్చును గదా అనుకొన్నాడు అనుకొని, బంగారుపిలక ఒడ్డున పెట్టి, కాళ్ళు కడుక్కోడానికి చెరువులోకి దిగాడు దిగి, కాళ్ళూ చేతులూ కడుక్కొని, పైకి వచ్చి, మళ్ళీ పిలకపెట్టుకొని ఒడ్డున కూచుని సంధ్య వార్చుకోవచ్చుగదా అనుకొన్నాడు

బ్రాహ్మడు కాళ్ళు కడుక్కుంటూంటే నక్క మెల్లిగా వచ్చి బంగారుపిలక పట్టుకొని పారిపోయింది బ్రాహ్మడు కాళ్ళు కడుక్కొని వచ్చి చూచేసరికి పిలక లేదు

"అన్నా! ఎంతపని జరిగింది! అత్తవారు పెట్టిన నిక్షేపం లాంటి పిలక పోయింది ఇంక ఏ మొహం పెట్టుకొని అత్తవారింటికి వెళ్ళను? ఎవరు తీసి ఉంటారు నా పిలక? ఇక్కడ మనిషి సందడేనా లేదే?" అని అనుకొని బ్రాహ్మడు చుట్టుపట్లంతా వెతకడం మొదలుపెట్టాడు ఎక్కడా పిలక చిక్కలేదు కాని చెరువు ఒడ్డుమీద తాను పిలక పెట్టినచోట నక్క కాలి అడుగులు ఉండడం చూచి, "ఈ నక్కగానీ పిలక పట్టుకుపోయి ఉంటుందా!" అనుకొన్నాడు గొర్రెపిల్లను పట్టుకుపోకుండా చేసినందుకు కోపంకొద్దీ, ఆ నక్క వచ్చి యింతపని చేసిఉంటుందని అతడు అనుకున్నాడు

దాని కాలి అడుగుల జాడను బట్టి మెల్లిగా వెడుతున్నాడు భూమిమీద కళ్ళుపెట్టుకొని ఇటూ అటూ చూడకుండా వెడుతూంటే అతనికి ఒక చెట్లదుబ్బులో అలుకుడైనట్లయింది గాండ్రు గాండ్రుమని శబ్దము వినిపించింది తటాలున ఆగాడు ఆ దుబ్బులోనుంచి ఒక పెద్దపులి వచ్చి అతనికి ఎదురుగా నిలబడింది

బ్రాహ్మడు గజగజ వణికిపోతున్నాడు చేతులు జోడించి పెద్దపులికి దణ్ణం పెడుతూ అన్నాడుగదా - "పులిరాజా పులిరాజా! నేను బ్రాహ్మణ్ణి, నన్ను వదిలిపెట్టు, నీకెంతో పుణ్యం ఉంటుంది నీవు ఈ అడివికి రాజువు నీకు కావాలంటే ఎన్ని మృగములు లేవు ఈ బ్రాహ్మడే కావాలా తినడానికి -- నీకు పదివేల దణ్ణాలు నన్ను వదిలిపెట్టు నేను అత్తవారింటికి వెడుతూ బంగారుపిలక పోగొట్టుకొని దుఃఖిస్తున్నాను పులిరాజుగారైన తమ దర్శనం దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాను తమ దర్శనఫలంగా నా పిలక నాకు దొరుకుతుందని నమ్మకం కలిగింది నన్ను వదిలిపెట్టు!" అని బ్రాహ్మడు సాష్టాంగపడ్డాడు "ఇదేమి ఖర్మం, పిలక కోసం వెదుకుతూంటే పులినోట పడవలసి వచ్చింది " అనుకొన్నాడు పెద్దపులి అతన్ని చూచి, నవ్వి "లే, బ్రాహ్మడా లే, నీ పొగడ్తలకు పొంగే రోజులు వెళ్ళాయి నేనెవరననుకొన్నావు? నాకు ఆకలి లేదు కాని దాహం ఎక్కువగా ఉంది నీ మెడదగ్గిర నరం నెమ్మదిగా కొరికి నీ రక్తం తాగి దాహం తీర్చుకొని వెడతాను తరవాత నీ దారిని నీవు వెళ్ళవచ్చు, లే!" అంది

"ధర్మమా పులిరాజా, బ్రాహ్మడి రక్తం త్రాగడం ? బ్రహ్మహత్యాదోషానికి ఒడిగడతావా ఇంత రాజ్యమూ ఏలుతూ?" అన్నాడు బ్రాహ్మడు

"అయ్యో ! వెర్రి బ్రాహ్మడా, మీ మనుష్యులకుమల్లె మాలో జాతిమత భేదాలు లేవు నలుపు, తెలుపు తేడాలు లేవు మా కంటికందరూ ఒక్కటే కాబట్టి నీ రక్తం తాగక మానను!"

"అమ్మయ్యో! నన్ను రక్షించు పులిరాజా" అన్నాడు బ్రాహ్మడు పెద్దపులి కోపంతో బ్రాహ్మణ్ణి సమీపించి, మెడ కొరకబోతూంటే అన్నాడుగదా బ్రాహ్మడు "ఆగు ఆగు పులిరాజా ఆగు, ఆగు!" అని

"ఎందుకు, ఎందుకు?" అంది పులి

"ఒక ధర్మసూక్ష్మం ఉన్నది "

"ఏమిటది ?"

"నేను చెప్పనూ చెప్పాను, నీవు చూడనూ చూచావు -- నాకు పిలక లేదనే సంగతి పిలకలేని బ్రాహ్మణ్ణిగాని, యితర కులస్థుణ్ణిగాని పులులు తినకూడదని ధర్మశాస్త్రం ఉన్నది అది నీవు మరిచి ఉంటావు ఎట్లాగా నన్ను చంప నిశ్చయించావు కాబట్టి ఒక ఉపాయం చెప్పుతా విను!"

"అవును బ్రాహ్మడా, ఆ మాట నిజమే చెప్పు, ఆ ఉపాయం ఏమిటో?"

"ఏమీ లేదు నేను కాళ్ళు కడుక్కుంటూంటే ఒక మాయ నక్క వచ్చి నా బంగారు పిలక ఎత్తుకుపోయింది మనం ఇద్దరమూ వెళ్ళి దానివద్దనుండి పిలక పుచ్చుకొందాము నేనా పిలకపెట్టుకొంటాను తరవాత నా రక్తంతో నీ దాహం తీర్చుకొందువుగాని నువ్వు" అన్నాడు బ్రాహ్మడు

పులి సరే పదమంది పులీ, బ్రాహ్మడూ కలిసి అడివిలోంచి వెడుతున్నారు ఎంత వెదికినా వాళ్ళకు నక్క ఉండే జాడ కనిపించలేదు ప్రతి కన్నమూ, ప్రతి పొదా చూస్తున్నారు నక్క కనిపించలేదు పులికి దాహం ఎక్కువౌతోంది బ్రాహ్మడికి భయం ఎక్కువౌతోంది

చెట్టుకొమ్మమీద నుంచి వీళ్ళను చూస్తున్న ఒక కాకి అంది కదా "పులిబావా పులిబావా, నువ్వూ, ఆ బ్రాహ్మడూ కలిసి ఏమిటి వెతుకుతున్నారు?" అని.

"ఈ బ్రాహ్మడి పిలక నక్క ఎత్తుకుపోయిందిట దాని కోసం వెతుకుతున్నాము" అంది పులి

"మనకు పగవాళ్లైన మనుష్యులతో స్నేహం చెయ్యవచ్చునా పులిబావా?" అంది కాకి

"స్నేహం కాదమ్మా, కాకమ్మా! నాకు దాహం వేస్తోంది ఈ బ్రాహ్మడి రక్తం రవంత తాగి దప్పిక తీర్చుకొందామనుకుంటే ఆ పాడు పిలక ఎక్కడో పారేసుకొన్నాట్ట అది లేందే నేను మనుష్యులిని ముట్టుకోకూడదు కదా!"

"అలాగా? అయితే నే చెబుతా విను ఇందాకా నేను ఆకాశం మీద షికారు తిరుగుతూంటే ఒక నక్క నోటితో పచ్చని వస్తువు ఒకటి కరుచుకొని పారిపోతోంది. దాన్ని నేనెరుగుదును "

"అయితే అది ఎక్కడ కాపరం?" అంది పులి

"అదిగో, ఆ కనిపించే కొండ దగ్గిర చెట్టు ఉంది ఆచెట్టు కింద ఒక పెద్ద బండ ఉంది ఆ బండకింద కన్నం ఉంది ఆ కన్నంలో కాపురం నక్క!" అంది కాకి

"నీమేలు మరవను సుమా!" అంది పులి

బ్రాహ్మడూ, పులీ కలిసి బండ దగ్గిరికి వెళ్ళారు కాకి కూడా వచ్చి చెట్టు మీద వాలింది

బ్రాహ్మడికి గండం తప్పేటట్లు లేదు ఎలాగ తప్పించుకోవడమా అని ఆలోచిస్తున్నాడు ఇంతట్లోకే పులి అంది కదా "అలా గుక్కిళ్ళు మింగుతూ నిలబడతావేమిటి బ్రాహ్మడా, పిలు ఆ నక్కను పిలు" అంది

"నేను పిలిస్తే వస్తుందో రాదో, పులిరాజా! పిలకకోసం వచ్చి ఉంటానని అది తెలుసుకొని

పలకదేమో నని భయం మీరు పిలవమంటే పిలుస్తాను." అన్నాడు బ్రాహ్మడు

"అయితే నువ్వు పిలవవద్దులే, నేనే పిలుస్తాను" అంది పెద్దపులి

అప్పుడు కాకి అందికదా "పులిబావా పులిబావా, వద్దు వద్దు నువ్వు పిలవకు నువ్వుగాని పిలిస్తే భయపడి అసలే కన్నంలోంచి బయటికి రాదు" అని

"అయితే ఏమిటి ఉపాయం?" అంది పులి

"ఉపాయానికి ఏముంది? నేనే పిలుస్తాను కాని ఈ బ్రాహ్మణ్ణి నువ్వూ, నక్కా తింటారు కదా, నాకేమిటి లాభం అనుకొంటున్నాను" అంది కాకి

"నీకు కూడా ఒక భాగం పంచి పెడతాములే" అంది పులి

కాకి సరేనని కన్నం దగ్గిర బండమీద వాలి పిలవడం మొదలెట్టింది

తలుపుతియ్యి, తలుపుతియ్యి నక్కబావా<br>
చుట్టాలు వచ్చారు నక్కబావా!<br>
కట్నాలు తెచ్చారు నక్కబావా<br>
కడుపు నిండిస్తారు నక్కబావా!

నక్క కన్నంలో ఉండి తన పిల్లాడికి జడవేసుకొంటోంది జడవేసి బంగారు పిలక ఆ పిల్లాడికి పెట్టాలని అనుకుంది కాకి పిలుపు విని అంది కదా

చుట్టాలు ఎవరమ్మ కాకమ్మా,<br>
కట్నాలు ఏమిటమ్మ కాకమ్మా!<br>
చెయ్యూరుకోలేదు కాకమ్మా,<br>
జడ వేస్తున్నాను కాకమ్మా!

అంటే కాకి అంది గదా .

చుట్టాలు నేనేను నక్కబావా,<br>
పక్కాలు నేనేను నక్కబావా!<br>
కట్నాలు యివిగోను నక్కబావా,<br>
కడుపు నిండా తినవయ్యా నక్కబావా!

అంటే, నక్క ముక్కుతో బయట ఎవరున్నారో అని వాసన చూడ్డం మొదలెట్టింది మొదట మనిషి వాసన కొట్టింది ఈ మనిషి ఆ బ్రాహ్మడే కదా, పిలకకోసం వచ్చి ఉంటాడు అనుకొంది తరవాత పెద్ద పులి వాసన కొట్టింది పెద్ద పులితో చెప్పి దాన్ని తీసుకొని, బ్రాహ్మడు పిలక నా దగ్గిర్నుంచి పుచ్చుకోడానికి వచ్చాడనుకొని, కాకి మాటలు నమ్మరాదనుకొని అంది కదా

చుట్టాలు వస్తేను కాకమ్మా,<br>
గుట్టమీద పీటవెయ్యి కాకమ్మా!<br>
చెట్టుమీద కూచోమను కాకమ్మా,<br>
జడవేసి వస్తాను కాకమ్మా!

అంటే పెద్ద పులి వచ్చి గుట్టమీద కూర్చుంది బ్రాహ్మడు చెట్టు ఎక్కేడు కాకి కన్నం దగ్గిర కూచుని చూస్తోంది

ఎంతకీ నక్క బయటికి రాలేదు పెద్దపులికి కోపంవచ్చింది గాండ్రు గాండ్రుమంటూ అరుస్తూ అందికదా -- "నక్కా నక్కా, నీవు బయటికి వస్తావా రావా? నాకు దాహంగా ఉంది, నువ్వు రాకపోతే నిన్ను చంపేస్తాను, జాగర్త!"

అప్పుడు నక్క "ఎందుకంత కోపం పులిబావా! దాహం వేస్తే కాఫీ కాస్తున్నా, తెస్తా ఉండు ఇంకా ఎవరున్నారు అక్కడ?" అంది

"నేనూ, బ్రాహ్మడూ, కాకీని -- చప్పున బంగారు పిలక పట్టుకు బయటికి రా!" అంది పులి

అప్పుడు నక్క ఆలోచించి అనుకొంది కదా "ఈ ముగ్గురూ పిలకకోసమే వచ్చారు నన్ను చంపాలనే వీళ్ళ ఉద్దేశం ఈ పిలక నా దగ్గర ఉంటే ఎప్పటికైనా వీళ్ళు నన్ను వదలిపెట్టరు ఎందుకీ పాడు పిలక నాకు? ఇక్కడ పారేసి పిల్లలతో కూడా పెరటిదారిని పారిపోతా!" అని

ఇట్లా అనుకొని నక్క పిలక అక్కడనే వదిలిపెట్టి వెళ్ళిపోతూ ఇలా చెప్పింది ---

వస్తూంటి వస్తూంటి పులిబావా,
పళ్లు కొరికి ఎగరబోకు పులిబావా!
పిల్లలకు జడవేసి పులిబావా,
పళ్లూ, కాఫీ తెస్తాను పులిబావా!

కాకీ, పులీ చాలాసేపు కూర్చున్నారు అక్కడే బ్రాహ్మడు చెట్టుచివర కొమ్మమీద కూర్చున్నాడు. ఎంతకూ రాకుంటే పులీ, కాకీ మళ్ళీ పిలిచారు సమాధానం లేదు నక్కమీద పులికి కోపం వచ్చి, దాని కన్నం గోళ్ళతో పెల్లగించి వేసింది నక్కలేదు మోసం చేసి పారిపోయిందిగదా అనుకొని ఇంకోమారు దాని పని పట్టవచ్చు ననుకొన్నది కాకీ, పులీ కలిసి కన్నం అంతా వెదికితే బంగారుపిలక దొరికింది కాకికీ, పులికీ సంతోషమైంది

"దొరికింది, బ్రాహ్మడా నీ బంగారుపిలక! అదృష్టవంతుడివి! పోతే పోయిందిలే వెధవ నక్క -- రా, దిగు - ఈ పిలక పెట్టుకో - నాకు మరీ దాహంగా ఉంది --- నాలిక పిడచకట్టుకుపోతోంది చప్పున పిలక పెట్టుకో!' అంది పులి

బ్రాహ్మడికి సగం ప్రాణం పోయింది ఇలా అన్నాడు

"నేరక ఈ చిట్టచివర కొమ్మ మీద కూర్చున్నాను ఇప్పుడు ఎలాగ దిగడమో తెలియడం లేదు నేను పిలకగానీ పెట్టుకుంటే దిగగలనేమో? పెద్దలు చెబుతారు గదా -- పిలక సగం బలం అని కాబట్టి కాకమ్మా! ఆపిలక రవంత యిట్లా తెచ్చి పెడితివా నీకు పుణ్యం ఉంటుంది నే నా పిలక పెట్టుకొని నెమ్మదిగా చెట్టు దిగుతాను "

"దిగకపోతేనో?" అంది కాకి

"దిగక ఎక్కడికి పోతానమ్మా? భూమి మీద పులిరాజూ, ఆకాశం మీద నువ్వూ, మధ్య నేనూను -- ఎక్కడికి పోతాను?"

కాకి ముక్కుతో పిలక తెచ్చి బ్రాహ్మడికి యివ్వబోతూంటే బ్రాహ్మడన్నాడు గదా, " ఈ రెండు చేతులతోనూ ఈ చెట్టు కొమ్మలు పట్టుకొన్నాను పిలక ఎలాగ పెట్టుకోగలను? నువ్వే రవంత పెట్టి పెడుదూ!" అని

అంటే, కాకి బ్రాహ్మడి తలకు పిలక తగిలించింది తగిలిస్తూంటే బ్రాహ్మడు తటాలున దాన్ని పట్టుకొని తన బట్టలో మూట గట్టి కింద పడవేశాడు పిలక బాగా తగిలించుకొని కూర్చున్నాడు

"అదేమిటి బ్రాహ్మడా, ఆ కాకిని మూటగట్టి కింద పడవేశావు నీవు మోసగాడివలె ఉన్నావే?" అంది పులి

"రామ రామా! నేను మీ పట్ల మోసం చేస్తానా? చేసి ఎక్కడికి వెడతాను? మీకు దాహం ఎక్కువగా ఉన్నదన్నారు గదా, నేను దిగేలోపుగా ఈ కాకి రక్తం కొంచెం పీల్చి దాహం తీర్చుకుంటారని పడవేశాను ఇష్టం లేకుంటే మూట విప్పి వెయ్యండి " అన్నాడు బ్రాహ్మడు

"నీరక్తం కావాలి నాకు, కాకి రక్తం కాదు" అంది పులి.

"అయితే దిగుతున్నా, కాని ఒక సందేహం మనస్సుని బాధిస్తోంది ఇప్పుడు రెండు జాముల రాత్రి అయిది పొద్దున్న పంచాంగం చూశాను సరిగ్గా ఇది వర్జ్య సమయం ఈ వర్జ్య సమయంలో చెట్టు దిగడానికి కాళ్ళూ చేతులూ ఆడ్డం లేదు అంతే కాకుండా ఈ వర్జ్య సమయంలో మీరు నారక్తం తాగితే ఏం కడుపునొప్పి వచ్చి బాధపడతారో అని నాకు దిగులుగా ఉంది!"

"అన్నా! ఎంత మోసగాడివి నీవు -- ఉండు నీ సంగతి చూస్తాను చిరతపులిని పిలిచి నిన్ను కిందకు లాగించకపోతే నా పేరు పెద్దపులి కాదు "

"ఎందుకు పులిరాజా ! నామీద నీలాపనిందలు వేస్తారు --- ఇక నాలుగు గడియలకు వర్జ్యం పోతుంది పోయీ పోవడంతోనే నేను చెట్టు దిగుతాను తరవాత నా రక్తం మీరు తాగవచ్చు!"

"సరే, నే నీ చెట్టు మొదటే కూర్చుంటాను నీవు ఎక్కడికి పోతావో చూస్తానుగా" అంది పులి చెట్టుమీద బ్రాహ్మడూ, చెట్టు కింద పులీ చాలాసేపు కూర్చున్నారు

కొంతసేపైన తర్వాత అన్నాడు కదా బ్రాహ్మడు, "ఏదో దూరాన్ని అలుకుడౌతోంది పులిరాజా, వినిపిస్తోందా?" అని

"చెట్టుమీద ఉన్నావు కదా - అదేదో చూచి చెప్పు" అంది పులి అప్పుడా బ్రాహ్మడు అన్నాడు-

మందలు మందలు , జింకల మందలు
మందలు మందలు లేళ్ళ మందలు!
పచ్చని వళ్ళూ చుక్కల వళ్ళూ
సన్నటి కాళ్ళూ గుండ్రని కాళ్ళూ,
అన్నీ మందలు, అవిగో మందలు!
మందలు మందలు జింకల మందలు!
మందలు మందలు లేళ్ళ మందలు!!
మందలు మందలు మందలు మందలు!!!

"ఎక్కడ, ఎక్కడ? ఆ మంద ఎక్కడ, బ్రాహ్మడా? సరిగా చూచి చెప్పు" అంది పులి ఆశతో.

బ్రాహ్మడన్నాడు గదా

కొండల దాపున సరస్సు దగ్గిర
లోయల్లోపల పొదల చాటునా,
సూటికొమ్మలూ కొమ్మలకొమ్ములూ
పదును గిట్టలూ నిండు పొట్టలూ,
మందలు మందలు జింకల మందలు!
మందలు మందలు లేళ్ల మందలు!!
మందలు మందలు మందలు మందలు !!!
"నిజంగానేనా, బ్రాహ్మడా?" అంది పులి తొందరగా
"నిజమేనయ్యా, ఎంత కన్నులపండుగ! ఎన్ని జింకలు, ఎన్ని జింకలు !
ఉత్సాహంతో ఉరుకుతున్నవి
గబగబ గబగబ గంతుతున్నవి
గిరగిర గిరగిర తిరుగుతున్నవి
చంగు చంగునా ఎగురుతున్నవి
తళతళ కళ్ళు గిరగిర తిరగా
పచ్చిక కొంచెం కొరుకుతున్నవి!
మేమే అంటూ అరుస్తున్నవి
సరస్సు నీళ్ళు తాగుతున్నవి!
మందలు మందలు జింకల మందలు
మందలు మందలు లేళ్ల మందలు
వేలూ లక్షలు, కోట్లు మందలు
మందలు మందలు మందలు మందలు !

బ్రాహ్మడు పాడుతూంటే పులికి నోరూరుతోంది ముక్కులో వాసన చూచింది కొంచెం జింకల వాసన కొట్టినట్లయింది చెవులు నిక్కించి విన్నది కొంచెం అలుకుడు కూడా వినిపించినట్లయింది

బ్రాహ్మడు మళ్లీ
ఆకాశంలో చుక్కల మిలమిల
కొండదాపులో జింకల మిలమిల!
అడివి అంతటా జింకల కలకల!
అడివి అంతటా జింకల కలకల !!
దుబ్బుల్లోనూ, చెట్ల ఎక్కనా
బండలమధ్యా, సరస్సుదరినీ

మైదానంలో, చరియల్లోనూ
కిందా మీదా, ముందూ వెనకా
బారా మందలు జింకల మందలు!
ఆడజింకలూ, పిల్ల జింకలూ
పొడల జింకలూ, పొట్టి జింకలూ
మందలు మందలు జింకల మందలు !
మందలు మందలు లేళ్ల మందలు !!
మందలు మందలు మందలు మందలు !!!

పెద్ద పులి బ్రాహ్మడు పాడిన పాట విని చెట్టు కింద ఉండలేకపోయింది రంయిన బయలుదేరి ఉరుకుతూ కొండలకేసి పరుగెత్తుకుపోతూంటే బ్రాహ్మడు గట్టిగా .

మందలు మందలు జింకలమందలు
మందలు మందలు లేళ్ల మందలు !
ఒకటా రెండా మూడా నాల్గా
వందలు వేలు లక్షలు కోట్లు!
కొండల చుట్టూ కెరటాలా అవి
సుడిగుండాలా సముద్రంపోటా?
మందలు మందలు జింకల మందలు !
మందలు మందలు లేళ్ల మందలు !!
మందలు మందలు మందలు మందలు !!!

అని పాడుతూనే ఉన్నాడు. పెద్దపులి మాయమయింది

తెల్లవారింది. జాము పొద్దెక్కేదాకా బ్రాహ్మడు చెట్టుమీద కూర్చుని, తరువాత చెట్టు దిగి, మూటవిప్పి కాకిని వదిలిపెట్టి, కండువా తీసికొని, బంగారుపిలక సరిగ్గా ఉందో లేదో చూచుకొని అత్తారింటికి నడిచి పోయాడు .

* * * * * *

"అయిందా, తాతయ్యా కథ?"

"అయిందిరా, ఇంక పడుకో!"

"మరి పెద్దపులి ఏమయింది?"

"జింకల్ని వేటాడి కడుపునిండాక తన గుహలో నిద్రపోడానికి పోయింది "

"బ్రాహ్మడున్న చెట్టు దగ్గిరికి రాలేదూ?"

"పగటివేళ పులులు తిరగవు వాటికి నిద్ర వస్తుంది. గుహలోకి పోయి నిద్రపోతాయి "

కథ కంచికి వెళ్ళింది తాతయ్యపక్కలో అబ్బాయి నిద్ర పోయాడు

# లీలాసుందరి

అనగా అనగా ఒక రాజు ఆ రాజుకు చక్కని చుక్కలాంటి కూతురున్నది ఆ పిల్లపేరు లీలాసుందరి ఒక్కగాని ఒక్కపిల్లకావడం చేత తల్లిదండ్రులు ఆమెను చాలా గారాబంగా పెంచుతున్నారు

ఒక్కగాని ఒక్కపిల్ల కావడం చేత బొమ్మలూ, నగలూ, పట్టుపరికిణీలూ, పట్టుచొక్కాలూ అన్నీ వాళ్ళ నాన్నా, అమ్మా ఇచ్చారు పరికిణీలు కట్టుకొని, ఆ చొక్కాలు తొడుక్కొని, నగలు పెట్టుకొని, ఆ బొమ్మలతో ఆడుకొంటూ ఉండేది లీలాసుందరి

ఆ రాజుపట్నంలో ఉన్న పిల్లలందరూ లీలాసుందరితో ఆడుకోవడానికి ప్రతిరోజూ సాయంకాలం వచ్చేవారు పిల్లలందరూ కలిసి ఒక పెద్ద పూలతోటలోకి వెళ్ళి అక్కడ ఆడుకునేవారు కొందరు ఉయ్యాలలూగేవారు, కొందరు పచ్చాకు ఆడుకునేవారు, కొందరు కోలాటం, పులిజూదం ఆడుకునేవారు కొందరు బుజబుజ రేకులూ, చెమ్మా చెక్కా, కొక్కూ, అల్లోనేరేళ్ళూ, వెన్నెలకుప్పలూ ఆడుకొనేవారు

ఆ తోటలో ఒక మంచి చెరువు ఉంది ఆ చెరువులో తామరపువ్వులూ, కలవపువ్వులూ, బాతులూ, తాబేళ్ళూ చాలా ఉన్నవి అందరూ ఆటలాడుకొని ఆ చెరువులో స్నానం చేసేవారు

వచ్చిన పిల్లలందరికీ కొత్త పరికిణీలు, కొత్త చొక్కాలు, కొత్త బొమ్మలూ, మిఠాయీ పెట్టి వాళ్ళ వాళ్ళ ఇంటికి పంపించివేసేది లీలాసుందరి మళ్ళీ మర్నాడు ఆటకు రమ్మని వాళ్లనందరినీ పేరు పేరువరుసను పిలిచేది

వాళ్లందరూ వెళ్లిపోయినతరువాత లీలాసుందరి తోటలో తిరుగుతూ నక్షత్రాలు లెక్కపెట్టేది వాళ్లమ్మా, నాన్నా రాత్రివేళ తిరగవద్దంటే "ఆఁ, అమ్మా, నే తిరుగుతాను తిరిగితే ఏం? నే తిరుగుతాను మీకేం?" అనేది లీలాసుందరి ముద్దుమాటలు విని తల్లీ తండ్రీ "కాస్తయినా భయంలేదేమిటమ్మా, మా అమ్మాయికి?" అనుకొనేవారు

రాత్రిళ్ళు పడుక్కోబోవటానికి ముందుగా పాటలు నేర్చుకొనేది లీలాసుందరి ఎంతో చక్కగా చాలా పాటలు పాడేది

తెల్లవారకముందే అందరికన్నా ముందుగా లేచి హాయిగా పాడేది వాళ్ళమ్మా, నాన్నా ఆ పాట విని లీలాసుందరి దగ్గిరికి వచ్చి ముద్దుపెట్టుకొనేవారు

లీలాసుందరి అంటే అందరికీ ముద్దే లీలాసుందరిని చూస్తూ ఉండవచ్చును గదా అనుకొని వాళ్ళ తోటలో ఎన్నో చిలకలు చెట్లమీద కాపురమున్నవి నెమళ్ళు లీలాసుందరిని చూచి పురులు విప్పి

అందముగా ఆటలు ఆడేవి పావురాలు లీలాసుందరికి ఎదురుగా పల్టీలుకొట్టేవి ఇవన్నీ చూచి లీలాసుందరి సంతోషిస్తూ ఉండేది

ఈ విధముగా కొన్నాళ్ళు గడచినవి

ఒకనాటి సాయంకాలము ఊళ్ళో ఉన్న పిల్లలందరూ లీలాసుందరితో ఆడుకోవడానికి మామూలుగా వచ్చినట్లే వచ్చారు వాళ్ళందరితోనూ కలిసి చాలా అందమైన ఒక ఆడపిల్లకూడా వచ్చింది

ఆ పిల్ల అక్కడికి రావడం అదే మొదలు ఈ కొత్తపిల్లను చూచి అందరూ "ఎవరు చెప్మా-ఈ పిల్ల" అని అనుకొన్నారు

లీలాసుందరి ఆ పిల్లను చూచి "నీవు బాగా ఆటలాడగలవా?" అంది

"నీకు ఎన్నో కొత్త ఆటలు నేర్పడానికి నేను వచ్చాను" అంది ఆ కొత్తపిల్ల

"నీ వెవరు ?" అని లీలాసుందరి అడిగింది

"నా పేరు చెప్పుకోలేవూ?" అంది కొత్తపిల్ల

"నే చెప్పుకోలేను నీవు చెప్పమ్మా" అంది లీలాసుందరి

"నాపేరే, నా పేరు - వనబాల" అంది కొత్తపిల్ల

లీలాసుందరికీ, వనబాలకూ చాలా స్నేహం కుదిరింది ఆరోజునే వాళ్లిద్దరూ కలిసి అందరి పిల్లలతోనూ ఎన్నో కొత్త ఆటలు ఆడుకొన్నారు వనబాల అందరి కళ్ళూ ఒక్కమారు మూసి మాయమయిపోయేది దాగుడుమూతలాడుకొనేటప్పుడు పిల్లలందరూ ఎక్కడ దాక్కొన్నదీ ఇట్టే చెప్పుకొనేది చెరువులోకి భయం లేకుండా దిగి తామరపువ్వులు తీసుకు వచ్చి పిల్లలందరికీ పంచిపెట్టేది తామరరేకులన్నీ లీలాసుందరితల్లో పెట్టి ముస్తాబుచేసేది

వనబాలను చూచి అందరు పిల్లలూ "ఎంత మంచిపిల్లో ! ఎవరో చెప్మా ఈ పిల్ల" అనుకొన్నారు

వనబాలను చూచి "నీవు ఎక్కడికీ వెళ్ళవద్దు మా ఇంట్లోనే ఉండు. మనమిద్దఁమూ ఒక కంచములోనే తిని, ఒక మంచంమీదే పడుకొందాము మనమిద్దరమూ ఎప్పుడూ ఆడుకొంటూ ఉందాము రాత్రిళ్లు కథలు చెప్పుకొందాము ఏం ?" అన్నది లీలాసుందరి వనబాల మాట్లాడలేదు

వనబాల నిజంగా చిన్నపిల్ల కాదు అది అసలు మనిషిపిల్ల కానేకాదు అది ఒక రాక్షసి రాక్షసులు తమకే వేషము ఇష్టమయితే ఆ వేషము వేసుకొని తిరగగలరు లీలాసుందరితో ఆడుకొని ఆడుకొని ఎవరితోటీ చెప్పకుండా ఆమెను తీసుకుపారిపోదామని వచ్చింది ఆ రాక్షసి

ఆ రాక్షసి ఆడపిల్లవేషము వేసుకొని వనబాల అని పేరు పెట్టుకొని లీలాసుందరితోటీ, మిగిలిన పిల్లలందరితోటీ ఆడుకోవడానికి వచ్చింది

అసలు ఆ రాక్షసి పేరు చీకటిజీబూతం చీకటిజీబూతం అన్ని రాజ్యాలూ తిరిగితిరిగి చివరకు ఈ రాజ్యానికి వచ్చింది

చీకటిజీబూతం రాక్షసజన్మం ఎత్తడానికి ముందు ఒక రాజ్యములో ఒక పేదరాలై ఉండేది ఆ పేదరాలికి ఒక చక్కని కూతురుండేది ఆ కూతురుని అల్లారు ముద్దుగా పెంచుకొన్నది ఆ పేదరాలు

ఒకనాడు తన కూతురిని తీసుకొని ఆ పేదరాలు పొలములోకి వెళ్ళి కళ్లములో రాలిన గింజలు ఏరుకుంటూ ఉన్నది కూతురు దూరముగా ఆడుకొంటూ ఉన్నది వడి కట్టుకొని, వడి నిండేదాకా గింజలు ఏరుకొని, కూతురుకోసం ఇటూ అటూ తిరిగిచూచింది కదా కూతురు కనిపించింది కాదు "అమ్మాయీ" అని గొంతుకెత్తి గట్టిగాపిలిచింది ఎవరూ పలకలేదు కూతురుకోసమని అంతటా వెదికింది ఎక్కడా కనిపించలేదు చెట్టూ, పుట్టా, తోటా, దొడ్డీ, ఊరూ, వాడా, కొండలూ, అడవులూ అనకుండా అంతటా వెదికింది పాపం! దాని కూతురెక్కడా కనిపించలేదు సరికదా ఎవరూ కూడా "మేము చూచా" మని కాని "ఈలాగు వెళ్ళిం"దనికాని చెప్పలేకపోయారు మరి దాని జాడ తెలియలేదు

ఆ పేదరాలు మతిచెడి నిద్రాహారాలు లేకుండా కూతురుకోసం తిరిగితిరిగి బెంగపెట్టుకొని చివరకు చచ్చిపోయింది చచ్చిపోయి రాక్షసి అయి పుట్టింది పుట్టింది మొదలుకొని నేటివరకూ తన కూతురుకోసం అన్ని రాజ్యాలూ తిరిగి చూచింది చివరకు మన లీలాసుందరి కనిపించింది తన కూతురులాగే చక్కగా ఉందనీ, తన కూతురు ఆడే ఆటల్లాంటి ఆటలే ఆడుతోందనీ, తనకూతురులాగే మాట్లాడుతూ ఉందనీ, తన కూతురులాగే నవ్వుతూ ఉందనీ రాక్షసి చూచి లీలాసుందరిని తీసుకుపోవాలని ఊహించింది

ఆవేళ ఆటలైన తరువాత ఊరిపిల్లలందరూ పువ్వులూ, చొక్కాలూ, బొమ్మలూ, మిఠాయిలూ పట్టుకొని ఎవరింటికి వారు వెళ్ళిపోయారు

వనబాలా, లీలాసుందరీ కలిసి మరికొంతసేపు ఆడుకొని చెరువుగట్టున కూర్చున్నారు

"నక్షత్రాలు లెక్కపెట్టుకొందామా ?" అన్నది లీలాసుందరి

"ఇంత దూరంగా ఉండి నక్షత్రాలు లెక్కపెట్టడం ఎలాగమ్మా ?" అంది వనబాల

"నేను రోజూ లెక్కపెట్టుతున్నాను కాదూ ?" అంది లీలాసుందరి

"అలాగుకాదు లెక్కపెట్టడం నేను నిన్ను ఆ నక్షత్రాల దగ్గిరకే తీసుకువెళ్లుతాను వస్తావా ? దగ్గిరగా వెళ్ళాక వాటిని ఒకచోటికి చేర్చి పువ్వులు లెక్కపెట్టినట్లు లెక్కపెడదాము ఏం ?" అంది వనబాల

"నిజంగా నీవు నన్ను అక్కడికి తీసుకువెళ్ళగలవా ? నాకు భయమెయ్యదూ ?" అంది లీలాసుందరి

"భయమేమిటి ? నేను రోజూ అక్కడికి వెళ్లుతూనే ఉంటాను మనమిద్దరమూ అక్కడికి వెళ్ళాక తలదువ్వి ఎన్నో నక్షత్రాలు నీకు తల్లో పెడుతాను. తరువాత చొక్కాజేబులనిండా నక్షత్రాలు

పోసుకొని ఇంటికివద్దాము, ఏం ?'' అంది వనబాల

"అయితే ఎప్పుడు వెడదాము ?'' అని అడిగింది లీలాసుందరి "ఇప్పుడే'' అంది వనబాల ఇంతట్లోనే లీలాసుందరి నాన్నా, అమ్మా మేడమీదనుంచి కేకవేశారు.

"లీలాసుందరీ, లీలాసుందరీ, ఇంకా ఆటలు కాలేదే అమ్మా ? బువ్వ తిన్నాక, పాటలు పాడి బజ్జుందువు గాని, రా మా చిట్టితల్లివి కాదూ, మా లీలవు కాదూ ఎవరొస్తారో, ఎవరొస్తారో ''

"నేను ఇంకా ఆడుకోవాలి : నేనింకా రానమ్మా, నేను రాను వనబాలా, నేనూ ఇంకా ఆడుకొంటాము, మీకేం ?'' అంది లీలాసుందరి

"చీకటిపడింది కాదమ్మా ? రేపు మళ్లీ ఆడుకొందువుగాని, లే రా, అమ్మా, రా మా చిట్టితల్లివి కాదూ, మా లీలవు కాదూ? బువ్వ తిందువుగాని, రా ఎవరొస్తారో, ఎవరొస్తారో'' అని వాళ్లమ్మా, నాన్నా పిలిచారు

"నేను నక్షత్రాల దగ్గిరకి వెళ్లి, తల్లో నక్షత్రాలు పెట్టుకొని, జేబులనిండా నక్షత్రాలు పోసుకొని, అప్పుడు వస్తాను నా కింకా ఆకలవడంలేదమ్మా'' అంది లీలాసుందరి

వాళ్లమ్మా, నాన్నా లీలాసుందరిని ఎత్తుకొని ముద్దెట్టుకొంటూ తీసుకువెళ్లవలెనని మేడదిగి వస్తున్నారు

ఇంతట్లోనే వనబాల లీలాసుందరిని తన భుజాల మీద కూర్చోపెట్టుకొని పై కెగిరి రంయిమని తీసుకుపోయింది

వాళ్లమ్మా, నాన్నా మేడదిగి, "రా, అమ్మా, రా, మా చిట్టితల్లివి కాదూ, మా లీలవు కాదూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో, ఎవరొస్తారో'' అనుకొంటూ వచ్చారు

వచ్చి చెరువుదగ్గిర చూచారుగదా లీలాసుందరి కనిపించింది కాదు తోటంతా వెదికారు లీలాసుందరి కనిపించింది కాదు "రా, అమ్మా, రా, మా చిట్టితల్లివి కాదూ, మా లీలవుకాదూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో, ఎవరొస్తారో'' అంటూ ఊరూ వాడా వెదికారు లీలాసుందరి కనిపించింది కాదు కోనా కొండా వెదికారు లీలాసుందరి కనిపించింది కాదు తిరిగితిరిగి విసిగివిసిగి వాళ్ల తోటలో చెరువు గట్టున కూర్చుని "ఎక్కడ దాగొన్నావమ్మా ? మా అమ్మా ! రా, అమ్మా, రా, మా చిట్టితల్లివి కాదూ, మా లీలవుకాదూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో, ఎవరొస్తారో'' అని రాత్రింబగళ్లు నిద్రాహారాలు మాని లీలాసుందరిని పిలుస్తున్నారు

రాత్రివేళ ఆదారిని పోయేవాళ్ళకు ఈ మాటలే వినిపిస్తూ ఉండేవి ఆ తోటలో చెట్లూ, చిలకలూ, నెమళ్లూ చెరువులో తామరపువ్వులూ, కలవపువ్వులూ, అన్నీ కూడా వాళ్ళమ్మానాన్నతోకూడా "రా, అమ్మా రా, మా చిట్టితల్లివి కాదూ, మా లీలవుకాదూ ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో ఎవరొస్తారో'' అని రాత్రీపగలూ దుఃఖించేవారు

# 2

వనబాల లీలాసుందరిని ఎత్తుకొని నక్షత్రాల దగ్గిరకు తీసుకువెళ్లడానికి బదులు ఎక్కడో కొండల్లోకి తీసుకు వెళ్లుతూ ఉంది కొంతసేపటిదాకా నక్షత్రాల దగ్గిరకే తీసుకువెళ్లుతూ ఉందని లీలాసుందరి అనుకొంది నక్షత్రాల దగ్గిరకి వెళ్లేటప్పుడు భయము వేస్తుందేమో అని కళ్ళు మూసుకుంది కొంతసేపైన తరువాత కళ్లుతెరచి పైకి చూచింది ఎక్కడి నక్షత్రాలు అక్కడే ఉన్నవి అడవుల మీదనుంచీ, చెరువుల మీదనుంచీ, ఏళ్ల మీదనుంచీ, వనబాల గబగబా గబగబా తీసుకు వెళ్లుతున్నట్లు కనబడింది లీలాసుందరికి భయమువేసి "వనబాలా, వనబాలా నన్ను నక్షత్రాల దగ్గిరికి తీసుకువెళ్లకుండా ఎక్కడికి తీసుకువెళ్ళుతున్నావు? నాకు భయమౌతుంది నేను రాను, నన్ను మళ్లీ ఇంటికి తీసుకువెళ్లు' అని వేడుకొంది

"కళ్ళు మూసుకో ,నేను తెరవమన్న దాకా కళ్లు తెరవకు నక్షత్రాలు నీకు నేను ఇస్తాను గాదూ" అంది వనబాల

లీలాసుందరి మళ్లీకళ్లుమూసుకున్నది మరికొంతసేపటికి కళ్లు తెరిచి చూచిందిగదా వనబాల ఆ పిల్లను ఒక కోనలో దింపింది ఆ కోన కొండలమధ్య ఉన్నది ఆ కోనలో ఒక పెద్ద మేడ ఉన్నది ఆ మేడచుట్టూ పువ్వుల మొక్కలు ఉన్నవి చెరువులున్నవి ఆ మేడలో బంగారు మంచాలూ, పట్టుపరుపులూ, బంగారు ఉయ్యాలాలు, బంగారు పంజరాలలో చిలకలూ, గోరింకలూ, అన్నీ ఉన్నవి

వనబాల లీలాసుందరిని ఆ మేడలోకి తీసుకువెళ్లింది

"నన్ను నక్షత్రాల దగ్గిరికి తీసుకువెడతానని ఇక్కడికెందుకు తీసుకు వచ్చావు? నన్ను ఇంటికి తీసుకు వెళ్లు మా అమ్మ దగ్గిరికి తీసుకువెళ్లు" అని లీలాసుందరి వనబాలతో అంది "ఇక్కడ నీకు నక్షత్రాలు ఇయ్యనా?" అంది వనబాల

"ఆకాశం మీద నక్షత్రాలుంటే ఇక్కడ ఏలాగిస్తావు ? మా యింటికి తీసుకువెళ్లవేం?" అని ఏడ్చింది లీలాసుందరి

"ఏడవకమ్మా, ఏడవకు ఇవిగో నీకు నక్షత్రాలు ఇవిగో" అని వనబాల బంగారు పెట్టెతీసి దానిలోని వజ్రాలు కుప్పలు కుప్పలుగా లీలాసుందరి ముందర పోసింది

"నాకు ఈ నక్షత్రాలు వద్దు నాకు ఆకాశంమీద నక్షత్రాలే కావాలి నా కివి వద్దు నన్నింటికి తీసుకుపో" అని మరీ ఏడ్చింది లీలాసుందరి.

"ఇదిగో చూడమ్మా, ఈ చిలకలు నిన్ను పిలుస్తున్నవి వాటికి జామిపళ్లూ, దానిమ్మ పళ్లూ పెట్టు ఇదిగో ఈ గోరువంకలతో మాట్లాడు నిన్ను పిలుస్తున్నాయి ఇవన్నీ నీవే తెల్లారిన తరువాత నీకు ఎన్నో పువ్వులిస్తాను మా అమ్మవు కదూ ! మా తల్లివికాదూ ఊరుకోవూ ! అంది" వనబాల

"నా కివేవీ అక్కర్లేదు, నన్నింటికి తీసుకువెళ్ళు, మా అమ్మా, నాన్నా దగ్గిరికి తీసుకువెళ్లు నే నిక్కడ ఉండను" అని లీలాసుందరి మరీ వెక్కి వెక్కి ఏడ్చింది

అప్పుడు వనబాలకు కోపము వచ్చింది "ఊరుకొంటావా, ఊరుకోవా? మీ అమ్మా, నాన్నా ఇక్కడ లేరు నేనే మీ అమ్మా, నాన్నాను, ఏడవకు, ఏడిస్తే నిన్ను భయపెడతాను చూడు" అంది వనబాల

ఎంత చెప్పినా ఏడుపు మానింది కాదు లీలాసుందరి "మా ఇంటికి తీసుకెళ్ళు మా ఇంటికి తీసుకెళ్ళు" అని అంటూనే ఉంది

అప్పుడు వనబాల రాక్షసిలాగున అయిపోయి లీలాసుందరి ఎదురుగా నిలుచుంది నల్ల మొద్దులాగుంది రాక్షసి ఎఱ్ఱటి కళ్ళు, బిరుసుజుట్టు, కోరలు తెల్లగా నోటిలో నుంచి బయటకు వచ్చినవి

"ఏడవకు ఇంక ఏడిస్తే నిన్ను మింగేస్తాను" అంది రాక్షసి

"వనబాలా ! వనబాలా ! నాకు భయము వేస్తూ ఉంది నన్ను ఇంటికి తీసుకు వెళ్ళవూ" అంది లీలాసుందరి

"నేనే వనబాలను నా పేరు అసలు చీకటిజీబూతం ఏడవకుండా ఇక్కడ ఉంటే నీకు పువ్వులూ, పళ్ళూ, బొమ్మలూ అన్నీ ఇస్తాను లేకపోతే జాగర్త " అంది రాక్షసి "నాకు నిన్ను చూస్తే భయమేస్తూ ఉంది నేనిక్కడ ఉండలేను అమ్మో !" అని లీలాసుందరి బావురుమంది గట్టిగా ఏడ్చింది

అప్పుడు రాక్షసి మళ్లీ వనబాలలాగ ఆడపిల్ల వేషం వేసుకువచ్చి లీలాసుందరిని తన ఒళ్ళో కూర్చోబెట్టుకొంది ఏడ్చి ఏడ్చి లీలాసుందరి వనబాల ఒళ్ళో నిద్రపోయింది

కొన్నాళ్లదాకా లీలాసుందరి అన్నము ముట్టుకోలేదు రాత్రీ పగలూ ఒకే మోస్తరుగా ఏడుస్తూనే ఉంది ఏమి ఇచ్చినా ఊరుకోదు ఏమి చెప్పినా ఊరుకోదు

కొన్నాళ్లయిన తరువాత క్రమక్రమంగా వనబాల దగ్గిర అలవాటు పడింది పగలంతా వనబాల లీలాసుందరితో ఆడుకునేది రాత్రివేళ లీలాసుందరిని ఒక బంగారు తొట్టెలో పడుకోబెట్టి ఆ గది తలుపు తాళం వేసి ఎక్కడికో వెళ్ళిపోయేది లీలాసుందరి తెల్లవారి లేచి చూచేసరికి వనబాల ఎదురుగా కనుపించేది ఇద్దరూ కలిసి లేళ్ళతోటీ, పక్షులతోటీ, పువ్వులతోటీ, రోజల్లా ఆడుకొనేవారు ఈ రీతిగా కొంతకాలం గడిచింది

ఒకనాడు సాయంకాలము వనబాలా, లీలాసుందరీ కలిసి చెరువు గట్టున ఆడుకొంటున్నారు చెరువులో బాతులు ఈదుతున్నవి చెరువునిండా ఎఱ్ఱటి కమలాలున్నవి లీలాసుందరిని ఒళ్లో కూర్చోబెట్టుకొని తల్లో పువ్వులు పెట్టుతూ ఉంది వనబాల

"వనబాలా, వనబాలా, మరి నన్ను ఆ వేళ రాక్షసినని చెప్పి ఎందుకు జడిపించావు ? నిజంగా నీవు రాక్షసివేనా ?"అంది లీలాసుందరి

"అబ్బే, ఉత్తది ఊరికే నిన్ను భయపెట్టాలని అలా వేషం వేసుకొన్నాను" అంది వనబాల

"మరి నీ పేరు చీకటిజీబూతం అని చెప్పావు కాదూ ?" అన్నది లీలాసుందరి

"నిన్ను భయపెట్టడానికే అట్లా చెప్పాను నా పేరు వనబాలే" అంది వనబాల

"మరి మా అమ్మా నాన్నా దగ్గరకు ఎప్పుడు తీసుకువెడతావు? చెప్పవు వనబాలా?" అంది లీలాసుందరి.

"నేనున్నాను కాదూ నీకు? మీ అమ్మా నాన్నా ఎందుకు ఇంకాను" అంది వనబాల

"ఆ, అమ్మా, నాకక్కర్లేదు, నాకక్కర్లేదు, నాకు మా అమ్మా, నాన్నా కావాలి నీవుకూడా నాతో ఉందువుకాని మా అమ్మా, నాన్నా దగ్గిర నన్ను తీసుకు వెళ్లవూ, వనబాలా?" అని అడిగింది లీలాసుందరి

"అదుగో చూడు ఆ బాతులెల్లా ఆడుకొంటున్నాయో" అని వనబాల ఈదుతున్న బాతులను చూపించింది

"ఆ బాతుల్ని ఇలాపిలు, వనబాలా, వాటిని ఈ గట్టుమీద ఆడిద్దాము" అని లీలాసుందరి అంది

వనబాల బాతుల్ని పిలిచింది కాని బాతులు భయపడి దూరందూరంగా పోయినవి ఎంత పిలిచినా అవి వనబాల దగ్గిరకి రాలేదు వనబాల కోప్పడి వాటిని గట్టిగా కేకవేసి పిలిచింది ఆ కేకకు లీలాసుందరి సైతం హడిలిపోయింది బాతులన్నీ గడగడలాడుతూ వచ్చినవి లీలాసుందరికి ఆ బాతులను అప్పగించి వనబాల దూరంగా కూర్చుంది లీలాసుందరి చాలా సేపు బాతుల్ని ఆడించి ఆడించి వాటిని మళ్లీ నీటిలో వదిలిపెట్టింది

"చీకటిపడింది, నిద్రపోదువుగాని రా" అని వనబాల లీలాసుందరిని పిలిచింది

"నన్ను నిద్రపోగొట్టి నీవు ఎక్కడికో వెళ్లిపోతావు నేను ఈ వేళ నిద్రపోను నీతోకూడా వస్తాను" అంది లీలాసుందరి

"నేనెక్కడికీ వెళ్లనులే, నీదగ్గిరే కూర్చొని నీవు నిద్రపోతుంటే ఎన్నో పాటలు పాడతాను రా, అమ్మా, రా" అని లీలాసుందరిని తీసుకువెళ్లి కడుపునిండా అన్నం పెట్టి బంగారు తూగుటుయ్యాలలో పడుకోబెట్టి పాడడం మొదలు పెట్టింది వనబాల చాలాసేపు పాడింది వనబాల

"లీలాసుందరి బంగరుబొమ్మా
లీలాసుందరి ముద్దులగుమ్మా
కొండల ఆవల కోటొక టుంది
కోటలోపల గుడి ఒకటుంది
గుడిలో ఉండే తోటపువ్వులు
లీలాసుందరి ముత్యాల్నవ్వులు
లీలాసుందరి పడుకోవమ్మా
లీలాసుందరి బంగరుబొమ్మా"

అంటూ చాలాసేపు పాడింది ఈ పాట వింటూ ప్రతిరోజూ లీలాసుందరి నిద్రపోయేది ఈ రాత్రిమాత్రం కళ్లు మూసుకొని నిద్రపోయినట్లు నటించింది వనబాల ఆమె ముఖం చూచి, కళ్లు చూచి, నిజంగా నిద్రపోయిందనుకొని

"లీలాసుందరి బంగరుబొమ్మా

లీలాసుందరి ముద్దులగుమ్మా"

అని పాడుకొంటూ, ఆలస్యమయింది ఆలస్యమయింది అనుకొంటూ, గది తలుపు తాళం వెయ్యడం మరచిపోయి ఎక్కడికో వెళ్లిపోయింది

వనబాల వెళ్ళిపోయిన కొంతసేపటికి లీలాసుందరి నిమ్మళంగా పక్కమీదనుంచి లేచింది తూగుటుయ్యాల దిగింది చేత్తో దీపం పట్టుకొని ఆ ఇంట్లో ఏమున్నదో చూతామని బయలుదేరింది మొట్టమొదట చిలకదగ్గిర కొచ్చి నిలబడింది

"నిద్ర పోలేదమ్మా లీలాసుందరీ?" అంది చిలక

" ఈ వేళ నేను నిద్రపోలేదు ఈ ఇంట్లో ఏముందో చూద్దామని వచ్చాను" అంది లీలాసుందరి

"ఆ రాక్షసికి తెలిస్తే మింగేస్తుంది సుమా !" అంది చిలక

"రాక్షసి ఎవరు?" అని అడిగింది లీలాసుందరి

"నీవు వనబాల అని పిలుస్తావూ, అదీ అది వనబాలాగాదు, గినబాలాగాదు అది రాక్షసి దాని పేరు చీకటిజీబూతం" అంది చిలక "ఇప్పుడెక్కడికి వెళ్లింది మరీ?" అని అడిగింది లీలాసుందరి

"రాత్రిళ్లు మనుష్యులూ, పశువులూ ఉండేచోట్లకు వెళ్లి కడుపునిండా పశువులనో, మనుష్యులనో తిని తెల్లవారే వేళకు వస్తుంది" అని చిలక చెప్పింది

"అమ్మయ్యో!" అని లీలాసుందరి కేకవేసింది

"నీ కేమి భయములేదమ్మా, నిన్నే మీ చెయ్యదులే" అని ఓదార్చింది చిలక

"మరి నీ వెవరవు?" అని లీలాసుందరి చిలక నడిగింది.

"నేనూ నీలాగే ఒక చక్కని ఆడపిల్లను మా నాన్నా, అమ్మా దగ్గిర పడుక్కొంటే వాళ్లు చూడకుండా ఈ రాక్షసి నన్నిక్కడకు తీసుకు వచ్చింది నీవు రాకముందు నాతో ఎంతో ముచ్చటగా ఆడేది నాకు బొమ్మలూ అన్నీ తెచ్చియిచ్చేది నీవు వచ్చాక నన్ను చిలకగా మార్చి ఈ పంజరములో పెట్టి నన్ను చూపించి నిన్ను ఆడిస్తూ ఉంది" అని ఏడుస్తూ చిలక చెప్పింది లీలాసుందరికూడా ఏడ్చింది పాపము

"మరి ఈ గోరువంకలూ, బాతులూ, జింకలూ ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చాయి?" అని లీలాసుందరి అడిగింది

"అవన్నీ మనలాంటి ఆడపిల్లలే! ఏ రాజ్యంలో ఎక్కడ ఆడపిల్ల లగుపించినా వాళ్లనందరినీ

తీసుకువచ్చి కొన్నాళ్లు వాళ్లతో ఆడుకొని తరువాత వాళ్లను గోరింకలుగానో, బాతులుగానో, జంతువులుగానో మార్చివేస్తుంది ఈ రాక్షసి'' అని చిలక చెప్పింది

"అయ్యో, అయ్యో, మరి నన్నూ మార్చివేస్తుంది గాబోలు ఏమి చేసేది? నాకు భయము వేస్తోంది, ఏమిచేసేది?'' అని లీలాసుందరి దిగులుపడింది

"నిన్ను మార్చదులే అమ్మా నీవు దాని కూతురులాగ - అచ్చంగా దాని కూతురులాగ ఉన్నావట అంచేత నిన్ను మార్చదు'' అని చిలక చెప్పింది

"ఈ ఇంట్లో ఇంకా ఏముందో చూచిరావద్దూ?'' అని ఇచిలకను అడిగింది లీలాసుందరి

"మెల్లగా వెళ్లి చూచిరా నేను ఈ మాటలన్ని నీతో చెప్పానని రాక్షసితో చెప్పేవు సుమా! తల్లీ మమ్మల్ని చంపేస్తుంది '' అని చిలక అన్నది

"చెప్పను, చిలకా, చెప్పను'' అని లీలాసుందరి ఆ ఇంట్లో ఉన్న గదులన్నీ చూడడానికి వెళ్లింది ఒక గదినిండా బంగారమూ, వజ్రాలూ, మాణిక్యాలూ, కెంపులూ ఉన్నవి ఇంకో గదినిండా పట్టుబట్టలూ, జరీబట్టలూ ఉన్నవి ఇంకోగదిలో అనేక రకాల పువ్వులూ, పళ్లూ ఉన్నవి ఇంకోగదిలో ఎముకలూ, తోళ్లూ కంపుకొట్టుతూ ఉన్నవి లీలాసుందరికి భయమువేసి చక్కావస్తూ వుంటే "లీలాసుందరీ, లీలాసుందరీ'' అని కేక ఇంకో గదిలో నుంచి వినిపించింది ఆ గదిలో ఏమున్నదో చూద్దామని లీలాసుందరి వెళ్లి చూచింది అందులో ఒక చిరతపులి ఉంది దానిని చూచి చూడడంతోనే లీలాసుందరి భయపడి పారిపోబోయింది కాని, చిరుతపులి "పారిపోబోకమ్మా, నేను నిజంగా చిరతపులినిగాను, నేనుకూడా నీలాంటి చక్కని ఆడపిల్లనే నన్ను ఈ రాక్షసి ఇలాగ మార్చివేసింది' అని చెప్పింది అది

"నిన్ను ఇలాగ చిరతపులిలాగ ఎందుకు మార్చింది? మిగిలిన పిల్లల్ని బాతులుగాను, చిలకలుగాను, జింకలుగాను మార్చిందిగదా'' అని లీలాసుందరి అడిగింది

"నన్ను, ఊరి వెలుపల ఆడుకుంటూ ఉంటే ఈ రాక్షసి పట్టుకొని ఇక్కడికి తేబోయింది నేను ఏడ్చి కేకలు వేసి దానితో దెబ్బలాడాను కాని నా నోరుమూసి బలవంతాన ఇక్కడికి తీసుకువచ్చింది ఇక్కడికి వచ్చాక నాకు నగలూ, బట్టలూ, పువ్వులూ, పళ్లూ, బొమ్మలూ ఇచ్చి, నాతో ఆడుకోవాలని ఎంతో ప్రయత్నించింది నేను దానిని కొట్టీ, తిట్టీ, మొగమూ ఒళ్లూ రక్కీ ఎంతో గోలచేశాను అందుకని నామీద కోపం వచ్చి నన్ను చిరతపులిగా మార్చివేసి ఈ గదిలో పెట్టింది ఈ మాట చెప్పానని దానితో అనకు మా తల్లీ'' అని చిరతపులి కంట నీరు పెడుతూ చెప్పింది

"నన్ను కూడా నీలాగ మారుస్తుందేమో'' అని లీలాసుందరి ఏడ్చింది

"నిన్ను మార్చదులే అమ్మా నీవు మంచిపిల్లవు నిన్ను చూస్తే దానికి చాలా ఆపేక్ష'' అని చిరతపులి చెప్పింది

"మరి మనమందరమూ ఇక్కడనుంచి వెళ్ళిపోవడం ఎలాగ?'' అని లీలాసుందరి అడిగింది

"రాత్రివేళ నీ గది దగ్గిర నన్ను కాపలాపెట్టమని దానితో చెప్పు తరువాత నేను ఉపాయం ఆలోచిస్తానులే" అంది చిరతపులి లీలాసుందరి 'సరే' అన్నది

లీలాసుందరి దీపం పట్టుకొని మెల్లిగా తనగదిలోకి వెళ్లి ఏమీ ఎరగనట్లు పడుకొంది.

లీలాసుందరి చాలసేపు నిద్రపోలేదు ఇంతట్లోకే వనబాల వచ్చి

"లీలాసుందరి మేలుకోవమ్మా
లీలాసుందరి బంగరు బొమ్మా
పళ్ళూ పువ్వులు తెచ్చా నమ్మా
బాగా ఆటలు ఆడాలమ్మా
లీలాసుందరి మేలుకో వమ్మా
లీలాసుందరి బంగరు బొమ్మా" అని పాట పాడింది

"రాత్రి బాగా నిద్రపట్టిందా?" అని వనబాల లీలాసుందరిని అడిగింది

"నాకు రాత్రల్లా భయంవేసింది నాతోకూడా పడుకుంటానని చెప్పి నీవు ఎక్కడికో వెళ్ళిపోయావు ఇంక నే నొక్కర్తెనూ ఈ గదిలో పడుకోలేనమ్మా, నేనూ నీతో వస్తాను" అంది లీలాసుందరి

"నీకు భయంలేదులే, నేను నీ దగ్గిరే ఉంటాను" అంది వనబాల.

"అన్నీ ఉత్తమాటలే నన్నుకూడా రాత్రిళ్లు నీతో తీసుకువెళ్లు లేకపోతే నాగదికి ఎవర్నైనా కాపలా పెట్టు లేకపోతే నేనొక్కర్తెను పడుకోలేను" అంది లీలాసుందరి

" ఎవరిని కాపలా పెట్టమన్నావు ? ఆ చిలకనూ, గోరింకలనూ పెట్టనా ? " అని అడిగింది వనబాల

" అవి ఏమి చేస్తాయి ఏమిటి? నాకు భయం పోతుందా ఏమిటి ?అవి నాకక్కరలేదు" అంది లీలాసుందరి

"పోనీ, లేడిని కాపలా పెట్టనా ? " అని అడిగింది వనబాల

" అదీ నాకక్కర్లేదు" అంది లీలాసుందరి

" మరెవరిని పెట్టమన్నావు ? " అంది వనబాల

" ఎవరంటే నాకు భయముందో వారిని" అని లీలాసుంచరి చెప్పింది

" మరీ నాదగ్గర ఒక చిరుతపులి ఉంది దానిని కాపలా పెట్టేదా ? " అని అడిగింది వనబాల

"చిరతపులి నన్ను కరవదూ ?" అని లీలాసుందరి అడిగింది.

" అది కరిచే చిరుతపులి కాదు" అని వనబాల చెప్పింది

" అయితే నా గది దగ్గర దాన్ని కాపలాపెట్టు అప్పుడు నాకు భయము వెయ్యదు నేను బాగా నిద్రపోతాను " అంది లీలాసుందరి

" సరేలే" అంది వనబాల

సాయంకాలం వనబాల, లీలాసుందరీ కలిసి బయలులో ఆడుకోవడానికి వచ్చారు అప్పుడు లీలాసుందరి అందిగద! " నీవు నాకు ఎన్నో ఆటలు చెప్పావు కాని ఒక ఆట చెప్పావు కావు మనిషిని పక్షిలాగ మార్చడం, మళ్లీ పక్షిని మనిషి లాగ మార్చడం, అలాగే జంతువులను మార్చడం ఎలాగో చెప్పవూ వనబాల?'

" అలాంటి ఆట నాకు చేతకాదు లీలాసుందరీ" అంది వనబాల

" ఆ, అమ్మా, ఉత్తది, ఉత్తది - నీకు అన్నీ ఆటలు వచ్చును నాకు చెప్పవూ ? నాకు చెప్పవూ ?" అని లీలాసుందరి అడిగింది

"నాకు రాదమ్మా ఆ ఆట ఇంకా చాలా ఆటలు ఉన్నాయి కదూ, అవి చెప్పుతానులే" అంది వనబాల.

"నాకు ఆ ఆటలేమి వద్దు నాకు ఈ కొత్తాటే కావాలి చెప్పకపోతే నేను అన్నం తినను నిద్రపోను నీతో ఆటలాడను నే నేడుస్తూ ఒక చోట కూర్చుంటాను అని మంకుపట్టు పట్టింది లీలాసుందరి

" పోనీ , నీకు ఊరికే ఆ ఆట చెప్పుతాను, కాని ఎవరితోటీ నీవు మరి చెప్పకూడదు ఆ ఆట నీవు ఇక్కడ ఆడకూడదు ఆడితే ఏ పక్షైనా, జంతువైనా పెద్దపులి అయి నిన్ను మింగివేస్తుంది ఎప్పుడూ ఆ ఆట ఆడనంటే చెప్పుతాను" అంది వనబాల.

"ఎప్పుడూ ఆడనులే, చెప్పు" అన్నది లీలాసుందరి

అప్పుడు వనబాల ఒక బంగారు కడ్డీ లీలాసుందరికి చూపించి "దీనితో ఎవరినైనా ముట్టుకుంటే ఏమికావాలంటే అది అవుతారు ఈ జింకపిల్లను ఇప్పుడు తాకుతున్నాను చూడు ఇది బాతు అయి చెరువుకేసి పరుగెత్తుతూ ఉంది మళ్ళీ దాన్ని జింకగా మార్చివేస్తా చూడు దీనితో ముట్టుకొని, అది జింక పిల్ల అయిపోయి గరిక మేస్తూ ఉంది" అని వనబాల బంగారు కడ్డీ లీలాసుందరికి చూపించింది ఆ బంగారు కడ్డీ లీలాసుందరి కిమ్మంటే ఇచ్చిందికాదు

కాని లీలాసుందరి ఆరోజు ఇంటికి వెళ్ళాక బంగారు కడ్డీ వనబాల ఎక్కడ దాచిందో కనిపెట్టి చూచింది

ఆ రోజు రాత్రి చిరతపులిని కాపలాపెట్టి లీలాసుందరిని నిద్రపోయేటట్లు జోకొట్టి వనబాలని ఎక్కడికో వెళ్ళిపోయింది

రాక్షసి వెళ్లిపోయింతరువాత లీలాసుందరి లేచి బంగారు కడ్డీ తీసుకువచ్చి చిరుతపులినీ, చిలకలనూ, గోరింకలనూ, జింకలనూ, బాతులనూ అన్నింటినీ ముట్టేసుకుంది అన్నీ ఆడపిల్లలయిపోయినవి. వాళ్లందరితోటీ ఆ రాత్రి చాలాసేపు ఆడుకొని మళ్లీ తెల్లారకముందు బంగారుకడ్డీతో వాళ్లందరినీ ముట్టుకొంది అందరూ మళ్లీ ఎవరిచోటికి వాళ్లు వెళ్లిపోయి నిద్రపోయారు

లీలాసుందరి బంగారుకడ్డీ ఎప్పటిస్థలంలో పెట్టి తూగుటుయ్యాలలో నిద్రపోయింది

తెల్లారినతరువాత వనబాల ఇంటికివచ్చేసరికి అన్నీ ఎప్పటిలాగే ఉన్నవి వనబాల లీలాసుందరి గదిలోకి వెళ్లి,

"లీలాసుందరి మేలుకోవమ్మా

లీలాసుందరి బంగరుబొమ్మా"

అంటూ పాటపాడి లీలాసుందరిని లేపి ఆటలు ఆడుకోవడం మొదలుపెట్టింది

ప్రతిరోజూ రాత్రి లీలాసుందరి పక్షులనూ, జంతువులనూ ఆడపిల్లలలాగున మార్చివేసి వారితో హాయిగా ఆడుకుంటూ ఉండి విచారం మరిచిపోయింది

# 3

కొన్ని సంవత్సరాలు ఈ రీతిగా గడచినవి

లీలాసుందరి ఇప్పుడు పెద్దపిల్ల అయినది ఆమెకు యౌవనము వచ్చింది బంగారుతీగలాగ మిసమిసలాడుతూ ఉంది లీలాసుందరితో పాటు అక్కడ ఉన్న ఆడపిల్లలందరికీ కూడా యౌవనము వచ్చింది

అందరూ కలిసి రాక్షసి దగ్గిరనుంచి తప్పించుకుపోవాలని ఆలోచిస్తూన్నారు

లీలాసుందరిని ఒక రాక్షసుడి కిచ్చి పెళ్ళిచేద్దామని వనబాల అనుకొంటూ ఉంది మిగిలిన ఆడపిల్లలందరిని లీలాసుందరికి దాసీలుగా చేద్దామనికూడా అనుకొంటూ ఉంది

చిరతపులి ప్రతీరాత్రీ లీలాసుందరి గదిముందర ఉండేది అందరు ఆడపిల్లలతోబాటు తానూ ఆడపిల్ల అయి ఆడుకొన్నంతసేపూ ఆడుకొని, మళ్ళీ చిరతపులి అయి ఆ గదిముందరే నిద్రపోయేది

పగటివేళల్లో చిరతపులి చుట్టుపట్ల ఉన్న అడవులలోనూ, కొండలలోనూ తిరుగుతూ ఉండేది

ఒకనాడు ఉదయం చిరతపులి ఒక అడవిలో తిరుగుతూ ఉంటే పెద్ద చప్పుడు వినిపించింది దానికి డప్పుల చప్పుడూ, కుక్కల భొంయి భొంయి మనే అరుపులూ గుర్రాల సకిలింపులూ, మనుష్యుల గోలా-అన్నీ కలిసి చిరతపులికి వినిపించినవి చిరతపులి "ఏమిటి చెప్మా ఈ గోల" అని అక్కడ నిలబడి చూచింది కొంతసేపటికి ఒక రాజకుమారుడు నౌకర్లతోనూ, వేటకుక్కలతోనూ వేటకు వచ్చి ఒక జింకను తరుముతూ ఉండడమూ చూచింది

జింకపిల్ల ముందుకు చెంగుచెంగున పరుగెత్తుతూ ఉంది దాని వెనక రాజపుత్రుడు గుర్ర ఎక్కి దౌడాయించుకొంటూ వస్తున్నాడు అతడు జింకమీద వేసిన బాణాలు దానికి తగలలేదు చిరతపులి వాళ్ళ కగుపించకుండా జింక వెనకే పరుగెత్తి వెళ్లింది

రాజపుత్రుడు జింకకోసమని నౌకర్లను వెనక వదలివేసి ఒక్కడూ వస్తున్నాడు చిరతపులి కుక్కల నన్నింటినీ పొదలలోకి ఈడ్చుకెళ్లి చంపేసింది తరువాత రాజపుత్రుడు చూస్తూ ఉండగానే జింకను పట్టుకొని చంపివేసింది

రాజపుత్రుడికి కోపం వచ్చింది చిరతపులిని తరమడం మొదలుపెట్టాడు చీకటిపడేదాక రాజపుత్రుణ్ణి చిరతపులి అటూ ఇటూ తిప్పుతూ తిరిగి, చివరికి చీకటిపడ్డ తరువాత రాజపుత్రుణ్ణి రాక్షసి ఇంటి దగ్గరికి తీసుకువచ్చి తాను ఇంట్లో దూరిపోయింది

రాజపుత్రుడు గుర్రాన్ని దిగి ఒక చెట్టుకు కట్టివేసి ఆ ఇంట్లో ప్రవేశించాడు

లీలాసుందరి అప్పుడేలేచి బంగారు కడ్డీ చేత్తో పుచ్చుకొని బయటకు వస్తున్నది లీలా సుందరిని చూసి రాజపుత్రుడు నిలబడ్డచోటే నిలిచిపోయాడు

లీలాసుందరి రాజపుత్రుణ్ణి చూసి "ఎవరు చెప్మా ఈ అబ్బాయి,ఇంత అందంగా ఉన్నాడు' ' ఎవరు చెప్మా అనుకొంది

"ఇంత అందమైనపిల్ల ఈ కొండల్లో ఎందుకుంది చెప్మా" అని రాజపుత్రుడనుకొన్నాడు

కాని లీలా సుందరికి ఒక అనుమానం వేసింది వనబాల తనకిచ్చి పెళ్లి చేస్తానన్న రాక్షసుడే ఈ రూపంతో వచ్చాడేమో అనుకొంది

"నీ వెవరువు? ఇక్కడ కెందుకు వచ్చావు" అని అడిగింది

"నా పేరు రాజమౌళి, నేను వేటాడుతూ ఉంటే ఒక చిరతపులి వచ్చి నా కుక్కలను చంపివేసి నేను వేటాడే జింకను చంపివేసి ఇక్కడికి వచ్చింది దానిని వెంబడించి నేను వచ్చాను" అని చెప్పాడు

ఇంతట్లోకే చిరతపులి వచ్చి "నీకోసమే ఈ రాజపుత్రుణ్ణి ఇక్కడకు తీసుకువచ్చాను" అని లీలా సుందరితో చెప్పింది

అప్పుడు లీలాసుందరీ, రాజమౌళీ చిరతపులిని దువ్వి ముద్దెట్టుకొన్నారు

"ఇంత అందమైన పిల్లవు నీ వీకొండల్లో ఎందుకున్నావు? నీ పేరు ఏమిటి?" అని రాజమౌళి అడిగాడు

"నా పేరు లీలాసుందరి నన్ను చిన్నప్పుడే ఒక రాక్షసి ఇక్కడికి తీసుకువచ్చి పెంచుతూ ఉంది నాలాగే ఇంకా చాలా మంది ఆడపిల్లల్ని తీసుకువచ్చి చిలకలుగానూ, గోరింకలుగానూ, బాతులుగానూ, జింకలుగానూ మార్చి వేసింది ఈ చిరతపులి కూడా ఒక ఆడపిల్లే" అని లీలాసుందరి కంట నీరు పెట్టుకొని చెప్పింది

"మరి, ఆ రాక్షసి ఏదీ?" అని రాజమౌళి అడిగాడు

"రాత్రిళ్లు ఎక్కడికో వెళ్లిపోయి తెల్లారేటప్పటి కల్లా వచ్చేస్తుంది" అని లీలాసుందరి చెప్పింది

"నిన్ను మా ఊరు తీసుకుపోతాను వస్తావా, లీలాసుందరీ?" అని రాజమౌళి అడిగాడు

"నన్నూ, మిగిలిన ఆడపిల్లలనూ కూడా తీసుకు వెళ్లవూ?" అంది లీలాసుందరి

"ఈ చిరతపులినీ, చిలకలనూ వీటినీ ఎలా తీసుకు వెళ్లడం?" అన్నాడు రాజమౌళి

అప్పుడు లీలాసుందరి బంగారు కడ్డీతో చిలకలనూ, గోరింకలనూ, బాతులనూ, జింకలనూ, చిరుతపులినీ ముట్టుకుంది అందరూ తామరతీగల్లా మెరిసిపోయే ఆడపిల్లలయిపోయారు వాళ్లందరినీ చూచి రాజమౌళి ఆశ్చర్యపోయాడు

"నన్నూ, ఈ పిల్లలనూ ఇక్కడి నుంచి తీసుకు వెళ్లవూ?" అని లీలాసుందరి మళ్లీ అడిగింది

"నన్ను పెళ్లాడుతానంటే తీసుకువెడతాను" అన్నాడు రాజమౌళి లీలాసుందరి మాట్లాడకుండా సిగ్గు చేత తల వంచుకొంది

తరువాత రాజమౌళీ, లీలాసుందరి, మిగిలిన ఆ పిల్లలూ అందరూ కలిసి చెరువు చెంత తోటలో వెన్నెట్లో చేయీ చేయీ పట్టుకొని చాలా ఆటలు ఆడుకొన్నారు

లీలాసుందరికి ఆ రోజున కలిగిన సంతోషం ఇంతా అంతా గాదు

చాలాసేపు వాళ్లందరూ ఆడుకొని తెల్లారితే రాక్షసి వస్తుందనుకొని అక్కడ నుంచి వెళ్లిపోవడానికి సిద్ధపడ్డారు.

లీలాసుందరి బంగారుకడ్డీతో ముట్టుకొని ఆడపిల్లలనందరినీ చిలకల కింద మార్చి వేసి తమతో రమ్మని చెప్పింది

తరవాత రాజమౌళీ, లీలాసుందరీ కలిసి గుర్రాన్నెక్కి ప్రయాణమయారు

అడవుల్లో గబగబా గుర్రము పరుగెత్తుతూ ఉంది వారితో కూడా ఆకాశం మీద చిలకలు పరుగెత్తుకొంటూ వస్తున్నాయి

కొంతదూరం వెళ్లిన తరువాత తూర్పు తెలతెల వారడం మొదలుపెట్టింది

రాక్షసి రాత్రి తిరిగి తిరిగి తెల్లారుతూ ఉండగా ఇంటికి వచ్చి చూచుకొంది గదా ఇంట్లో లీలాసుందరీ లేదు, చిలకలూ లేవు, బాతులూ లేవు, గోరింకల్లూ లేవు, జింకలూ లేవు, చిరతపులీ లేదు

"అయ్యో, అయ్యో, వీళ్లందరూ ఎక్కడికో పారిపోయారు కాబోలు" అని రాక్షసి గట్టిగా ఏడ్చింది ఇల్లంతా నలుదిక్కులా బాగా వెదికింది ఎక్కడా వాళ్లు కనిపించకపోతే బయటికి వచ్చి ఏవైపు వెళ్లారో ముక్కుతో నాలుగు దిక్కులూ వాసనచూచి కనుక్కొని అటువైపు పెద్ద కేకలు వేసుకొంటూ గబగబా పరుగెత్తుకొంటూపోయింది

రాజమౌళికీ, లీలాసుందరికీ రాక్షసికేకలు వినబడ్డవి వెనకకు తిరిగి చూశారు అది దగ్గిరగా వస్తూ ఉంది వారు గుర్రాన్ని గబగబా పరుగెత్తించారు చిలకలు కూడా ఆకాశం మీద నుంచి భయంతో కిలకిలమంటూ పరుగెత్తుతున్నవి రాక్షసి గబగబా అంతకంతకు దగ్గిరగా వస్తోంది ఇంక గుర్రం మీదుంటే వచ్చి పట్టుకొంటుందని వాళ్లు గుర్రాన్ని దిగి అక్కడో పెద్ద మర్రిచెట్టుంటే ఆ మర్రి చెట్టెక్కేరు చిలకలు కూడా మర్రిచెట్టు మీదికి వచ్చాయి

ఇంతట్లోకి రాక్షసి మర్రిచెట్టు దగ్గరికి వచ్చి మర్రిచెట్టు ఇటూ అటూ ఊపేసింది

వాళ్ళకు మర్రిచెట్టులో ఒక పెద్ద తొర్ర కనిపించింది లీలాసుందరి, రాజమౌళీ, చిలకలూ అందరూ కలిసి చెట్టుతొర్రలో దూరిపోయారు ఆచెట్టు తొర్రలోనుంచి నిమ్మళంగా అడుక్కి దిగిపోయారు

రాక్షసి వాళ్లందరూ చెట్టుమీదికి ఎక్కి చెట్టుతొర్రలో దూరిపోవడం చూచింది

తానుకూడా చెట్టుతొర్రలో దూరుదామని చెట్టుఎక్కి ఒక ఎలకపిల్ల అయి తొర్రలో దూరింది అప్పుడు లీలాసుందరి చిలకలన్నిఒంటినీ బంగారుకడ్డీతో ముట్టుకొంది అవన్నీ పిల్లులైపోయినవి పిల్లులు ఆ ఎలకమీదపడి చంపెయ్యబోతే అప్పుడు రాక్షసి తాను కుక్క అయి పిల్లులమీద భొంయి భొంయి మంటూ పడింది లీలాసుందరి మళ్లీ పిల్లులన్నింటినీ బంగారు కడ్డీతో ముట్టుకొంది అవన్నీ చిరతపులులైపోయినాయి చిరతపులులు ఆ కుక్కమీద పడబోతూఉంటే రాక్షసి భయపడి పెద్దపులి అవబోయింది కాని చెట్టుతొర్రలో దాని వళ్లు పట్టలేదు అందుచేత చెట్టుతొర్రలో నుంచి బయటికి వచ్చింది అది బయటకు పోగానే లీలాసుందరి పులులను చిలకలకింద మార్చి వేసింది అందరూ చెట్టుతొర్రలో ఉంటారు గదా అనుకొని రాక్షసి ఆ చెట్టువేళ్లతో కూడా పైకి ఊడబెరికి బుజంమీద పెట్టుకొని ఇంటికి తీసుకువెళ్లిపోయింది

రాజమౌళీ, లీలాసుందరీ, చిలకలూ రాక్షసి చెట్టు ఊడబెరకడానికి ముందే తొర్రలోనుంచి భూమిలోకి మార్గం ఉండడం చూచి భూమిలోకి దిగిపారిపోయారు అక్కడ నుంచి ఎక్కడికి వెళ్ళడానికీ దారిలేదు పైకివస్తే రాక్షసి చంపిపోతుందేమో అని భయం అప్పుడు ఆలోచించి లీలాసుందరి చిలకలన్నింటినీ బంగారు కడ్డీతో ముట్టుకొంది అవి అన్నీ పందికొక్కులైపోయి అక్కడినుంచి ఒక పెద్ద సొరంగం గబగబా తవ్వుకొంటూ పోయినవి ఆ సొరంగంలోనుంచి రాజమౌళి, లీలాసుందరీ గబగబా నడిచి వెళ్లుతున్నారు సొరంగం అంతా చీకటిగా ఉంది అప్పుడు బాగా ఆలోచించి, గుడ్లగూబకు చీకట్లో కళ్లు కనబడతవి గదా అని లీలాసుందరి తన బంగారు కడ్డీతో రాజమౌళిని ముట్టుకొంది అతడు గుడ్లగూబ అయిపోయినాడు ఆ గుడ్లగూబ ఆ చీకటి సొరంగములో ఆమెకు దారి చూపించింది ఆ దారివెంబడే ఆమె నడిచి వెళ్ళగా వెళ్ళగా ఒకచోట కొంచెం సూర్యకాంతి కనిపించింది. ఆ సూర్యకాంతి వచ్చిన దిక్కుకేసి ఆమె నడిచి వెళ్ళింది

వెళ్ళగా వెళ్ళగా ఒకచోట బయలు కనిపించింది అందరూ ఆ బయలులోకి వెళ్ళారు లీలాసుందరి బంగారుకడ్డీ పుచ్చుకొని గుడ్లగూబను రాజమౌళిగాను పందికొక్కులను మళ్లీ ఆడపిల్లలుగాను మార్చివేసింది

రాజమౌళీ, లీలాసుందరీ, మిగిలిన ఆడపిల్లలు కలిసి ఆ బయలులో కొంతదూరం నడిచివెళ్లగా అక్కడ ఒక చెరువు కనిపించింది ఆ చెరువుచుట్టూ పళ్ల చెట్లూ పువ్వుల చెట్లూ ఉన్నవి వాళ్లందరూ అక్కడ పళ్లుకోసుకొని కడుపునిండా తిని, పువ్వులుకోసుకొని తలనిండా పెట్టుకొని ఒకనీడను పడుకొని నిద్రపోయారు కొంచెం చల్లబడిన తరువాత అందరూలేచి ఒకకాలితోవను నడిచి వెళ్ళారు

వెళ్ళగా వెళ్ళగా వాళ్ళకు ఒకచోటనుంచి ఏడుపు వినిపించింది 'ఏమిచెప్మా' అని వాళ్ళు ఆ వైపుకు వెళ్ళారు అక్కడ ఒక రాజూ, ఆరాజు భార్యా కలిసి అంటున్నారు గదా !" రా, అమ్మా రా మా చిట్టితల్లివి కాదూ, మా లీలవుకాదూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో, ఎవరొస్తారో" అని

చెరువుగట్టున కూర్చుని వాళ్ళమ్మా, నాన్నా చేతులు చాపి, కళ్లంట నీళ్ళుకారుస్తూ, "రా, అమ్మా, రా, మా చిట్టితల్లివిగదూ, మా లీలవుకాదూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో, మా లీలొస్తుందో, ఎవరొస్తారో" అంటున్నారు

లీలాసుందరి గబగబ పరుగెత్తుకువెళ్ళి వాళ్ళమ్మనూ, నాన్ననూ కౌగిలించుకొని ముద్దెట్టుకొన్నది

"మా అమ్మే, మా అమ్మే వచ్చావా, లీలా, వచ్చావా ? మా చిట్టితల్లివి కదా, మా లీలవుకాదూ, మా కోసం మళ్ళీవచ్చావా ? మా అమ్మే, మా అమ్మే" అని ముద్దుపెట్టుకొంటూ వాళ్ళమ్మా, నాన్నా ఎంతో సంతోషించారు

లీలాసుందరి వాళ్ళమ్మతోనూ, నాన్నతోనూ రాజమౌళి సంగతీ, వనబాల సంగతీ తాను రాక్షసి ఇంట్లో ఎలాగ ఉన్నదీ అంతా చెప్పింది

రాజమౌళికీ, లీలాసుందరికీ తరువాత పెళ్లయింది ఆ రాజ్యంలోఉన్న రాజపుత్రులను పిలిపించి స్వయంవరం పెట్టించి మిగిలిన ఆడపిల్ల లందరికీ కూడా పెళ్లిళ్ల చేశారు

బుజంమీద మర్రిచెట్టు పెట్టుకొని రాక్షసి ఇంటికి వెళ్లి మర్రిచెట్టు కిందబెట్టి దానిని నిలువుగా చీల్చింది చెట్టుతొర్రలో లీలాసుందరీ ఎవరూ కనిపించలేదు కొమ్మలన్నీ వెదికి చూచింది ఎవరూ కనిపించలేదు "అయ్యో, అయ్యో" అనుకొంటూ ఆ చెట్టు అక్కడపారవేసి మళ్లీ చెట్టున్న దగ్గిరకి పరుగెత్తుకు వెళ్ళింది. అక్కడ సొరంగం చూచింది దానిలోకి లీలాసుందరీ వాళ్లూ వెళ్లారుగదా అనుకొని సొరంగంలో ప్రవేశించి నడిచి వెళ్ళుతోంది కేకలూ బొబ్బలూ పెట్టుకుంటూ వెళ్లుతోంది పెద్దఏడుపు ఏడుస్తూ వెళ్ళుతోంది

ఈ బొబ్బలూ ఈ కేకలూ విని రాజమౌళీ వాళ్లు కలిసి రాక్షసి వస్తుంది కాబోలు అనుకొని సొరంగం ఒక వైపు ద్వారం మన్నుతో బాగా కప్పివేయించారు రాక్షసి సొరంగంలో చీకటిలో తిరిగితిరిగి దారి తెలియక, పోనీ ఇంటికి వెళ్ళిపోదామని వెనక్కు తిరిగి వస్తోంది. అది రెండవవైపు ద్వారానికి వచ్చేలోగా రాజమౌళి ఆ ద్వారం కూడా మన్నుతో మూయించివేశాడు ఎటువెళ్లడానికీ దారి లేక రాక్షసి ఆ సొరంగంలోనే ఉండిపోయింది

అప్పుడప్పుడు మాత్రం గట్టిగా బొబ్బలు పెట్టి భూమిని చీల్చివేసి బయటికి రావాలని ప్రయత్నిస్తూ ఉంటుంది కాని రాలేదు వానలు కురిసే రోజుల్లో అది గట్టిగా బొబ్బలు పెట్టుతుంది అప్పుడు భూమి కదిలిపోతుంది ఆ బొబ్బలు మనకు వినబడుతూ ఉంటాయి కూడాను

కథ కంచికి వెళ్లింది. మన మింటికి వచ్చాము కథ విన్న వాళ్లది పాడి ఆవు వినని వాళ్లది బోడి ఆవు

* * * *

# గోపీ మోహిని

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక రాజు ఉన్నాడు ఆ రాజుకు ఒక కొడుకు ఉన్నాడు ఆ కొడుకుపేరు శివసాయకుడు శివసాయకుడు చాలా అందమైన పిల్లవాడు అతడు రాజుల పిల్లవాళ్ళవలే విల్లూ, బాణములూ ఉపయోగించడమూ, గుఱ్ఱమును ఎక్కి సవారీ చెయ్యడమూ, వేటాడడమూ అన్నీ నేర్చు కొన్నాడు కాని అతనికి ఇవేమీ నచ్చలేదు అతనికి బాగా చదువుకోవాలనీ ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు నేర్చుకోవాలనీ ఉండేది కాని ఆ వూళ్ళో ఆ విద్యలు చెప్పేవారు ఎవరూ దొరకలేదు అందుచేత అతను ఒకనాడు తండ్రిదగ్గర సెలవు పుచ్చుకొని గుఱ్ఱమెక్కి ఇతరదేశాలు వెళ్ళిపోయాడు ఒక దేశములో అతనికి ఒక ముసలివాడు కనబడి 'ఈ కాలములో ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు నేర్పేవారెవరూ ఈ దేశాలలో లేరు కావలిస్తే నీవు హిమాలయ పర్వతాలకి వెళ్ళితే అక్కడ ఒక ముని వున్నాడు, అతడు ముసలి పండు ఒక మంచుఅతని దగ్గరకు వెళ్ళి అతని శిష్యరికం చేసినట్లయితే నీకు ఆ విద్యలన్నీ చెపుతాడు' అని చెప్పాడు గుహలో అతను తపస్సు చేసుకుంటూ ఉంటాడు

'ఆ ముని పేరెవరు' అని శివసాయకుడు అడిగాడు

'ఆ ముని పేరు కామబాహుడు'' అని ముసలివాడు చెప్పాడు

ఆ రోజే శివసాయకుడు ప్రయాణమై వెళ్ళాడు వెళ్ళగా వెళ్ళగా త్రోవలో అతనికి ఒక దట్టమైన అడివి కనిపించింది. ఆ అడవి దాటితేనే గాని హిమాలయ పర్వతమును నేరలేడు ఆ అడవిలో ప్రవేశిస్తే దారి తెలుస్తుందో తెలియదో అనుకొన్నాడు అప్పుడు ఆ దారిని ఒక శబరవాడు వెడుతూంటే వాడిని పిలిచి 'ఈ అడవికి అడ్డంగా పడి వెడితే హిమాలయ పర్వతములు తగులుతవా' అని అడిగాడు 'నీవు చూడబోతే చిన్నవాడవు. ఈ అడవిలోనుంచి ఎట్లా వెళ్ళగలవయ్యా?' అన్నాడు శబరవాడు

'అడవి జంతువుల భయముందా?' అని శివసాయకుడు అడిగాడు

'అడవి జంతువుల భయము లేదుగాని ఈ అడవిలో ప్రవేశించిన వారెవరూ తిరిగి మళ్ళీ రాలేదు '

'అడవిజంతువుల బాధ లేదుకదా ఎందువల్ల తిరిగి రాలేరు?'' అని శివసాయకుడు అడిగాడు

'ఈ అడవిలో భూతాలు, రాక్షసులు, పిశాచాలు ఎన్నో ఉన్నవని చెప్పుకుంటారు మనుష్యుణ్ణి చూచినట్లయితే అవి వాడిని ప్రాణములతో వదిలిపెట్టవుట' అని శబరవాడు చెప్పాడు

'ఇదివరకు ఎవరైనా ఈ దారిన వెళ్ళారా?' అని శివసాయకుడు అడిగాడు

'నా ఎరికలో ఒక్కరు వెళ్లారు' అని శబరవాడు చెప్పాడు.

'ఆ మనుష్యుడు మళ్ళీ తిరిగి రాలేదా?' అని శివసాయకుడు అడిగాడు

'ఆ వెళ్ళినది మనుష్యుడు కాడు ఒక ఆడపిల్ల ఆ పిల్ల తిరిగి మళ్ళీ రానేలేదు' అని శబరవాడు చెప్పాడు

'ఆ పిల్ల యెందుకు ఈ అడవిలోకి వెళ్లింది అసలు?' అని శివసాయకుడు అడిగాడు శబరవాడు ఆ ఆడపిల్ల కథ ఈ విధంగా చెప్పాడు

'ఇక్కడికి సమీపాన్ని ఒక రాజ్యమున్నది దానిని ఒక రాజు ఏలేవాడు అతనికి లేక లేక ముసలితనములో ఒక కూతురు పుట్టింది ఆ కూతురుని వారు ఎంతో ముద్దుగా పెంచుకొంటూ ఉండేవారు ఆ కూతురికి పదో ఏడు వచ్చేప్పటికల్లా అన్ని విద్యలూ చెప్పారు. తండ్రితో కూడా సవారీ చెయ్యడమూ, వేటాడటమూ, కత్తి తిప్పడమూ అన్నీ నేర్చుకొంది ఒకనాడు రాజు వేటకని ప్రయాణమై మా శబరవాళ్ళ నందరినీ పోగు చేశాడు రాజుతో కూడా అతని కూతురూ, భార్యా ప్రయాణమయ్యారు కూతురినీ, భార్యనీ తీసుకొని అతను మాతో కూడా అడవిలో ప్రవేశించి వేట మొదలుపెట్టాడు. భార్యా, కూతురూ మాత్రం గుడారంలో ఉన్నారు. రాజు వేటాడి వేటాడి సాయంత్రమయ్యేసరికి గుడారానికి వచ్చేవాడు. ఈ విధంగా వాళ్ళు కొంత కాలము సరదాగా ఆ అడవిలో కాలం గడిపారు.

ఒకనాడు భార్యనూ, కూతురినీ తీసికొని రాజు వేటకు ప్రయాణమయ్యాడు రాజు ఒక గుర్రంమీదా, అతని భార్య ఒక గుర్రంమీదా, అతని కూతురు ఒక గుర్రంమీదా కూర్చున్నారు. మేమంతా డప్పులూ, ఈటెలూ, విల్లులూ, బాణాలూ పుచ్చుకొని వాళ్ళవెంట వెళ్లాము వేట ప్రారంభమయింది. రాణీ దూరాన్ని ఒక పొదలో సింహాన్ని చూచింది. మాతో చెప్పింది. మేమందరమూ పొదచుట్టూ దూరంగా కాసుకొని ఉన్నాము రాణీ, రాజూ, వాళ్లకూతురూ కలసి పొదను సమీపించారు. రాణీ సూటిగా చూచి సింహం మీద ఒక బాణం వేసింది ఆ బాణం వెళ్ళి సింహం నడుముకు గుచ్చుకొంది సింహం నొప్పికి కోపించి చెంగున పొదదాటి రాణిమీదకు ఉరికి గుర్రం మీదనుంచి ఆమెను కిందకు లాగివేసి ఆమెను గట్టిగా కరిచింది రాణీమీదకు దుమికీ దుమకడంతోనే రాజూ అతని కూతురూ గుర్రం మీదనుంచి దిగి కత్తి తీసి కొట్టబోయారు కాని ఆ కత్తి దెబ్బలు తగులకుండా తప్పించుకొని రాణీదేహాన్ని అక్కడ వదిలిపెట్టి మమ్ము తప్పించుకొని సింహం పారిపోయింది రాణీని చూస్తూ ఉండమనిమాలో కొందరితో చెప్పి రాజూ, అతని కూతురూ గుర్రాలెక్కి సింహాన్ని తరుముకు వెళ్లారు సింహం వాళ్లు వేసే బాణాలు తప్పించుకొంటూ గబగబా పరుగెత్తుతూ పొదలలో దూరుతూ, మళ్ళీ బయటికి వస్తూ, వాళ్ళను ఎంతోదూరం తీసుకుపోయింది సింహాన్ని ఎలాగైనా చంపవలెనని రాజు పంతం పట్టాడు అందువల్ల దానివెనకే వెళ్లాడు అతనివెనకే అతని కూతురు వెళ్ళుతూ వుంది ఆమె వెనకే మేము కొందరము ఈటెలు పుచ్చుకొని వెళ్లుతూ ఉన్నాము వెళ్ళగా వెళ్ళగా రాజు క్రమ క్రమంగా దూరమై పోతున్నాడు అతని కూతురూ, మేమూ

వెనకపడ్డాము  కొంతసేపైన తరువాత రాజు ఆమెకు కనపడలేదు  సింహమసలే కనపడలేదు రాజుకోసమని మేము ఎంత వెదికినా అగుపించలేదు  రాజు వెళ్ళిన దారిని గుర్రపు గిట్టల గుర్తులను బట్టి ఎంతోదూరం వెళ్లాము  కొంతదూరం ఆ గుర్తులు కనబడ్డవి తరువాత ఇసుక పర్రలు కనపడ్డవి ఇసుక పర్రల మీద గుర్తులసలే కనపడలేదు  అతని కూతురు చాలా విచారించింది  మేము ఆమెను ఓదార్చి ఎలాగో కష్టంమీద వెనుకకు తీసుకువచ్చాము  రాణీ పడిపోయిన చోటికి వచ్చి చూచాము మా వాళ్ళందరూ ఆమెకు అనేక విధాల పసరులూ, మందులూ వేశారు  కాని కన్నువిప్పి చూడలేదు ఆమెకు ప్రాణం పోయినట్లే అందరూ నిశ్చయించారు  తరవాత ఆమెను డోలీలలో తీసుకొని అందరమూ కలిసి వారి పట్నానికి వెళ్లాము  అక్కడ రాజవైద్యులు ఎందరో ఆమెకు మందులిచ్చారు కాని, ఆవిడ బతకలేదు  చివరకు ఆవిడను ఒక తోటలో సమాధి చేశారు

రాజు కూతురికి ఇంతా అంతా కాదు దుఃఖము  కొన్నాళ్ళ పాటు ఆవిడ నిద్రాహారాలు లేకుండా దుఃఖిస్తూ ఉంది. తల్లిపోతే పోయింది. తండ్రైనా బ్రతికివుంటే చాలును అనుకొని తండ్రి కోసం ఎంతకాలమో ఎదురుతెన్నులు చూసింది  తండ్రి ఎంతకీ రాలేదు  అన్ని దిక్కులకూ వేగులవాళ్ళను పంపి తన తండ్రి సంగతి ఎక్కడైనా తెలుస్తుందేమో కనుక్కురమ్మంది  వేగుల వాళ్ళు అన్ని దేశాలూ తిరిగి తిరిగి వచ్చి రాజు సంగతి ఏమీ తెలియలేదని చెప్పారు  చివరకు విసుగెత్తి తానే బయలుదేరింది  తండ్రిని వెదకడానికని  బయలుదేరి అన్ని రాజ్యాలూ తిరిగింది  అడవులు తిరిగింది  కొండలు తిరిగింది. ఎక్కడా తన తండ్రి కానరాలేదు  అప్పుడు ఒక శబరవాడివల్ల ఈ అడవి ఉందనీ, ఈ అడవిలోకి ఎవ్వరూ వెళ్లరనీ, వేగులవాళ్ళు కూడా ఇందులోకి వెళ్ళలేరనీ, రాజువుంటే ఈ అడవిలో ఉండవచ్చుననీ వింది  విని ఈ అడవిలో ప్రవేశించడానికి తీర్మానించుకొంది మంత్రులు వద్దని ఎంతచెప్పినా విందికాదు  పురోహితులు వద్దని చెప్పినా విందికాదు  ఒక గుర్రాన్నెక్కి ఆమె ఒకనాడు ఈ అడవిలో ప్రవేశించింది  నాటికీ నేటికీ ఆవిడ సంగతి ఏమీ తెలియలేదు '

శబరవాడు చెప్పిన కథ విన్నాడు శివసాయకుడు

'రాజు ఈ మధ్య తిరిగి వచ్చాడా?' అని శబరవాడిని అడిగాడు

'లేదు  రాజు సంగతీ తెలియలేదు, ఆయన కూతురి సంగతీ తెలియలేదు' అని శబరవాడు చెప్పాడు

'మరి ఆ రాజ్యం ఏమయింది?' అని శివసాయకుడు అడిగాడు

'గోపీమోహిని పేరుపెట్టి మంత్రులు ఏలుతున్నారు' అని శబరవాడు చెప్పాడు

'గోపీ మోహిని ఎవరు?' అని శివసాయకుడు అడిగాడు

'రాజు కూతురిపేరు గోపీ మోహిని' అని శబరవాడు చెప్పాడు

శబరవాడు చెప్పిన కథ విని శివసాయకుడు ఏమీ భయపడలేదు సరిగదా అడవిలోనికి

వెళ్ళవలెననీ, గోపీమోహినిని చూడవలెననీ ఎంతో కుతూహలపడ్డాడు కాని వెళ్ళవద్దని శబరవాడు మరీ మరీ చెప్పాడు ఎంత చెప్పినా శబరవాడి మాట చెవిని పెట్టలేదు శబరవాడు దయతలచి ఒక వేరు ముక్క ఇచ్చాడు ఇచ్చి యిలాగ చెప్పాడు

'ఈ వేరు ముక్క నీవు దగ్గర పెట్టుకొన్నట్లయితే భూతాలూ, పిశాచాలూ నీ దగ్గరికి రావు జాగ్రత్తగా దగ్గర ఉంచుకో' అని చెప్పాడు

'ఈ అడవిలో రాక్షసులు కూడా ఉన్నారని చెప్పావు కాదూ. ఈ వేరువల్ల వాటి భయం కూడా లేకుండా ఉంటుందా?' అని శివసాయకుడు అడిగాడు

'ఈ వేరు రాక్షసభయం లేకుండా చేయలేదు కాబట్టి రాక్షసుల విషయంలో మాత్రము నీవు జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది ' అని శబరవాడు చెప్పాడు

'రాక్షసులు వచ్చినప్పుడు తప్పించుకోవడానికి మార్గమేమీ లేదూ?' అని శివసాయకుడు అడిగాడు

'రాక్షసులు ఏ రూపం బడితే ఆ రూపం పొందుతారు. వాళ్ళు మన్ని మోసం చేయగలరు గాని మనము వాళ్ళని మోసం చెయ్యలేము కాని ఒకటుంది రాక్షసులెప్పుడూ రాత్రివేళ సంచరిస్తో ఉంటారు పగటివేళ నిద్రపోతారు కాబట్టి నీవు పగటివేళ ప్రయాణం చేస్తూ వెళ్ళు. రాత్రివేళ ఎక్కడైనా దాక్కో' అని శబరవాడు చెప్పాడు

'రాత్రివేళ రాక్షసులు మనుష్యులను పసిగట్టలేరూ?' అని శివసాయకుడు అడిగాడు.

'రాక్షసులు బాగా పసిగట్టగలరు అందులో మనుష్యులను ముఖ్యంగా పసిగట్టుతారు' అని శబరవాడు చెప్పాడు

'మరి రాత్రిళ్లు తప్పించుకోవడము ఎలాగ?' అని శివసాయకుడు అడిగాడు

'అదే కష్టం మనిషి వాసనలేకుండా ఒంటికి పసరు పూసుకుంటే కొంతమటుకి నయం' అని శబరవాడు చెప్పాడు

'సరే' అని శివసాయకుడు శబరవాడి దగ్గరనుంచి వేరు పుచ్చుకొని అడవిలో ప్రవేశించడానికి సిద్ధమయాడు గుర్రానికి బాగా తిండిపెట్టి కత్తీ, బాకూ, విల్లూ, బాణాలూ సిద్ధం చేసుకొని ఒకనాటి ఉదయం బయలుదేరి అడవిలో ప్రవేశించాడు

శివసాయకుడు ఆ పగలల్లా గుర్రం మీద సవారి అయి వెడుతున్నాడు తోవలో అడవి జంతువులేమీ అతనికి కనిపించలేదు, కాని, చెట్లమీద చిన్న చిన్న పక్షులు మాత్రం కూర్చొని పాటలు పాడుతూ ఉన్నవి ఆ పక్షులు శివసాయకుణ్ణి చూచి 'అయ్యో, అయ్యో, ఇలాగ ఎందుకు వచ్చావు?' అనే మాదిరిగా గట్టిగా కూసినవి శివసాయకుడు వాటి కూతలు వింటూ వాటి పాటలు వింటూ వెడుతున్నాడు అడవి చాలా దట్టముగా ఉంది పొదలలో నుంచి దారిచేసుకుంటూ దారి లేనిచోట కత్తితో కొట్టి, అడవిలోబడి చాలా దూరము వెళ్లాడు మధ్యాహ్నమైనది అడవి ఎక్కడా ఆదీ అంతము

కనిపించడములేదు  ఒక మర్రిచెట్టుక్రింద గుర్రాన్ని కట్టివేసి అక్కడ నేల బాగుచేసికొని కొంతసేపు నిద్రపోయాడు  కొంతసేపైన తరువాత నిద్రలేచి చూచేసరికి బారెడు పొద్దు ఉంది  సూర్యుడు కుంకేలోగా ఎక్కడైనా మంచిస్థలము చూచుకోవాలని అతడు గుర్రాన్నెక్కి మళ్ళీ ప్రయాణం సాగించాడు  వెళ్ళగా వెళ్ళగా అతనికి ఒక నది అడ్డమైనది  ఆ నది అడవి మధ్యనుండి ప్రవహిస్తూ ఉంది  నదిగట్లమీద దట్టముగా చెట్లు పెరిగి ఉన్నవి  సూర్యుడు అస్తమించడానికి సిద్ధంగా ఉన్నాడు ఆ వేళకు ఇంక ప్రయాణము చేయకూడదనుకొని అతడు ఆ నదిగట్టున పెరిగిన ఒక దట్టమైన రావిచెట్టు దగ్గరికి వెళ్ళి గుర్రాన్ని రావిచెట్టు వేరుకు కట్టివేసినాడు  ఆ చుట్టు పట్ల ఉన్న చెట్ల పళ్ళు కోసుకొని కడుపు నిండా తిని, ఆ ఏటినీరు కడుపునిండా తాగాడు  తరువాత తన బట్టలన్నీ తీసివేసి గుర్రం దగ్గర పెట్టి ఒంటినిండా ఆకుపసరు పూసుకొన్నాడు  ఒక పెద్ద కత్తి మాత్రము తనదగ్గర పెట్టుకొని రావిచెట్టుకు కొంతదూరములో ఉన్న తులసి పొదలలోకి వెళ్ళి అక్కడ అగుపించకుండా దాక్కొన్నాడు  అతన్ని ఒక చక్కని రంగులపిట్ట చూచి కిలకిలమని పలుకుతూ అతని చుట్టూ తిరుగుతూ ఉంది  ఆ పిట్ట అతనితో మాట్లాడాలని ప్రయత్నిస్తూ ఉన్నట్లు అతడు ఊహించాడు  కాని అతనికి పక్షిభాష రాదు  కాబట్టి దానికేసి చూస్తూ అతడు అక్కడే ఉండిపోయాడు  కొంతసేపు ఆ పిట్ట అలాగ తిరిగి తిరిగి నదిమీదనుంచి అడ్డంగా పరుగెత్తుకు వెళ్లిపోయింది  ఆ పిట్ట అలా ఎందుకు తిరిగిందో అదేమి చెప్పదలచుకొందో అతనికి తెలియలేదు  ఆశ్చర్యం వేసింది

ఇంతట్లోకే చీకటిపడింది  భూతాలేమి వస్తవో, పిశాచాలేమి వస్తవో, రాక్షసులెవరు వస్తారో అని అతడు మేలుకొని కూర్చున్నాడు  శబరవాడిచ్చిన వేరుముక్క తన మొలతాడుకి కట్టుకొన్నాడు  గనక భూతాలవల్లా, పిశాచాలవల్లా భయం లేదనుకొన్నాడు

కొంతరాత్రి గడిచింది  నదిమీద అతనికి కొన్ని దీపాలు కనిపించినవి  ఆ దీపాలేమిటా, అని అతడు చూడగా చూడగా అతనికి ఒక ఊహ తట్టింది  భూతాలు నదిమీద ఆడుకొంటున్నవి కాబోలనుకొన్నాడు  బాగా నిదానించి చూశాడు  కొందరు మనుష్యులు ఆ దీపాల దగ్గర అతనికి కనిపించారు  వాళ్ళు నిజంగా మనుష్యుల్లా లేరు  వాళ్ళకన్నీ ఎముకలే  తెల్లగా కనిపిస్తున్నవి ఒంటిమీద చర్మంలేదు. ఎప్పుడూ నవ్వుతూనే ఉన్నట్లున్నారు  శివసాయకుడికి భయం వేసింది  కత్తి గట్టిగా పట్టుకొని చూస్తున్నాడు  ఆ దీపాలు క్రమ క్రమంగా తన దగ్గరికి వస్తూవున్నట్టు చూచాడు. అవి ఏటిగట్టుకు వచ్చినవి  వచ్చీరావడంతోనే ఆ దీపాలు మాయమైపోయినవి  అతడు దాక్కొన్న పొదచుట్టూ ఆ భూ తాలు వచ్చి గిర్రున తిరుగుతున్నవి  శివసాయకుడు కత్తి తిప్పుతూ తులసిపొదలోనే ఉండిపోయాడు  కొంతసేపు తిరగగా తిరగగా శివసాయకుడి దగ్గర ఉన్న వేరుముక్క వాసన కొట్టింది ఆ వాసన తగిలీ తగలడంతోనే అవి దూరముగా వెళ్ళిపోయినవి  అందులో ఒక టి మాత్రం అక్కడే నిలబడింది  శివసాయకుడు దాన్ని చూచి

'ఎవరు నీవు?' అన్నాడు

'నేను పిశాచాల రాజుని మా అడవిలోకి నీ వెందుకు వచ్చావు? నిన్ను చంపేస్తాను' అని పిశాచాల రాజు భయపెట్టాడు

'నేను రాజపుత్రుణ్ణి నాపేరు శివసాయకుడు ఈ అడవిదాటి హిమాలయ పర్వతాలకి వెళ్ళుతున్నాను' అని చెప్పాడు

'నీపేరు శివసాయకుడా? అయితే నీవు నాకు స్నేహితుడవే ఎందుచేతనంటే మా దేవుడు శివుడు శివుణ్ణి ఆశ్రయించుకు ఉంటాము మేము నీవు మాదేవుడి పేరు పెట్టుకొన్నావు కాబట్టి నిన్నేమీ చెయ్యనులే ఆ పొదలోంచి బయటికిరా' అన్నాడు పిశాచాల రాజు

'నీవే ఈ పొదలోకి రా' అన్నాడు శివసాయకుడు తులసి పొదల్లోకి భూతాలూ, పిశాచాలూ రావని అతనికి తెలుసును తాను పొదలోనుంచి బయటికి వెళ్ళితే పిశాచాల రాజు ఏమి చేస్తాడో అని పొదదాటి బయటికి వెళ్ళలేదు

'నీకు మావల్లా, రాక్షసులవల్లా భయంలేకుండా ఉండడానికీ ఒక మంత్రం చెపుతాను బయటికిరా' అని పిశాచాల రాజు మళ్ళీ పిలిచాడు ఎంత పిలిచినా శివసాయకుడు బయటికి వెళ్ళలేదు

'మీరు పిశాచాలెందుకు అయ్యారు?' అని శివసాయకుడు అడిగాడు పిశాచాల రాజును

'మేమూ మీలాంటి మనుష్యులమే మనుష్యులముగా ఉన్నప్పుడు మేము చాలా పాపాలు చేశాము అందువల్ల పిశాచాలై పుట్టాము' అని పిశాచాల రాజు చెప్పాడు

'అయితే ఇంకా పాపాలు చేస్తారెందుకు?' శివసాయకుడు అడిగాడు

'పాపాలు చెయ్యకపోతే మాకు తోచదు బయటికి రావు గదూ!' అని పిశాచాల రాజు పిలిచాడు

ఎంత పిలిచినా శివసాయకుడు బయటికి రాకపోవడం వల్ల విసుగెత్తి పిశాచాల రాజు అక్కడినుంచి వెళ్ళిపోయాడు మళ్లీ పిశాచాల రాజూ, పిశాచాలూ కలసి నదిమీద దీపాలు పెట్టుకొని ఆడుకొంటూ దూరంగా వెళ్ళిపోవడం శివసాయకుడు చూచి ఒక గండం గడిచింది గదా అనుకొన్నాడు ఆ పొదలోనే కత్తిచేత్తో పుచ్చుకొని అతడు మేలుకొని కూర్చున్నాడు

రాత్రి రెండోజాము అయింది అతనికి దూరం నుంచి ఏదో శబ్దం వినిపించింది ఆ శబ్దం నది అవతలనుంచి వచ్చినట్లు అతనికి తోచింది ఆవైపు కన్నులు తిప్పి చూస్తున్నాడు కొందరు నల్లటి పెద్దమనుష్యులు ఆ వైపునుండి వస్తూ ఉన్నట్లు అతడు చూచాడు 'వీళ్ళే కాబోలు రాక్షసు' లనుకొన్నాడు మగవాళ్ళూ, ఆడవాళ్ళూ, పిల్లలూ అందరూ కలిసి పెద్ద పెద్ద కేకలు వేసుకొంటూ గోలచేసుకొంటూ నది అవతలగట్టుకు వచ్చి వాళ్ళు అక్కడ కూర్చున్నారు రాక్షసులలో పెద్దవాళ్లు ఒకళ్ళతో ఒకళ్లు మాట్లాడుకొంటున్నారు రాక్షసిపిల్లలు వాళ్ళచుట్టూ తిరుగుతూ గంతులు వేస్తూ కేకలు వేస్తూ ఆడుకొంటున్నారు

శివసాయకుడు వాళ్ళకేసి చూస్తూ భయపడుతూ ఉన్నాడు వాళ్ళు రాగానే తన దగ్గరికి వస్తే ఏమిచేయాలో అతనికి తోచింది కాదు కత్తి గట్టిగా పట్టుకొని కూర్చున్నాడు

చాలాసేపు రాక్షసులు ఆ గట్టుమీద కూర్చున్నారు వాళ్ళను చూచి భయపడింది కాబోలు, గుఱ్ఱము సకిలించినది గుఱ్ఱం సకిలింపు విని రాక్షసులు చేటల్లాంటి చెవులు అటు తిప్పి విన్నారు జంతువులు లేని ఈ అడవిలోకి జంతువులు యెట్లా వచ్చాయా అని వాళ్ళు ఆశ్చర్యపోయారు గుఱ్ఱము మళ్ళీ సకిలించింది సంతోషంతో రాక్షసులు ఒక్కమారు నదిమీద నుంచి ఎగిరి ఇవతల గట్టుకు వచ్చారు శివసాయకుడి ప్రాణాలు ప్రాణాల్లో లేవు దగ్గరికి వస్తే కత్తితో నరికివేద్దామని సిద్ధంగా కూర్చున్నాడు

రాక్షసులు ఇవతల గట్టుకు వచ్చి గుఱ్ఱాన్ని చూచి దానిని చంపి తినేశారు ఒక మోస్తరుగా వాళ్లకు కడుపు నిండింది ఏటి నీళ్లు త్రాగి ఆ గట్టునే కూర్చున్నారు

కొంతసేపటికి వాళ్లకు మనిషి వాసన కొట్టుతూ ఉన్నట్లు తోచింది రాక్షసులందరూ ముఖాలెత్తి ముక్కులతో అన్నివేపులా వాసన చూచారు ఒక వేపునుంచి వాసన వస్తూ ఉన్నట్లు గ్రహించి చప్పట్లు కొడుతూ కేకలు వేస్తూ ఆ దారిని వెళ్లడానికి సిద్ధపడ్డారు

రాక్షసులను చూచినప్పుడు మొదట భయపడ్డా, తన గుఱ్ఱాన్ని చంపేశారనే కోపంచేత శివసాయకుడికి భయం పోయింది చాలా కోపం వచ్చింది కాని జాగ్రత్తగా ఉండడం మంచిదనుకొని ధైర్యంతో వాటికేసి తిరిగి చూస్తున్నాడు ఒక పెద్ద రాక్షసి ఆవురు ఆవురుమంటూ అతని కేసి పరుగెత్తుకు వచ్చి అతణ్ని రెండు చేతులతోటీ పట్టుకోబోయింది శివసాయకుడు చేతులు చాచీ చాచడంతోనే కత్తితో వాటిని నరికేశాడు రాక్షసి చచ్చిపోయింది ఇదిచూచి రాక్షసి పిల్లలంతా భయపడి దూరంగా పారిపోయారు శివసాయకుడు ఆ రాక్షసిని చంపి, మళ్ళీ ఇంకా ఎవరైనా వస్తారేమోనని కాసుకొని ఉన్నాడు ఒక పెద్ద రాక్షసుడు రాక్షసిని చంపివేసినందుకు శివసాయకుడిమీద మండిపడి పరుగెత్తుకొంటూ అతన్ని చంపడానికి వచ్చాడు శివసాయకుడు ఆ రాక్షసుణ్ణి చూచి భయపడకుండా ధైర్యం తెచ్చుకొని కత్తి దూశాడు. రాక్షసుడు అతన్ని మింగాలని పెద్ద నోరు తెరచుకొని చేతులు చాచుకొని వచ్చాడు శివసాయకుడు రాక్షసుని నోట్లో తన కత్తి పెట్టి గట్టిగా పొడిచాడు రాక్షసుడు కిందపడిపోయి బొబ్బలు పెడుతూ భూమి మీద పొర్లాడుతూ శివసాయకుణ్ణి గట్టిగా చేతులతో పట్టుకొన్నాడు శివసాయకుడు కత్తి నోట్లో నుంచి తీసి రాక్షసుడి చెయ్యి ఒకటి నరికివేశాడు రెండో చేత్తో రాక్షసుడు శివసాయకుణ్ణి పట్టుకొని గట్టిగా నదిలోకి విసిరి పారేసి, అక్కడ భూమిమీద పొర్లి పొర్లి ప్రాణం విడిచాడు మిగిలిన రాక్షసులందరూ భయపడి పారిపోయారు

శివసాయకుడు నీటిలో పడ్డాడు అతని చేతిలో కత్తి రాక్షసుడు విసిరినప్పుడు జారి ఎక్కడో పడిపోయింది నీటిలో నిమ్మళంగా ఈదుతూ అవతలిగట్టుకు అతడు చేరుకుందామనుకొన్నాడు కాని ఏరు చాలా తీవ్రంగా ప్రవహిస్తోంది అతడు చాలాసేపు ఈది అలసిపోయాడు ఇంకా గట్టు

చేరడానికి ఇరవై బారల దూరముంది సూర్యుడు అప్పుడే ఉదయిస్తున్నాడు. ఇంక పది బారల దూరాన్ని గట్టు ఉందనగా అతనికి చాలా ఆయాసం వచ్చి ఒళ్ళు తెలియకుండా అయిపోయింది

ఏరు బాగా ప్రవహిస్తూ ఉండడం వల్ల అతని దేహము ఆ ఏటిలో పడి కొట్టుకు పోతోంది సూర్యుడు ఉదయించాడు పక్షులు చెట్లమీద కిల కిలమంటూ పలుకుతున్నవి కొన్ని పక్షులు అతని దేహాన్ని చూచి విచారించి గబగబా తూర్పుగా పరిగెత్తుకు పారిపోయాయి

## 2

శివసాయకుడు కళ్ళు తెరిచి చూచేటప్పటికి బాగా ఎండెక్కింది అతడు ఏటిగట్టున ఉన్నట్లు తెలుసుకొన్నాడు అతని ప్రక్క ఒక చాలా అందమైన ఆడపిల్ల పదిహేనేళ్ళది కూర్చుని ఉపచారం చేస్తున్నది చుట్టుపట్ల చెట్ల మీద అనేక రకాల చిన్న చిన్న పక్షులు కూర్చుని అతనికేసి చూస్తున్నవి

శివసాయకుడు కళ్ల తెరవడంచూచి, ఆ పిల్ల సంతోషంతో చప్పట్లు కొట్టి నవ్వింది చెట్లమీద పక్షులన్నీ సంతోషంతో పాడినవి .

పాలూ, పళ్లరసమూ ఆ ఆడపిల్ల అతని నోట్లో పోసింది కొంతసేపటికి అతనికి బలము వచ్చింది అతడు లేచికూర్చుని ఆ పిల్ల కేసి చూస్తూ, 'ఇంత చక్కని పిల్లవు ఈ అడవిలోకి ఎలాగ వచ్చావు?' అని అడిగాడు

'నీకు వంట్లో బాగా ఉందా, అలసట పోయిందా?' అని ఆ పిల్ల అడిగింది

'నాకు బలముగానే ఉంది నీవెవరవో నాకు చెప్పవూ?' అని శివసాయకుడు అడిగాడు

'చెప్తానులే, నాతో రా' అని ఆ ఆడపిల్ల అడవిలో నుంచి నడపించుకొని తీసుకువెళ్ళింది కొంతదూరం వెళ్లాక ఒక పెద్ద కొండ అగుపించింది వాళ్ళు ఆ కొండ దగ్గరికి వెళ్లారు ఆపిల్ల కొండకు అడ్డముగా వున్న ఒక రాతి తలుపు తీసివేసింది అందులోనుంచి త్రోవ కనిపించింది వాళ్ళు కొండలో ప్రవేశించారు ఆ పిల్ల మళ్ళీ రాతి తలుపు మూసివేసింది కొండలో నుంచి నడిచి వెళ్ళగా ఒక బయలు కనిపించింది ఆ బయలికి అన్ని వేపులా కొండలే ఆ బయల్లో ఒక పెద్ద మేడ ఉంది ఆ మేడచుట్టూ సరస్సు వుంది ఆ సరస్సులో బాతులూ, తాబేళ్ళూ ఆడుకొంటున్నవి కమలాలూ, కలవపువ్వులూ వికసించి ఉన్నవి శివసాయకుణ్ణి ఆ మేడలోకి తీసుకువెళ్ళి ఆ పిల్ల తలంటి నీళ్లోసి కట్టుకోడానికి కొత్త బట్టలిచ్చి కడుపునిండా అన్నం పెట్టింది తరవాత అతన్ని చూస్తూ అతని పక్క ఒక తూగుటుయ్యాలలో కూర్చుంది

శివసాయకుడు ఆ పిల్లను చూస్తూ, 'నీవు చూడబోతే మనుష్యుల పిల్లలాగ ఉన్నావు ఈ రాక్షసుల అడవిలోకి నీవు రావడానికి కారణ మేమిటి?' అని అడిగాడు

'వేటకు వచ్చి నా తండ్రి ఒక సింహాన్ని వెంబడిస్తూ వెళ్ళాడు ఆ సింహం ఈ అడవిలోకి వచ్చి ఉంటుంది దాని వెనకే నా తండ్రి కూడ వచ్చి ఉంటాడు వచ్చిన పిమ్మట మళ్ళీ నా తండ్రి తిరిగి

రాలేదు ఎక్కడో మాయమైపోయాడు ఎంత కాలానికీ రాకపోతే ఏమైనాడో అని నేను నా తండ్రిని వెదుకుతూ బయలుదేరి ఈ అడవిలో ప్రవేశించాను' అని ఆ పిల్ల చెప్పింది

'అయితే నీ పేరు గోపీ మోహినా?' అని శివసాయకుడు అడిగాడు

'అవును నాపేరు గోపీ మోహినే నాపేరు నీకెలాగ తెలిసింది?' అని ఆ పిల్ల అడిగింది

'నీ తండ్రిని వెదుక్కుంటూ నీవు అడవిలో ప్రవేశించినట్టూ, మళ్ళీ రానట్టూ ఒక శబరవాడు చెప్పాడు ' అని శివసాయకుడు చెప్పాడు

'నా తండ్రి ఈ లోపుగా అక్కడికి రాలేదుకదా' అని ఆ పిల్ల అడిగింది

'ఇక్కడ నీకు నీ తండ్రి కనిపించలేదా? అక్కడకి నీ తండ్రి రాలేదుట నీ పేరు పెట్టి మంత్రులు రాజ్యం ఏలుతున్నారుట' అని శివసాయకుడు చెప్పాడు.

"ఈ అడవిలోకి రావడంతోనే నా తండ్రిని వెదుక్కో దగ్గ అవకాశం దొరికింది కాదు నాకు' ' అని గోపీ మోహిని అంది.

'ఎందువల్ల?' అని అతడు అడిగాడు గోపీ మోహిని తన కథ ఇలాగ చెప్పింది

'నేను నా తండ్రికోసమని గుర్రమెక్కి ఈ అడవిలో ప్రవేశించాను. ఒక పగలు ప్రయాణము చేశాను. సాయంత్రమయ్యేసరికి గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టివేసి ఆ చెట్టుమీదకు ఎక్కి వొక కొమ్మమీద కూర్చున్నాను రాత్రి అయ్యేసరికి రాక్షసులు గుంపులు గుంపులుగా ఈ అడవి అంతటా తిరగడం మొదలు పెట్టారు. నాకు చాలా భయం వేసింది కొంతసేపైన తరువాత కొందరు రాక్షసులు నా గుర్రాన్ని చూచి దాని దగ్గరికి వచ్చారు నా గుర్రం కట్లు తెంచుకొని పారిపోయింది దానితో వాళ్లూ పరిగెత్తుకు వెళ్లారు మళ్లీ నా దగ్గరికి వస్తారేమో అనుకొన్నాను కాని రాలేదు మరి కొంతసేపటికి ఇంకో కొందరు రాక్షసులు నా చెట్టు క్రిందనుంచి వెళ్ళుతూ మనిషి వాసన కొట్టుతోందని అక్కడ ఆగారు ఆగి, నాలుగువేపులా పరీక్షించి చూచి, చివరకు చెట్టు పరీక్షిస్తూ వుంటే నేను కనపడ్డాను నా చేతిలో కత్తీ, బాకూ ఉన్నవి ఒక పెద్ద రాక్షసుడు నన్ను చెట్టుమీద నుంచి లాగేశాడు నేను కిందపడి కత్తితో ఇటూ అటూ కొడుతున్నాను 'ఎవరో మనుష్యుల పిల్ల చాలా అందమైనది దీనిని నేను పెంచుకొంటాను' అని వారిలో ఒక రాక్షసి అంది

ఎవరూ నన్నేమీ చేయకూడదని వాళ్ళు అనుకొన్నారు నన్నేమీ చెయ్యరుకదా అని నేనూ మాట్లాడక ఊరుకొన్నాను ఆ రాక్షసి నన్ను సమీపించి నా వళ్ళు తడిమి చూచి ఎంతో సంతోషించి నన్ను ఆపేక్షతో ఎత్తుకొని ఈ మేడలోకి తీసుకు వచ్చింది ఇక్కడ నాకు కావలసిన వస్తువులన్నీ ఇస్తూ ఎంతో గారాబంగా పెంచుతూ ఉంది '

'నీ తండ్రి సంగతి రాక్షసిని అడిగావా?' అని శివసాయకుడు గోపీమోహినిని అడిగాడు

'అడిగాను అతను తరుముకు వచ్చింది సింహం గాదనీ, ఒక రాక్షసుడు ఆ వేషం వేసుకొని వెళ్లి అతన్ని ఈ అడవిలోకి తీసుకు వచ్చాడనీ, తరువాత రాక్షసుడు సింహం రూపం వదిలి పెట్టి

రాక్షసరూపం పొంది అతన్ని మింగివేయ బోయాడనీ అతను రాక్షసుడితో యుద్ధం చేసి అడవిలోనుంచి తప్పించుకు పోయాడనీ చెప్పింది '

'మరి నీకు ఇక్కడే ఉండిపోవాలని ఉందా?' అని శివ సాయకుడు అడిగాడు.

'లేదు, కాని ఇక్కడనుంచి వెళ్ళిపోవడం ఎలాగ? అడవి దాటేలోగా నన్ను మళ్ళీ పట్టుకొని ఈ రాక్షసి తీసుకు రాదా? అందుచేత ఇక్కడే ఉండి ఈ రాక్షసిని మంచిచేసుకొని ఎలాగైనా తపిం్పచుకు పోవాలని చూస్తున్నాను ' అని గోపీ మోహిని చెప్పింది.

అయితే మనమిద్దరము కలిసి ఈవాళ ఇక్కడనుంచి పారిపోదాము వస్తావా?' అని శివసాయకుడు అడిగాడు

'నీవు ఎవరవు అసలు! ఈ అడవిలోకి ఎలాగవచ్చావు ఇది రాక్షసుల అడవి అని నీకు తెలియదా ?' అని గోపి మోహిని అడిగింది

' నే నొక రాజకుమారుణ్ణి నా పేరు శివసాయకుడు ఇంద్రజాలం మహేంద్రజాలం విద్యలు నేర్చుకుందామని నా తండ్రి దగ్గర సెలవు పుచ్చుకొని బయలుదేరాను హిమాలయ పర్వతాలలోఒక ముని వున్నాడని తెలిసి, అక్కడికి ఈ అడవిలోంచి వెళ్ళవలె ననుకొన్నాను. ఈ అడవిలోంచి వెళ్లవద్దని ఒక శబరివాడు చెప్పాడు నీవు ఈ అడవిలో ప్రవేశించావనీ మళ్ళీ తిరిగిరాలేదనీ కూడా చెప్పాడు. ఈ అడవిలో నిన్ను చూడవచ్చునీ , తరువాత మనమిద్దరమూ కలిసి హిమాలయ పర్వతాలకు వెళ్ళిపోవచ్చుననీ, అనుకొని ఈ అడవిలోకి వచ్చాను నిన్న రాత్రి పిశాచాలు రాక్షసులూ వచ్చి భయపెట్టారు గాని పిశాచాలు నా దగ్గరకు రాలేక పోయాయి. నా దగ్గరకు వచ్చిన రాక్షసులను నేను చంపేశాను ' అని శివనాయకుడు చెప్పాడు

రాక్షసులను చంపినందుకు గోపీ మోహిని చాలా సంతోషించింది. అతని ధైర్యాన్ని మెచ్చుకుంది అతని కేసి సంతోషముతో చూస్తూ కూచుంది

' నేను నదిలోపడి కొట్టుకుపోతుంటే నన్ను గట్టుకుతీశావు గదా నీ కెలాగ తెలిసింది?' అని శివసాయకుడు అడిగాడు

' నీవు అడవిలో ప్రవేశించడం నా పక్షులు చూచినవి అని గోపి మోహిని చెప్పింది

' నీ పక్షులు ఏమిటి ? 'అని శివసాయకుడు అడిగాడు

'నే నొక్కర్తెనీ ఇక్కడ ఉండడం కష్టంగా ఉండి రాక్షసితో చెప్పాను-నాకు స్నేహితులు కావాలని ఎవరు కావాల' ని అడిగింది ' పక్షులుతో ఆడుకుంటాను, తెచ్చిపెట్ట మన్నాను' అప్పుడు ఈ పక్షుల్ని తెచ్చి పెట్టింది వీటిని ఈ అడవిలో ఎవరూ చంపరు నాతో ఆడుకు న్నంతసేపు నిడుకుని అడవిలో తిరిగి తిరిగి పళ్ళూ, గింజలూ తిని ఏటినీరు తాగి మళ్ళీ నీ దగ్గరకే వస్తవి నావు నీటిలోపడి కొట్టుకు పోతున్నట్లు అవే చెప్పాయి అప్పుడు గబాగబా పరుగెత్తుకు వచ్చి నిన్ను నీటిలోనుంచితీశాను అని గోపీ మోహిని చెప్పింది

కొంతసేపు వాళ్ళు మాట్లాడుకొన్న తరువాత గోపీ మోహిని ఇలాగ చెప్పింది

' నీవు ఈ మేడలో ఉన్నట్లయితే రాక్షసులు కనుక్కొని నీకూ నాకూ కూడా అపకారం చేస్తారు చీకటి పడేటప్పటికల్లా రాక్షసి మేడలోకి వచ్చి, నాతో కొంతసేపు ఉండి, నన్ను పడుకోబెట్టి వెళ్ళిపోతుంది ' అని గోపీమోహిని చెప్పింది

'నీవు కూడా నాతో రారాదా ?' అని శివసాయకుడు అడిగాడు

'వస్తే నీకు నాకూకూడా ప్రమాదమే నీకు నా పక్షులు ఈ అడవి దాటడానికి దగ్గర మార్గం చూపిస్తాయి అవి చూపిన మార్గాన్ని వెళ్ళితే నీకు హిమాలయ పర్వతాలు కనబడతాయి అక్కడ ఇంద్రజాలం మహేంద్రజాలం నేర్చుకొని ఇక్కడకురా అప్పుడు నిన్ను రాక్షసు లేమీ చేయలేరు నీవు వచ్చాక మనమిద్దరమూ కలిసి అడవిదాటి వెళ్లిపోదాము ' అని చెప్పగానే శివసాయకుడికి విచారం కలిగింది గోపీ మోహిన్ని చూడ్డం తోనే కొంతకాలం అక్కడ ఉండి, ఆడుతూ పాడుతూ కొన్నాళ్లు గడపవచ్చుననుకొన్నాడు కాని చేసేదేమీలేక ప్రయాణమయాడు గోపీమోహిని అతన్ని కౌగలించుకొని 'మళ్ళీ తప్పకుండా రావాలి సుమా' అని చెప్పింది తరువాత తన పక్షుల్ని పిలిచి శివసాయకుడికి దగ్గిర దారి చూపించమని పంపించింది శివసాయకుడు ఆమెను వదలే క చివరకు 'వెళ్ళివస్తాను' అని చెప్పి ప్రయాణమయాడు.

'పక్షులు చూపించే దారిని వెళ్ళినట్టయితే చీకటి పడకుండానే అడవి దాటిపోచ్చును సుమా ! జాగ్రత్తగా వెళ్ళు ' అని గోపీమోహిని చెప్పింది

' సరే' అన్నాడు శివసాయకుడు పక్షులు ఆకాశంమీద పరుగెత్తుకు వెళ్ళుతూ ఉంటే అతడు వాటిని అనుసరించి భూమి మీద గబగబా నడుస్తూ వెడుతున్నాడు తోవలో పండ్లూ కాయలు కోసుకుతింటూ చిన్న చిన్న సరస్సు లో నీళ్లు త్రాగుతూ వెళ్లుతున్నాడు ఇట్లా కొంత దూరం వేళ్లే టప్పటికి అతనికి అలసట వచ్చింది ఒక సరస్సు దగ్గరికి వచ్చి ఆ సురస్సులో నీళ్ళు కడుపునిండా తాగి, అక్కడ ఒక నాపరాతిమీద పడుకున్నాడు చల్లగాలి వేస్తూఉన్నది అతనికి నిద్ర వచ్చింది తెలియకుండానే అక్కడ కొంతసేపు నిద్రపోయాడు నిద్రపోయి మళ్ళీ ఉలిక్కిపడి లేచాడు తన ప్రయాణం సంగతి జ్ఞాపకం వచ్చింది ఆకాశం కేసి పక్షుల కోసమని చూచాడు ఆకాశం మీద పక్షులు లేవు అతడుభూమిమీద నడిచి వస్తున్నాడే అనుకొని అవి గబగబ ముందుకు ఎగురుకుంటూ పోయినవి ఇంకా చీకటి పడలేదు సూర్యుడు ఇంక కొంచెం సేపటికి అస్తమించేటట్లు ఉన్నాడు అతనికి భయము వేసింది దు ఖం వచ్చింది చీకటి పడకముందు అడవిదాటి వెళ్ళడం ఎలాగా అని ఆలోచిస్తూ అక్కడ కొంతసేపు కూర్చున్నాడు పక్షులు వెళ్ళేదిక్కు చూచాడు కాబట్టి ఆ దిక్కుగా నడిచి వెళ్ళితే చీకటి పడేలోపుగా అడవి దాటవచ్చు ననుకొన్నాడు. ఏమైనా సరే వెళ్లక తప్పదనుకొని బయలుదేరాడు బయలుదేరి రెండుమూడుగులు పెట్టకముందే అతనికి ఎవరో చప్పట్లు కొడుతూ వున్నట్లు వినిపించింది

ఎవరు చెప్మా అని అన్ని వేపులా తిరిగి చూచాడు సరస్సులో స్నానము

చేస్తూవుంది ఒక చక్కనిపిల్ల పదమూడేళ్ల వయస్సు ఉంటుంది. బంగారంలాంటి శరీరం ఆ పిల్ల నవ్వుతూ చప్పట్లు కొడుతూ నీటిలోంచి గబగబ పరుగెత్తుకు వచ్చి తడి బట్టలతో అతని ఎదుట నిలబడింది ఆ పిల్లని చూచి అతడు చాలా ఆశ్చర్యపోయాడు గోపీ మోహినిగానే వచ్చింది కాబోలు అనుకొని కళ్ళు నులుముకొని మళ్ళీ చూచాడు ఆ పిల్ల గోపీ మోహిని కాదు మరో కొత్తపిల్ల ఆ పిల్లకేసి చూస్తూ అతడు నిలబడ్డాడు ఆ పిల్ల అతని సమీపానికి వచ్చి భుజం మీద చెయ్యివేసి నవ్వుతూ నిలబడింది

' నేను తొందరగా ఈ అడవి దాటి వెళ్ళిపోవాలి నన్నెందుకు ఆపుతున్నావు, ఎవరిపిల్లవు నీవ్వు? అని శివపాయకుడు అడిగాడు ఆ పిల్ల నవ్వుతూ అతని జుట్టు తడుముతూ అతని కళ్ళు చూస్తూ నిలబడింది

'అలాగ నవ్వుతావెందుకూ, మాట్లాడవేం? నీకు మాటలు రావూ? ' అన్నాడు శివనాయకుడు.ఆ పిల్ల మాట్లాడలేదు అతని చెయ్యి పట్టుకొని ఆ చేతికేసి చూస్తూ నవ్వుతూ సరస్సువేపు తీసుకువెళ్ళబోయింది

'చీకటిపడే లోపుగానే వెళ్ళిపోవాలి ఈ అడవి దాటిపోవడానికి నీకు దారితెలిసినట్టయితే చెప్పు లేదా నే వెళ్ళిపోతాను' అన్నాడు శివసాయకుడు ఆ పిల్ల మాట్లాడకుండా అదే నవ్వుతూ అతన్ని తీసుకుపోవడానికి లాగింది అతనికి కోపం వచ్చి చెయ్యి విదిలించుకొని పోబోయాడు అప్పుడాపిల్ల రెండు చేతులతోనూ అతని చేతులు గట్టిగాపట్టుకొని నవ్వుతూనే అంది

'నువ్వెంతటి చక్కటి వాడవు! నువ్వు మా ఇంటికి రావూ ! అక్కడ మనమిద్దరమూ ఎంతో హాయిగా ఆటలు ఆడుకొంటూ పాటలు పాడుకొంటూ ఉందాం, ఏం ? "

'నేను రావడానికి వీలులేదు నేను వెళ్ళిపోవాలి నన్ను వదులు' అన్నాడు శివసాయకుడు

'పోనీ ఇప్పుడు మా ఇంటికిరా ఈ రాత్రి నిన్ను నేను దాచివేస్తాను. రేపు మనమిద్దరమూ ఈ సరస్సు దగ్గర ఆడుకొందాము తరువాత నీకు నేను దారి చూపెడతాను ఏం' అంది ఆపిల్ల

నే నిప్పుడే వెళ్ళిపోవాలి. ఇప్పుడే దారి చూపించు' అన్నాడు శివసాయకుడు

'సూర్యుడు అస్తమిస్తున్నాడప్పుడే చీకటిపడేలోగా నీవు అడవిదాటి వెళ్ళలేవు.తోవలో రాక్షసులు నిన్ను బతకనివ్వరు కాబట్టి నేను చెప్పిన మాటలువిని మా ఇంటికిరా ఏం' అంది ఆ పిల్ల సూర్యుడు ఆస్తమిస్తున్నమాట వాస్తవము చీకటి పడేలోగా అడవి దాటడం కూడా కష్టమే అందుచేత ఆ పిల్ల ఇంటికి వెళ్ళాలని అనుకొని శివసాయకుడు ఇలాగ అన్నాడు

'నీవు చూడబోతే మంచి పిల్లలాగే ఉన్నావు అందమైన పిల్లలందరూ మంచిపిల్లలే కాని నీ వెవరవో నాతో చెప్పితేనే గాని మీ యింటికి నే నెలాగ వచ్చేది?,'

' మా యింటికి వచ్చాక నా సంగతి నీకు చెబుతాను నావల్ల నీకేమీ అపాయం రాదు నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం వేస్తాను ఈమాటు వస్తావా రావా? ఏం ' అంది ఆ పిల్ల

'పోనీ నీపేరెవరో చెప్పు' అన్నాడు శివసాయకుడు

'నా పేరు మణిమాల నా పేరు చెప్పాగా? ఇక ఇంటికిరా, రా ,ఏం' అని ఆ పిల్ల శిసాయకుణ్ణి వాళ్ళ ఇంటికి తీసుకుపోయింది వాళ్ళిల్లు సరస్సుకు పడమరగా కొంతదూరంలో ఉన్న కొండకి అవతల వుంది ఆ ఇంట్లో చిలుకలూ, నెమళ్లూ, హంసలూ, వున్నవి ఇంటిచుట్టూ ఏవో పూలమొక్కలున్నవి ఇంటిగోడలకి రంగురంగుల వెల్ల వేసి ఉన్నది గోడలమీద చిత్రచిత్రాల పటములున్నవి శివసాయకుణ్ణి ఆ ఇంట్లోకి తీసుకువెళ్ళింది మణిమాల ఆ ఇంట్లో మంచి గది ఉంది ఆ గది మణిమాలది ఆ గదిలో మధ్య చిన్న చెరువు ఉంది ఆ చెరువులో దీపాలు పెట్టిన ప్రమిదలు ఎప్పుడూ ఇటూ అటూ తిరుగుతుంటవి ఆ సరస్సులో తామర పువ్వులు కూడా ఉన్నవి ఆ పువ్వులచుట్టూ దీపాలు ప్రదక్షిణం చేస్తూవుంటవి కూడాను ఆ సరస్సుచుట్టూ బంగారు తూగుటుయ్యాల లున్నవి ఆ తూగుటుయ్యాలల్లోకి పన్నీరు తుంపర ఎప్పుడూ పడుతూ ఉంటుంది ఆ గదిలోకి మణిమాల తప్ప ఇంకెవరూ రారు ఆ గదిలోకి శివసాయకుణ్ణి తీపుసువెళ్ళి ఒక ఉయ్యాలలో అతన్ని కూర్చోబెట్టింది దానికి ఎదురుగా వున్న ఒక ఉయ్యాలలో తాను కూర్చుని ఉయ్యాల ఊగుతూ నవ్వుతూ ఉంది

అదంతా చూచి శిసాయకుడు ఆశ్చర్యపోయాడు 'నీ వెవరిపిల్లవో చెబుతానన్నావు.-ఈ మాటు చెప్పు' అన్నాడు శివసాయకుడు

'ఆ పిల్ల నవ్వుతూ ఉయ్యాల ఊగుతూ' యీ ఇల్లు బాగుందిగాదూ, యీ గదిలో చూడు దీపాలు ఎలాగ ఆడుకుంటున్నాయో నీవు ఈ అడవి దాటి వెళ్ళిపోవడమెందుకు? ఇక్కడే ఉండిపోరాదూ నాతో ఆడుకుంటూ ఉండవచ్చు ఎంచక్క ! ఏం ' అంది మణిమాల

'నీ సంగతి చెప్పమంటే ఈ మాటలన్నీ చెపుతావెందుకు? నీవు పెంకిపిల్లవు కాదూ?' అన్నాడు శివసాయకుడు

ఆ మాటలు వినడంతోనే మణిమాల విరగబడి నవ్వింది. నవ్వుతూ అతన్ని చూస్తూ 'ఇక్కడుండిపోవూ' అంది నే నుండను నీవు మంచిపిల్ల వనుకున్నాను నీవు మంచిపిల్లవు కానట్లున్నావు నేనిప్పుడేవెళ్ళిపోతాను' అన్నాడు శివసాయకుడు

'వెళ్ళిపోవద్దు, వెళ్ళిపోవద్దు, నా సంగతి చెప్పనా? చెబుతా విను నా పేరు మణిమాల అని నవ్వింది మణిమాల

'నీ పేరు ఇదివరకే చెప్పావు' అన్నాడు శివసాయకుడు.

'అయితేవిను నేను అందమైన పిల్లను' అంది మణిమాల

'ఆమాట నేనే చెప్పాను ఇందాకా' అన్నాడు శివసాయకుడు

'అయితే ఇంకా చెప్పనా? ఈ ఇల్లు నాది ఈ గదినాది ఈ గదిలోనే నే నెప్పుడూ ఆడుకుంటూ ఉంటాను మనమెప్పుడూ ఆడుకొంటూ ఉండవచ్చు' అంది మణిమాల

'ఈ మాట కూడా ఇదివరకే చెప్పావు' అన్నాడు శిసాయకుడు

' అయితే ఇంకా చెపుతాఉండు మరీ ఈ ఇంటిలో నేనొక్కత్తెను ఎప్పుడూ ఉండాలి నాతో ఆడుకోడానికి ఎవరూ లేరు అందుచేత నాకేమీ తోచకుండా ఉంది నిన్ను చూడ్డంతోనే నాకు అందువల్లనే ఎంతో సంతోషమైంది' అంది మణిమాల

'మరి నీకు మీ అమ్మలేదూ?' అని శివసాయకుడు అడిగాడు

' మా అమ్మ ఉంది కాని మా అమ్మ మంచిది కాదు' అని మణిమాల చెప్పింది

' మీ అమ్మ ఎందుకు మంచిదికాదూ?' అని శివసాయకుడు అడిగాడు మణిమాల చెప్పలేదు ఎంతడిగినా చెప్పలేదు

'ఇంత అందమైన పిల్లవు ఈ రాక్షసుల అడవిలో ఎందుకున్నావు' అని శిసాయకుడు అడిగాడు.

'చిన్నప్పటినుంచీ నేనిక్కడే ఉన్నాను ' అంది మణిమాల

'అయితే మీ అమ్మ రాక్షసి అన్నమాట' అన్నాడు శివసాయకుడు

మణిమాల మాట్లాడలేదు కొంతసేపైన తర్వాత మణిమాల' నే వొక్కర్తెనూ ఇక్కడ ఉండలేకుండా ఉన్నాను నాతో కూడా నీ వుండవూ? అంది

' మరి మీ అమ్మ రాక్షసిగదా నన్ను మింగివేస్తుందేమో' అన్నాడు శివసాయకుడు

' మా అమ్మ నిన్నేమీ చెయ్యదు. నీ సంగతి మా అమ్మతో చెప్పనే చెప్పను' అంది మణిమాల

'చెప్పకపోతే పసిగట్టి కనుక్కోలేదుకామోసు' అన్నాడు శివసాయకుడు

అయితే మా అమ్మతో చెప్పి నిన్నేమీ చెయ్యవద్దంటాను మా అమ్మకు నన్ను చూస్తే ఎంతోఆపేక్ష నేనేం చెబితే అవి చేస్తుంది ' అంది మణిమాల.

'సరేగాని, నేను ముందుగా ఈ అడవిదాటి హిమాలయ పర్వతాలకి వెళ్లాలి. వెళ్ళి మళ్ళీ వస్తాను అప్పుడు నీతో ఉండనైనా ఉంటాను లేకపోతే నిన్ను నాతో తీసుకువెళ్ళతాను ' అన్నాడు శివసాయకుడు

ఆ మాటలకు మణిమాల చాల సంతోషించి అతని దగ్గరకు వచ్చి అతని ప్రక్కనే కూర్చుని ఉయ్యాల ఊపుతోంది

ఇంతట్లోనే 'మణిమాలా, మణిమాలా' అనే కేక వినిపించింది

' మా అమ్మ వచ్చింది మా అమ్మ వచ్చింది ' అని మణిమాల చటుక్కున ఉయ్యాలలోంచి దిగి తలుపు గడియువేసి ' ఓయ్, నే నిక్కడున్నాను' అవి కేక వేసింది

'ఎక్కడున్నావే మణిమాలా' అని వాళ్ళమ్మ మళ్ళీ కేక వేసి గది దగ్గరకు వచ్చింది మణిమాల 'ఈగదిలోనే ఉన్నానే అమ్మా' అంది

' గది తలుపు తియ్యి మణిమాలా' అంది వాళ్లమ్మ

'నాకు బద్ధకంగా ఉందమ్మా నేను తియ్యలేను' అంది మణిమాల

అంతా ఉత్తది నాకు ఈ ఇంట్లో మనిషి వాసన కొడుతోంది అంతా చూచాను ఎక్కడా మనుషులు అవుపించలేదు ఈ గదికూడా చూద్దామని వచ్చాను నువ్వు తలుపు తియ్యమ్మా' అంది వాళ్ళమ్మ

'ఇక్కడికి మనుష్యులెలావస్తారే అమ్మా' ఏదో వాసన చూచి మనిషి వాస ననుకొన్నావు ఈ గదంతా చూచాను ఎవరూ మనుష్యులు లేరు' అంది మణిమాల

నన్ను కూడా చూడనియ్యే ఒక మాటు' అంది వాళ్లమ్మ

'నాకు బద్ధకంగా ఉందే నేను పడుకున్నాను ఇప్పుడు లేవలేనమ్మా ఇక్కడెవరూ లేరంటూంటేనే అంది మణిమాల

'పోనీలే అయితే నే వెళ్ళివస్తాను జాగ్రత్తగా ఇంట్లో ఉండు మనుష్యులూ వాళ్ళూ వస్తారు జాగ్రత్త సుమా తలుపులు వేసుకు పడుకో' అని వాళ్ళమ్మ వెళ్ళిపోయింది

' మా అమ్మ నే చెప్పినమాట వింటుందని చెప్పాను కాదూ మా అమ్మ నిన్నే మీ చెయ్యదులే' అంది మణిమాల.

'ఇప్పుడు వెళ్ళిపోయి మళ్ళీ ఎప్పుడు వస్తుంది మీ అమ్మ' అన్నాడు శివసాయకుడు

'మళ్ళీ తెల్లారేవేళకు వస్తుంది అందాకా మన మాడుకుందాము ఏం ' అంది మణిమాల

' మరి మీ అమ్మను వదిలిపెట్టి నాతో రమ్మంటే వస్తావా నువ్వు?' అన్నాడు శివసాయకుడు

' మా అమ్మ నాకు మంచిదే నే నంటే ఎంతో ప్రేమ, కాని ఇతరులను ఎవరిని చూచినా ఇష్టంలేదు ' అంది మణిమాల

' మరి నాతో వస్తావా?' అన్నాడు శివసాయకుడు

' పోనీ రమ్మంటే వస్తా' నంది మణిమాల

'నేను హిమాలయాలకి వెళ్ళి మళ్ళీ తిరిగి వవచ్చేటప్పుడు చెపుతానులే!' అన్నాడు శివసాయకుడు

ఆ రాత్రి ఇద్దరూ ఆ ఇంట్లో చిలకలతోటీ, హంసలతోటీ నెమిళ్ళ తోటీ ఆడుకున్నారు రాత్రి నాలుగోజాము రాగానే శిసాయకుడు ' నాకు దారి చూపించు నే వెళ్ళిపోతా' నన్నాడు

మణిమాల చాలా సేపు ఏడ్చింది అతన్ని ఉండిపొమ్మని బతిమాలింది 'అతడు' ఉండడానికి వీల్లేదు మళ్ళీ వస్తా' నన్నాడు సరే నని మణిమాల అతన్ని తీసుకొని ఎవరికీ తెలియని ఒక కొండగుహలోకి వెళ్ళి అక్కడ ఒక పెద్ద సొరంగం ఉంటే దాని గుండా నడిచి వెళ్లుతోంది శివసాయకుడు ఆమె వెంట నడిచి వెళ్లాడు కొంత దూరం నడవగా నడవగా ఒక బయలు కనిపించింది ఆబయలులోకి శివసాయకుణ్ణి తీసుకువచ్చి ' ఇదే అడవి ఇవతల, ఇక్కడ నుంచి నీవు వెళ్ళిపో' అని చెప్పింది మణిమాల

' హిమాలయాలకి దారి ఎలాగ?' అని శివసాయకుడు అడిగాడు

'ఇక్కడనుంచి తిన్నగా వెళ్ళిపో, ఇకముందు రాక్షస భయమూ, పిశాచ భయమూ వుండవు '

అని మణిమాల చెప్పింది

'సరే వెళ్ళుతున్నాను నీవు మంచిపిల్లవే నాకు దారి చూపించావు ' అని శివసాయకు డన్నాడు.

'మళ్ళీ వస్తావుకాదూ ? నీకోసం నేను కనిపెట్టుకు వుంటాను సుమా ?' అని మణిమాల అంది.

' వస్తాను ' అన్నాడు శివసాయకుడు

'ఎన్నాళ్ళలో వస్తావు ?' అని మణిమాల అడిగింది

'నేను అక్కడ కొన్ని విద్యలు నేర్చుకొంటాను ఆ విద్యలు నేర్చుకొన్న తరువాత వస్తాను. అన్నాడు శివసాయకుడు

' నీ కెందుకు విద్యలూ?' అంది మణిమాల

'నిన్ను ఈ అడివిలోనుంచి తీసుకు వెళ్ళవద్దూ ? అందుకని విద్యలు ' అన్నాడు శివసాయకుడు.

'మళ్ళీ వస్తావుకాదూ ?' అంది మణిమాల

'వస్తా ' అన్నాడు శివసాయకుడు

'తప్పకుండా?' అంది మణిమాల

'తప్పకుండా ' అన్నాడు శివసాయకుడు

మణిమాల బిక్కమొహం వేసుకొని ఇంటికి తిరిగి వెళ్ళి పోయింది శివసాయకుడు తిన్నగా హిమాలయ పర్వతాల దగ్గరికి నడిచి వెళ్లుతున్నాడు

గోపీమోహిని శిసాయకుణ్ణి దిగబెట్టి ఇంటికివచ్చి అతని మీదనే మనసు పెట్టుకొని ఆలోచిస్తూ కూర్చుంది సాయంత్రమైంది తాను పంపించిన పక్షులు తిరిగి రాలేదు శివసాయకుడు అడవిదాటి వెళ్ళగలిగాడో లేదో ? తోవలో ఎవరైనా రాక్షసులు అడ్డమయారేమో? శివసాయకుడు ఏమైనాడో పాపం! అని దు ఖిస్తూ కూర్చుంది చీకటి పడింది ఇంకా పక్షులు రాలేదు పక్షులు ఎందుకు ఆలస్యం చెయ్యాలి ? అతన్ని అడవి చివర దిగబెట్టి గబగబ ఎగిరి చక్కా రావచ్చు కాదూ ? ఎందుకు రాలేదు మరి ? అని ఎంతో ఆలోచించింది పోనీ తాను వెళ్ళి అడవంతా తిరిగి ఎక్కడైనా దొరుకుతాడేమో చూద్దామనుకొంది కాని పక్షులువచ్చి ఏదో ఒకమాట చెప్పకముందు వెళ్ళకూడదనుకొని పక్షులకోసం ఎదురుచూస్తూ వుంది ఇంతలోనే పక్షులు వచ్చాయి వచ్చి శివసాయకుడు దారి తప్పిపోయినట్టూ, తాము ఇంకా వెల్తురు ఉండగానే అడవి చివరకు వెళ్ళి చూస్తే శివసాయకుడు కనపడనట్టూ మళ్ళీ అతనికోసము వెనక్కివచ్చి అంతటా వెదికినట్టూ ఎక్కడా అతను కనబడట్టూ చెప్పినవి ఈ మాటలు విని గోపీమోహిని చాలా విచారించింది మళ్ళీ ఇంకో మాటు వెళ్ళి అడవి అంతా తిరిగి ఏమైనాడో శివసాయకుడు కనుక్కొరమ్మని పక్షులను మళ్ళీ పంపించింది గోపీమోహిని పక్షులు మళ్ళీ వెదకడం కోసమని వెళ్ళాయి

గోపీమోహిని మేడ ఇవతల చెరువుగట్టు మీద కూర్చుని విచారిస్తూ వుంటే వాళ్ళమ్మ అప్పుడే వచ్చింది రాక్షసి వచ్చి చెరువు గట్టున కూర్చున్న గోపీమోహినిని చూచి ఎత్తుకొని ముద్దు పెట్టుకొని

ఇంట్లోకి తీసుకుపోయింది. తాను విచారముగా ఉన్నట్లు రాక్షసికి తెలియకూడదనుకొని నవ్వుతూ ఉంది

రాక్షసి గోపీమోహిని నీళ్లు పోసి, కొత్తబట్టలు కట్టి, పళ్ళూ, భక్ష్యాలూ, పరమాన్నాలూ పెట్టింది తరువాత తూగుటుయ్యాలలో పడుకోబెట్టి జోలపాటలు పాడింది. గోపీమోహినికి నిద్ర పట్టలేదు పక్షులు ఎప్పుడు వస్తాయో అని అనుకొంటూ వుంది రాక్షసి దగ్గర వుందన్న మాటే గాని దాని ధ్యానమంతా శివసాయకుడిమీదే వుంది అది కనిపెట్టి రాక్షసి అడిగింది కదా, ' అమ్మా గోపీ మోహినీ! రోజులాగ ఈవాళ సంతోషంగా లేవెందుకూ? విచారిస్తూన్నా వెందుకూ? నాతో చెప్పవా?' అంది

'ఏమీ లేదు' అంది గోపీ మోహిని

'ఏమీ లేకపోవడమేమిటి ? నీ మొహం చూస్తేనే తెలుస్తోంది నీకు విచారం ఎందుకో నాతో చెప్పు నీకు ఏం కావలిస్తే అది నీకు ఇస్తాను ' అంది.

' నాకు విచారమూ లేదు, నాకేమీ అక్కర్లలేదు ' అంది గోపీ మోహిని

'పోనీ అయితే పడుకో నేను నిన్ను పడుకోబెట్టి వెడతాను ' అంది రాక్షసి

'నేను పడుకున్నాను నువ్వు వెళ్లు ' అంది గోపీ మోహిని

'నీకేం కావాలో చెప్పవా? నీకు విచారం ఎందుకో చెప్పవా?' అంది మళ్ళీ రాక్షసి

'ఎందుకూలేదు' అంది గోపీ మోహిని

తనతో ఏదో చెప్పకుండా దాస్తోందని రాక్షసికి కోపం వచ్చి గోపీ మోహినిని కొట్టి తిట్టి వెళ్ళిపోయింది గోపీ మోహిని దెబ్బలు - తిట్లు తిని ఏడుస్తూ కూర్చుంది

రాక్షసి వెళ్ళిపోయిన కొంత సేపటికి పక్షులు తిరిగి వచ్చాయి వచ్చి శివసాయకుడు బతికి వున్నాడని చెప్పాయి

' ఎక్కడున్నాడు ఇపుడు'! అని గోపీ మోహిని అడిగింది ఇక్కడికి ఉత్తరంగా ఒక రాక్షసి మేడ ఉంది ఆ రాక్షసికి ఒక చక్కని కూతురు కూడా ఉంది శివసాయకుడు వెడుతూంటే అతన్ని తోవలో పట్టుకొని ఆ రాక్షసి కూతురు తన మేడలోకి తీసుకువెళ్ళింది అక్కడ ఉన్నాడతడు ' అని పక్షులు చెప్పినవి

'అది మంచిదేనా? ఏమీ చెయ్యదుకదా అతన్ని?' అని గోపీ మోహిని అడిగింది

'రాక్షసి మంచిది కాదు, కాని దానిపిల్ల ఎంతో మంచిది అచ్చంగా నీలాగే వుంటుంది నీలాగా ఆటలూ పాటలూ ఆడుతూ పాడుతూ వుంటుంది ' అని పక్షులు చెప్పాయి

' మరి అది రాక్షసుల పిల్ల అన్నావు?' అని గోపీ మోహిని అడిగింది

'రాక్షసులపిల్ల అయినా మనిషిపిల్లలాగే వుంది శివసాయకుణ్ణి ఏమీ చెయ్యదు సరికదా, అడవి దాటిస్తుందికూడాను అంచేత శివసాయకుడికి ఏమీ భయంలేదు ' అని పక్షులు చెప్పాయి

సరే' అని గోపీమోహిని పక్షుల్ని పంపించి వేసింది

ఆ రాక్షసికూతురు ఎవరో, నిజంగా రాక్షసిపిల్లో, లేక పోతే మనిషిపిల్లో తెలుసుకొందా మనుకొంది ఎవరైనా తాను రోజూ ఆడుకుంటూ వుండవచ్చునుగదా అనుకొంది తెల్లారాక రాక్షసి వస్తుంది గదా అప్పుడు దానితో చెప్పి ఆపిల్లని తెప్పించాలను కొంది

ఆసంగతే ఆలోచిస్తూ గోపీమోహిని తూగుటుయ్యాలలో పడుకొని నిద్రపోయింది.

తెల్లారాక రాక్షసి తిరిగి వచ్చింది అప్పటికి గోపీమోహిని ఇంకా నిద్రపోతోంది రాక్షసి గోపీ మోహిని ప్రక్కను కూర్చోని రాత్రి దాన్ని కొట్టినందుకు ఏడుస్తూవుంది చేత్తోగోపీ మోహిని వళ్ళు తడుముతూవుంది

గోపీమోహినికి మెలుకువ వచ్చింది కళ్లువిప్పి చూచింది ఎదురుగుండా రాక్షసి కనిపించింది అది ఏడుస్తూవుండడం గోపీ మోహిని చూచి 'ఎందుకేడుస్తున్నావు?' అని అడిగింది

'నిన్నింత ఆపేక్షగా పెంచుతూవున్నా, నామీద నీకు దయ లేదు,' అని రాక్షసి చెప్పింది.

'మరి రాత్రి ఎందుకు కొట్టేవు నన్ను?' అని గోపీమోహిని అడిగింది

'ఇంకెప్పుడూ కొట్టనులే ఏదో కోపం వచ్చి కొట్టేను ఇంత బద్ధకంగా వున్నావేం?' అని రాక్షసి అడిగింది

'నాకేమీ తోచడంలేదు నాతో ఆడుకోవడానికి ఎవరూ లేరు ' అంది గోపీమోహిని

'పక్షులున్నాయిగా?' అంది రాక్షసి 'అస్తమానం పక్షులతోటేనా, ఏమిటి ఆడుకోవడం? నాకు విసుగెత్తుతోంది ' అంది గోపీమోహిని

'మ రేం గావాలి నీకు?' అని రాక్షసి అడిగింది

'నాతో ఆడుకోవడానికి ఎవరైనా మంచిపిల్ల కావాలి,' అంది గోపీ మోహిని

'ఎవరున్నారమ్మా నీతో ఆడుకొనేపిల్లలూ? ' అందిరాక్షసి

'ఏమో నాకేం తెలుసునేమిటి!' అంది గోపీమోహిని

'పోనీ రాక్షసిపిల్లలతో ఆడుకుంటావా?' అని రాక్షసి అడిగింది.

' నాకొద్దమ్మా! నాకు భయమేస్తుంది ' అంది గోపీమోహిని

'అలాగే కనుక్కుంటాను లే! లే!' ఈపాటికిలే! అని రాక్షసి గోపీమోహిని లేవదీసి తలంటి, నీళ్ళోసి, కొత్తబట్టలు కట్టి ఆడుకోమని బొమ్మలూ, పువ్వులూ అవీ ఇచ్చి ఒక గదిలో నిద్రపోయింది

గోపీమోహిని చాలా సేపు ఆడుకొంది గోపీమోహినితో పక్షులు కూడా ఆడుకొన్నవి సాయంత్రం అయ్యేటప్పటికి గోపీమోహిని బయలులోవున్న సరస్సు దగ్గరికి వచ్చి అందులో స్నానం చేసి హంసలతో ఆడుకొంది చెరువులో తామరపువ్వులు కోసుకొని తల్లోనూ, చెవుల్లోనూ పెట్టుకొంది తామర తూళ్ళు చేతులకు కూడా కట్టుకొంది

చీకటిపడేవేళకి రాక్షసి లేచివచ్చి గోపీమోహిని ఆడుకోవడం చూస్తూసంతోషిస్తూ చెరువుగట్టుమీద నిలబడింది గోపీమోహిని 'తెచ్చిపెట్టవూ?' అంది

'ఏమిటి?' అంది రాక్షసి.

'ఆడుకోవడానికి పిల్లని తెచ్చిపెట్టవూ? అంది గోపీమోహిని

'ఇవాళ రాత్రి కనుక్కుంటానులే 'అంది రాక్షసి

' ఈవాళ రాత్రికాదు, ఇప్పుడేకావాలి ఇప్పుడే వెళ్ళు' అంది గోపీమోహిని

'ఇప్పుడే వెడితే ఎలాగ! నీకు అన్నం పెట్టి, నిన్ను పడుకోబెట్టి, వెడతానులే, అంది రాక్షసి

'నాకక్కర్లేదు ఇప్పుడే వెళ్ళాలి ' అంది' గోపీ మోహిని

'నే వెడితే నీవాక్కర్తెవూ అన్నంతిని పడుకోగలవా?' అంది రాక్షసి

'పడుక్కొంటాను. వెళ్ళు' అంది గోపీమోహిని

'సరే' అని రాక్షసి వెళ్ళిపోయింది

రాక్షసి ఆ రాత్రల్లా ఎక్కడకూ వెళ్ళకుండా ఆ అడవంతా తిరుగుతోంది ఎవరైనా గోపీమోహినితోఆడుకోవడానికి మంచిపిల్ల దొరుకుతుందేమోనని కనిపించిన రాక్షసుల నందరినీ అడిగింది ఎవరు చెప్పలేదు చివరకు ఒకరాక్షసుడు కనిపించాడు ఆ రాక్షసుడు చెప్పాడు ఒక రాక్షసికి ఒక చక్కని కూతురుందనీ ఆ కూతురిని ఎంతో ముద్దుగా పెంచుకొంటూన్నదనీ, ఆ కూతురు రాక్షసిపిల్లలాగ ఉండక అచ్చంగా మనిషి పిల్లలాగా వుంటుందనీ

ఆ రాక్షసి తక్షణం మణిమాల తల్లిదగ్గరకు వెళ్ళింది. వెళ్ళి ఆ రాక్షసితో తనకో కూతురున్నట్లు ఆ కూతురితో ఎవరూ ఆడుకోవడానికి లేనట్టు అందుచేత తన కూతురు బెంగపెట్టుకొన్నట్టు చెప్పింది

ఆ మాటలు విని మణిమాల తల్లికూడా తనకో కూతురున్నట్టూ, తన కూతురుతోకూడా ఆడుకోవడానికి ఎవరూ మంచి పిల్లలు లేనట్టూ, అంచేత బెంగపెట్టుకొన్నట్టూ చెప్పింది

రాక్షసి ఆమాటలువిని మణిమాల తల్లితోకూడా వాళ్ళింటికి వెళ్ళి మణిమాలను చూచింది మణిమాల తన కూతురులాగే చక్కగా చురుకుగా వుండడం చూచింది

'మా అమ్మాయితో ఆడుకొంటావా అమ్మాయీ' అంది

' మీ అమ్మాయి ఎక్కడుంది?' అంది మణిమాల

'మా అమ్మాయి మా మేడలో వుంది నేను నీకు మా మేడ చూపిస్తాను అక్కడ ఇద్దరూ ఆడుకుంటూ ఉండండి మా అమ్మాయికూడా అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చి నీతో ఆడుకుంటూ ఉంటుందిలే' అని రాక్షసి చెప్పింది

'అయితే వాళ్ళమ్మాయి దగ్గరికి నన్ను తీసుకెళ్ళవూ!' వాళ్లమ్మతో అంది మణిమాల

'అలాగే తీసుకువెడతానులే' అంది వాళ్ళమ్మ

రాక్షసులిద్దరూ మణిమాలను తీసుకొని గోపీమోహిని దగ్గరికి వచ్చారు

ఆ రోజునుంచీ రాక్షసులిద్దరికీ చాలా స్నేహం అయింది మణిమాలకీ గోపీమోహినికీ కూడా

స్నేహం అయింది రాత్రిళ్లు రాక్షసులిద్దరూ ఎక్కడికో వెళ్ళిపోయేవారు మణిమాల గోపీమోహినీ రాత్రిళ్ళు ఒక్క మంచం మీదనే పడుక్కొని కథలు చెప్పుకుంటూ నిద్రపోయేవారు, పగటిపూట వాళ్ళిద్దరూ ఒకళ్ళింటికి ఒకళ్ళు వెడుతూ అడవంతా పరుగెత్తి ఆడుకుంటూ ఎంతో సంతోషంగా కాలం గడుపుతున్నారు ఒకనాడు ఉదయం వాళ్ళిద్దరూ కలిసి అడవిలోకి వెళ్లారు. అక్కడ వాళ్ళకి ఒక అందమైన పెద్ద చెరువు కనిపించింది ఆచెరువుగట్టుమీద ఒక చాపరాయి ఉంటే దానిమీదకూర్చుని వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకొంటున్నారు

'నీవు నిజంగా మనిషిపిల్లవో రాక్షసిపిల్లవో చెప్పవూ' అని గోపీమోహిని అడిగింది.

'నే నెలాగ కనిపిస్తున్నాను' అంది మణిమాల

'నువ్వు అచ్చంగా మనిషిపిల్లలా వున్నావు' అంది గోపీమోహిని

'అయితే మరెందుకు అడుగుతున్నావు?' అంది మణిమాల

'రాక్షసి పిల్లలుకూడా ఒక్కప్పుడు మనిషిపిల్లల్లాగా వుంటారటగా' అంది గోపీమోహిని

'ఏమో నే నెవరిపిల్లనో నాకేం తెలుసును చిన్నప్పటి నుంచీ నేను ఇక్కడే పెరుగుతున్నాను మా అమ్మను అడిగితే నా పిల్లవే నువ్వు అంటోంది ' అంది మణిమాల

'మరి నువ్వు శివసాయకుణ్ణి ఏం చేశావు?' అంది గోపీమోహిని

'శివసాయకుడు ఎవరు' అంది మణిమాల

'మీ ఇంటికి వచ్చాడటగా శివసాయకుడు' అంది గోపీ మోహిని

'ఆ మంచిపిల్లాడా?' అంది మణిమాల

'మంచిపిల్లాడేమిటి' అంది గోపీమోహనీ

'ఆ చక్కని పిల్లాడుకాదూ' అంది మణిమాల

' అవును అతవే' అంది గోపీమోహిని

'పాపం అతను చెరువుదగ్గిర నిద్రపోతుంటే చూశాను లేచాక మా ఇంటికి తీసుకెళ్ళి ఉయ్యాలలో కూచోబెట్టి ఊపాను ఎంతోసేపూ అతనితో మాట్లాడాను అతనెంత మంచివాడనుకొన్నావు' అంది మణిమాల

'అతనేడీ-ఇప్పుడెక్కడికి వెళ్ళాడు?' అని గోపీమోహిని అడిగింది

'ఎక్కడో హిమాలయ పర్వతాలున్నాయట అక్కడేవో విద్యలు నేర్చుకోవడానికి వెడతానంటేనూ నేనే ఈ అడవి దాటించాను అతడు మళ్ళీ వస్తానన్నాడు కూడాను' అంది మణిమాల

'జాగ్రత్తగా వెళ్లాడా' అని గోపీమోహిని అడిగింది

'నే దిగబెట్టానంటూంటేనే-మరి అతన్ని నువ్వెలాగెరుగుదువు?' అంది మణిమాల

'నీ దగ్గరికి రావడానికి ముందు మా మేడలోకి వచ్చాడు. అతనితో కొంతసేపు మాట్లాడి పక్షుల్ని తోవ చూపించమని పంపేశాను ' అంది గోపీమోహిని

'మళ్ళీ వచ్చి నిన్నుకూడా తీసుకువెడతా నన్నాడా?' అని మణిమాల అడిగింది

'నిన్ను తీసుకువెడతా నన్నాడా' అని గోపీమోహిని అడిగింది

'నన్ను తీసుకు వెడతానన్నాడు నిన్నుకూడా తీసుకువెడతాడులే మనమిద్దరము అతనితో వెళ్ళిపోదాం ఎంచక్కా ఏం' అంది మణిమాల

'మరి మీ అమ్మా మా అమ్మా ఏడవరూ' అంది గోపీమోహిని

'వాళ్ళనుకూడా తీసుకువెళ్ళదాము ఏం' అంది మణిమాల

'అమ్మయ్యో! రాక్షసులను తీసుకువెళ్ళకూడదు' అంది గోపీమోహిని

'పోనీ వాళ్ళ నిక్కడ అట్టేబెట్టి చెప్పకుండా మనం వెళ్ళిపోదాం' అంది మణిమాల

'వాళ్ళు ఏడవరూ మరి' అంది గోపీమోహిని

'పోనీ వాళ్ళతో చేప్పే వెడదాము' అంది మణిమాల

'చెపితే వెళ్ళనిస్తారు కామోసు' అంది గోపీమోహిని

'ఏమోనమ్మా మరి నాకు తెలియదూ' అంది మణిమాల ఇలాగవాళ్ళు కబుర్లు చెప్పుకొంటూ శివసాయకుడి కోసం ఎదురు చూస్తూ ఉన్నారు.

ఒకనాడు మణిమాల తల్లి వీళ్ళిలాగ కబుర్లు చెప్పుకుంటూ ఉంటే వాళ్ళ మాటలు వింది విని గోపీమోహిని తల్లితో చెప్పింది ఈ పిల్లలిద్దరూ కలిసి ఎవరితోనో వెళ్ళిపోతారేమోనని వాళ్ళు చాలా భయపడ్డారు ఆరోజునుంచీ వాళ్ళను బయటకు రాకుండా ఇంట్లో ఉండేటట్టు చేశారు రాత్రిళ్ళు సంచారానికి పోయినప్పుడు వాళ్ళిద్దరినీ ఒక్కగదిలో పెట్టి తాళం వేసి వెళ్ళిపోయేవారు మణిమాలా గోపీమోహినీ ఇలాగ ఎందుకు చేస్తారని వాళ్ళమ్మలతో దెబ్బలాడేవారు వాళ్ళకు కోపం వచ్చి మణిమాలనూ, గోపీమోహినినీ కొట్టారు

'మమ్మల్ని కొట్టితే మేమిక్కడ ఉండేదిలేదు ఎక్కడ కైనా పోతా'మని వాళ్ళిద్దరూ కలిసి ఎక్కడికో వెళ్ళిపోబోయారు వాళ్ళను వెళ్లిపోనియ్యకుండా రాక్షసులు పట్టుకొని ఒక గదిలో పెట్టి తాళంవేసి ఉంచారు ఎప్పుడూ ఆ గదిలోనే వాళ్ళుండడం రోజూ అన్నం మాత్రం రాక్షసులు పెట్టేవారు ఆ అన్నం తింటూ ఆటలూ పాటలూ లేకుండా ఆ గదిలోనే వాళ్ళిద్దరూ ఏడుస్తూ కూర్చునేవారు

'ఎక్కడికీ వెళ్ళిపోక పోతే గదిలోంచి వదలి పెడతాము' అని రాక్షసులు అరిచారు.

'మే మెక్కడికీ వెళ్ళములెండి' అన్నారు మణిమాలా గోపీమోహినీని

అప్పుడు వాళ్ళని గదిలోంచి వదలిపెట్టారుగాని ఇల్లు దాటి వెళ్ళనిచ్చేవారుకాదు ఆ ఇంట్లోనే వాళ్ళు శివసాయకుడు ఎప్పుడు వస్తాడు చెప్మా అనుకుంటూ బెంగపెట్టుకు ఉన్నారు శివసాయకుడి కోసం వాళ్ళిద్దరూ కనిపెట్టుకు ఉన్నారనిరాక్షసులు తెలుసుకొని అతన్ని ఎక్కడున్నాడో పట్టుకొని చంపి వేద్దామని ఆ రాక్షసులిద్దరూ అడవంతా తిరుగుతున్నారు

* * * * * *

శివసాయకుడు ఎంతదూరం వెళ్ళినా మృగసంచారం లేదూ-మనిషిసంచారం అసలే లేదు కొంతసేపటికి తోవలో అతనికి కొందరు కొండవాళ్ళు కనిపించారు

కామబాహుడనే ముని ఎక్కడ ఉంటాడనీ వాళ్ళను అతడు అడిగాడు కైలాసపర్వతము మొదట ఒక మంచుగుహ ఉందనీ అందులో అతను తపస్సు చేసుకుంటూ ఉంటాడనీ వాళ్ళు చెప్పారు అక్కడినుంచి బయలుదేరి అతను కైలాస పర్వతం దగ్గిరికి వెళ్ళాడు దాని చుట్టూ తిరిగాడు ఆ చుట్టుపట్ల అంతా మంచుకెరళ్ళు గట్టి ఉంది ఆ మంచుమీద నడుస్తూ ఉంటే అతనికి కాళ్ళు జువ్వున లాక్కుపోతున్నాయి ఎలాగో కష్టపడి గుహకనుక్కున్నాడు అందులో ఒక ముసలిముని లేడి చర్మంమీద పద్మాసనం వేసుకొని తపస్సు చేసుకొంటున్నాడు శివసాయకుడు మునికిఎదురుగా చాలాసేపు నిలబడ్డాడు ముని కళ్ళు తెరచి శివసాయకుణ్ణి చూచి కూర్చోమని సైగచేసి మళ్ళీ కళ్ళుమూసుకొని తపస్సు చేసుకుంటున్నాడు శివసాయకుడు ఆ గుహలో ఆ మంచుమీద అలాగే కూర్చుండి పోయాడు సాయంత్రం అయింది ముని కళ్ళు తెరవలేదు శివసాయకుడు లేవలేదు రాత్రల్లా ముని కళ్ళుమూసుకునే ఉన్నాడు శివసాయకుడు, ఎంత చలివేసినా అక్కడనుంచి కదలనేలేదు ఒకరోజు అయింది ముని కళ్ళు విప్పలేదు శివసాయకుడు లేవలేదు రెండురోజులయింది ముని కళ్ళు విప్పలేదు శివసాయకుడు లేవలేదు కూర్చున్నచోటే కూర్చుండిపోయాడు మూడురోజులయింది ముని కళ్ళు విప్పనేలేదు శివసాయకుడు కదలనే లేదు నిద్రాహారాలు లేకుండా మునీ శివసాయకుడు ఆ గుహలోనే కూర్చొండిపోయారు

నాలుగోరోజు ఉదయాన్ని కళ్ళు విప్పి చూచాడు శివసాయకుడు అక్కడే కూర్చుని ఉన్నాడు ముని కళ్ళు విప్పడంతోనే శివసాయకుడు అతని పాదాలమీద పడి నమస్కారం చేశాడు ముని అతన్ని లేవదీశాడు

శివసాయకుడు లేచి నిలబడ్డాడు అప్పుడు ముని అతనితో, నీవు వచ్చిన పని నాకు తెలుసును నీకు కావలసిన విద్యలు నేర్చుకోవడానికి ఓపిక చాలా ఉండాలి నీకు ఓపికా పట్టుదలా ఉన్నాయో లేవో తెలుసు కోవడానికి మూడురోజులు కూర్చోబెట్టాను మూడురోజులూ నీవు మంచులో కూర్చున్నావు నాకు చాలా సంతోషమైంది నీకు ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు నేర్పుతానులే, ఇక్కడ ఉండిపో' అన్నాడు శివసాయకుడు 'చిత్తం ' అన్నాడు ముని శివసాయకుడికి ఒక లేడి చర్మం ఇచ్చి తినడానికి పళ్ళు ఇచ్చాడు శివసాయకుడు పళ్ళు తిన్నతరువాత చలి వెయ్యకుండా ఉండడానికి అతనికి పసరు పూసుకొమ్మని ఇచ్చాడు శివసాయకుడు ఆ పసరు ఒంటికి పూసుకున్నాడు వెచ్చగా ఉంది మంచుగుహలో ఉన్నట్లే లేదు

అప్పుడు కామబాహుడు శివసాయకుడికి సంగతంతా చెప్పమని అడిగాడు శివసాయకుడు తాను ఇంటిదగ్గరనుంచి బయలు దేరింది మొదలుకొని దేశదేశాలూ తిరగడం, ఒకముసలివాడు అగుపించి హిమాలయాలకి వెళ్ళమనడం-రాక్షసుల అడవిదాటేటప్పుడు శబరవాడొకడు గోపీమోహినిసంగతీ వాళ్ళమ్మా నాన్నా సంగతీ చెప్పడం, తాను అడవిలో ప్రవేశించడం,రాక్షసులతో యుద్ధం చేయడం, నదిలో పడిపోవడం, గోపీమోహిని తన్ను నదిలోంచి ఇంటికి తీసుకుపోవడం,

అక్కడనుంచి మణిమాల ఇంటికి వెళ్ళడం, మణిమాల అడవి దాటించడం మొదలైన సంగతంతా చెప్పాడు

కామబాహుడు గోపీమోహినిని గురించి అంతా పూర్తిగా చెప్పమని చెప్పించుకొని ఇంకా సంతుష్టిలేక మళ్ళీ మళ్ళీ గోపీమోహిని సంగతి చెప్పమని ఎంతో ఇష్టంతో విన్నాడు గోపీమోహిని బతికి బాగా ఉందిగదా అని సంతోషించాడు గోపీమోహిని సంగతి ఇంతగా అడుగుతున్నావెందుకు ? అని శివసాయకుడు అన్నాడు

'గోపీమోహిని నాకూతురే' అన్నాడు కామబాహుడు

'సింహాన్ని తరుముకుంటూ వెళ్ళిన రాజువేనా నువ్వు? అయితే మీ పట్నం వెళ్ళి రాజ్యం చెయ్యక ఇక్కడ తపస్సు చేసుకుంటూ ఎందుకు కూర్చున్నావు అని శివసాయకుడు అడిగాడు కామబాహుడు తన సంగతి ఇలాగ చెప్పాడు

' సింహాన్ని తరుముకుంటూ నేను అడవిలో ప్రవేశించాక ఆ సింహం ఒకరాక్షసై నామీద పడింది దానితో యుద్ధంచేసి దానిని చంపివేశాను నాకు ఎలాగ వెళ్ళడానికీ దారి తెలిసిందికాదు గబగబా గుఱ్ఱాన్ని పరుగెత్తించుకొంటూ వస్తుండగా కొందరు రాక్షసులు ఎదురుపడితే వాళ్ళకు గుఱ్ఱాన్ని వదిలిపెట్టి నేను పరుగుపరుగున అడవి దాటి వచ్చాను ఆ అడవంతా రాక్షసుల అడవి ఇంకోదారిని నా పట్నానికి వెళ్ళాలని ఊహిస్తూ ఉంటే ఒక సన్యాసి అగుపడి 'నీ భార్య చచ్చిపోయింది ' నీ కూతురు ఎక్కడో తప్పిపోయింది ఇంక ఇంటికి వెళ్ళి ఏమి చేస్తావు! ఇక్కడ ఉండిపో' అన్నాడు సరేనని నేను ఆ సన్యాసిరికం చేసేను నాకు అన్ని విద్యలూ నేర్పాడు నన్ను ఈ గుహలో తపస్సు చేసుకుంటూ ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు అతను వచ్చిందాకా నే నిక్కడే ఉండిపోతాను నేనుముసలివాణ్ణి అయ్యాను రాజ్యం చేద్దామని కోరిక లేదు నాకు వచ్చిన విద్యలు నీకు చెబుతాను నీవు వెళ్ళి గోపీమోహినిని రాక్షసి దగ్గరనుంచి తప్పించు అంతే కావలసింది ' అని కామబాహుడు చెప్పి అ మాటలు శివసాయకుడువిని 'గోపీమోహిని మీ అమ్మాయే కదా దానిని చూడాలని లేదూ?' అని అడిగాడు

'నీవు గోపీమోహిని సంగతి నాకు చెప్పావుగదా నీ మాటలు వింటూంటే నాకు గోపీమోహినిని చూచినట్టే ఉంది నేను ఆసన్యాపి వచ్చిందాకా కదిలి రాకూడదు

శివసాయకుడు అతని దగ్గర చాలా కాలం ఉండిపోయాడు కామబాహుడు అన్ని విద్యలూ అతనికి చెప్పుతున్నాడు. ఆ మంచు గుహలో అతనిచేత జపాలూ తపాలూ చేయిస్తూ సరిగా చేసిన తరువాత విద్యలు చెపుతూ ఉన్నాడు కొంత కాలానికి శివసాయకుడు ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు అన్నీ నేర్చుకొన్నాడు తరువాత కామబాహుడు శివసాయకుణ్ణి ఉపవాసం ఉండి ఒక నెల్లాళ్ళు ఆ గుహలో తపస్సు చెయ్యమన్నాడు శివసాయకుడు తపస్సు చేశాడు తరువాత ముని అతనికి బలం రావడానికి పళ్ళూ కాయలూ దుంపలూ పెట్టి బాగా బలం వచ్చిన తరువాత అతను వెడతానంటే 'నీకు విద్యలు పట్టు ఇచ్చాయో లేదో చూడవలెను ఇంకా కొన్నాళ్ళు ఉండు' అన్నాడు

శివసాయకుడు ఉండిపోయాడు ఒకనాడు కామబాహుడు శిసాయకుణ్ణి పిలిచి ' ఈరోజున

నీ విద్య పరీక్ష చేస్తాను సిద్ధంగా వున్నావా?' అని అడిగాడు

'సిద్ధంగా వున్నాను' అన్నాడు శివసాయకుడు

అయితే నీవు గంగానది ఒడ్డునే వెళ్ళితే కేధార్‌నాధ మనే ఊరు కనిపిస్తుంది ఆ ఊరికి ఉత్తరంగా ఒక అడవివుంది ఆ అడవిలో ఒక తీగ ఉంది ఆ తీగ రాత్రిళ్లు మెరుస్తూ వుంటుంది పగలు మామూలు తీగలాగే వుంటుంది ఆ తీగె తీసుకురాగలవా?' అన్నాడు కామబాహుడు

'తీసుకు వస్తాను - కాని ఆతీగ నీకెందుకు?' అని శివసాయకుడు అడిగాడు

'నేను ముసలివాణ్ణి అయిపోవడంచేత నే నక్కడికి వెళ్ళలేను నీవు పడుచువాడవు. నువ్వు వెళ్ళి రాగలవని నిన్ను పంపుతున్నాను ఆ తీగె నాకు కావాలి నీవు తెచ్చింతర్వాత దాని వుపయోగం చెపుతానులే' అన్నాడు కామబాహుడు

'సరే వెడుతున్నాను'అన్నాడు శివసాయకుడు

'తోవలో కొండలూ నదులూ వుంటాయి జాగ్రత్త దేవతలు అడ్డంవచ్చి నిన్ను ఎక్కడకైనా తీసుకుపోతారు జాగ్రత్త ' అని చెప్పి శివసాయకుణ్ణి పంపించివేశాడు

శివసాయకుడు గంగానది ఒడ్డునే నడిచిపోతున్నాడు.

వెళ్ళగా వెళ్ళగా ఒక కొండ అతనికి అడ్డం వచ్చింది గంగానది ఆ కొండ మొదట్లో మాయమైపోయింది అతను తక్షణం ఒక గద్దలాగ మారిపోయి ఆకాశం మీదికి ఎగిరి కొండ దాటేడు కొండవతల మళ్ళీ గంగానది కనిపించింది భూమిమీదకు దిగి మళ్ళీ మనిషిలాగ అయిపోయి గట్టునే వెడుతున్నాడు తోవలో ఒక చిన్న నది వచ్చి గంగానదిలో పడుతోంది అది అతనికి అడ్డం వచ్చింది. అప్పుడు అతను ఒక చేప అయిపోయి నది దాటి పోయి మళ్ళీ మనిషిరూపం పొంది గంగానది ఒడ్డునే వెడుతున్నాడు వెళ్ళగా వెళ్ళగా అతనికి కేదార్ నాధ మనే ఊరు కనిపించింది ఆ వూళ్ళో రెండు రోజులుండి ఆయాసం తీర్చు కొని మళ్ళీ ఉత్తరంగా వెళ్ళడానికి బయలుదేరాడు ఆ ప్రదేమంతా మంచు ఆ మంచు కాళ్ళకు తగలకుండా ఒక పసరు పాదాలకు రాసుకొని వెళ్లాడు. కొంత దూరం వెళ్ళిన తరువాత అతనికి ఒక అడవి అగుపించింది ఆ అడవిలో ప్రవేశించి అక్కడ పళ్ళూ, కాయలు తిని నిద్రబోయాడు నిద్రబోతూండగా కొందరు దేవకన్యలు వచ్చి అతని ఎత్తుకుపోవాలని ఊహించి నిద్రబోతూన్న అతన్ని నిమ్మళంగా చేతులతో ఎత్తారు ఇంతట్లోనే అతనికి మెళుకువ వచ్చింది వాళ్లు తన్ను ఎత్తడం చూచి బరువైపోయాడు 'ఇంత బరువుగా వున్నాడెందు కితను' అనుకొన్నారు వాళ్ళు అతను మరీ బరువైపోయాడు.వాళ్లు అతన్ని మొయ్యలేక 'ఇతనెవరోభూతం' అని భయపడి పారిపోయారు

రాత్రి అయింతరువాత అతను అడివంతా తిరిగాడు ఒక చోట మిలమిలా మెరుస్తూ ఒక తీగ కనిపించింది దాన్ని సమీపించాడు దానిచుట్టూ ఎందరో గంధర్వులు కత్తులు పుచ్చుకొని కూర్చున్నారు శివసాయకుణ్ణి చూడ్డంతోనే వాళ్ళు లేచి నిలబడి అతనిమీద పడబోయారు వాళ్ళు చూస్తూండగానే అతను పర్వత మంత మనిషి అయిపోయి వాళ్ళముందర నిలబడ్డాడు వాళ్ళకు భయంవేసి పారిపోయారు వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత ఆ తీగ తీసుకొని అతను వెనక్కి తిరిగాడు గంధర్వు లందరూ ఇదంతా చూచి అతనిమీద రాళ్ళవాన కురిపించారు రాళ్ళవాన కురిపించినంతసేపూ

అతను ఏనుగై గబగబా నడిచి వెళ్ళిపోతున్నాడు అప్పుడు గంధర్వులు మళ్ళీ ఎదురుగావచ్చి ఏనుగును పొడిచివెయ్యబోయారు అప్పుడు శివసాయకుడు ఒకచిన్న కుందేలై ఒక పొదలో దూరిపోయాడు వాళ్ళు అతను ఏమైనదీ ఎక్కడికి వెళ్ళినదీ తెలియక విసిగి ఇంటికి వెళ్ళిపోయారు

వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత అతను మళ్ళీ మనిషిలాగ అయిపోయి వెడుతున్నాడు మళ్ళీ తోవలో దేవతాకన్యలు అతనికి ఎదురుగా వచ్చి, 'నువ్వు ఎక్కడికి వెడతావు? మాతో ఉండిపోదువుగాని రా' అన్నారు

'నేను వెళ్లిపోవాలి. అడ్డం రాకండి' అన్నాడు శివసాయకుడు

'నిన్ను మేము వెళ్లనిచ్చేది లేదు మేము మనుష్యుల కన్నా గొప్పవాళ్ళం మా దగ్గర ఉండిపో' అన్నారు

'నేను ఉండను'

అప్పుడు వాళ్ళంతా కలిసి గట్టిగా పట్టుకొని తీసుకువెళ్ళాలనుకొన్నారు వాళ్ళు పట్టుకోవడంతోనే అతను వాళ్ళ చేతుల్లోంచి తప్పించుకుపోయి వేలంత చిన్నవాడై నిలబడ్డాడు

'ఇంత కుఱ్ఱాడు ఎవరిక్కావాలి?' అని వాళ్ళు మూతి ముడుచుకొని వెళ్లిపోయారు

శివసాయకుడు వెళ్లగా వెళ్లగా కేదారనాథము వచ్చింది. అతను తొడ చీల్చుకొని తీగ తొడలో పెట్టి కుట్టివేసి కేదారనాథములో ఒకరోజు ఉండి అలసట తీర్చుకొన్నాడు తరవాత ఆ ఊళ్లో కేదారేశ్వరుడి దేవాలయం ఉంటే అందులోకి వెళ్ళి దేవుడికి నమస్కారం పెట్టి మళ్లీ ముని దగ్గిరికి బయలుదేరాడు గంగానది గట్టునే అతను వెడుతూండగా అతనికి కొందరు సన్యాసులు కనపడి తీగ ఇయ్యమని అడిగారు అతను ఇయ్యనన్నాడు వాళ్లు అతన్ని కొట్టబోతే అతను ఆకాశం మీదికి ఎగిరిపోయాడు

అతను ఆకాశం మీద కొంతదూరం పోయి మళ్ళీ కిందకు వచ్చి గంగానది ఒడ్డునే నడిచిపోతూ నది అడ్డం వచ్చినప్పుడు చేప్తై దాన్ని ఈది మళ్లీ పర్వతం అడ్డం వచ్చినప్పుడు గద్దయి పైకి ఎగిరాడు ఎగిరి కొండను దాటబోతూంటే ఇంకో గద్దవచ్చి అతని మీద పడింది అతను వెంటనే రాంబందు అయిపోయి గద్దను చీరాడు గద్ద పారిపోయింది మళ్ళీ మనిషిలాగ అయిపోయి నది గట్టునే వచ్చి చివరకు ముని దగ్గిరికి వచ్చాడు

'తీగ తెచ్చావా?' అన్నాడు కామబాహుడు

'తెచ్చాను' అని చెప్పి శివసాయకుడు తొడ చీల్చి తీగ తీసి మునికి ఇచ్చాడు ముని చాలా సంతోషించాడు

శివసాయకుడు తీగ తేవడానికి వెళ్ళేటప్పుడూ తీగ తీసుకొనేటప్పుడూ తీగ తెచ్చేటప్పుడూ జరిగిన సంగతులన్నీ కామబాహుడితో చెప్పాడు కామబాహుడు సంతోషించి అతన్ని దీవించి ' ఈ తీగవల్ల చావు ఉండదు అందుకే నిన్ను తెమ్మన్నాను' అని చెప్పి వెడతానంటే వెళ్ళమన్నాడు

'గోపిమోహినిని చూడవచ్చును, నువ్వుకూడా రావా ?' అన్నాడు శివసాయకుడు

'ఇప్పుడు రాకూడదు' అన్నాడు కామబాహుడు

కామబాహుడిదగ్గర సెలవు తీసుకొని అతడు ఇచ్చినతీగ ముక్క తొడలో ఉంచి అడవిదగ్గిరికి బయలుదేరాడు శివసాయకుడు

మణిమాల గోపీమోహిని తల్లులవల్ల అనేక కష్టాలు పడుతున్నారు రాక్షసులిద్దరూ కలిసి వాళ్ళకి సరిగా అన్నం పెట్టడంలేదు ఇల్లుదాటి రావద్దనడంవల్ల వాళ్ళు ఇంట్లోనే ఉండవలసివచ్చింది. శివసాయకుడు ఎక్కడున్నాడో చెప్పమని ప్రతీ రోజూ వాళ్ళు మణిమాలనీ గోపీమోహినినీ బలవంతంచేసి అడుగుతున్నారు వాళ్ళు 'మాకు తెలయదంటే మాకు తెలయ'దన్నారు 'మీకు తెలియకుండా ఉంటుందా చెప్పండి' అని వాళ్ళని కొట్టారు ఎంతకొట్టినా ఎంత బలవంతపెట్టినా వాళ్ళు శివసాయకుడి సంగతి చెప్పలేదు

వీళ్ళిద్దరినీ ఒకచోట ఉంచితే ఇలాగే పెంకెతనంగా ఉంటారని రాక్షసులు మణిమాలను ఇంకో ఇంట్లోకి తీసుకువెళ్ళిపోయారు గోపీమోహిని ఒక్కర్తె రాత్రీ పగలూ ఏడుస్తూ ఉంది శివసాయకుడు సంగతి వీళ్ళని ఎంత అడిగినా చెప్పలేదని గోపీమోహిని తల్లి పక్షులన్నిటినీ పిలిచి అడిగింది పక్షులు 'మాకు తెలియదు' అన్నాయి

'నిజం చెప్పకపోతే చంపేస్తాను' అంది రాక్షసి

'మాకు తెలియదు ' అన్నాయి పక్షులు

'చెపితే మీకు పళ్ళూ పంచదారా పెడతాను, చెప్పండి' అని రాక్షసి మళ్ళీ అడిగింది

'మాకు తెలియదు ' అన్నాయి మళ్ళీ పక్షులు

అప్పుడు రాక్షసికి కోపం వచ్చింది ఒక్కొక్క పక్షినే పట్టుకొని చంపివేయటం మొదలుపెట్టించి అన్నిపక్షులూ చచ్చి పోయినాయి ఒక గుడ్లగూబమాత్రం బతికివుంది దాన్ని చంపి వెయ్యబోతూంటే అది 'నే చెబుతాను నే చెబుతాను, చంపకు చంపకు' అంది

'అయితే చెప్పు

'శివసాయకుడు హిమాలయ పర్వతానికి వెళ్ళాడు నేను చూశాను మళ్ళీ వస్తానని గోపీమోహినితో చెప్పి వెళ్ళాడు' అంది గుడ్లగూబ

'మళ్ళీ ఎప్పుడు వస్తానన్నాడు?' అని రాక్షసి అడిగింది

'అతను వచ్చేవేళ అయింది ' అని గుడ్లగూబ చెప్పింది

గుడ్లగూబను ఆ రాక్షసి ముద్దుపెట్టుకొని దానికి పళ్ళూ పంచదార పెట్టింది

హిమాలయపర్వతాన్నుంచి వస్తాడని రెండో రాక్షసితో కూడా అది చెప్పింది ఇద్దరూ కలిసి రాత్రింబగళ్ళు అతను వచ్చే దారిలో కాసుకుని ఉన్నారు అతన్ని చంపేస్తే మణిమాలా, గోపీమోహినీ తమదగ్గరే ఉంటారని అనుకొన్నారు వాళ్ళు

చాలారోజులు ఆ రీతిగా అక్కడ కాచుకొని ఉన్నారు ఉండగా ఉండగా ఒకనాడు వారికి ఒక

మనిషి కనిపించాడు అతడు అడవిలోకి వచ్చేమార్గాన్ని వస్తున్నాడు అతనే శివసాయకుడు అవునో కాదో తెలుసుకోవడానికి ఒక రాక్షసి మామూలు మనిషిలాగ అయిపోయి అతనికి ఎదురుగా వెళ్ళింది వెళ్ళి అతనికి ఎదురుగా నిలబడి, 'అబ్బాయీ, నీవు ఈ అడవిలోకి వెళ్ళవద్దు ఇందులో అందరూ రాక్షసులే వెళ్ళితే నిన్ను చంపి వేస్తారు ' అంది

'నన్ను ఎందుకు చంపివేస్తారు? అన్నాడు ఆ మనిషి.

'రాక్షసులు మనుష్యులకు విరోధులు గనక ' అంది రాక్షసి

'భయంలేదు నన్ను తినరులే! అన్నాడు ఆ మనిషి.

'ఏమమ్మా అంతధైర్యం! నీ వెవరవని నిన్ను ముట్టరు?' అంది రాక్షసి

" నేను రాజపుత్రుణ్ణి నాపేరు శివసాయకుడు " అన్నాడు మనిషి.

అతనే శివసాయకుడు గదా అనుకొని ఆ రాక్షసిమాయమై వెళ్ళిపోయి రెండో రాక్షసితో చెప్పింది అతను అడవిలోకి రావడంతోనే ఒక్కమారు చంపివెయ్యవచ్చును గదా అనుకొని వాళ్ళిద్దరూ ఒక కొండదగ్గిర రెండువేపులా పెద్ద రాళ్ళు చేత్తో పట్టుకు నిలబడ్డారు ఇద్దరూ చెరొక పెద్దరాయీ అతనిమీద వేస్తే అతను చచ్చిపోతాడనీ తరువాత మణిమాలతోనూ గోపీమోహిని తోనూ సుఖంగా ఉండవచ్చుననీ వాళ్ళు అనుకొన్నారు

శివసాయకుడు తనతో మాట్లాడినది మనిషి కాదనీ రాక్షసి అనీ తెలుసుకొన్నాడు జాగ్రత్తగా నడిచి వస్తున్నాడు కొండ దగ్గరికి వచ్చేటప్పటికి రాక్షసులిద్దరూ పెద్దరాళ్ళు రెండూ అతనిమీదకు విసిరేరు అతను తటాలున కనిపించకుండా మాయమైపోయాడు ఆరాళ్లు శివసాయకుడికి తగలడానికి బదులు రాక్షసులకే తగిలినవి ఆ రాక్షసి విసిరిన రాయి ఈ రాక్షసికి తగిలినది

'నామీద ఎందుకు విసిరేవు?' అంది రెండో రాక్షసి

ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి కోపం వచ్చింది ఇద్దరూ కలియబడి కేకలువేస్తూ బొబ్బలు పెడుతూ ఒకరి నొకరు గట్టిగా గుద్దుకుంటూ, రక్కుకొంటూ, కరచుకొంటూ యుద్ధముచేసి చివరకు ఇద్దరూ అలసిపోయి కింద పడిపోయారు శివసాయకుడు అప్పుడు వాళ్ళ ఎదుట నిలబడ్డాడు అతన్ని చూచి ఇద్దరు రాక్షసులూ గట్టిగా బొబ్బలుపెట్టి లేవబోయారు కాని లేవలేక పోయారు చివరకు వాళ్ళు అక్కడ పడిపోయి చచ్చిపోయారు శివసాయకుడు అక్కడినుండి బయలుదేరి వెడుతుండగా అడవిలో వున్న రాక్షసులందరూ తన వేపు పురుగెత్తుకు రావడంచూశాడు

రాక్షసు లిద్దరూ గట్టిగా బొబ్బలు పెడుతూ యుద్ధం చేయడంవల్ల అడవిలోవున్న రాక్షసులందరికీ ఆ బొబ్బలు వినిపించినవి వాళ్ళు నిద్రలోంచి లేచి గబగబా పరుగెత్తుకు వచ్చారు ఇద్దరు రాక్షసులూ చచ్చిపోవడం,శివసాయకుడు అక్కడే వుండటంచూచి అతనిమీదికి వెళ్ళారు వాళ్ళు రావడము శివసాయకుడు చూశాడు వాళ్ళ నందరినీ దగ్గిరిగా రానిచ్చాడు రానిచ్చి కొందరిని కుందేళ్ళుగా మార్చివేసి మరికొందరిని కుక్కలుగా మార్చివేశాడు కొందరిని తోడేళ్లు గానూ, చిరుతపులుగానూ మార్చివేసి మరికొందరిని ఏనుగులుగానూ, సింహాలుగానూ మార్చివేశాడు కొందరిని నక్కలుగానూ

మరికొందరిని సివంగలు గానూ మార్చివేశాడు కొందరిని పిట్టలుగానూ మరికొందరిని డేగలుగానూ మార్చివేశాడు ఇట్లా అందరినీ మార్చి వేసి తానక్కడ చూస్తూ నిలబడ్డాడు

కుందేళ్ళను చూడడంతోనే కుక్కలు తరుముకువెళ్ళేయి కుందేళ్ళు పరుగెత్తి పరుగెత్తి కన్నాలలో దూరిపోయేయి కుక్కలు వాటికోసం అడివిలో తిరుగుతున్నాయి

తోడేళ్ళను చిరతపులులు తరుముకు వెళ్ళేయి చిరతపులులను ఏనుగులు తరుముకు వెళ్లేయి ఏనుగులను చూచి సంహాలు వాటిని తరుముకు పోయాయి నక్కలూ శివంగులూ సింహాల వెనకే పరుగెత్తుకుంటూ వెళ్లేయి సింహాలు తినగా మిగిలిన మాంసము తాము తినవచ్చునవి.

పిట్టలు ఆకాశంమీదికి ఎగిరిపోవడం చూచి డేగలు వాటి వెంట బడ్డాయి

అన్ని జంతువులూ అన్నిదిక్కులా ఈ విధంగా పారి పోవడం చూచి శివసాయకుడు నవ్వుకొన్నాడు

మళ్ళీ బయలుదేరి కొంతదూరం వెళ్ళాడు అక్కడ మణిమాల ఇల్లు కనిపించింది మణిమాల ఉన్న దేమోనని ఇంట్లోకి వెళ్ళాడు ఇల్లు అంతా వెతికి చూశాడు మణిమాల కనిపించ లేదు ఎక్కడకు వెళ్ళిందోగదా అనుకొని అతను అక్కడ కూర్చుని ఉండగా మణిమాల గది జ్ఞాపకంవచ్చింది గది తలుపులు తీసి లోపలచూశాడు సరస్సు ఉంది కాని సరస్సులో దీపాలు లేవు తూగుటుయ్యాలలో ఎవరూ లేరు మణిమాల లేదు కాబోలని మళ్ళీ తిరిగివస్తుంటే కొన్ని భూతాలు అతనికి ఎదురుగా వచ్చి మా గదిలోకి ఎందుకు వచ్చావు? నిన్ను చంపేస్తామని అన్నాయి

'ఈ గది మణిమాలది కాదూ'? అన్నాడు శివసాయకుడు

'అవును మణిమాలదే' అన్నాయి భూతాలు

'మరి మీ గది అంటారేం?' అన్నాడు శివసాయకుడు,

'ఇందులో వెలిగే దీపాలము మేమే అంచేత మాగది' అన్నాయి భూతాలు

'మణిమాల ఎక్కడుంది మరి?' శివసాయకుడు అడిగాడు

'ఏమో రాక్షసి ఎక్కడికో తీసుకుపోయింది' అన్నాయి భూతాలు

'అయితే వెళతాను' అన్నాడు శివసాయకుడు

'నిన్ను వెళ్ళనివ్వము'చంపేస్తాము' అన్నాయిభూతాలు

'అయితే చంపండి' అన్నాడు శివసాయకుడు

భూతాల్లన్నీ కలిసి ఒక్కమారు అతనిమీదపడ్డాయి పడికొట్టడం మొదలుపెట్టాయి కొట్టి కొట్టి భూతాలన్నీ లేచి చచ్చి పోయాడో లేదో అని చూచాయి అక్కడ శివసాయకుడులేడు శివసాయకుడిలాగే ఉన్న ఒక గుడ్డబొమ్మ ఉంది

తమరిని మోసం చేశాడని కోపంవచ్చి భూతాలన్నీ కలిసి శివసాయకుడు వెళుతూవుంటే అతని వెంటబడ్డాయి శివసాయకుడు వాటిని చూచి నవ్వి, 'మళ్ళీ ఎందుకువచ్చారు?' అన్నాడు వాటికి మరీ కోపంవచ్చి 'నిన్ను చంపేస్తాము' అన్నవి అతను వాటి నన్నిటినీ చాలాసేపు తనవెంట పరుగెత్తించుకొన్నాడు

చివరకు వాటినన్నింటినీ ఒక కొండగుహలోకి తీసుకువెళ్ళి వాటికి తెలియకుండా తాను బయటికి వచ్చి గుహద్వారము ఒక పెద్ద రాతితో మూసివేశాడు ఆ భూతాలు ఆ కొండగుహలో నుంచి బయటికి రాలేక ఒకళ్ళనొకళ్లు కొట్టుకుంటూ అందులోనే ఉండిపోయాయి

తరవాత శివసాయకుడు బయలుదేరి గోపీమోహిని ఇంటికి వెళ్ళాడు గోపీమోహిని ఒక గదిలో చిక్కిపోయి ఏడుస్తూ ఉంది శివసాయకుణ్ణి చూడడంతోనే ఎదురుగావచ్చి అతన్ని కౌగలించుకొంది గోపీమోహినికి ఎంతో సంతోషంవచ్చింది 'మణిమాల ఎక్కడుందో నీకు తెలుసునా?' అని గోపీమోహినిని శివసాయకుడు అడిగాడు 'ఏమో నాకు తెలియదు ' అంది వాళ్ళిద్దరూ కలిసి ఆ ఇల్లంతా వెదికారు ఒక గదిలోమణిమాల నిద్రపోతూ ఉంది శివసాయకుడు మణిమాలను లేపాడు మణిమాల లేచి అతన్ని కౌగలించుకొని వెక్కి వెక్కి ఏడ్చింది శివసాయకుడు మణిమాలను ఊరుకోబెట్టాడు

ముగ్గురూ కలిసి సరస్సులో స్నానంచేశారు చేసి మంచి బట్టలు కట్టుకొని చెరువుగట్టున కూర్చుని పళ్ళు తింటూ కబుర్లు చెప్పుకొన్నారు శివసాయకుడు తాను వెళ్ళినరోజు మొదలుకొని ఆ రోజువరకూ చేసిన పనులన్నీ చెప్పాడు రాక్షసులందరూ జంతువులైపోయినందుకు వాళ్ళు చాలా సంతోషించారు. వాళ్ళను పెంచిన రాక్షసులిద్దరూ చచ్చిపోయినందుకు మాత్రము విచారించారు భూతాలను కొండగుహలో పెట్టినందుకు వాళ్ళు చాలా సేపు నవ్వుకొన్నారు తరవాత మణిమాలా గోపీమోహినీ కలిసి తాము పడ్డ కష్టాలన్నీ అతనితో చెప్పారు అతను చాలా విచారించాడు

కొంతకాలము అక్కడ అలసట తీర్చుకొని వాళ్ళు బయలుదేరారు బయలుదేరి కాలినడకను వెళ్ళగా వెళ్ళగా వాళ్ళకు నది అడ్డం వచ్చింది శివసాయకుడు వాళ్ళిద్దర్నీ తన భుజాలమీద కూర్చోబెట్టుకుని 'జయ్ సీతారాం' అని ఒక్కమారు నదిదాటి అవతల గట్టుకు వెళ్ళారు అక్కడ శివసాయకుడు ఎక్కి వచ్చిన గుర్రం ఎముకలూ, గోపీమోహిని ఎక్కివచ్చిన గుర్రం ఎముకలూ కనిపించినవి శివసాయకుడు మంత్రంవేసి ఆ గుర్రాలను రెంటినీ బ్రతికించాడు ఒక గుర్రంమీద శివసాయకుడూ, ఇంకో గుర్రంమీద మణిమాలా - గోపీమోహిని కూర్చున్నారు కూర్చుని వాళ్ళు వెళుతుండగా చీకటి పడింది

'చీకట్లో మాకు భయంగా వుంది' అని మణిమాల అంది

'భయం లేదులే' అన్నాడు శివసాయకుడు

'అమ్మయ్యో! నాకు భయంగా వుంది ఇంక మనం వెళ్ళవద్దు ఈ మర్రిచెట్టుకింద దిగిపోదాము తెల్లారేదాకా ఇక్కడ ఉండి తెల్లారిన తరువాత వెళ్ళిపోదాము' అంది మణిమాల

'సరే' అని వాళ్ళు గుర్రాలు దిగి వాటిని చెట్టుకు కట్టివేసి కింద బాగుచేసి కూర్చున్నారు

'ఇక్కడన్నీ రాళ్ళే రాత్రంతా ఇక్కడ ఎలాగ కూర్చోవడం?' అంది గోపీమోహిని

'నే కూర్చోలేనమ్మా ఈ రాళ్ళమీద' అంది మణిమాల

'మరి అడవిలో మంచాలూ, పరుపులూ వస్తాయా?' అని నవ్వాడు శివసాయకుడు

'మరి నువ్వేవో విద్యలు నేర్చుకువచ్చావు కాదూ?' అంది మణిమాల

శివసాయకుడు ఒక కొమ్మ తీసుకొని మంత్రం వేసి ఒక పెద్ద పట్టెమంచమూ పరుపూకింద ఆ కొమ్మను మార్చివేశాడు వాళ్లు ముగ్గురూ మంచంమీది పరుపుమీద కూర్చున్నారు

'ఈచీకట్లో నాకేమిటో భయం వేస్తోంది' అంది మణిమాల

'నాకునూ, ఇక్కడ పిశాచాలుకూడా ఉన్నాయట' అంది గోపిమోహిని

'ఐతే ఏం చెయ్యమన్నారు?' అన్నాడు శివసాయకుడు

'దీపం తెప్పించలేవూ?' అంది మణిమాల

'పిశాచాలు రాకుండా మంత్రం వెయ్యలేవూ?' అంది గోపీమోహిని

'సరే' అన్నాడు శివసాయకుడు

అనడంతోనే అతని అరచేతిలోంచి పెద్ద కాంతి వచ్చింది ఆ కాంతివల్ల ఆ చుట్టుపట్లంతా బాగా కనిపిస్తూన్నది

'దీపం చాలునా'అన్నాడు శివసాయకుడు

'చాల్లే' అంది మణిమాల

తరువాత అతను లేచి వాళ్ళు కూర్చున్న మంచానికి చుట్టూ ఒక గిరి గీశాడు గీసి ' ఈ గిరిదాటి ఏ పిశాచాలూ రాలేవు' అన్నాడు

'సరే అయితే రా, ఈ మంచంమీద కూర్చో' అంది గోపీమోహిని అతను మంచంమీద కూర్చున్నాడు

'మనం ఈ అడవిదాటి ఎక్కడికి వెళదాము?' అంది మణిమాల

'ముందుగా గోపీమోహిని రాజ్యానికి వెళదాము తరువాత అక్కడనుంచి బయలుదేరి మా రాజ్యానికి వెళదాము' అన్నాడు శివసాయకుడు

'మీ రాజ్యంలో ఎవరున్నారు?' అంది మణిమాల

'మా రాజ్యంలో మా అమ్మా,నాన్న వున్నారు చాలాకాలం అయింది మా అమ్మా నాన్న నాకోసం కనిపెట్టుకు వుంటారు' అన్నాడు శివసాయకుడు.

'అయితే చప్పుచప్పున వెళ్ళిపోదాము' అంది మణిమాల

' మా రాజ్యంలో మా అమ్మాలేదు, మా నాన్నాలేడు ' అని గోపీమోహిని ఏడ్చింది

'మీ అమ్మనీ నాన్ననీ నేను తెప్పిస్తానులే' అని శివసాయకుడు గోపీమోహినిని ఊరుకోబెట్టాడు

" మా అమ్మా నాన్నా ? "అంది మణిమాల

'మీ అమ్మా నాన్నా ఎవరో తెలియందే?' అన్నాడు శివసాయకుడు

'నువ్వుంటే, మా అమ్మా నాన్న లేకపోయినా విచారం ఉండదు' అంది మణిమాల

'చూద్దాములే' అన్నాడు శివసాయకుడు

వాళ్ళు ఇలాగ మాట్లాడుకొంటూ ఉంటే దూరంనుంచి గోల వినిపించింది పిశాచాల రాజు పిశాచాల నన్నింటినీ వెంటబెట్టుకొని తనవైపు వస్తూన్నట్టు చూశాడు

మణిమాలా గోపీమోహినీ భయపడ్డారు 'మీకేమీ భయం లేదు చూస్తూ వుండండి' అని శివసాయకుడు వాళ్ళతో చెప్పాడు

ఇంతలో పిశాచాల రాజు గబగబా వచ్చి వాళ్ళమీద పడదామని గిరిలో కాలుపెట్టాడు పెట్టీపెట్టడంతోనే 'మొ(ర్రో'అని ఏడుస్తూ వెనక్కి వెళ్ళిపోయాడు మిగిలిన పిశాచాలన్నీ కూడా అతని వెనకాల నిలబడ్డవి

పిశాచాలరాజూ, పిశాచాలూ అక్కడనుంచి పారిపోవాలనుకొన్నాయి కాని పారిపోలేక పోయాయి గిరి చుట్టూ తిరుగుతూ అక్కడే ఉండిపోయాయి

'వీటిని ఏం చెయ్యమన్నారు?' అని శివసాయకుడు మణిమాలనీ గోపీమోహినినీ అడిగాడు

'ఈ రాత్రంతా ఊరికే కూర్చోవడం ఎందుకు?' వీటిని మన కెదరుగుండా నిలబడి ఆడమను ' అంది మణిమాల

'అవును వీళ్ళచేత ఆటలు ఆడించు' అంది గోపీమోహిని

అప్పుడు శివసాయకుడు మంత్రం వేశాడు వాళ్ళ ఎదురుగా పిశాచాలన్నీ గుండ్రంగా నిలబడి అడ్డం మొదలు పెట్టాయి గుండ్రంగా తిరుగుతూ, గంతులు వేస్తూ, పాడుతూ, తాళాలు వేస్తూ చాలాసేపు అవి ఆడాయి తరువాత ఒక్కొక్క పిశాచమే వాళ్ళకి ఎదురుగా నిలబడి ఆటలు ఆడింది మిగిలిన పిశాచాలన్నీ చప్పట్లు కొడుతూ కూర్చున్నాయి దానికి అలసట వచ్చాక రెండోది ఇలాగ్గా - అన్నీ ఆడాయి మణిమాల, గోపీమోహిని వాళ్ళ ఆట చూచి సంతోషించారు ఇంతట్లోకే తెల్లార వస్తూ ఉంది పిశాచాలరాజు చేతులు జోడించుకొని శివసాయకుడి కేసి తిరిగి 'తెల్లవారబోతూంది మమ్మల్ని పంపించి వెయ్యండి అన్నాడు మిమ్మిల్ని పంపిస్తే ఈ అడవిలోకి వచ్చే వాళ్లనల్లా బాధ పెడతారు, మిమ్మల్ని వదిలిపెట్టను' అన్నాడు శివసాయకుడు

అవి భయపడి అతన్ని చాలా చాలా బతిమాలుకొన్నాయి దణ్ణాలు పెట్టాయి ' ఎవరినీ భయపెట్టము' అన్నాయి

'వీటిని ఏమి చేయమన్నారు?' అని శివసాయకుడు మణిమాలను గోపీమోహినినీ అడిగాడు

మణిమాలా గోపీమోహినీ వాటిని చూచి జాలిపొందారు

'పోనీ వాటిని పక్షులకింద మార్చివేయి ఈ అడవిలో తిరుగుతూ ఉంటాయి ' అంది మణిమాల

అన్నీ ఒకమోస్తరు పక్షులు కావు కొన్నింటిని చిలకలు గానూ, కొన్నింటిని గోరింకలుగానూ, కొన్నింటిని పికిలిపిట్టలూ, పాలపిట్టలూ, నెమళ్ళుగానూ ఇలాగ అనేకరకాల పక్షుల్ని చెయ్యి' అంది గోపీమోహిని

శివసాయకుడు పిశాచాలరాజును ఒక ఎలుగుబంటిగా మార్చి వేశాడు అది అతని చేతిలోనుంచి వచ్చే కాంతిని చూచి గబగబా పారిపోయింది మిగిలిన పిశాచాల నన్నింటినీ అనేక రకాల పక్షులుగా మార్చి వేశాడు అవన్నీ చెట్లమీదికి వెళ్ళిపోయి తెల్లారుతోంది గదా, అని పాటలు పాడడం మొదలు పెట్టాయి

తెల్లవారిన తరువాత వాళ్ళు ముగ్గురూ గుర్రాలెక్కి బయలు దేరారు మెల్లగా ప్రయాణం చేసుకొంటూ వెళ్ళి వెళ్ళి చివరకు వాళ్ళు అడవిదాటారు అడవి దాటి వెళ్ళుతూ ఉంటే వాళ్ళకి తోవలో శబరవాడు కనిపించాడు శబరవాడు వాళ్ళని చూచి చాలా ఆశ్చర్యపోయాడు

'ఈ అడవిలోకి వెళ్ళి ఎలాగ తిరిగి వచ్చావయ్యా?' అన్నాడు శబరవాడు 'నేను రావడమే కాకుండా గోపీమోహినినీ ఈ పిల్లనూ కూడా తీసుకువచ్చాను' అన్నాడు శివసాయకుడు శబరవాడు గోపీమోహినిని గుర్తుపట్టి చాలా సంతోషించాడు మణిమాలకేసి పరకాయించి చూచి 'ఈ అమ్మాయికి మా రాణీ గారి పోలిక ఉంది ' అన్నాడు

'మీ రాణిగారంటే ఎవరు?' అన్నాడు శివసాయకుడు

'అంటే గోపీమోహిని తల్లి' అన్నాడు శబరవాడు

వాడి మాటలకి వాళ్ళంతా నవ్వుకొన్నారు.

'నీవు వెళ్ళివచ్చావు గదా ఆ అడవిలో రాక్షసులూ, పిశాచాలూ అవీ లేవా?' అన్నాడు శబరవాడు

'ఇప్పుడేమీ లేవు అడవిజంతువులూ పక్షులూ కావలసినన్ని ఉన్నాయి' అన్నాడు శివసాయకుడు

'నిజంగానే!' అన్నాడు శబరవాడు

'నిజంగానే' అన్నారు మణిమాలా గోపీమోహినీని

శబరవాడు ఆ మాటలకు సంతోషించి వాళ్ళదగ్గరసెలవు తీసుకు వెళ్ళిపోయి తనవాళ్ళందరితోనూ ఆ మాట చెప్పాడు వాళ్ళందరూ చాలా సంతోషించి ఆ రోజు నుంచీ ఆ అడవిలోనే కాపురం ఉండడం మొదలు పెట్టారు

శివసాయకుడూ, మణిమాలా గోపీమోహినీ కలిసి గుర్రా లెక్కి ఒక దేశంలోనుంచి వెళుతూంటే వాళ్ళకు ఒక ముసలివాడు కనిపించాడు ఆ ముసలివాడు హిమాలయ పర్వతం దగ్గరికి శివసాయకుణ్ణి వెళ్ళమన్నవాడే! అతను వాళ్ళను చూచి చాలా సంతోషించాడు శివసాయకుడు అన్ని విద్యలూ నర్చుకు వచ్చినట్లు చెప్పాడు

'అవును నాకు తెలుసును కామబాహుడు నా శిష్యుడే నేనే అతనికి అన్ని విద్యలు చెప్పాను గోపీమోహిని తండ్రి గదా అని నిన్ను అతని దగ్గరికి పంపించాను నేను మళ్ళీ అతని దగ్గరికి సన్యాసి వేషంతో వెళ్ళిపోతున్నాను' అన్నాడు

'కామబాహుణ్ణి తీసుకురావా?' శివసాయకుడు అడిగాడు

'అలాగే తీసుకు వస్తా'నని అతను వెళ్ళిపోయాడు

తరువాత వాళ్ళు మళ్ళీ బయలుదేరి గోపీమోహిని రాజ్యం లోకి వెళ్ళారు అక్కడ మంత్రులూ పురోహితులూ, ప్రజలూ వాళ్ళు రావడంచూచి ఎదురుగా వెళ్ళి పెద్ద ఉత్సాహంతో ఇంటికి తీసుకు వచ్చారు

మణిమాలనూ గోపీమోహినినీ మేడలో దిగబెట్టి శివసాయకుడు రాణీ సమాధి ఉన్న తోటలోకి వెళ్ళి ఆవిడను బ్రతికించాడు బ్రతికించి మేడలోకి తీసుకువచ్చాడు రాణీ గోపీమోహినిని చూచి

కౌగిలించుకొని ముద్దుపెట్టుకుంది తరువాత మణిమాలను చూచి ఏదో జ్ఞాపకం వచ్చినట్టుంటే మరోమారు నిదానంగా చూచి 'మా అమ్మే, మా అమ్మే నీవుకూడా వచ్చావమ్మా! నీవుకూడా వచ్చావమ్మా ' అని కౌగలించుకొని ముద్దు పెట్టుకొంది

'మణిమాల ఎవరే అమ్మా?' అని గోపీమోహిని అడిగింది

'మణిమాల నీ చెల్లెలేనే అమ్మా చిన్నప్పుడు నేను దాన్ని ఒళ్లో పడుకోబెట్టుకొని తోటలో నిద్రపోతూఉంటే ఎవరో తీసుకుపోయారు దానికోసం అన్ని దేశాలూ వెదికాము ఎక్కడా కనిపించింది కాదు ఏమైపోయిందో అనుకొని ఊరుకొన్నాము' అంది రాణీ

మణిమాలా గోపీమోహినీ కలసి వాళ్ళమ్మతో శివసాయకుడు తమర్ని ఎలాగ రక్షించాడో అంతా చెప్పారు రాణీ శివసాయకుణ్ణి చూచి ఎంతో మెచ్చుకొంది

కొన్ని రోజులు పోయినతరువాత సన్యాసి కామబాహుణ్ణి తీసుకొని అక్కడికి వచ్చాడు అందరూ అతన్నిచూచి చాలా సంతోషించారు

కామబాహుడూ, రాణీ తమ కూతుళ్ళ నిద్దరినీ శివసాయకుడి కిచ్చి పెళ్ళిచేయవలె ననుకొన్నారు

శివసాయకుడూ సంతోషించాడు మణిమాలా, గోపీమోహినీ కూడా సంతోషించారు చాలా వైభవంగా వాళ్ళకు పెళ్ళిజరిగింది

పెళ్ళి అయినతరువాత సన్యాసీ కామబాహుడూ కలిసి తపస్సుచేసుకోవడానికి వెళ్ళిపోతా మన్నారు ఆ రాజ్యానికి శివసాయకుణ్ణి రాజుగా చేశారు వెళ్ళిపోతూ కామబాహుడు శివసాయకుడికి ఇచ్చిన తీగ తీసుకు వెళ్ళిపోయాడు

'ఈ తీగ నీ కిప్పుడు అక్కరలేదు అడవి భద్రంగా దాటడానికని నీకు ఇచ్చాను' అని వెళ్ళిపోయేటప్పుడుచెప్పాడు.

శివసాయకుడు కొన్నాళ్ళు అక్కడ ఉండి, తరువాత మణిమాలనూ గోపీమోహినీని తీసుకొని తన తండ్రి రాజ్యానికి ప్రయాణ మయ్యాడు

'మళ్ళీ చప్పున రండి' అని చెప్పి రాణీ వారిని పంపించి వేసింది వాళ్ళకోసమని వాళ్ళమ్మా నాన్నా ఎదురుచూస్తున్నారు

శివసాయకుడు ఇద్దరు చక్కని పిల్లలను పెండ్లాడి, అన్ని విద్యలూ నేర్చుకునివచ్చినందుకు తల్లీ తండ్రీ చాలా సంతోషించారు అక్కడ కొన్నాళ్ళు వారు కులాసాగా గడిపారు

కొన్నాళ్ళు తండ్రిగారి రాజ్యములోనూ, కొన్నాళ్ళు తన రాజ్యములోనూ ఉంటూ మణిమాలతోనూ గోపీమోహినితోనూ అన్యోన్యంగా ఉంటూ శివసాయకుడు ప్రజలను బాధపెట్టకుండా రాజ్యం చేశాడు శివసాయకుడు మణిమాలకు ఒక పెద్ద మేడా, గోపీమోహినికి ఒక పెద్ద మేడా తన రాజ్యంలోనే కట్టించాడు

వాళ్ళంతా సుఖంగా ఉన్నారు

*　　*　　*　　*

# శంపాలత

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక కాపువాడూ, వాని భార్యా ఉండేవారు వారు చిలకా గోరింకల్లాగ కలిసి మెలిసి ఉండేవారు. వారు ప్రతిదినమూ చద్దిఅన్నము పిడతలలో పెట్టుకొని పొలానికి పోయి సాయంత్రందాకా పొలంలో పనిజేసి రాత్రి అయ్యేసరికి ఇంటికి వచ్చేవారు

వారికి రెండుకాళ్ళు ఎద్దులు కూడా ఉండేవి. ఆ ఎద్దులను ఉదయాన్ని పొలానికి తోలుకువెళ్ళేవారు, సాయంత్రము ఇంటికి తోలుకు వచ్చేవారు.

ఈ రీతిగా చాలాకాలం వాళ్లు గడిపారు

పాపం వాళ్ళకు పిల్లలు లేరని చాలా విచారంగా ఉండేది పిల్లలు కలుగుతారేమోనని వాళ్ళు బ్రాహ్మలకు దానాలు ఇచ్చారు రావిచెట్టు ప్రదక్షిణాలు చేశారు వ్రతాలూ, నోములూ పట్టారు. ఏమి చేసినా వారికి సంతానం కలిగింది కాదు

"పోనీ భగవంతుడు మన కింతే ఇచ్చాడు దీంతో సంతుష్టి పొంది ఉందాము," అని వారు మనస్సు సమాధానం చేసుకొన్నారు

ఒకనాడు తెల్లవారగట్ల వాళ్ళు చద్దిమూటలను కట్టుకొని, ఎడ్లని తోలుకొని తెల్లారకముందే పొలానికి వెళ్ళారు పొలంలో మధ్యాహ్నందాకా పనిచేసి చద్దిఅన్నము తిని ఒక చెట్టునీడను పండుకొన్నారు అప్పుడు కాపువాని భార్యకు ఒక కల వచ్చింది

ఆవిడకు కలలో మల్లికార్జునస్వామి కనిపించి, "నీకు సంతానము లేదని చాలా దుఃఖిస్తున్నావు నీవు నీ భర్తతో దేశాలన్నీ తిరిగి ఎవరైనా నీ కడుపున పుట్టుతారేమో కనుక్కో పుట్టుతామని ఎవరైనా ఒప్పుకొన్నట్లయితే నీకు తప్పకుండా సంతానం కలుగుతుంది," అని చెప్పి మాయమైపోయినాడు

కాపువాని భార్య కళ్ళు నులుపుకుంటూ లేచి భర్తను లేపి తనకు వచ్చిన కల సంగతి చెప్పింది "పగలు వచ్చిన కలను పాటించకూడ"దని కాపువాడు చెప్పాడు "పగలు వచ్చినా రాత్రి వచ్చినా మల్లికార్జునస్వామి ప్రత్యక్షమయ్యేడు గదా ! ఆ స్వామి ప్రత్యక్షమయి చెప్పినమాట ఎందుకు అబద్ధమౌతుంది?" అని కాపువాని భార్య చెప్పింది ఆవిడ దైవభక్తికీ, నమ్మకానికీ కాపువాడు ఆశ్చర్యం పొంది, సరే ఏమి చేద్దాము?" అన్నాడు

భార్యాభర్త లిద్దరూ, కూడబలుక్కొని తమ పొలాలూ, ఎడ్లూ అమ్మివేసి దేశాలవెంట బయలుదేరారు వారు త్రోవలో ఒక అందమైన పిల్లవాణ్ణి చూచి, "మా కడుపున పుట్టుతావా నాయనా?" అని అడిగారు "మా అమ్మ కొట్టుతుంది నే పుట్టను నిన్ను చూస్తే నాకు భయమేస్తూ ఉంది," అన్నాడు వాళ్ళా మాట విని సిగ్గుపడి మళ్లీ మాటాడకుండా తమ దారిన వెళ్ళిపోయారు

వెళ్ళగా వెళ్ళగా వారికి త్రోవలో ఒక చెరువు కనిపించింది. ఆ చెరువు దగ్గిర ఒక అందమైన ఆడపిల్ల కనిపించింది అలాంటి ఆడపిల్ల తమకు పుట్టితే ఎంత బాగుంటుందో అనుకొని ఆ

పిల్లదగ్గిరికి వారు వెళ్ళి అన్నారుగదా, "అమ్మాయీ! మా చిట్టితల్లివి, నీ విక్కడేమి చేస్తున్నావమ్మా ? నీకు బొమ్మలూ, పువ్వులూ ఇస్తాము మా కడుపున పుట్టుతావా?" అని

"నాకు బొమ్మలూ, పువ్వులూ ఉన్నవి నాకు మా అమ్మా, నాన్న అన్నీ ఇస్తారు మీ దగ్గిరికి నేను రాను," అంది

ఈ విధంగా వారు అగుపించిన పిల్లలందరినీ అడుగుతూ వెళ్ళారు కాని ఎవరూ వాళ్ళ కడుపున పుట్టడానికి ఒప్పుకోలేదు

"పోనీ ఎవరైతేనేమి? పుట్టితే చాలును," అనుకొని వాళ్ళు ఒక ముసలి అవ్వదగ్గిరికి వెళ్లి, "అవ్వా, అవ్వా, మాకు పిల్లలు లేక చాలా దుఃఖిస్తున్నాము నీవు కాటికి కాళ్ళు చాచుకొన్నావు గదా! మళ్ళీ జన్మములో మా కడుపున పుట్టడానికి ఒప్పుకొంటావా?" అని అడిగారు

"నేను మీ కడుపున పుట్టడ మెందుకు? నేను ఎవరి కడుపునా పుట్టను అందుకనే రామా ! కృష్ణా! అనుకొంటున్నాను" అంది

పోనీలే అని వారు కొంతదూరం నడిచి వెళ్ళగా వెళ్ళగా ఒక ఇంటిలో ఒక ముసలివాడు కర్ర చేత్తో పుచ్చుకొని గుమ్మందగ్గిర కూర్చుని ఉన్నాడు వాళ్ళు ముసలివాని దగ్గిరకు వెళ్లి, "నాయనా, మాకు సంతానం లేక చాలా దుఃఖిస్తున్నాము. నేడో రేపో నీవు కాలంచేస్తావు గదా ? మా కడుపున పుట్టడానికి ఒప్పుకోవా?" అని అడిగారు

ఆ ముసలివాడు ఉలిక్కిపడి, "ఏమిటీ, ఏమిటీ, నేను మీ కడుపున పుట్టడమా ? ఈ నా ఇళ్ళూ, వాకిళ్ళూ, పొలంబొ(్రా ఏమైపోను ? నేను ఎవరి కడుపునా పుట్టను ఇవన్నీ చూచుకొంటూ ఇక్కడనే ఉంటాను," అన్నాడు

ఎవరిని అడిగినా ఎవరూ ఒప్పుకోవడంలేదని వాళ్లు "పోనీ ఎవరైతేనేమి ? ఎవళ్ళో వొకళ్లు కావాలిగదా మనకు సంతానం," అనుకొని, ఒక బాట ప్రక్క ఇద్దరు కుంటివాళ్ళు బిచ్చము ఎత్తుకొని జీవిస్తూ ఉంటే దగ్గిరకు వెళ్ళి ఇలాగ అన్నారు "తిండికి లేక బిచ్చమెత్తుకొని మలమల మాడుతున్నారు గదా ! పోనీ మీరు చచ్చిపోయి మా కడుపున పుడతారా ? మీకు కూడూ, గుడ్డా లోపం ఉండదు అన్ని సౌఖ్యాలూ ఉంటవి "

ఆ కుంటివాళ్ళు కాపువాణ్ణీ, వాని భార్యను చూచి "మేము ఎందుకు చచ్చిపోవాలి ? మేము చచ్చిపోనూ చచ్చిపోము, మీ కడుపున పుట్టనూ పుట్టము మా కిలా ఉంటేనే బాగుంది " అని అన్నారు

ఎంతమంది మనుష్యుల నడిగినా ఎవరూ ఒప్పుకోలేదు ఇంక వారికి సంతానం కలగడం ఎలాగ? పోనీ మనుష్యులు కాకపోతేపోయిరి, జంతువులైనా తమ కడుపున పుట్టడానికి ఒప్పుకొంటాయేమోనని ఒక ఆవు దగ్గిరికి వెళ్ళి, "ఆవూ, ఆవూ, నీకు ఈ మృగ జన్మము ఎందుకు ? మా కడుపున పుట్టరాదూ? నీకు అన్ని సౌఖ్యాలూ ఉంటవి," అని అడిగారు "నాకు ఈ జన్మమే బాగుంది నాకు మనుష్యజన్మ అక్కరలేదు" అని ఆవు చెప్పింది

ఈలాగే జింకల దగ్గరకూ, పక్షుల దగ్గిరికీ, గుర్రాల దగ్గిరికీ వెళ్ళి తమ కడుపున

పుట్టవలసినదని వారు కోరగా అవి ఏమీ ఒప్పుకోలేదు.

తరువాత వాళ్ళు ఒక పెద్దపులి దగ్గిరికి వెళ్ళి, "పెద్దపులీ, పెద్దపులీ, మా కడుపున పుట్టుతావా?" అని అడిగారు

"నా కర్మం కాలిందా ఏమిటి, నేను మనుష్యజన్మ ఎత్తడానికి ? హాయిగా, స్వేచ్ఛగా ఈ అడవిలో నేను తిరుగుతూ సుఖంగా ఉన్నాను నాకు లోటేమిటి ? నాకు మనుష్యజన్మం అక్కరలేదు పొండి," అని గాండ్రించింది

వాళ్ళు భయపడి అక్కడ నుండి పారిపోయారు

తమ కడుపున పుట్టడానికి మనుష్యులూ ఒప్పుకోలేదు, మృగములూ ఒప్పుకోలేదు, పక్షులూ ఒప్పుకోలేదు, ఇంక ఏమి చేయ్యడానికీ వారికి తోచింది కాదు సంతానం లేకుండానే చచ్చిపోవాలి కాబోలు ననుకొని వాళ్లు దుఃఖిస్తూ ఒక చెట్టుకింద కూర్చున్నారు

అది పెద్ద మర్రిచెట్టు ఆ చెట్టుమీద ఒక బ్రహ్మరాక్షసీ, బ్రహ్మరాక్షసుడూ కాపురం ఉన్నారు

పూర్వజన్మంలో వాళ్లు మనుష్యులు వాళ్లు మనుష్యులుగా ఉన్న రోజుల్లో చాలా పాపాలు చెయ్యడంవల్ల రాక్షసులై పుట్టి ఆ మర్రిచెట్టుమీద కాపురం ఉన్నారు

ఆ దారిన వచ్చేపోయే వారందరినీ భయపెట్టుతూ, కొట్టుతూ, రక్కుతూ ఎంతో బాధ పెట్టుతూ ఉన్నారు

పూర్వ జన్మలో పాపాలు చెయ్యడంవల్ల తమకు రాక్షసజన్మ వచ్చిందనీ, మళ్లీ మనుష్యజన్మ ఎత్తగలిగితే అన్నీ పుణ్యాలు చెయ్యవచ్చుననీ, దానివల్ల తమకు మళ్ళీ రాక్షసజన్మ రాదనీ వాళ్ళు అనుకొంటూ ఉండేవారు కాని ఆ దారిని పోయే ప్రయాణీకులను మాత్రము అనేక విధాలుగా బాధపెట్టేవారు

చెట్టుమీదనుంచి బ్రహ్మరాక్షసీ, బ్రహ్మరాక్షసుడూ కాపువాణ్ణీ, వాడి భార్యనూ చూచారు "మీరు ఇక్కడకు ఎందుకు వచ్చారు?" అని చెట్టుమీదనుంచి కేకవేశారు

కాపువాడూ, భార్యా ఆ కేకవిని ఎవరో చెట్టుమీద ఉన్నారనుకొని తల ఎత్తి చూచారు వారి కెవరూ కనిపించలేదు "ఎవరు చెప్మా కేకవేసి మాయమయ్యేరు దయ్యమూ, భూతమూ కాదుగదా !" అనుకొన్నారు వారు

రాక్షసులు మళ్లీ "మీ రెవరో చెప్పుతారా, చెప్పరా, మిమ్మల్ని మింగేసేదా?" అని అరిచారు

"ఎవరో నాయనా మీరు, మేము చూడలేకుండా వున్నాము మేము సంతానం లేక దేశదేశాలూ తిరుగుతున్నాము ఎవరైనా మా కడుపున పుట్టుతారేమోనని ఎవరిని అడిగినా పుట్టమన్నారు మా గతి ఇలాగ అయింది గదా అనుకొని దుఃఖిస్తున్నాము నాయనా !" అని వారు చెప్పారు

ఆ మాటలు వినడంతోనే రాక్షసులకు సంతోషమయింది "మే మిద్దరమూ మీ కడుపున కొడుకూ, కూతురూ అయి పుడతాము మీకు ఇష్టమేనా?" అని రాక్షసులు అడిగారు

"మీ రెవరు నాయనా?" అని కాపువాడూ, భార్యా అడిగారు

"మేము బ్రహ్మరాక్షసులము," అన్నారు వారు

ఆ మాట వినగానే కాపువానికీ వాని భార్యకూ చాలా భయంవేసింది బ్రహ్మరాక్షసులు తమ కడుపున పుట్టడమేమిటి ? ఎవరైనా వింటే తమ్ముకూడా అడవులలోనికి తరిమివేస్తారు గదా ? అయినా బ్రహ్మరాక్షసులను కని యెలాగ బ్రతకడం ?" అనుకొన్నారు వారు

అనుకొని ఆ చెట్టుకింద నుంచి లేచి గబగబా పరుగెత్తారు బ్రహ్మరాక్షసీ, బ్రహ్మరాక్షసుడూ వాళ్లవెంటబడి తరుముకు వెళ్లారు

"మీ కడుపున మేము పుడతాము, మీ కడుపున మేము పుడతాము ఒప్పుకోండి లేకపోతే మిమ్మల్ని మింగివేస్తాము," అంటూ బ్రహ్మరాక్షసులు అరవడం ప్రారంభించారు

"అయ్యో, ఈ బ్రహ్మరాక్షసులు నిష్కారణంగా చంపివేస్తారు కాబోలు, ఎలాగ?" అని వారు భయపడుతూ, మరీ గబగబా పరుగెత్తి వెళ్లిపోతున్నారు

బ్రహ్మరాక్షసులు వాళ్లవెంట వెళ్లి వాళ్లను పట్టుకొని, "మీ కడుపున పుట్టనిస్తారా ? పుట్టనియ్యరా? పుట్టనియ్యకపోతే చంపేస్తాము," అన్నారు

"మీరు పుడితే మాకు భయంవేస్తుంది ఎవరికైనా తెలిస్తే మమ్మల్ని బ్రదకనియ్యరు," అని కాపువాడూ, భార్యా చెప్పారు

"మేము పుట్టితే మనుష్యుల్లాగే పుట్టి, మనుష్యుల్లాగే ఉంటాము మేము పుట్టామని ఎవరికీ తెలియదులెండి," అని రాక్షసులు చెప్పారు

"పోనీ, యెవరైతేనేమి పుట్టడానికి ? సంతానం కోసం ఇన్నిపాట్లు పడ్డాముకదా? నేటికి మీ కడుపున పుడతాము అని చెప్పినవారు వీరు కనబడ్డారు ఎవరైతే నేమి, సంతానానికి, అందరిలాగే వీళ్ళూ ఉంటామంటున్నారుగదా? అయినా రాక్షసులు పుట్టారని యెవరికి తెలియబోతుంది? పోనీ ఈ సంతానం వద్దంటే ఇంకో విధంగా సంతానం కలిగేమార్గం లేదుగదా? కాదూ కూడదూ అంటే వీళ్ళు బ్రదకనిచ్చేవిధం లేదు," అనుకొని కాపువాడూ కాపువాని భార్యా బ్రహ్మరాక్షసులు తమకడుపున పుట్టడానికి ఒప్పుకున్నారు

ఒప్పుకొన్నందున బ్రహ్మరాక్షసులు సంతోషించి వెళ్లిపోయారు

కాపువాడూ, వాడిభార్యా ఇంటికి వచ్చి మామూలు ప్రకారము సేద్యము చేసుకొంటూ ఉన్నారు

## 2

కాపువానికీ వాని భార్యకూ ఒక కొడుకూ ఒక కూతురూ పుట్టారు కొడుకు పేరు నీరదశ్యాముడు, కూతురు పేరు శంపాలత కొడుకునూ కూతురినీ వారు కంటిలీ పాపలాగ యెంతో ముద్దుగా చూచుకొంటూ ఉన్నారు కొడుకుకు చదువు చెప్పించారు, సేద్యం నేర్పారు శంపాలతకు ఎన్నో ఆటలూ పాటలూ వచ్చును నీరదశ్యాముడు శంపాలత కలిసి పొలంగట్టుల మీద తరుచుగా ఆడుకొంటూ ఉండేవారు

మల్లికార్జునస్వామి దయవల్ల తమకు సంతానం కలిగింది గదా అని కాపువాడు భార్య పిల్లలతోకూడా శ్రీశైలం వెళ్లి మల్లికార్జునస్వామినీ, భ్రమరాంబనూ చూడవలెనని అనుకొన్నారు కాని వారి ప్రయాణం జరిగింది కాదు కారణం ఏమిటంటే

మర్రిచెట్టు మీద బ్రహ్మరాక్షసీ బ్రహ్మరాక్షసుడు ఉన్న రోజుల్లో ఒకమారు ఒక దొంగలగుంపు ఒక ఊరు దోచుకొని ఆ మర్రిచెట్టు క్రిందకు దోచుకొన్న ధనమంతా తీసుకువచ్చి పంచుకోవాలని అనుకొన్నారు వాళ్ళందరూ కూర్చొని పంచుకొంటూ ఉన్న సమయములో బ్రహ్మరాక్షసులు వాళ్ళ మీద రాళ్ళవాన కురిపించారు వాళ్లు రాళ్ళవానకు తాళలేక డబ్బంతా పోగుచేసుకొని అక్కడనుంచి పారిపోవాలని ప్రయత్నించారు కాని వారు పారిపోకుండా బ్రహ్మరాక్షసులు వారిచుట్టూ మంటలు పుట్టించారు దొంగలకు భయమువేసింది ఏ విధంగా తప్పించుకుపోవడానికీ వాళ్ళకి వీలయింది కాదు అప్పుడు వాళ్ళు ఆ డబ్బంతా అక్కడ పారవేసి బ్రహ్మరాక్షసులకు మొక్కుకొన్నారు బ్రహ్మరాక్షసులు దయదలిచి చివరకు వాళ్ళను వదలిపెట్టారు

దొంగలు ఎలాగైతేనేమి బ్రతుకుజీవుడా అనుకొని తప్పించుకొనివచ్చి వాళ్ళ ఊరు చేరుకొన్నారు

దొంగలు వదలి పెట్టిన డబ్బంతా ఆ బ్రహ్మరాక్షసులు పోగుచేసి మర్రిచెట్టు కింద ఒక గొయ్యి త్రవ్వి ఆ గోతిలో ఆ డబ్బు పెట్టి గొయ్యి పూడ్చివేసి ఆ డబ్బుకు వాళ్ళు అక్కడ కాపలా ఉండడము మొదలు పెట్టారు

దొంగలు ఇంటికి వచ్చి తమకు జరిగిన పరాభవము తలచుకొని ఎలగైనా బ్రహ్మరాక్షసుల మీద కసి తీర్చుకోవాలని ఆలోచించారు ఆ ఊళ్ళో బ్రహ్మరాక్షసులను పట్టే మాంత్రికులిద్దరు ఉన్నారు వారు దయ్యాలనూ, భూతాలనూ, బ్రహ్మరాక్షసులనూ మంత్రంవేసి పట్టుకొని సీసాలలోకి వాళ్ళని దింపి భూమిలో పాతిపెట్ట గలవారు దొంగలు ఆ మాంత్రికుల దగ్గరకు వెళ్ళి అడవిలో మర్రిచెట్టు ఉందనీ, దానిమీద బ్రహ్మరాక్షసులు ఇద్దరు ఉన్నారనీ వాళ్ళను పట్టుకొన్నట్లయితే కావలసినంత ధనమిస్తామనీ చెప్పారు మాంత్రికులందుకు ఒప్పుకొన్నారు

దొంగలు, మాంత్రికులూ కలిసి అడవికి ప్రయాణమై వెళ్ళారు ఆ మర్రి చెట్టు దగ్గిరికి వెళ్ళి మాంత్రికులు చూచారు గాని అక్కడ బ్రహ్మరాక్షసులు కనిపించలేదు ఆ సంగతి దొంగలతో వారు చెప్పారు

"మనము వస్తున్నామని భయపడి ఈ బ్రహ్మరాక్షసులు ఎక్కడకో పారిపోయినారు వారిని ఎక్కడ ఉన్నా పట్టుకొని కసితీర్చుకోవాలి," అని దొంగలు మాంత్రికులతో చెప్పి వారికి కావలసినంత డబ్బు ఇచ్చి ఊరూరూ తిరగడం మొదలుపెట్టారు

చివరకు కాపువాడూ, భార్యా, పిల్లలూ ఉన్న ఊరు వచ్చారు, మాంత్రికులు కాపువాని పిల్లలను చూచి వాళ్లే బ్రహ్మరాక్షసులయి ఉంటారని గుర్తుపట్టారు

దొంగలు వాళ్ళనెలాగైనా పట్టువలసిందని మాంత్రికులను వేడుకొన్నారు

"నరజన్మం ఎత్తినప్పుడు బ్రహ్మరాక్షసులను పట్టుకోకూడదు," అని చెప్పి మాంత్రికులు వెళ్ళిపోయారు

దొంగలకు మాత్రం బ్రహ్మరాక్షసులమీద కోపము పోలేదు నరజన్మ ఎత్తినా సరే వాళ్ళమీద కసితీర్చుకోవాలని అనుకొన్నారు కాని నరజన్మం ఎత్తినప్పటికీ వాళ్ళు బ్రహ్మరాక్షసులు గదా, అపకారం చేసే బుద్ధితో వాళ్ళదగ్గిరికి వెళ్లితే ఏమి చేసిపోతారో అని దొంగలు భయపడడం మొదలుపెట్టారు ఎలాగైనా వాళ్ళమీద కసితీర్చుకోవాలని ఆలోచిస్తున్నారు

ఒకనాడు కాపువాడు తనపిల్లల నిద్దరినీ తీసుకొని పొలానికి వెళ్ళాడు నీరదశ్యాముడూ, శంపాలతా దూరంగా ఆడుకొంటూన్నారు కాపువాడు పొలము దున్నుకొంటున్నాడు ఇంతట్లోకే సాయంకాలమయింది దొంగలెక్కడినుంచో వచ్చి నీరదశ్యామునీ, శంపాలతనూ పట్టుకొని దూరముగా తీసుకొనిపోయి చేతులూ, కాళ్లూ కట్టివేసి ఒక పాడునూతిలో పారవేశారు

కాపువాడు పొలం దున్నడం చాలించి ఎద్దులకు నాగలి తిరగవేసి కట్టి ఇంటికి పోవాలని తన కొడుకునూ, కూతురినీ పేరుపెట్టి పిలిచాడు ఎంతపిలిచినా వాళ్ళు మారుపలుకు వినిపించలేదు చెప్పకుండా ఇంటికి వెళ్ళిపోయారేమో ననుకొని గబగబా ఎడ్లను తోలుకొని యింటికి పోయాడు ఇంటిలో భార్యను అడిగాడు పిల్లలు ఇంటికి రాలేదని భార్య చెప్పింది అప్పుడు భార్యాభర్తలిద్దరూ బయలుదేరి తమ పిల్లలకోసమని రాత్రల్లా "శంపాలతా ! నీరదశ్యామా !" అని పిలుచుకొంటూ తిరిగారు కాని వారి కెక్కడా వారి పిల్లల జాడ కనిపించలేదు "వీళ్లు పిల్లలు కారు, బ్రహ్మరాక్షసులు మన ఇంట్లో ఉండడం ఇష్టము లేక ఎక్కడికో మాయమైపోయారు ఇంతకి మన కర్మం ఈలాగ ఉంది," అని అనుకొంటూ మల్లికార్జునస్వామిని ధ్యానము చేసుకొంటూ ఇంటివద్ద ఉండిపోయారు

నీరదశ్యాముడూ, శంపాలతా పాడు నూతిలో పడ్డారు అందులో కొంచెం నీళ్లు మాత్రమున్నవి వాళ్లు కష్టపడి కాళ్ళకూ, చేతులకూ కట్టిన త్రాళ్లను తెంచుకొని నాలుగువైపులా తాకి చూచారు ఆ నూతికి ఒకవైపు చిన్న తలుపు ఉన్నది వాళ్లు తలుపు తీసి లోపలికి వెళ్లారు అక్కడ వాళ్లకొక మైదాన మగుపించింది ఆ మైదానమును దాటి ఒక తోట కనిపించింది. ఆ తోటలోకి వారు వెళ్లారు అక్కడ ఒక చక్కని మేడ కనిపించింది వాళ్లకు ఆకలీ, దాహముగానూ ఉన్నది " ఆ మేడలోకి వెళ్లితే ఎవరైనా కనిపించుతారు, వాళ్ళనడిగితే ఏమైనా తినవచ్చు," ననుకొన్నారు అనుకొని ఆ మేడలో ప్రవేశించారు ఆ మేడలో ఎవరూ వారికి కనిపించలేదు మేడంతా తిరిగితిరిగి విసిగి అలసట వచ్చి చివరకు ఒక చాపమీద పడుక్కొని నిద్రపోయారు

వారు నిద్రపోతూ ఉండగా ఆ మేడలోకి ఒక చక్కని నాగకన్య వచ్చింది ఆ మేడ నాగకన్యది నాగకన్యక వచ్చి నిద్రపోతూ ఉన్న నీరదశ్యాముణ్ణీ, శంపాలతనూ చూచి, "ఈ మనుష్యులు ఇక్కడకు ఏలాగ వచ్చారు చెప్మా ? పాడునూతిలో నేను పెట్టుకొన్న గుమ్మంలోంచి వచ్చారు కాబోలు," అనుకొంది

కొంతసేపటికి నీరదశ్యాముడూ, శంపాలతా లేచారు నాగకన్య వారిచేత స్నానము చేయించి,

గంధము పూసి మంచిబట్టలు కట్టుకోబెట్టి, భక్ష్యాలతో అన్నము పెట్టి ఎంతో ఆదరించింది

"మీ రిక్కడ కెందుకు వచ్చా"రని నాగకన్య వారిని అడిగింది

"మేము పొలములో ఆడుకొంటూ ఉంటే ఎవరో దొంగలు వచ్చి మమ్ము కాళ్లూ, చేతులూ కట్టివేసి పాడునూతిలో పారవేశారు ఆ కట్లు తెంచుకొని అక్కడ ఒక వాకిలి కనిపిస్తే దానిగుండా ఇక్కడికి వచ్చా"మని వారు చెప్పారు

నాగకన్య వాళ్ళిద్దరినీ అక్కడ ఉండిపొమ్మని చెప్పింది కాని వాళ్ళు నాన్నా, అమ్మా దగ్గిరికి పోతామన్నారు దారి చూపించమన్నారు "మీరు మళ్లీ అక్కడికి వెళ్ళితే దొంగలు మళ్ళీ వచ్చి మిమ్ము బాధపెట్టుతారు ఇక్కడే ఉండిపోరాదా ?" అని నాగకన్య అడిగింది

ససేమిరా మేముండమన్నారు వారు

అప్పుడు నాగకన్య వారికి మోయగలిగినంత బంగారమూ, రత్నాలు యిచ్చి వారి ఇంటికి దారి చూపించింది వెళ్ళిపోవడానికి ముందు వారు "మా దగ్గిరికి దొంగలు మళ్ళీ వచ్చి బాధపెట్టుతారేమో ? వాళ్ళు మమ్మల్ని బాధపెట్టకుండా ఏమి చెయ్యమన్నావు ?" అని నాగకన్యని అడిగారు

నాగకన్య వారిద్దరికీ చెరొక రత్నహారమూ ఇచ్చి అది ఎప్పుడూ మెళ్ళో వేసుకొన్నట్లయితే ఏమీభయము లేదని చెప్పి పంపించివేసింది

వాళ్లు ఆ రత్నహారాల్ని మెళ్ళో వేసికొని ఇంటికి తిరిగి వస్తున్నారు.

త్రోవలో వాళ్ళకు ఒక దొంగ కనిపించాడు వాళ్లు మోసుకు వస్తూవున్న బంగారమూ, రత్నాలూ చూచి, వాళ్లు మెడలో వేసుకొన్న రత్నహారాలు చూచి వాటిని ఎలాగైనా ఎత్తుకు పోవాలని ఊహించినాడు వాళ్లకు అడ్డంగా వచ్చి, "ఆ మూటలన్నీ ఇచ్చివేసి వెళ్లండి లేకపోతే మిమ్మల్ని చంపుతాను," అని దొంగ అన్నాడు

దొంగను చూచి వాళ్లు భయపడలేదు నవ్వుతూ వాడిమాట వినిపించుకోకుండా నడిచిపోయారు దొంగకు కోపం వచ్చి వారి మూటలు బలవంతాన్ని లాగాలని దగ్గిరకు వచ్చి మూటలు పట్టుకొన్నాడు పట్టుకునీ పట్టుకోవడంతోనే ఒక పెద్దపాము వచ్చి దొంగను కరిచింది దొంగ అక్కడ పడిపోయి చచ్చిపోయాడు

వాళ్లు ఆ మూటలు పట్టుకొని ఇంటికి వచ్చారు కాని వాళ్ళ యింట్లో ఎవరూ లేరు వాళ్ళమ్మా, నాన్నా ఇంట్లో లేరు, పొలానికి వెళ్లారేమోనని ఇంట్లో మూటలన్నీ దాచి వేసి వాళ్ళిద్దరూ కలిసి పొలానికి వెళ్లారు కాని పొలంలోనూ కనిపించలేదు తాము రాకపోవడం చూచి నిరాశ చేసుకొని మల్లికార్జునస్వామి దర్శనం చేసుకోవడానికి వెళ్లి వుంటారని ఊహించి వాళ్ళిద్దరూ కలిసి కొంత ధనము తమ ఇంట్లో పాతిపెట్టి, కొంత ధనము మూటలు కట్టుకొని శ్రీశైలముకు ప్రయాణమయ్యేరు పగలు చల్లగా ఉన్నప్పుడల్లా ప్రయాణము చేస్తూ, ఎండ వేళ చెట్లనీడ నిద్రపోతూ, రాత్రిళ్లు ఏ సత్రములోనో తల దాచుకుంటూ వాళ్లు ప్రయాణము చేస్తున్నారు

వీళ్లిల్లాగ ప్రయాణము చేస్తూవుండగా వీళ్ళ వెనుక ముగ్గురు దొంగలు కూడా వెంటబడ్డారు

ఈ ముగ్గురు దొంగలు అసలు బ్రహ్మరాక్షసుల మీద పగ తీర్చుకోవాలని పనిచేస్తూ ఉన్నవాళ్లే నీరదశ్యాముడూ, శంపాలతా బంగారమూ, రత్నాలూ మూటలు కట్టి తెస్తూ ఉంటే ఆ మూటలు లాక్కోబోయి ఒకదొంగ తాచుపాము కరచి చచ్చిపోయాడు గదా ! ఆ దొంగ చచ్చిపోవడం ఈ ముగ్గురు దొంగలూ తెలుసుకొన్నారు నీరదశ్యాముడి మీదా, శంపాలతమీదా వీళ్ళకు మరీ కోపం వచ్చింది ఎలాగైనా వీళ్లిద్దరినీ చంపివెయ్యవలె ననుకొన్నారు ప్రయాణము చేసి చేసి అలసి ఒకనాటి రాత్రి ఒక పాడు దేవాలయములో నీరదశ్యాముడూ, శంపాలతా నిద్రపోయారు వాళ్లు నిద్రపోతూ వుండగా ముగ్గురు దొంగలూ వెళ్ళి వాళ్ళ మూటలను నిమ్మళంగా తీసివేసుకొన్నారు అందులో ఒకడు వాళ్ల మెడలో ఉన్న రత్నహారమును తీయబోగా ఒకపాము వచ్చి వాడిని కరిచింది వాడు చచ్చిపోయాడు వాడు చచ్చిపోవడం చూచి భయపడి మూటలు పట్టుకొని మిగిలిన ఇద్దరు దొంగలూ పారిపోయారు

తెల్లారడంతోనే నీరదశ్యాముడూ, శంపాలత లేచారు తమ మూటలు తీసుకోవాలని చూచుకొన్నారు మూటలు కనిపించలేదు గాని ఒక దొంగ చచ్చి పడి వుండడం చూచారు తమ మూటలు దొంగలు ఎత్తుకుపోయారు గదా అనుకొని ఏమి చెయ్యడానికీ లేక ప్రయాణము సాగించారు

వెళ్లగా వెళ్లగా ఎండ ఎక్కింది తొవలో వాళ్లకొక నది కనిపించింది ఎండ ఎక్కువగా ఉండడం వల్ల నదిలో స్నానం చేయవలెనని చెప్పి రత్నహారాలు బట్టలు వడ్డున పెట్టుకుని నదిలోకి దిగి ఈతలాడుకుంటూ సంతోషంతో చాలాసేపు స్నానంచేసారు తరువాత నీటిలోనుంచి బయటకి వచ్చి చూసుకుంటే వాళ్లబట్టలు రత్నహారాలు లేవు

వాళ్ల వెనకే దూరమున వస్తువుఉన్న ఇద్దరుదొంగలు వాళ్లబట్టలు హారాలు తీసుకున్నారు తీసుకోవడం శంపాలత, నీరదశ్యాముడు చూడలేదు రత్నహారాలు పోయినందుకు వాళ్లు దుఖిస్తూ నదిఒడ్డునే కూర్చున్నారు చీకటిపడింది ఆనదిగట్టున వాళ్లు బిగ్గరగా ఏడుస్తూ ఉండగా ఆ దారిన పోయె ఒక చెంచువాడు వాళ్లని చూచి దయతలచి వాళ్లను తనయింటికి తీసుకొనిపోయి బట్టలు ఇచ్చి కడుపునిండా తిండిపెట్టి వాళ్ల సంగతి అడిగారు వాళ్లు తమ పుట్టుకదగ్గరనుంచి జరిగిన వృత్తాంతము చెంచువాడితో చెప్పారు చెంచువాడు ఆ ఇద్దరు దొంగలను చంపివెయ్యవలెనని విల్లు బాణాలు పుచ్చుకుని ఉదయాన్నే బయలుదేరాడు కొంతదూరం పిల్లలు చెప్పిన గుర్తుపట్టి వాళ్లు వచ్చిన దారిన వెళ్లగా అక్కడ ఇద్దరు దొంగలు అగుపించారు

వాళ్లు బట్టలు రత్నహారాలు తీసుకొని బట్టలునదిలో పారవేసి రత్నహారాలు మెడలో వేసుకు పారిపోయారు కదా! మెళ్లోవేసుకున్న రత్నహారాలు పెద్దపాముల కింద మారిపోయి వాళ్లగొంతుకను చుట్టపెట్టుకొన్నవి వాటిని విదిలించుకోవాలని ఎంత ప్రయత్నం చేసినా అవిపోయాయి కావు కొంతసేపు వాటితో పెనుగులాడి అలసిపోయి ఊపిరిఆడక ఉక్కిరిబిక్కిరి అయి అక్కడ పడిపోయారు ఇలాగ పడిపోయి ఉన్న దొంగలను చెంచువాడు చూసి వాళ్ల దగ్గర రత్నహారాలు ఉన్నవేమోనని వెదకి చూచాడు రత్నహారాలు కనిపించలేదు చుట్టుప్రక్కల పడిపోయామోనని అంతటా వెదికాడు

ఎక్కడా దొరకలేదు ఆసంగతి నీరద శ్యాముడితోనూ శంపాలతతోనూ ఇంటికి వచ్చి చెప్పాడు వారు రత్నహారాలు పోయినందుకు విచారించిన దొంగలు చచ్చిపోయినందుకు చాలా సంతోషించారు.

## 3

శంపాలతానీరదశ్యాముడు కొన్నాళ్లపాటు చెంచువాడి గూడెములో ఉండిపోయారు చెంచుపిల్లలందరితోనూ వాళ్లు సహవాసం చేశారు ప్రొద్దునే వాళ్లతో కలిసి వేటకు వెళుతూ రాత్రికి ఇంటికి వస్తూఉండేవారు రాత్రివేళ వాళ్లు అందరూ కలిసి చెట్లకింద మంచిమంచి ఆటలు ఆడుకునేవారు

అది వెన్నెలకాలము రాత్రి పుచ్చపువ్వులాగ వెన్నెలలు కాస్తున్నవి కడుపునిండా పళ్లుతిని ఒకనాటి రాత్రి వాళ్లందరూ చెట్లకింద చేరారు చెట్లకింద వెన్నెలలు నీడలు వెన్నెలలు నీడలుగాఉన్నవి శంపాలత ఆడపిల్లలందరితోనూ చెయ్యీ చెయ్యీ పట్టుకుని గుండ్రముగా తిరుగుతూ నవ్వుతూ కేరింతాలు కొడుతూ కేకలు వేస్తూ ఆడుకుంటూ ఉన్నది నీరదశ్యాముడు చెంచుపిల్లవాళ్లుకలిసి ఆ చెట్లకిందే పరుగులెత్తుచూ ఒకరినొకరు పట్టుకొంటూ పట్టులు పట్టుతూ ఒకరినొకరు కిందపడవేస్తే లేస్తూ గోలచేస్తూ ఆడుకుంటున్నారు కొంతసేపటికి ఆడపిల్లలు మగపిల్లలు అందరూకలిసి గట్టిగా గొంతుకెత్తి పాటలు పాడుతూ చప్పట్లు చరుస్తూ చెట్టుచుట్టూ గిర్రున పరుగులెత్తుచూ మర్రి ఊడలు పట్టుకొని ఊగులాడుతూ చెట్లమీద కెక్కుతూ ఆడుకొంటున్నారు

చెట్లమీద నిద్రపోయిన పక్షులు లేచి కిలకిల కిల మని గోలచేశాయి ఈ గోలవిని మైదానంలో పండుకొన్న జింకలమంద చెంగుచెంగున పరుగెత్తుకు పోయినాయి చెంచువాళ్లందరూ పిల్లల ఆటలు చూస్తూ వాళ్ల చుట్టూరా నిలబడ్డారు

ఇలా ఆటలాడుకొంటూ ఆడుకొంటూ వాళ్లు సమీపానే ఉన్న పాతాళగంగ దగ్గరకి వెళ్లారు అక్కడికి వెళ్లవద్దని పెద్దచెంచువాళ్లు కొందరిని వెనక్కిమళ్లించారు కొందరు వాళ్లమాట వినకుండా పాతాళగంగ దగ్గరకి వెళ్లిపోయారు. నీరదశ్యాముడు, శంపాలత కూడా పాతాళగంగ దగ్గరకి వచ్చారు

పాతాళగంగ గట్టు పొడుగున ఉన్న బండలమీద వాళ్లు అందరూ కూర్చుని కథలు చెప్పుకుంటూ ఉన్నారు నీరదశ్యాముడు, శంపాలత ఒకబండమీద కూర్చున్నారు వాళ్లు ఈమాట ఆమాట చెప్పుకుంటూ " ఇదే శ్రీశైలమట ఇక్కడ నాన్న అమ్మా ఉన్నారేమో చూడవద్దా?" అనుకున్నారు అనుకొని ఇంకెవరితోనూ చెప్పకుండా ఆ అడవిలో నడుస్తూ వెళ్లారు వెన్నెట్లో వాళ్లు వెళుతూ ఉండగా త్రోవలో రెండు ఎలుగుబంట్లు వాళ్లకి ఎదురుగా వచ్చినవి వాటిని చూచి వాళ్లుభయపడి ఒక పెద్ద చెట్టువెనక దాక్కున్నారు ఒక ఎలుగుబంటి ఇంకో ఎలుగుబంటితో చెప్తుతూ ఉన్న మాటలు వాళ్లు విన్నారు "శంపాలతా నీరదశ్యాముడు ఈ అడవిలో తిరుగుతూ ఉన్నారు వాళ్ల అమ్మా నాన్న ఇక్కడ ఉన్నారనుకొని వచ్చారు వాళ్లు అప్పుడే నాగలోకానికి వెళ్లిపోయిన సంగతి వాళ్లకు తెలియదు", అని ఒక ఎలుగుబంటి అన్నది "మరియు నాగలోకానికి దారి ఎక్కడ ఉన్నది?" అని రెండో ఎలుగబంటి అన్నది తరువాత మాటలు శంపాలతకు నీరదశ్యాముడికి వినబడలేదు వాళ్ల అమ్మా నాన్న, నాగలోకానికి వెళ్లిపోయిన సంగతి విని వాళ్లు అక్కడే ఏడుస్తూ

కూర్చున్నారు అప్పుడు రెండు పెద్దపులులు మాటలు చెప్పుకుంటూ ఆ దారిన వెళుతూ ఉన్నవి వాటి మాటలు కొన్ని మళ్లీ వీళ్ల చెవిలో పడ్డవి

"పాతాళగంగలో స్నానంచేస్తూఉంటే ఒక నాగకన్య వచ్చి వాళ్లిద్దరిని తనిఇంటికి తీసుకొని పోయిందట వాళ్లని వెతుక్కుంటూ నీరదశ్యాముడు, శంపాలత ఈ అడవిలోకి వచ్చారట వాళ్లుకూడా " తరువాత మాటలు వాళ్లకి వినిపించేయి కావు

అడవిలో ఉన్న జంతువులన్నీ తమ కథే చెప్పుకుంటూ ఉన్నవి ఎందుకు చెప్మా! అనుకుంటూ వాళ్లు ఆ చెట్టుకింద కూర్చుని విచారిస్తున్నారు

అప్పుడు ఆచెట్టుమీద రెండు పక్షులు కూర్చుని మాట్లాడుకోవటం వాళ్లువిన్నారు

"నాగకన్యనీరద శ్యాముడిని కూడా తీసుకు వెళుతుంది శంపాలతను కూడా . " అని కొంతమటులుకు చెప్పి ఊరుకున్నది

"ఎందుకు ఊరుకున్నావు పూర్తిగా చెప్పలేదే?" అని రెండవపక్షి అడిగింది

" చూడు చూడు ఎవళ్లో ఇద్దరు మనుష్యులు మన చెట్టుకింద కూర్చొని మన మాటలు ఆలకిస్తున్నారు " అని మొదటి పక్షి చెప్పింది

"వాళ్లకు మన భాష తెలుసునా ఏమిటి?" అన్నది రెండోపక్షి

" వాళ్లు అసలు మన అడవిలో ఉండేవారే పూర్వము మన అడవిలో కొంతకాలము ఉన్నారుకూడాను అందుచేత మనమాటలు వాళ్లకు తెలుసు," అని మొదటి పక్షి చెప్పింది

" శంపాలత ఏమౌతుంది చెప్పుదూ?" అంది రెండోపక్షి

"శంపాలత మనతోపాటు ఉంటుంది ఇంకో చెట్టుమీదకెళ్లి చెప్పుకుందాం రా," అని మొదటి పక్షి రెండోపక్షితో చెప్పింది రెండుపక్షులు ఇంకో చెట్టుమీదికి ఎగిరిపోయినాయి

నీరదశ్యాముడూ శంపాలత ఈ మాటలు అన్నీ విని, "ఈలాగ చెప్పుకుంటున్నవి చెప్మా!' ' అనుకొన్నారు ఇంతట్లోకే తెల్లారుతూ ఉంది వాళ్లు మల్లికార్జునస్వామి గుడిదగ్గరకి వెళ్లుతున్నారు త్రోవలో రెండు కోతులు మాట్లాడుకుంటున్నవి ఒకకోతి చెట్టుకొమ్మమీద కూర్చుని ఇంకోకోతితో చెప్పుతూంది.

" భ్రమరాంబ ఆలయము వెనుక ఒక ఎఱ్రటి పూలమొక్క ఉన్నది ఆ పువ్వు దగ్గర పెట్టుకున్న ట్లయితే ఏమయిపోవాలన్నా అది అయిపోవచ్చును," అని

" పెద్దపులి అయిపోవచ్చా?" అని కోతి అడిగింది

" ఆ అయిపోవచ్చును, " అంది రెండోకోతి

"ఏనుగైపోవచ్చునా?" అని అడిగింది మొదటికోతి

"ఏమి కావాలంటే అది అయిపోవచ్చును," అంది రెండోకోతి

ఆ మాటలు శంపాలత వింది నీరదశ్యాముడు ముందుగా నడిచి వెళ్ళిపోయాడు ఆ మాటలు వినలేదు శంపాలత నీరదశ్యాముడితో ఆ మాటలు చెప్పలేదు కూడాను

వాళ్ళిద్దరూ కలిసి మల్లికార్జునస్వామిని చూచారు దణ్ణము పెట్టారు "మా అమ్మనూ, నాన్ననూ చూపించవా?" అని అడిగారు

తరువాత భ్రమరాంబ గుడిలోకి వెళ్లి దణ్ణముపెట్టి, వాళ్లమ్మనీ, నాన్ననీ చూపించమని అడిగారు

తరువాత వాళ్లు ఆలయము చుట్టూ బొమ్మలు చూచుకొంటూ తిరిగారు

భ్రమరాంబ గుడివెనుక ఎఱ్ఱపువ్వులమొక్క శంపాలత చూచి ఒకపువ్వు కోసుకొని తలలో పెట్టుకొన్నది

తరువాత వాళ్లిద్దరూ కలిసి వాళ్లమ్మా, నాన్న కోసం వెదికారు. కాని ఎక్కడా వాళ్లు కనిపించలేదు

తరువాత పాతాళగంగవైపు ప్రయాణమై వెళ్లారు పాతాళగంగ దగ్గిర అంతటా వెదికారు గాని వాళ్లమ్మా, నాన్నా ఎక్కడా కనిపించలేదు

నిజంగా నాగలోకంలోకి వెళ్ళిపోయారు కాబోలు అనుకొన్నారు వాళ్ళిద్దరూను

"నేను నాగలోకంలోకి వెళ్లి చూచిరానా?" అన్నాడు నీరదశ్యాముడు

"అమ్మయ్యో ! నీవు వెళ్ళిపోతే నేనొక్కర్తెనూ ఉండగలనా?" అంది శంపాలత

"నీవు యీ శ్రీశైలంలోనే ఉండు నే వెళ్ళి చూచి చప్పునే మళ్ళీ వస్తాను వచ్చి నిన్ను తీసుకువెళ్లుతాను," అన్నాడు నీరదశ్యాముడు

"నీవు ఎలాగ వెళ్ళుతావు ? నీకు దారి తెలుసునా ఏమిటి ?" అన్నది శంపాలత

"పాతాళగంగలో నుంచి దారి ఉన్నదట ఇందాక పెద్దపులులు చెప్పుకుంటూ ఉంటే విన్నాముకాదూ?" అన్నాడు నీరదశ్యాముడు

"అయితే, నేనుకూడా వస్తాను మనిద్దరం కలిసి వెడదాము," అంది శంపాలత

"నీ విక్కడ ఉండి అమ్మా, నాన్నా ఇక్కడకు వస్తారేమో చూస్తూ ఉండు నేను నాగలోకంలో చూచి వస్తాను," అన్నాడు నీరదశ్యాముడు

"అమ్మా, నాన్నా ఇక్కడ కెందుకు వస్తారు? వాళ్లు నాగలోకంలో ఉన్నారటగా ?" అంది శంపాలత

"మనకోసం వాళ్లూ తిరుగుతూ ఉంటారేమో? నాగలోకంలో నుంచి మనకోసం వాళ్లు ఇక్కడకు వస్తారేమో నీవు చూస్తూ ఉండు నేను నాగలోకంలోకి వెళ్ళి చూచి వస్తాను ఎక్కడో ఒకచోట మనకు వాళ్లు కనిపిస్తారు," అన్నాడు నీరదశ్యాముడు

"నిన్ను వదలిపెట్టి నేనుండలేను సుమా !" అంది శంపాలత

"ఇప్పుడేవస్తానుకాదూ !" అన్నాడు నీరదశ్యాముడు

"అమ్మో, నాకు భయం వేస్తుంది, నే నుండలేను," అంది శంపాలత

"మా అమ్మవుకావు ! ఇప్పుడే వస్తాను ఇక్కడ ఉండు, నాకోసం, అమ్మా, నాన్నా కోసం

చూస్తూ ఉండు,'' అన్నాడు నీరదశ్యాముడు

"నీవు రావేమో?'' అంది శంపాలత

"నేను తప్పకుండా వస్తాను,'' అన్నాడు నీరదశ్యాముడు

"నీవు వచ్చిందాకా ఇక్కడే ఉంటాను మరి ఎక్కడికీ వెళ్ళను,'' అంది శంపాలత

"నేను వచ్చేదాకా ఇక్కడే ఉండు నాకోసం చూస్తూ ఉండు మరెక్కడికీ వెళ్ళకు,'' అని నీరదశ్యాముడు చెప్పాడు

నీరదశ్యాముడు శంపాలతను ముద్దుపెట్టుకొని కౌగిలించుకొన్నాడు శంపాలత అన్నను గట్టిగా కౌగిలించుకొని ముద్దుపెట్టుకొని, "నేనిక్కడే ఉంటాను చప్పున రా సుమా అన్నా!'' అంది శంపాలత

"చప్పున వస్తానులే,'' అని నీరదశ్యాముడు పాతాళగంగలో ప్రవేశించాడు

శంపాలత చూస్తూ ఉండగానే నీళ్లలో మునిగి మాయమయ్యాడు

నీరదశ్యాముడు నీటిలోకి వెళ్లడంతోనే నాగకన్య వానికి కనిపించి చేయి పట్టుకొని లోపలికి తీసుకపోయింది వెళ్ళగా వెళ్ళగా అక్కడ ఒక పెద్ద బండ కనిపించింది నాగకన్య ఆ బండ తీసివేసింది తీసివెయ్యగానే మెట్లు కనిపించినవి నాగకన్య నీరదశ్యాముణ్ణి ఆ మేడలోకి తీసుకవెళ్ళింది

"మా అమ్మా, నాన్నా ఇక్కడున్నారా?'' అని నీరదశ్యాముడు అడిగాడు

"నీవు వస్తావనే వాళ్ళను ఇక్కడ పెట్టాను,'' అంది నాగకన్య అని నీరదశ్యాముణ్ణి ఒక గదిలోకి తీసుకవెళ్లింది అక్కడ వాళ్ళమ్మా, నాన్నా కూర్చుని వున్నారు వాళ్లు నీరదశ్యాముణ్ణి చూడడంతోనే కౌగిలించుకొన్నారు కొంతసేపైన తర్వాత, "శంపాలత ఏదీ?'' అని అడిగారు

"నేను వెళ్ళి తీసుకువస్తాను,'' అన్నాడు నీరదశ్యాముడు

"నీవు వెళ్లవద్దు నాయనా ! వెళ్లితే మళ్లీ రాగలవో లేదో, మేమైనా వెళ్లివస్తా''మన్నారు వాళ్లు

"నాకోసం పాతాళగంగదగ్గిర శంపాలత కనిపెట్టుకు ఉంటుంది నేను వెళ్లితేనేగాని రాదు,' అన్నాడు నీరదశ్యాముడు

ఈ విధంగా వాళ్లు మాట్లాడుకొంటూ ఉండగా నాగకన్య "నీవు వెళ్లవద్దులే, నేను వెడతాను,' అంది

"నీవు వెళ్ళినా రాదు శంపాలత, నేను వెళ్లాలి,'' అన్నాడు నీరదశ్యాముడు

"సరే వెళ్ళవచ్చునులే,'' అని నాగకన్య అతనికి తలనీళ్ళోసి, కొత్తబట్టలిచ్చి, పాయసం కడుపునిండా పెట్టింది వాళ్ళమ్మా నాన్నా కూడా పాయసం తిన్నారు. పాయసం తినడంతోనే వాళ్లు నిద్రపోయారు

నాగకన్య నీరదశ్యాముణ్ణి మొదట చూచినప్పుడే అతణ్ణి పెళ్లిచేసుకోవాలనుకొంది అందుకోసమని అతనికోసం అప్పటినుంచీ ఎదురుతెన్నులు చూస్తూ ఉంది అతడు రావడంకోసమే

వాళ్ళఅమ్మను, నాన్ననూ తీసుకువచ్చి తనమేడలో పెట్టుకొంది నీరదశ్యాముడికి శంపాలత మీద ఎంతో అపేక్ష శంపాలత కూడా వస్తే తన్ను ప్రేమించి పెళ్లిచేసుకోడేమోనని శంపాలతను రాకుండా జేసింది శంపాలతకోసం నీరదశ్యాముడు వెళ్ళితే మళ్ళీ వస్తాడో రాడో ? వస్తే తనను పెళ్ళిచేసుకుంటాడో చేసుకోడో ? అని భయమువేసింది అందుకోసమని వాళ్ళకు ఏదో పాయసం పెట్టింది

వాళ్లు పాయసం తిని చాలాసేపు నిద్రపోయి చివరకు లేచారు లేచి శంపాలత సంగతి అందరూ మరిచి పోయారు నీరదశ్యాముడు కూడా మరిచిపోయి నాగకన్యతో తిరుగుతూ, నాగకన్యతో ఆడుకొంటూ, పాడుకొంటూ ఉన్నాడు

కొన్నాళ్ళకు నాగకన్యకూ నీరదశ్యాముడికీ పెళ్ళయింది వాళ్లు అక్కడ హాయిగా అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తూ ఉన్నారు

శంపాలత తన అన్నకోసం చాలాకాలం వేచి ఉంది ఎన్నాళ్ళకీ తన అన్న వచ్చినట్లు లేదు తన అన్న ఏమైపోయినాడో ? అని తానుకూడా నాగలోకానికి వెళ్ళవలెనని పాతాళగంగలో మునిగింది కాని ఎంత వెదికినా నాగలోకానికి దారి కనిపించింది కాదు పోనీ అని బయటకు ఎచ్చి పాతాళగంగ గట్టున కూర్చుని "ఓ అన్నా" అని పిలవడం మొదలుపెట్టింది గట్టవతల కొండమీదనుండి "ఓ అన్నా' అని మారు పిలుపు వినిపించింది

శంపాలత రాత్రీ, పగలూ ఒక్క విధంగా గట్టు మీద కూర్చుని "ఓ అన్నా" అని పిలుస్తూనే ఉంది కాని నీరదశ్యాముడు పలకలేదు

నీటిలో ఎక్కడైనా ఉంటాడేమోనని తాను చేపగా మారిపోయి నీటిలో యీదుతూ "ఓఅన్నా' ' అని కేకవేశింది ఎవరూ పలకలేదు నది అంతా కిందకూ, పైకీ ఈదుతూ "ఓ అన్నా," "ఓ అన్నా' ' అంటూ శంపాలత తిరిగింది నీటిలో ఎంత వెదికినా నాగలోకానికి త్రోవ కనిపించలేదు 'ఓ అన్నా,' ' అనే పిలుపుకు జవాబు లేదు

తరువాత తాను నీటిలోనుండి బయటకు వచ్చి జింకగా మారిపోయి, "ఓ అన్నా" 'ఓ అన్నా' ' అని అరుస్తూ అడవి అంతటా పరుగెత్తి పిలిచింది "ఓ అన్నా, "ఓ అన్నా" అనే పిలుపు [illegible] దాని చెవులలో పడింది కాని జవాబు లేదు

ఇంకా సంతుష్టి లేక పెద్దపులిగా మారిపోయి "ఓ అన్నా, ఓ అన్నా" అని గాండ్రిస్తూ కొండలన్నీ తిరిగింది గుహలన్నీ వెదికింది అడవంతా పారాడింది "ఓ అన్నా, ఓ అన్నా," అనే గాండ్రింపులు అడివి అంతటా అలుముకొన్నాయి కాని జవాబులేదు

"ఓ అన్నా, ఓ అన్నా" అంటూ సెలయేళ్లుగా మారిపోయి శంపాలత పిలిచింద సెలయేళ్లతోకూడా కొండరాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా," అన్నవి కాని జవాబు లేదు

శంపాలత వాయువుగా మారిపోయి చెట్ల కొమ్మలలో దూరి "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ శబ్దము చేసింది చెట్ల ఆకులు "ఓ అన్నా, ఓ అన్నా" అంటూ ఏడ్చినవి కాని జవాబు రాలేదు

"ఓ అన్నా, ఓ అన్నా," అంటూ కార్చిచ్చులుగా మారిపోయి శంపాలత హోరు పెట్టింది చెట్లకొమ్మలు ఆ అగ్నిలో "ఓ అన్నా, ఓ అన్నా," అంటూ పట పట మని పగిలిపోయినవి కాని జవాబు లేదు

శంపాలత నల్లటిమేఘాలలో ప్రవేశించి "ఓ అన్నా, ఓ అన్నా," అంటూ ఉరిమింది ఆ మేఘాన్నుంచి ఆ మేఘానికి "ఓ అన్నా, ఓ అన్నా," అనే ఉరుములు వ్యాపించినవి భూమీ, ఆకాశమూ అంతా "ఓ అన్నా, ఓ అన్నా," అనే శబ్దముతో నిండిపోయినవి కాని జవాబు రాలేదు.

అడవిలో జంతువులన్నీ శంపాలతతో కూడా "ఓ అన్నా, ఓ అన్నా," అని పిలిచినవి చెట్లమీద పక్షులన్నీ శంపాలతతోకూడా ఓ "అన్నా, ఓ అన్నా," అని కూసినవి చెట్లకొమ్మల ఆకులన్నీ శంపాలతతో "ఓ అన్నా, ఓ అన్నా," అంటూ మర్మరధ్వని చేసినవి

ఆకాశము "ఓ అన్నా, ఓ అన్నా," అని శబ్దించినది

పాతాళగంగ శంపాలతతో కూడా "ఓ అన్నా, ఓ అన్నా," అంటూ హోరుపెట్టినది కాని ఎవరిపిలుపుకూ కూడా జవాబు రాలేదు శంపాలత చిట్టచివరకు ఒక చిన్న పక్షిగా మారిపోయింది ఆ చిన్నపక్షి శ్రీశైలం అడవులలోనూ, కొండలలోనూ ఎప్పుడూ తిరుగుతూ "ఓ అన్నా, ఓ అన్నా," అని పిలుస్తూ ఉంటుంది ఆ పిలుపు అడవి అంతా నిండిపోతుంది

శ్రీశైలం యాత్ర పోయేవాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా," అనే పిలుపు విని ఆ చిన్న పక్షిని చూచి చాలా ఆశ్చర్యపోతారు జాలి పొందుతారు

ఆ అడవుల్లో తిరిగే చెంచువాళ్లు "ఓ అన్నా, ఓ అన్నా," అనే ఆ చిన్నపక్షి పిలుపు విని శంపాలత కథ వాళ్ల పిల్లలకి చెప్పుతూ ఉంటారు

నీవు శ్రీశైలం వెళ్ళినప్పుడు "ఓ అన్నా, ఓ అన్నా," అని కూసే చిన్నపక్షిని చూడలేదూ ? అంది చెట్ల కొమ్మలమీద కూర్చుని మనుష్యులగుపించినప్పుడల్లా తోక ఎత్తి శరీరం ముందుకు వంచి గట్టిగా, తొందరగా, "ఓ అన్నా, ఓ అన్నా," అని అందరినీ పిలుస్తుంది కాని మనుష్యులందరూ మళ్ళీ "ఓ అన్నా," అంటారు అది మరీ బిగ్గఱగా "ఓ అన్నా, ఓ అన్నా," అంటుంది

శ్రీశైలం అడవుల్లో, నల్లమల కొండల్లో అంతటా ఈ పక్షి తిరుగుతూ, ఎక్కడబడితే అక్కడ, ఎవరికిబడితే వారికి కనిపిస్తూ, పిలుస్తూ ఉంటుంది

ఈ మాటు నీవు శ్రీశైలం వెళ్లినప్పుడు ఈ చిన్న పక్షిని తప్పకుండా చూడు అది కొమ్మమీద కూర్చుని నీవైపు తిరిగి "ఓ అన్నా, ఓ అన్నా," అని పిలుస్తుంది అప్పుడు నీవు శంపాలత కథ జ్ఞాపకం తెచ్చుకో

నీవు జ్ఞాపకం తెచ్చుకొంటూ ఉంటే ఆ చిన్నపక్షి నిన్ను పిలుస్తూనే ఉంటుంది, "ఓ అన్నా,' ' అని

నీవు ఎంతదూరం వెళ్ళిపోయినా నీ వెనక వినిపిస్తూనే ఉంటుంది, "ఓ అన్నా, ఓ అన్నా," అనే కేక నీవు ఇంటికి వచ్చాక కొన్నాళ్లదాకా నీ చెవులో గింగురు మంటూనే ఉంటుంది, "ఓ అన్నా, ఓ అన్నా,' ' అనే పిలుపు

# హాస్యం

1. ఆంధ్ర - దోమల సభ

2. మిసెస్. వి. కే. పటీరావు. ఎమ్మే.

# ఆంధ్ర - దోమలసభ

1

యోగాభ్యాసం చేస్తూన్నవాడు ఒక స్థితిలో పశుపక్ష్యాదుల భాషలు తెలుసుకోగలుగుతాడట!
నేను ఎంత వద్దన్నా వినకుండా నా స్నేహితుడొకడు యోగాభ్యాసం మొదలుపెట్టాడు తెల్లారకుండా ఒక గదిలో తలుపులు వేసుకొని కూర్చుని ఏవో మొగ్గలు వేస్తుండేవాడు అవేమిటంటే ఆసనాలని నాతో రహస్యంగా చెప్పేవాడు అంతే కాకుండా ఇంజనుగొట్టములో ఆవిరిలాగ చప్పుడు చేస్తూ గాలి లోపలికి ఎగపీల్చి బయటకు వదలిపెట్టుతూ ఉండేవాడు అదేమిటంటే ప్రాణాయామం - ఎవరితోనూ చెప్పవద్దన్నాడు క్రమ క్రమంగా ఆ పిచ్చిలో పడిపోయాడు కొన్ని నెల్లయ్యేసరికి ఏవేవో కొత్త శక్తులు తన కబ్బేయని చెప్పాడు అందులో ఒక శక్తి పశువుల, పక్షుల, కీటకముల భావాలు వాటి చేష్టల ద్వారా శబ్దములద్వారా ఇతర విధములుగాను గుర్తించడం

అతగాడు చెప్పే మాటలు యదార్థమో కాదో అని అప్పుడప్పుడు ఒక్కొక్క మృగానుద్దేశించి దాని భావము చెప్పమనేవాడిని ఏదో చెప్పుతూ ఉండేవాడు అయితే అతడు చెప్పింది నిజమో కాదో నిర్ణయించడం ఎలాగ?

గోదావరి ఒడ్డున గడ్డికి ప్రత్యామ్నాయము కాగితాలు తింటూన్న ఒక గోవును చూపి ఇది ఏమనుకొంటోంది చెప్పమంటే అతడు అక్కడ నిలబడి దానికేసి నిదానించి చూచి కళ్లుమూసుకొని చెప్పేవాడు "ఇది - ఈ గోవు - ఈ గోవు ప్రస్తుత సమయాన్ని మనదేశములో ధర్మము క్షీణించిందని విచారిస్తోంది ఈ మానవులు తను కాగితాలు తినడం చూచి గోవుల కుండదగ్గ హక్కులమాట అటుండగా అధమపక్షం కడుపునిండా గడ్డైనా వేస్తారేమోనని ఆలోచిస్తోంది "

ఈ మాటలు విన్న నేను ఏమనుకోవాలి?

ఒకనాడు ఒక ఆంబోతు తానే పట్టణ మేలుతూన్నట్లు చూస్తూ రోడ్డు కడ్డంగా నిలబడింది మనుష్యులూ, బళ్లూ తప్పుకుపోతున్నారు. కాని దాన్ని ఎవరూ పక్కకు తోలడం లేదు భయంచేత

దాని చిత్తవృత్తి ఎటువంటిదో తెలుసుకోవాలని అడిగాను మా స్నేహితుణ్ణి అతడు చెప్పుతున్నాడు - "ఈ మనుష్యులకు బుద్ధి లేదు లొంగితే బళ్లకు కట్టుకు తిప్పుతారు ఎదురుకొంటే దూరంగా తొలిగిపోతారు బోలెడంత గందరగోళం చేసి, పసుపు రాసి, కుంకుం పెట్టి, ఊరేగించి, పూజించి, అచ్చుపోసి వదలిపెడతారు మర్నాడు దానికి తిండి దొరికిందా లేదా అనే సంగతైనా ఆలోచించరు చస్తే రెండెడ్ల బండిలో ముస్తాబు చేసి పడుక్కోబెట్టి ఊరేగిస్తారు బదికున్నప్పుడు పట్టెడు గడ్డిపోచలైనా వెయ్యరు ఈ మానవుల్ని ఏం చేసినా పాపం లేదు "

ఈ విధంగా నా స్నేహితుడు జంతు హృదయాన్ని వెల్లడి చేసేవాడు అతడి మాటలను బట్టి

చూస్తే వాటికి మనుష్యుల పట్ల సద్భావ మున్నట్లు తోచదు

మనుష్యులు తమ కుపకారము చెయ్యడం లేదని వారిని నిందించడమే కాకుండా అ కారణంగా మానవుల ఆచారవ్యవహారాలను గురించి కూడా అవి ప్రసంగించుకోవడమూ నిందించడమూ కూడా కద్దు

ఊరి వెలపల చిట్టడవిలోకి మేమిద్దరమూ షికారుగా వెళ్లినప్పుడు అతడు ఒక పక్షి దంపతుల సంభాషణ ఈ విధంగా చెప్పాడు

"చూడు చూడు, ఇద్దరు ద్విపాదులు అలా వెడుతున్నారు "

"వాళ్ల ఒళ్లు అలాగ వేళ్లాడిపోతోందేం పాపం?"

"ఒళ్లు కాదు వేళ్లాడుతూంట --- అవి వాళ్ళు తొడుక్కొనే బట్టలు "

"ఎందుకు పాపం వాళ్లవి తొడుక్కోవడం --- వాళ్లకి ఒంటిమీద చర్మంగాని వెంట్రుకలు గాని లేవూ?"

"ఉన్నాయి, ఉన్నా ఎందుకో అవి తొడుక్కొంటారు "

"పాపం మనకు భగవంతుడు రెక్కలూ, వెంట్రుకలూ ఇచ్చినట్లు వాళ్లకివ్వలేనట్లుంది నిజంగా భగవంతుడు పక్షపాతం చేస్తాడా?"

జంతువులలో ఉత్కృష్ట జంతువుల కుండే సదుపాయాలు నీచజంతువుల కుంటాయా? భగవంతుడి దయకు పాత్రమైన వాళ్లు ఉత్కృష్ట జంతువులై పుడతారు పాపం చేసుకొన్న వాళ్లకి ఏ నరజన్మమో, ఏ సర్ప జన్మమో వస్తుంది "

"అవును పాపం --- చూడు తలమీద బుట్టలు బోర్లించుకొన్నారు మెడకు గుడ్డపేలికలు చుట్టబెట్టుకొన్నారు కళ్లకుగంతలు కట్టుకొన్నారు కాళ్లకు డెక్కలు తగిలించుకొన్నారు "

"తోడి జంతువులు నవ్వుతారనేనా లేదు వీళ్లకి ---"

"వాళ్ల దగ్గిరగా వెళ్లకూడదు వాళ్ల కళ్లు మంచివి కావు "

ఈ విధంగా సంభాషణ వెడుతోంది నా స్నేహితుణ్ణి ఆపి అన్నాను గదా, "పూర్వకాలాల్లో పక్షిదంపతులు రాచకొమార్తెలను గురించీ రాచకొమాళ్లను గురించీ మాట్లాడుకొంటూ ఉండేవిట --- ఈ కాలంలో ఈ విధంగా మారాయేమి? మళ్లీ జాగ్రత్తగా విను -- మన యువరాజుగారి పెళ్లిని గురించి కాని మన మంత్రిగారి కుమారుడి పెళ్లిని గురించి గాని మాట్లాడుతాయేమో "

మా స్నేహితుడు వినాలని మళ్లీ మనస్సు నేకాగ్రము చేసుకొంటూండగా అవి ఎగిరిపోయాయి

ఈ విధంగానే తమకు బలిభుక్కులని పేరుపెట్టిన్నీ మనుష్యులు తమకు బలులు వేయడం లేదని కాకులు అడ్డమైన తిట్లూ తిడుతూన్నట్లు ఒకమాటు నా స్నేహితుడు చెప్పాడు

వినోదంగా కొంతకాలం ఈ మాదిరిగా కాలక్షేపం చేశాము ఒకనాటి సాయంకాలం నా స్నేహితుడు మా యింటికి పరుగెత్తుకు వచ్చి - "లే, లే, వెడదాం, రా, చప్పున - కండువా వేసుకో '

"ఏమంత తొందర" అన్నాను

"టైము లేదు రావాలి, రావాలి చప్పున" అన్నాడు

"ఏమిటి సంగతి?"

"దోమల సభ"

"అంటే?"

"నీకు మతిగాని పోయిందా ఏమిటి --- ఇప్పుడు దోమలు సభ చేసుకొంటున్నాయి రా, కాగితాలు, కలం తీసుకురా, వ్రాసుకొందువుగాని ---"

"ఎక్కడ ఈ సభ?"

"దానవాయి గుంటలో"

"అక్కడ దోమలుండవే ఆరోగ్యకరంగా ఉండే తావుల్లో దోమలు సభ చేస్తవా?"

"అదే తమాషా --- వాటికీ ఆరోగ్యకరంగా ఉన్న స్థలాలు కావాలిట---"

"ఈ సంగతి నీకెలా తెలిసింది?"

"రెండు దోమలు నా చెవి దగ్గిర చెప్పుకొంటూంటే విన్నాను"

ఇద్దరమూ బయల్దేరి వెళ్లాము దోమల సభకి

## 2

కుంటకు సమీపంలో ఒక దోమలదండు ఎగురుతున్నది చుట్టూ చెట్లు, ఆ ఎగరడంలో ఒక మోస్తరు శబ్దము పుడుతోంది కుంట సమీపానికి వచ్చేటప్పటికి నా స్నేహితుడు "అయిపోతోంది, సభ, అయిపోతోంది" అన్నాడు

"దోమలింకా ఎగురుతూనే ఉన్నాయి" అన్నాను

'ఎగురుతూనే అవి సభ చేసుకోవడం" అన్నాడు అని అక్కడ ఒక బండమీద కూర్చున్నాడు కళ్లు మూసుకొన్నాడు వింటూన్నట్లు అభినయిస్తూ "వ్రాసుకో" అన్నాడు అతడు చెప్పగా నేను వ్రాసింది ఇదిగో. ఇందులో ఏమీ మార్పులు చెయ్యలేదు చెప్పింది చెప్పినట్లు వ్రాశాను ఇందలి నిజానిజాలు బుద్ధిమంతులే తేల్చుకోవాలి

"సోదర సోదరీ మణులారా --- పవిత్రమైన గౌతమీ తీరాన్న జన్మించిన మనము తత్ప్రాంతములలోనే సభచేసుకోక ఈ కుంటవద్ద సభ చేసుకోవడం మీకు వింతగా తోచవచ్చు మనలను తరతరములనుండి పోషించిన గౌతమి నేడు మన ఉదాసీనతకు కారణమయిందని మనము విచారించవలసి ఉన్నది కాని యీ మార్పుకు బాధ్యులము మనము కాము పవిత్రమైన గోదావరిని కలుషితము చేస్తున్నది మానవులు తత్ఫలము ననుభవిస్తున్నది మనము. మానవరక్తమే ప్రధానాహారముగా గల మన మా ప్రాంతములందలి మానవ రక్తమును గ్రహించడమువల్ల రుజాపీడితుల మౌతున్నాము ఆరోగ్యము చెడుతున్నది అయితే దేశాంతరము పోరాదా అనే ప్రశ్న పుట్టవచ్చును.

"మన పూర్వులు సంపాదించిన ఈ క్షేత్రమును మనము నేడు కాదని విడిచి వెళ్లడము వివేకము కాదు 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్న పాతమాట సభ్యులకు కొత్తమాట కాదు ఏ మహాక్షేత్రమును రాజరాజు, రెడ్డి ప్రభువులు, నవాబులు పాలించి మన వంశమును పోషించారో, ఏ మహారాజ్యము చిరకాలమునుండియు ఆంధ్రత్వమునకు నిలయమై యున్నదో, ఏ పవిత్రభూమి శ్రీనాధాది మహాకవుల వాణి కాటపట్టయినదో, అట్టి రాణ్మహేంద్రవరమును మన మెన్నటికైన విడిచిపోగలమా? ఒక్కమాట మరవవద్దని సభ్యులను నేను మరీ మరీ వేడుకొంటున్నాను మన పూర్వీకులను పోషించినది ఆంధ్రసామ్రాట్టయిన రాజరాజు రక్తము, మన వంశమునకు ఆదిభిక్ష పెట్టింది, ఆంధ్రకవితాపితయైన నన్నయ్య రుధిరము, మన కులములకు ప్రాపుగా నిలిచినది కవిసార్వభౌముడైన శ్రీనాధుని నెత్తురు నానావిధ భక్ష్యభోజ్యముల ననుభవించినమహారాజుల, మహావీరుల, మహాకవుల, గాయకగ్రామణుల, పతివ్రతాతిలకముల రక్తమే - వారి ఆంధ్రరక్తమే నేడు మన నాళములలో ప్రవహించుచున్నది ఈ మాటలు తలుచుకొన్న ఏ మశకశిఖామణి రక్తనాళములు ఉబుకవు, ఉడుకెత్తవు? మరవకండి, సోదర సోదరీమణులారా, మరవకండి, మశకశేఖరులారా మరవకండి - మన మాంధ్రులమన్నమాట మరవకండి ఆంధ్రరక్తము మన నాళములలో ప్రవహించుచున్నదన్నమాట మరవకండి ఆనాడు ఆంధ్ర శత్రువుల రక్తము ఆంధ్రవీరుల కరవాలములతోపాటు త్రాగినది మన తొండములే ఉత్కళరక్తమును చవిచూచితిమి యవనరక్తమును త్రాగితిమి ఆంగ్లరుధిరమును రుచిచూచితిమి అరవరక్తమును పానమొనరించితిమి వలందుల రక్తమెట్టి రుచికలదో గ్రహించితిమి ఆంధ్రసామ్రాజ్య స్థాపనకు, తద్వ్యాప్తికి, స్థిరత్వమునకు మనమున్నూ కారణమన్నమాట మరవకండి ఆంధ్రతటాకములు మనకాటపట్టులు ఆంధ్రగిరులు మనకు విహారసీమలు ఆంధ్రులు మన భోజనంబులు వంశపారంపర్యముగా వస్తూ ఉన్న ఇట్టి హక్కులను వదలి స్థానభ్రష్టులమై పోవుటకు మీరు ఇష్టపడుదురా? ఆంధ్ర-దోమలారా ! ఒక విన్నపము భగవదనుగ్రహమువల్ల మన వంశము నాడు నాటికి వృద్ధిచెందుచున్నది చల్లని రాజులు మన దేశము పాలిస్తున్నారు మనపట్ల గౌరవాభిమానములు గల మన ఆంధ్రమానవ సోదరులు మన పట్టణమునకు పాలనకర్తలై ఉన్నారు మన వంశాభివవృద్ధికి గారణభూతులైన వారిపట్ల మనము కృతజ్ఞులమై ఉండవలెను కిందటి జనాభా లెక్కలతో పోల్చి చూడగా నేడు మన జనసంఖ్య నూటికి వెయ్యిరెట్లు పెరిగినట్లు తేలుతున్నది ఈ వృద్ధికి మనము సంతోషించవలసినదే కాని ఒక ప్రమాదము మాత్రము సంభవించుచున్నది మన జనసంఖ్య యింతగా పెరగడము వల్ల మనకు తగినంత ఆహారము దొరకడము లేదు అంతే కాకుండా ఈ కాలపు మానవ రక్తము తగినంత ఆరోగ్యకరముగా ఉండకపోవడము ఒక కారణం దురాచారములకు లోనైన నేటి మానవులు తమ రక్తము మనకు సరిపడడము లేదనిన్నీ రోగకారణమగుచున్నదనిన్నీ గ్రహిస్తే బాగుండును పురపాలకులీ విషయము గ్రహింతురు గాక ఇక మన కాహారము సరిపోకపోవడానికి కారణమేమై ఉంటుందని

శాస్త్రజ్ఞులాలోచించగా తేలిన విషయం ఏమంటే - మానవుల జనసంఖ్య తగ్గుచున్నదట అందుకు కారణము వారు సంతాననిరోధమును కొన్ని ఉపకరణముల ద్వారా చేసుకొంటున్నారట ఈ విధముగా వారి జనసంఖ్య తగ్గి మన జనసంఖ్య పెరుగుతూ ఉన్నట్లయితే కొంతకాలానికి మనకు కూడు దొరకదేమో ననే భయము కలుగుతున్నది కాబట్టి పెద్దల అనుమతిని నేను యువతీ యువకులకు ఒక సలహా ఇస్తున్నాను మానవుల మార్గమును మనమున్నూ అవలంబించి సంతాననిరోధమునకు ప్రయత్నిస్తే బాగుంటుందేమో ఆలోచించండి ('కూడదు, కూడదు' అని కేకలు) తరువాత తమ చిత్తము

"పైని నేను చెప్పిన వాక్యముల వల్ల మనము మానవులపట్ల ఎంత అభిమానము వహించియున్నామో అందరికీ విదితమే ఎంతటి ఆంధ్రాభిమానులమో సుగమ్యమే ఇట్టి అభిమానపూరితులమైన మన యెడల మానవులు కృతజ్ఞులై ఉండవలెను గదా! మనలను సోదరసోదరీ భావముతో చూచుకోవలెను గదా! ఆంధ్రజనని గర్భోద్భవులమైన మనమున్నూ, మానవులున్నూ ఏకోదరులవలె మెలగవలెను గదా కాని అట్లు జరుగుచున్నదా? లేదు ఇందు కెవరు కారణం? మనమెంత మాత్రమూ కాదని మన యంతరాత్మ మనకు బోధించుచున్నది మానవులపై ఆధారపడి బ్రతుకవలసిన మన మెన్నడైన మానవుల యెడ కృతఘ్నభావము వహించి ఉండగలమా? లేము కాబట్టి యిట్టి స్థితికి కారణభూతులైన మానవుల నేమనవలెను? వారు కృతఘ్నులు కారా? అవివేకులు కారా? వారిని పోషించే ఆంధ్రగౌతమీనది మనలను పోషించుచున్నది గదా? వారిపై ప్రసరించే ఆంధ్రవాయువులు మనపైనిన్నీ ప్రసరిస్తున్నవి కదా! వారి అస్థికల గర్భస్థము చేసుకొనుచున్న ఆంధ్రభూమి మన కళేబరములను కూడ గ్రహిస్తున్నది కదా? వారికి చాందినీయైన ఆంధ్రాకాశమే గదా మనకున్నూ మేలుకట్టై ఉన్నది ? వారిపై తన కిరణముల ప్రసరించు ఆంధ్ర సూర్యుడే గదా మనలను కూడ తన కిరణములలో ముంచుతున్నాడు! వారి రాజులే గదా మన రాజులున్నూ, వారి మహా కవులే కదా మన మహాకవులున్నూ, వారి కళాప్రవీణులే గదా మన కళాప్రవీణులున్నూ!

"ఈ సంగతి మానవులు గ్రహించారా? లేదు సరిగదా మనలను వారి శత్రుకోటిలో చేర్చి అంతరింపజేయుడమునకు ప్రయత్నిస్తున్నారు ( 'సిగ్గు, సిగ్గు' అని కేకలు ) మన వలన వారికి కొత్త జబ్బులు పుట్టుతున్నవట - మలేరియాకు మనమే కారణమట, బోదకాళ్లకుమనమే కారణమట ఇంకా ఏమేమో జబ్బులకు మనమే కారణమట - రాజరాజు కాలములో ఎన్నడైన ఇట్టి మాట పుట్టినదా? శ్రీనాధుడెన్నడైన యిట్టి యసత్యముల వక్కాణించియున్నాడా? పోతన మహానుభావుడెన్నడైన యిట్టి అవాచనముల పల్కి యున్నాడా? కృష్ణదేవరాయలనాడైన యిట్టి కింవదంతి పుట్టినదా? విన్నారా సోదర సోదరీమణులారా! నా అనుంగు ఆంధ్రదోమలారా! మానవులు మనపై పెద్ద పెద్ద పుస్తకములు వ్రాసినారు మన చిత్తరువులను అచ్చొత్తినారు మనలను చంపు ఉపాయములను కనిపెట్టి, ప్రచారము చేస్తున్నారు! ఇట్టి సందర్భములలో మనము చేతులు కట్టుకొని రెక్కలు ముడుచుకొని

కూర్చొనవలసినదేనా? చేతగానివాళ్ల మనిపించుకోవలసినదేనా? ఆంధ్రరక్తము మీ నాళములలో ప్రవహించడము లేదా? గతించిన ఆంధ్రవీరుల ప్రతాపము మీ స్మృతికి తగలడము లేదా! మానవ రక్తపానము మన జన్మహక్కు గాదా? భగవంతుని ఉద్దేశమేమి? మనల నెందుకు పుట్టిస్తే? మొదట మానవులను పుట్టించి వారి రక్తము త్రాగి బ్రదకమని భగవంతుడు మనలను తరువాత పుట్టించియున్నాడు గదా? ఇట్టి జన్మహక్కును మనము వదలుకోగలమా? భగవదాదేశమునకు వ్యతిరేకముగా నడచుకోగలమా? స్వామిద్రోహమునకొడి గట్టగలమా? దేశద్రోహము చేయగలమా?

"ఆప్తులారా! ఈ సందర్భమున మీకో సంగతి జ్ఞాపకము చేస్తున్నాను. మన మూలపురుషులు పూర్వము అడవులలో సంచరించేవారు. తృణకాష్ఠజల సమృద్ధిగల ఆ స్థలములలో వారు సుఖముగా దైవచింతలలో మునిగి ఉంటూండగా ఈ మానవులే వారిని పట్టణవాసమునకు రమ్మని ఆహ్వానము చేశారు అమాయకులైన మన పూర్వులు వారి మాటలు మన్నించి పట్టణములలో కాపురమేర్పాటు చేసుకొన్నారు ఇప్పుడు యిన్ని యుగములు గడచిన తర్వాత ఈ మానవులు మనలను చంపుటకు-హత్య చేయుటకు ప్రయత్నిస్తున్నారు చూచారా ఎంత కృతఘ్నులో?

"వాదము కొరకు వారికి మనవల్ల జబ్బులు వస్తున్నవనే సంగతి ఒప్పుకొందాము వారిలో కొందరి మరణమునకు మనమే కారణమన్నమాట అంగీకరింతాము అయితే ఆ తప్పుకు ఇట్టి శిక్షలా విధించడం? మన వంశక్షయము చేయడమునకు మానవుడు పూనుకొంటాడా? మనలను ఆబాలవృద్ధము అంతరింపజేస్తాడా? ఇది న్యాయమేనా? ఈ మానవుడు మనల నెంతటి చేతగాని వారిక్రింద కట్టివేసినాడు? మనలో వీర్యము చచ్చినదనుకొంటున్నాడు కాబోలు! మన పరాక్రమ మంతరించిందనుకొంటున్నాడు కాబోలు! మనలో ఆంధ్రత్వము ఇంకిపోయిందనుకొంటున్నాడు కాబోలు!

"కడుపు కక్కుర్తికి మనము మానవ రక్తము త్రాగుతున్నామన్నమాట మరవకండి. అది భగవదుద్దిష్టము కాకపోతే మనకీ తుచ్ఛరక్తము కావలసివచ్చునా? ఈ మానవులేనా మహారక్తముతో నిండినవారు ఎందరు లేరు కాని మనము భగవంతుని ఉద్దేశమునకు భిన్నముగా నడుచుకోలేము

"ఇట్టి చిన్న తప్పు - నిజముగా తప్పు కాదు, మన జన్మహక్కే - మనలను మారణహోమము చేయచలచాడే మానవుడు! ఈ మానవుడిని ఏమి చేయవలసింది చూడండి అతడు చేసే తప్పులకు? నిష్కారణముగా ఏ కపటమూ ఎరుగని తియ్యటి పక్షులను అతడు ఇష్టము వచ్చినట్లు చంపుతున్నాడే! దీనికేమిశిక్ష? అడవులలో సంచరిస్తూ తమ బ్రదుకు తాము బ్రదికే అనపరాధులైన మృగములను వధిస్తున్నాడే! దీనికేమి శిక్ష? తన పిల్లలతో పాటు తాను సాకి, పిమ్మట పక్షులను, మేకలను, గొర్రెలను పీకలు కోసి తింటున్నాడే! దీనికేమి శిక్ష? భగవంతుని సృష్టికి కళంకప్రాయుడై ఉన్నాడే! భగవంతుని శాసనములను బ్రద్దలు కొడుతున్నాడే! దీనికేమి శిక్ష ? భగవంతుడు లేడూ? న్యాయాన్యాయ పరిపాలనము చెయ్యడూ ?

"కాని సోదరసోదరీమణులారా! ఒక్క విషయము మనవి చేస్తున్నాను  అది గుడ్డిలో మెల్ల మనపై కత్తికట్టి మనలను సంహరించవలెనని పూనుకొన్న మానవుడు పుస్తకములు వ్రాయడముతోనూ, మన బొమ్మలు అచ్చొత్తించి ప్రదర్శించడముతోనూ, మనలను చంపే ఔషధములట - వాటిని కనిపెట్టడముతోనూ తృప్తి జెంది ఊరుకొన్నాడు  ఇది మనము సంతోషించదగ్గ విషయం  ఇందుకు మనము మానవుల యెడ కించిత్తు కృతజ్ఞులమై ఉండవలెను  మానవుడెంత వాక్శూరుడో అంత కార్యశూరుడూ, ఖడ్గశూరుడూ అయి ఉన్నట్లయితే మనకు నిలవ నీడ లేకుండా ఉండేది  కాని మన అదృష్టము వల్లను భగవదనుగ్రహమువల్లను అతడట్టి వాడు కాడు  అందువల్ల మనకంతగా ప్రమాదము లేదు  ఆలోచించగా నాకు తోచిన విషయం ఏమిటంటే - ఈ మానవుడు బదుకుతెరువు కోసమని ఈ పుస్తకాలు రాసుకొంటున్నాడే కాని నిజముగా మనపై ద్వేషభావము కలిగి కాదు! చూడండి ఎంతమంది మనపేరు చెప్పుకు బతుకుతున్నారో! పుస్తకాలు రాసేవాళ్లు, మాజిక్ లాంతర్ల వాళ్లు, ఆసుపత్రులవాళ్లు, ఆరోగ్యశాఖవాళ్లు, ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు! ఇంతమందికి మనము జీవనాధారము కల్పిస్తున్నందుకు మనము గర్వపడవలెను, మానవులు మన యెడల కృతజ్ఞత చూపవలెను

"పులిమీద పుట్ర అన్నట్లు ఈ మధ్య ఆరోగ్యవారములంటూ లేవనెత్తి ఈ మానవులు మనలను నిందించడం మొదలుపెట్టారు  మన వంశనిర్మూలనము లక్ష్యముగా పెట్టుకొన్నట్లు ఉపన్యసించారు  ఇందువల్ల మనకేమి ప్రమాదము సంభవిస్తుందో అని చాలా భయపడ్డాము  కాని క్రియకు వచ్చేసరికి ఆరోగ్య వారోత్సవాలన్నీ ఉపన్యాసములతో అంతరించాయి  విందులతో సమాప్తమయ్యేయి  ఇట్టి ఆరోగ్య వారోత్సవాలలో మనమున్నూ హృదయపూర్వకముగా వారికి సాయపడి నిర్విఘ్నముగా అవి జరిగేటట్లు ముందు ముందు చేయవలెను  ఇట్టి ఆరోగ్య వారములు నిరంతరమూ జరపగలందులకై ఈ సభ తరపున మానవులను నేను ప్రార్థిస్తున్నాను  అరవ ఉద్యోగస్థులు వచ్చి ఆరోగ్యవార సందర్భమున మనలను పారదోలవలెనని ఉపన్యాసము లిస్తూన్నట్లు తెలియుచున్నది  అరవవారి ఉపన్యాసాలకు బెదిరి పారిపోయే దుస్థితి యింకా ఆంధ్ర - దోమలకు పట్టలేదని మనవి చేసుకొంటున్నాను

"సోదరసోదరీమణులారా! ఒక ముఖ్యవిషయమును గురించి నేను మీకు యింకను మనవి చేయవలసి ఉన్నది  మనము చిరకాలము నుండి పట్టణములలో, అనగా పాత ఊళ్లో కాపురమున్నాము కాని మానవ జనసమృద్ధి చేతనూ, ఆరోగ్యకరమైన మానవరక్తము మనకు దొరకనందువల్లనూ మనలో కొందరము ముఖ్యముగా ఆరోగ్యము కొరకై ఇన్నీసుపేట వలసపోయినాము  అక్కడ కూడ పరిస్థితులు చెడినవి  అనారోగ్యము హెచ్చుతున్నది  వంశక్షేమము ప్రధానము కాబట్టి మనము - అధమపక్షము కొందరమైనను వేరొకచోటికి వలసపోవలసిన అవసరము గోచరించుచున్నది ఆర్యాపురమూ, వీరభద్రపురమూ, మన మిప్పుడు సభచేసిన దానవాయిగుంటా వాసయోగ్యములని

వింటున్నాను తీరా ఆరోగ్యము చెడ్డ తరువాత చేసేదేమిన్నీ లేదు కాబట్టి ఇప్పుడే జాగ్రత్త పడడము మంచిది 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన'మ్మని గదా పెద్దలు చెబుతారు. . . . . .

. . . . . . . . . . .

అరుగో, అరుగో, మానవులు; చుట్టుకోండి, వాలండి, పొడవండి, తాగండి రక్తం .

నా స్నేహితుడు తటాలున లేచి "రా, రా పారిపోదాం రా! మన్ని చూచాయి ఈ దోమలు ఇక్కడ నిలిస్తే బతకనివ్వవు రా, రా" అంటూ నన్ను లాక్కుపోయాడు ఈ లోపుగానే వందలాది దోమలు మా మీద పడి చెడకుట్టాయి. బతుకుజీవుడా అంటూ ఏలాగైతే నేమి యింటిలో వచ్చి పడ్డాము

నా స్నేహితుడు ఎవరో తెలుసుకోవాలని పాఠకులు పరిశోధనలు చెయ్యవచ్చు. అతగాడి పేరు చెప్పడానికి వీలులేదు కాని అతడింకా యోగాభ్యాసం చేస్తూనే ఉన్నాడు జంతుహృదయాలు తెలుసుకొంటూ ఉన్నాడు అతడిప్పుడు నెల్లూరులో ఉన్నాడు. సాయంకాలాల్లో పెన్న ఒడ్డున షికారు చేస్తూ ఉంటాడు చేపల సంభాషణ తెలుసుకోడానికి ప్రయత్నిస్తూన్నట్లు మొన్ననే ఉత్తరం వ్రాశాడు పర్యవసానం ఇంకా తెలియలేదు ఇప్పటి కింతటితో సరి

తాజాకలం - చివరకు దోమల సభ ఏమైనదో, అవి ఎట్టి తీర్మానాలు చేసుకొన్నాయో తెలియదు. కాని దేశములో దోమలబాధ మాత్రం ఎక్కువైనది .

# మిసెస్ వి.కే. వటీరావు, యమ్మే

ఈ మధ్య నా భార్య నాతో బహు అన్యోన్యంగా ఉండడం మొదలెట్టింది. సాధారణంగా తన చీరలేమిటో, తన బ్లౌసులేమిటో, తన ఆభరణాలేమిటో, తన అలంకరణ మేమిటో, తన క్లబ్బేమిటో అదే గొడవగాని, భర్త అనే మగవాడిని నేనొక్కణ్ణి ఉన్నాననీ, నాకూ, తనకూ విచ్ఛిత్తిగాని ప్రేమ ఆజన్మమూ ఉండాలనీ మరచిపోయేది హోటల్నించి భోజనం తెప్పించుకొని మేమిద్దరమూ నూగనోము పట్టి భోంచేశేవాళ్ళము. తక్షణమే ఆవిడ క్లబ్బుకు సింగారించుకు వెళ్ళిపోయేది నేను కచేరీకి పరుగెత్తుకు పోయేవాణ్ణి

పిల్లలు వేరే కాన్వెంటు స్కూలులో చదువుకొంటున్నారు కాబట్టి వాళ్ళ గొడవ నాకూ, మా ఆవిడకు కూడా పట్టేది కాదు. ఎప్పుడైనా పిల్లలు యింటికి తిరిగివస్తే నన్ను అసలే మరచిపోయేది మా ఆవిడ వాళ్ళచేత యింగ్లీషు పద్యాలూ, పాటలూ పాడించడం, వాళ్ళచేత యింగ్లీషు ఆటలు ఆడించడం, వాళ్ళతో పాటు తనూ గంతులెయ్యడం, స్కిప్ చెయ్యడం, డాన్సు చెయ్యడం, ఇదీ

పొద్దస్తమానమూను సాయంత్రం వాళ్ళను యింగ్లీషు దుస్తులతో అలంకరించి తనూ అలంకరించుకొని క్లబ్బుకు తీసుకుపోయేది నిజం చెప్పాలి కాబట్టి చెప్తున్నాను నా భార్య మాత్రం యింగ్లీషు దుస్తులు ధరించేదిగాదు హ్యాట్ పెట్టేది కాదు రోజుకో రకం చీర కట్టుకొని, బాహుమూల రుచుల కడ్డురాని రవిక తొడుక్కొని, ఒకచేతికి రెండు బంగారు గాజులు పెట్టుకొని, రెండో చేతికి రిష్టువాచి కట్టుకొని క్లబ్బుకు వెడుతూండేది

ఒకమాటు అన్నాను గదా హాస్యానికి - "పోనీ నువ్వు కల్చర్డు లేడీవి గదా! యమ్మే ప్యాసయ్యేవు, లేడీస్ కల్చర్ క్లబ్బులో సభ్యురాలవు బైసికిల్ తొక్కగలవు కూడాను - ఈ చీరలూ, రవికలూ ఖర్మం ఏమిటి? స్కర్టు తొడుక్కొని, హ్యాట్ పెట్టుకొని యింగ్లీషు స్త్రీలలాగ వాక్యం పూర్తిగాకముందే నన్ను గట్టిగా ఛెళ్లున చెంపమీద కొట్టి "మీరు సూటు వేసిననాడు నేను కడతానులెండి స్కర్టు" అంటూ నిప్పులు గ్రక్కుతూ లేచిపోయింది

చెంపకాయ తిని ఊరుకొన్నాను ఊరుకోక చేసేదేమిటి - యమ్మే ప్యాసైన కామిని సహధర్మచారిణి అయినప్పుడు ఇంటిగుట్టు రట్టు చేసుకోవచ్చునా? ఇంతకీ హిందూ స్త్రీ ధర్మానికి వ్యతిరేకంగా స్కర్టు, హ్యాట్లు ధరించుకోమని చెప్పడం నాదే తప్పు!

సాధారణంగా ఈ విధంగా ఉండే నా భార్య నా యెడల ఎక్కువ అన్యోన్యంగా ఉండడమూ, నాతో ఎక్కువకాలం గడపడమూ, నాతో అదే మాటలు చెప్పడమూ, అదే పరిహాసాలు చెయ్యడమూ, అదే కథలు చెప్పడమూ, నన్ను దువ్వడమూ లాలించడమూ -- యిదంతా తమాషాగా తోచింది ఏమిటి చెప్మా కారణం అనుకొన్నాను ఏమి స్ఫురించింది కాదు.

కాని ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది నిరుడు కొంచెం హెచ్చుతగ్గుగా యీవిధంగానే నాతో అన్యోన్యంగా ఉండేది. నా పూర్వాచార పరాయణత్వాన్నీ మెచ్చుకొనేది చివరకు నా చేత వేషం వేయించి, నన్ను నలుగురి ఆడవాళ్ళలోనూ నవ్వులపాలు చేసి, బర్తను ఫూల్ని చెయ్యడంలో అగ్రగణ్య అనే పేరు సంపాదించి, అందుకుగాను క్లబ్ యిచ్చే బహుమానాన్ని సంపాదించింది. నిజానికి కొంత తప్పు నాది కూడాను వేషం వెయ్యడానికి పూనుకొన్నది నేనే. నా భార్య నన్ను ఫూల్‌గొల్పి నాకు సహాయం చేసింది - దుర్బుద్ధితో నైతేనేమి? అంతేకాకుండా తనతోపాటు నాకూ బహుమతులు తెచ్చి పెట్టింది అయిందేమిటో అయింది ఇక యీ యేడాది మళ్ళీ ఆ విధంగానే చెయ్యదుకదా? ప్రతిసంవత్సరం కొత్త కొత్త విషయానికి క్లబ్బువాళ్లు ప్రైజులిస్తారు కాని ప్రతి యేడూ భర్తలను, భార్యలను ఫూల్సుగా చేసినందుకే ప్రైజులిస్తారనడం అసంభవం గదా? కాబట్టి ఆ దురుద్దేశం నా భార్యకు లేకపోవచ్చును మరి వేరే విషయం యేదైనా ఉంటుందా?

లేడీస్ కల్చరు క్లబ్బువారు ప్రతీ యేడూ డిశంబరులో బహుమతులిస్తారు డిశంబరు యింకా మూడునెల్లు ఉంది నా భార్య నన్ను లాలించడం అప్పుడే మొదలు పెట్టింది

నాకు బహుమతిగా వచ్చిన నటరాజ విగ్రహాన్ని తనూ పూజించడం మొదలుపెట్టింది

గోడలమీది సినిమా బొమ్మలు తీసివేసి దేవుళ్ళబొమ్మలు తగిలించింది. రోజూ నా చొక్కాలకు బొత్తాలు పెడుతోంది ఊడిపోయిన బొత్తాలు కుట్టి పెడుతోంది పంచెలు మరమ్మత్తు చేస్తోంది వద్దంటే వినక నాకప్పుడప్పుడు వాసన నూనెలు అత్తరువులూ రాస్తోంది ఒక మాటు బలవంతాన్ని నామొహం అంతా ఫేసుపౌడరు పామింది వద్దంటూంటే! సబ్బుతో కడుక్కొని ఆఫీసుకు ఆలస్యంగా వెళ్లి చివాట్లు కూడ తినవలసి వచ్చిందప్పుడు

ఒక వేళ నాభార్యకు మమకారం హెచ్చిందేమో నామీద - ఒకవేళ బుద్ధి తిరిగిందేమో, చదువుకొన్నది, హిందూదేశంలో పుట్టినది, విద్యాదోషంవల్ల కొంతవరకు బుద్ధి కొంతకాలం పరదేశపు దారిని పట్టినా క్రమేణా సర్దుకొంటూన్నదేమో?

ఏమైనా యీ యేడు బహుజాగ్రత్తగా ఉండాలని దృఢసంకల్పం చేసుకొన్నాను. నా భార్య ఎంత మౌకారం చూపినా ఎంత చాకచక్యంతో నడుచుకొన్నా, ఎంత పూర్వాచారాభిమానం నటించినా నేను చలించదలుచుకోలేదు రాతిబొమ్మను చక్కలిగింతలు పెట్టగలుగుతుందేమో చూద్దాము!

ఈ మార్పు తనలో ఎందుకు కలగాలో నాభార్యనే అడిగితే బాగుంటుందేమో ననిపించింది చదువుకొన్న లేడీతో వ్యవహారం గదా! తీరా అడిగితే తనను ఇన్‌సల్టు చేశానని విసిరి కొడుతుందేమో? అడక్కపోతే నన్ను మళ్లీ ఫూల్ని చేస్తుందేమో? ఏమైనా సరే ఎందుకైనా మంచిదని నిశ్చయించి, నా భార్యతో ఈ విషయాన్ని గురించి పూర్తిగా చర్చించడానికి తీర్మానించుకొన్నాను మా ఉభయులకూ తీరుబడిగా ఉన్న ఒక రోజున నా భార్యను పిలిచాను "వటీ! నీ విలువయైన కాలంలో కొన్ని నిముషాలు నా కొరకు వినియోగించగలవా?'' అన్నాను యింగ్లీషులో. నా భార్య అసలు కళావతమ్మ, అది క్రమక్రమంగా కళావతి, వతిగా మారింది ప్రస్తుతం వాడుకలో ఉన్న పేరు "మిసెస్ వతీరావు' ' లేక "వటీరావు'' ఈ చివర "రావు'' నాపేరు. ఇంగ్లీషులో మాత్రమే పేరు చదివేవారు నా భార్యను మిసెస్ వటీరావు అనిగాని, మిసెస్ వాటీరావు అనిగాని పిలుస్తారు మొగుడిపేరు తమ పేర్ల చివర తగిలించుకోవడంలోనే ఇంగ్లీషు చదువుకొన్న ఆడాళ్ల అస్వతంత్రత కనబడుతోందని ఒక మాటు నేను దెప్పి పొడిచాను అది అస్వతంత్రత కాదనీ, పేరు ఒక ప్రత్యేకతకు సూచనగా మాత్రమే వినియోగిస్తుందనీ, మొగుడిపేరు వంటరిగా వదిలివేస్తే దిక్కుమాలినదై పోతుందని తమ పేరుతో జోడిస్తున్నామనీ, అందుకు కృతజ్ఞత చూపక దెప్పిపొడవడం మగవాళ్ల నీచత్వానికి నిదర్శనమనీ చెప్పి మళ్ళీ నన్ను కిక్కురుమనకుండా చేసింది

"అయితే కళా, యీ యేడు మీ క్లబ్బులో బహుమతులివ్వడం కద్దా?'' అని అడిగాను "మళ్లీ మీకు బహుమానం పొందాలనీ ఉందా ఏమిటి పాపం - మా అమ్మే, నాకంటిపాపే.'' "నాకు బహుమానం కావాలని కాదు, వటీ, నీకు బహుమానం వస్తే నాకు వచ్చినట్లు కాదూ?''

"ఆఁ'' మరే, పాపం - నా బహుమానం మీరు కొట్టెయ్యాలనుకుంటున్నారు గాబోలు --''

"అదికాదు, వటీ!''

"పోనీ కావలిస్తే తీసుకోండి పాపం మాటవరసకి నాకీ యేడు ఒక చీర, ఒక బ్లౌసూ బహుమానం యిచ్చారనుకుందాం మీరంత సరదాపడుతూంటే మీకు కాదని నేను మాత్రం వాటిని వాడతానా ఏమిటి మీరే తీసుకోండి "

"యూ సిల్లీ! అందుకుకాదు నేను అడుగుతూంట. అసలు సంగతి తెలుసుకోవడానికి "

"సంవత్సరోత్సవాలు ఉన్నప్పుడు బహుమతులే ఉండవూ ఆ మాత్రం నా డార్లింగుకు తెలిసిందికాదు కాని "

"అయితే కిందటి యేడులాగ ఈ యేడేమైనా కోతిపనులు చేస్తావా?"

అనగా నా మీసం పట్టుకు లాగుతూ "అంత మరపేమిటి మీకు, డియర్ హబ్బీ! కోతిపనులు మీరా, నేనాచేస్త? మీ తెలివితేటలవల్లనేగా నాకూ మీకూ బహుమానం వచ్చింది?"

మీసం వదిలించుకొని అన్నాను గదా "చూడు కళా, ఈ యేడుగానీ నన్ను అలాంటి కోతిపనుల్లో కలుపుకున్నావంటే మాటదక్కదు సుమా "

"నో ఫియర్ మైడియర్"

"అయితే, వటీ, అసలు సంగతేమిటి? ఈ యేడు ఎందుకని బహుమతులిస్తారు?" అన్నాను సంగతి తెల్సుకోవటానికి.

నా భార్య అనుమానించి, నా కేసి పరకాయించి చూచింది. నా ముఖమూ, చెవులూ, జుట్టూ తన చేతులతో దువ్వుతూ అన్నది

"అనుమానం పట్టుకుంది కాబోలు కాదూ మీకు?"

"కాదు డార్లింగ్!"

"అవును, పీచ్!"

"కాదంటూంటే!"

"అయితే చెప్పడానికి వీల్లేదు!"

"ఏమిటి?"

"బహుమతు లెందుకిస్తారో చెప్పడానికి వీల్లేదు - క్లబ్బు రూల్సు పాటించ నక్కరలేదంటారా ఏమిటి?"

"చెప్పకూడదని క్లబ్బు రూల్సా?"

"అవును మై పెట్!"

"డియ్యర్ హబ్బీకి కూడా చెప్పకూడదా, రోజ్?"

"సారీ, హబ్బీ "

"పోనీ ఆ గొడవ నా కక్కరలేదు గాని - నా మీదకు మాత్రం రాకేం, ఓల్డుగరల్ !"

"మీచేత వేషం వేయించనులెండి."

"సరే, నా జాగ్రత్తలో నేనుంటానులే!"

"సరే, నా జాగ్రత్తలో నేనుంటానులే !"

"ఆల్‌రైట్, మైడియర్ !"

"కళా, ఇంకో ప్రశ్న అడగాలని ఉంది, అడగనా?"

"రైటో, అడగండి "

"ఈ మధ్య నీకు నామీదా, నా అభిప్రాయాలమీదా కొత్తగా అభిమానం కలిగింది ఎంచాతనంటావు?" ఈ ప్రశ్న నేనడగడంతోనే నాభార్య కోపం నటించింది తటాలున లేచి వెళ్లిపోబోయింది గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ తిరిగివచ్చి, గభాలున నా వళ్ళో కూచుని నా బుగ్గలు రెండూ గట్టిగా సాగదీసింది నా మీసాలు గుంజింది గట్టిగా కంఠాన్ని ఆశ్లేషించి "ఇంకెప్పుడూ అడగరు గదా అలాంటి ప్రశ్న, అడగరు గదా, అడగరు గదా!" అంటూ నా చెంపలు మృదువుగా ప్రేమతో వాయించింది

"నా ప్రశ్నలో తప్పేమిటి?" అన్నాను

"తప్పేమిటా, తప్పేమిటా?" అని నన్ను భుజాలు పట్టి ఊగిస్తూ

"నన్ను అనుమానిస్తారా యింత దర్టీగా? నా ప్రియమైన భర్తమీద నాకెప్పుడు అభిమానం లేదు? నా కనుపాప అభిప్రాయాల మీద నాకెప్పుడు అభిమానం లేదు? క్రొత్తగా అభిమానం పుట్టిందంటారా! మీన్!" అని మొహం చిట్లించింది నా అభిప్రాయానికి ఆధారాలు లేకపోలేదు కాని అవి అన్ని నేను చెప్పితే నా భార్య చిన్నబుచ్చుకోవచ్చు, లేదా కోపగించుకోవచ్చు ననుకొని, తనకు మాత్రం ఆలోచిస్తే తెలియదా ఏమిటి అనుకొని ఊరుకొన్నాను

పర్యవసానం ఏమీ తేల్లేదు ఎందుకు బహుమతులిస్తారో రహస్యంగా ఉంచుకొన్నారు నాచేత వేషం వేయించనని మాత్రం నా భార్య చెప్పింది వెయ్యమంటే మాత్రం వేస్తానా? కాబట్టి అది చెప్పి లాభం లేదు ఏ విధంగానైనా నన్ను మోసగిస్తుందేమో అని నా జాగ్రత్తలో నేనున్నాను నా భార్యను కనిపెడుతున్నాను ఒకనాడు నేనింట్లో ఉండగా నా భార్య ఒక పెద్దమనిషిని తీసుకొనివచ్చింది అతగాడు యింగ్లీషు దుస్తులు వేసుకొన్నాడు చేతులో ఈవినింగ్ హాట్ ఉంది మీసం ముక్కుకింద మాత్రమే ఉంది పడుచువాడు

సాధారణంగా ఎవళ్ళనైనా కొత్తవాళ్ళను యింటికి తీసుకువచ్చినప్పుడు నా భార్య నాకు వాళ్లని ఎరుకచేసేటి ఇన్‌ట్రడ్యూసు చెయ్యకుండా ఎప్పుడూ ఉండలేదు ఇప్పుడు మాత్రం ఆ నల్లదొర ఎవరో నాతో చెప్పలేదు నేను ఫలానా అని అతడితోనూ చెప్పలేదు

వచ్చీ రావడంతోనే ఇద్దరూ రెండు కుర్చీలలో కూలబడ్డారు నా భార్య తన చేత సంచీ బల్లమీద పెట్టింది దాని మీద అతడు తన హాట్ పడవేశాడు కాఫీ ముందర బెట్టుకొని బిస్కత్తులు తింటూ వాళ్ళు యింగ్లీషున అదే కబుర్లు చెప్పుకోవడం మొదలుపెట్టారు

పక్కగదిలోకి వెళ్లి నేను పని చూచుకొంటున్నాను ఉండుండీ ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు చప్పట్లు కొడుతున్నారు బల్ల గుద్దుతున్నారు చేతులతో తొడలు తట్టుకొంటున్నారు ఎందుకో అంత కులాసా నాకు బోధపడింది కాదు

ఆ మొద్దు ముండాకొడుకెవరో నా కాఫీ అంతా తాగేస్తూ, నా బిస్కత్తులన్నీ మింగేస్తూ, నా కుర్చీలూ, బల్లలూ విరగ్గొడుతూ, నాభార్యతో అంత జోస్తీగా మాట్లాడుతూ నవ్వుతూ, నా యింట్లో యింత హంగామా చేస్తూన్నందుకు నాకు కోపం వచ్చింది కాని ఏమి చేసేది ఏమైనా కలగచేసుకొంటినా చదువుకొన్న భార్యతో వ్యవహారం పెద్దపులితో చెలగాటం వంటిది

కాని ఒకటుంది నా భార్య అనేక పట్టణాల్లో కాలేజీలల్లో చదువుకొన్నది కాబట్టి అనేకమంది స్నేహితులు ఆవిడకున్నారు ఆడవాళ్ళల్లోనూ ఉన్నారు మగవాళ్ళల్లోనూ ఉన్నారు బహుశా యీ మనిషి మగమిత్రులలో ఒకడు కావచ్చు పాత స్నేహితుడు కావచ్చు చాలా కాలానికి వాళ్లు కలుసుకొని ఉండవచ్చు అందువల్ల ఈ ఉత్సాహమంతా అయి వుండవచ్చు లేదా అతడు నా భార్య దూరబంధువు కావచ్చు నాభార్య దూరబంధువుల నందరిని నేను ఎరిగి వుండను గదా! ఒక మాటు చూచిపోదామని వచ్చివుండవచ్చు దూరబంధువే అయితే నేను కూడా కొంతమట్టుకు బంధువునే కదా! మరి నన్ను కలుసుకోలేదేమిటి?

లేదా ఒక వేళ వాళ్ళ క్లబ్ మెంబర్ల తాలూకు మనిషై ఉండవచ్చు ఏ మెంబరు భర్తో, అన్నో, తమ్ముడో అయి యుండవచ్చు ఆ మెంబరు ద్వారా నా భార్యతో పరిచయం కలిగించుకొని ఉండవచ్చు ఎందుకు తొందరపడడం? తెలుస్తుందిగదా!

కొంతసేపటికి సద్దణిగింది నా గదికేసి వస్తారేమో, నాకు అతనితో పరిచయం కలిగిస్తుందేమో అని ఆశతో సులోచనాలు సర్దుకొని సీరియస్‌గా బింకంగా కూర్చున్నాను ఎవరూ వస్తూన్న జాడలేదు నిరుత్సాహంతో లేచి చూతును గదా - నా భార్యా ఆ ముక్కు కింద మీసాలవాడూ కలిసి కబుర్లు చెప్పకొంటూ, నవ్వుకొంటూ వీధమ్మట నడిచి వెడుతున్నారు

రెండు మూడు రోజులదాకా నా భార్యతో నేను సంప్రతించడానికి వీలు కలిగిందికాదు నా పనుల తొందర, ఆవిడికి క్లబ్బు తొందర, స్నేహితులలో పరిచయాల తొందర - ఇన్ని కారణాలు -

ఈ రెండు మూడు రోజులలోనూ ఎన్నో విశేషాలు కూడాను ఒకనాడు నేను కచేరీపని పూర్తిచేసుకొని షికారుగా సముద్రతీరానికి వెళ్లాను హాయిగా గాలి వీస్తోంది సముద్రపు అలలు నా పాదాల దగ్గరికి వచ్చి ఆడుకొంటున్నాయి సముద్రం నా హృదయంలాగే లేచిపడుతోంది సూర్యుడు సముద్రంలో అస్తమించబోతున్నాడు కడుపులో చెయ్యి పెట్టి కడిగివేస్తూన్న బెంగలు మరచిపోయి, సంధ్యావందనం సంగతి కూడా మరచిపోయి, నీలి సముద్రం కేసీ, ఆ ఎర్ర సూర్యబింబం కేసీ చూస్తూ సంజ వెలుగులో మునిగి ఉన్నాను

కొంతసేపైన తర్వాత తల ప్రక్కకుతిప్పి చూచాను ఒక పురుషుడూ ఒక స్త్రీ మాట్లాడుకొంటూ

వస్తున్నారు  కొంతసేపటికి పోలిక గట్టగలిగాను.  ఆ పురుషుడు ముక్కు కింద మీసంవాడు!  ఆ స్త్రీ నా భార్యా!  అలలు మరిచాను, సముద్రం మరిచాను  సంజ మరిచాను, అంధకారంలో పడ్డాను దగ్గరికి వస్తారుగదా!  ఏవిధంగా ఈ కుట్ర పరిణమిస్తుందో చూతామని వాళ్ళను చూడనట్టు నటిస్తూ అక్కడే నిలబడ్డాను

నా భార్య నన్ను చూచింది కాబోలు దారి మళ్లించి అడ్డదారిని అతణ్ణి తీసుకువెడుతోంది  ఆ మసక చీకట్లో వాళ్ల నవ్వులు వినిపిస్తున్నాయి  కనిపెట్టి చూస్తున్నాను  వాళ్లు మోటారుకారు దగ్గరికి వెళ్లారు  కారు ఎక్కారు  కారు బయలుదేరుతోంది  లేదు  బయలుదేరడం లేదు  ఎందుచేతనో, పదినిముషాలైంది  నేను చూడనే లేదు  సముద్రపు ఒడ్డునుంచే వెళ్ళింది ఒక పడుచమ్మాయి  కారు సమీపించింది.  ఆమె కారు ఎక్కింది  కారు కదిలి వెళ్ళిపోయింది.

ఎవరో ఆ అమ్మాయి?  ఎంత క్షోభపడింది మనస్సు నిష్కారణంగా అనుకొంటూ ఇంటిమార్గం పట్టాను

ఇంకో మాటు కచేరీ పని కావడంతోనే కల్చరు క్లబ్ పక్కనుంచి వెడదామని బుద్ధి పుట్టింది నా భార్య కనిపిస్తుందేమో ఏమిచేస్తూ ఉంటుందో గేటు ఇవతలనుంచే చూడవచ్చు ననుకున్నాను మనస్సు మహపాడు వస్తువ  ఎంత సమాధాన పెట్టినా వినదు  ఇంటికి పోనియ్యకుండా ఎందుకు ఈ క్లబ్ వైపుకు ఈడ్చుకురావాలి?  ఏదైనా ఫలానా కార్యంకోసమని తీసుకువస్తే బాగుంటుంద ఏమీలేదే!  ఈ మనస్సు అడుగు పొరల్లో ఏదో అనుమానం దాన్ని శల్యంలాగ బాధిస్తోంది  ఆ అనుమానాన్ని ధృఢపరుచుకోడానికో, రద్దు చేసుకోడానికో ఈ ప్రయత్నమంతాను.  ఎవరిమీద అనుమానం ?  నా భార్య మీదనే?  నా భార్య గడుసుదంటే ఒప్పుకుంటాను.  పెంకెదంటే ఒప్పుకుంటాను, మాటకారి అంటే ఒప్పుకుంటాను, చెయ్యి చేసుకొనే స్వభావం కలదంటే ఒప్పుకొంటాను - కాని యిన్నాళ్లు నిష్కళంకంగా నాతో కాపురంచేసి, మా యిద్దరికీ సంతానం కూడా కలిగిన తరువాత యింకా అనుమానమా?  మనస్సు మహచెడ్డ వస్తువ!  క్లబ్బు పక్కనుంచి అటూ ఇటూ తిరిగాను. గేటులోనుంచి చూచాను నా భార్య కనబడలేదు  ఇంతలో గేటుదగ్గర జవాను నన్ను చూచి వచ్చి నమస్కరించి అన్నాడు బాబయ్యా "యీయేల అమ్మొగోరు క్లబ్బుకు రానేదు  ఆరెవరో పెద్దింటోరే బాబయ్యా  ఆలుమొగళ్లు దెబ్బలాడుకొన్నారంట - సంసారంగాదా బాబయ్య; అమ్మొగోరు ఆ మొగాయిన్ని యెంటపెట్టుకు ఎల్లిబోయేరంట "  మాయామర్మం ఎరుగని వాడి మాటలు విని నా మనస్సు చివుక్కుమంది.  వెంటబెట్టుకు వెళ్ళడమంటే ఏమిటి?  చెప్పరానిమాటైతే వాడు నాతో చెప్తుతాడా?  చెప్పగూడనిమాటైతే వెంటబెట్టుకు వెళ్లడమంటే ఏమిటి?  వెధవ అనుమావం బాధిస్తూనే ఉంది  ఎందుకు అనుమానం?

ఇంటికి వచ్చిన వాణ్ణి నాకు చూపకపోవడం ఒకటి;  బీచి దగ్గర తప్పించుకుపోవడం రెండు; మొగాయన్ని వెంటబెట్టుకు వెళ్ళడం మూడు,  సరే కాని అడిగి చూస్తాను!

నాభార్య నీ సంగతులన్నీ నిలవేసి అడగాలని నిశ్చయించాను సంజాయిషి ఏమియిస్తుందో చూడాలని నిశ్చయించాను కాని ఆవిడ ఎడమొహం పెడమొహంగా తిరుగుతోంది నాతో సమావేశం కాకుండా ఉండాలని ప్రయత్నిస్తోంది నేనుఎప్పుడైనా పిలిచినా, ఏమైనా అడిగినా "ఇప్పుడు గాదు, తీరుబడిలేదు, సారీ" అంటోంది నా భార్య ప్రవర్తనలో, కళ్ళల్లో, చేష్టల్లో మార్పు కనిపిస్తోంది చూడమని నా మనస్సు నాకు బోధిస్తోంది. ఇలా వుండగా నాకో వుత్తరం వచ్చింది నా శ్రేయోభిలాషి వ్రాసింది పేరులేదు, ఊరులేదు అందులో విషయాలు ఏమిటంటే - "మీరు బహు ఉత్తములు విద్యావతిని వివాహమాడి ధన్యులైనారు ఇంతవరకూ కళంకం లేకుండా మీ సంసారం జరిగింది మీ మేలుకోరినవాడను కాబట్టి చెప్పుచున్నాను మీ భార్య ప్రవర్తన అనుమానాస్పదంగా ఉన్నది నిరంతరము చాటూ మాటూ లేకుండా ఒక జంటిల్‌మానుతో తిరగడం మా బోటివారికి చాలా విచారంగా వుంది మీరు తగు శ్రద్ధ వహించాలి సంసారులము గదా ! వ్యవహారము ఫాక్తుపరుచుకోవాలిగాని పాడుచేసుకోకూడదు సెలవు

ఇంకేముంది అనుకున్నంతా జరిగింది ఏమిటి చెయ్యడమిప్పుడు వ్యవహారం ఫాక్తుపరుచుకోవాలిట! అలాగే వుంటుంది పరాయివాళ్ళకి తనదాకా వచ్చేదాకా తెలియదు మతిపోయింది ఉత్తరం మళ్ళీ చదివాను ఆ దస్తూరీ ఏదో ఎరిగిఉన్నట్లే ఉంది ఎవరో నా మిత్రులో, బంధువులో వ్రాసి ఉంటారు ఉత్తరం జాగ్రత్త చేశాను. కర్తవ్యమేమిటో మాత్రం తెలియడం లేదు డైవోర్సు బిల్లైనా పెట్టారుగారు

కార్పణ్యంతో తిరుగుతున్నాను నాభార్య ముఖంకేసైనా చూడ్డంలేదు మాయిద్దరికీ కొన్నాళ్ళు మాటలు కూడా లేకపోయాయి ఏమి చెయ్యాలో నిర్ణయించి తరువాత దండిద్దామని ఆలోచిస్తున్నాను డిశంబరు నెల గడిచిపోతోంది

ఒకనాడు నా భార్య గంతులతో, నవ్వులతో ఒక పెద్ద తోలు ట్రంకు పట్టుకొని నా దగ్గర కొచ్చింది నేనామె ముఖం చూడలేదు.

"ఏంచేస్తున్నారు, మైడియర్" అంది నాకు వళ్ళు మండుతోంది అసహ్యంగా నా భార్య మొహం కేసి చూచాను ఇంతాచేసి సిగ్గూ బిడియం లేకుండా యీ విధంగా నా దగ్గరకొస్తుందా! కానీ

"కోపం వచ్చిందా మైలవ్" అన్నది నాకు అసహ్యం, కోపం ఎక్కువౌతున్నాయి తొందరపడి ఏంచేసిపోతానో అని నాలో నాకే భయంగా వుంది.

"మైడియర్ నన్ను క్షమించరూ?"

"నీ ప్రవర్తన ఏమీ బాగాలేదు పిల్లల గన్నదానవు - బుద్ధిలేదూ? సిగ్గూ బిడియం లేదూ? ఏ మొహం పెట్టుకు నా దగ్గిరకొచ్చావు - అవతలికి ఫో" అన్నాను

ఈ మాటలు వినడంతోనే మానమున్న భార్య అయితే బయటికి వెళ్ళిపోయి గదిలో కూర్చుని ఏడుస్తుంది నాభార్య అప్పుడప్పుడు నేను తిట్టినప్పుడు - ఆ విధంగానే చేసేది ఇప్పుడు కూడా అలాగే

చేస్తుందనుకొన్నాను చెయ్యలేదు సరిగదా విరగబడి నవ్వడం మొదలుపెట్టింది చప్పట్లు కొట్టి గిర్రున తిరుగుతూ నవ్వుతోంది ఈ ప్రవర్తన నా కర్ధం కాలేదు. నవ్వి నవ్వి నా వళ్ళోకి వచ్చి కూచుని నా చేతులు గట్టిగా పట్టుకొంది చేతులు వదిలించుకొని కిందకు తోసెయ్యాలనుకున్నాను నిదానించాను అప్పుడంది నా భార్య "మీ మనస్సుకు చాలా నొప్పి గలిగించాను. నాకు తెలుసు, రెండు నెలలపాటు మిమ్మల్ని బాధపెట్టాను, నేనెరుగుదును నేను మాత్రం బాధపడడం లేదా ఏమిటి? పైకి నవ్వుతున్నానుగాని మనస్సులో ఎంత ఏడుస్తున్నాను నన్ను క్షమించరూ!" అంటూ నా చేతులు వదిలిపెట్టి కళ్లమీద చేతులు పెట్టుకొని ఏడవడం మొదలెట్టింది నాకు జాలివేసింది. కాని మనస్సు కఠినంగానే ఉండమంటోంది నా భార్య చీరకొంగుతో దాని కన్నీళ్లు తుడిచివేసి, కళ్లముందర నుంచి చేతులు తీసి "ఏమిటిదంతా" అన్నాను.

"నన్ను క్షమించండి చెయ్యక తప్పిందికాదు" అన్నది

"సరే నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు" అనిపించింది నా మనస్సు

నాభార్య మాట్లాడలేదు

"ఎవరా రెణ్ణెల్ల క్రితం మనింటికి వచ్చిన పెద్దమనిషి? వాడిని నాకెందుకు యిన్‌ట్రడ్యూసు చేశావుకావు? వాడితో నవ్వులు నవ్వుకొంటూ పోక నా దగ్గరకెందుకొచ్చావు? వాడితో సముద్రపొడ్డున షికార్లు కొట్టుకో నీ యిష్టం వచ్చినట్లు! ఆలూమగళ్లు దెబ్బలాడుకొంటే అదే సమయమని మగాణ్ణి వెంటవేసుకు వెళ్లు నా దగ్గరకెందుకు వచ్చావు?" అన్నాను కోపధోరణితో

"వినండి. వినండి అంతా చెబుతాను తొందరపడకండి" అన్నది నా భార్య. నా వళ్ళోనుంచి లేవనెత్తి పక్క కుర్చీలో కూచోబెట్టి చెప్పమన్నాను. నా భార్య యీవిధంగా చెప్పింది.

"మా క్లబ్బులో ఒకమ్మాయి ఉంది. ఆవిడకు పెళ్లయి ఇంకా సంవత్సరమేనా దాటలేదు. వట్టి తెలివి తక్కువపిల్ల ఆమొగుడేనా సర్దుకుపోయేవాడేమో ననుకొంటే అతడు కోపదారి అందువల్ల వాళ్ళిద్దరికీ అన్యోన్యం చెడింది. ఇద్దరూ విడిపోయి ఒక నెల్లాళ్ళు కాలక్షేపం చేశారు. ఎన్నాళ్ళు అలాగ ఉండగలరు? తానని చెప్పి ఆ పిల్ల మొగుణ్ణిరమ్మనదు. అంత అభిమానం ఆవిడకి. అతగాడు మగాడు గదా సర్దుకోగూడదా అంటే అతనికీ తగని గర్వం. కాబట్టి మధ్యవర్తులద్వారా వాళ్ళ వ్యవహారం ఫొక్కు పరచవలసి వచ్చింది.

మా క్లబ్బులో ఒక నియమమేమిటంటే - మాలో ఎవరికి ఏ ఆపద వచ్చినా క్లబ్బు మెంబర్లు కలుగజేసుకొని సహాయం చేస్తారు ఈ విషయమై ఒక సభచేసి ఏకగ్రీవంగా నన్ను మధ్యవర్తిత్వం నడిపించమన్నారు. క్లబ్ తీర్మానానికి అనుగుణంగా నేనతన్ని పిలిపించి నెల్లాళ్ళు అతనితో పోరి భార్యతో సమాధానపడడానికి వప్పించాను

ఆ పిల్ల దగ్గరికి వెళ్లి చెప్పవలసిన విధంగా చెప్పి సమాధానపరిచాను. వాళ్ళిద్దరూ కలుసుకొని రెండురోజులే అయింది.

"అయితే అతన్ని మనింటికి తీసుకువచ్చి ఆ విరగబడి నవ్వులెందుకు? నా మొహం ఎదటే అంత అల్లరెందుకు? బీచి షికార్లెందుకూ?"

"బీచి షికారు అతనూ, నేనూ, అతని భార్యా వెళ్ళాము అప్పటికింకా వాళ్ళు సుముఖులు కాలేదు వాళ్ళిద్దరినీ చెరోవేపునా పెట్టుకొని ఆమాట ఈ మాట చెపుతూ నవ్విస్తూండేదాన్ని, క్రమక్రమంగా నన్ను వదిలి వాళ్ళిద్దరూ చెట్టాపట్టాలు వేసుకొని కబుర్లలోకి దిగేదాకాను "

"మరి"

"అతనితో అలాగ విరగబడి మీ మొహం ముందు నవ్వడానికి కారణం లేకపోలేదు" అన్నది నాభార్య

దాచిన ఉత్తరం తీసుకువచ్చి నా భార్య మీద పడవేసి "ఇదేమిటో చూచావా" అన్నాను

ఉత్తరం చేత్తో పుచ్చుకు చూచి నా భార్య మళ్ళీ నవ్వడం మొదలెట్టింది

"ఎందుకానవ్వు?" అన్నాను.

"ఎవరు వ్రాశారో ఆ వుత్తరం చూశారా?" అంది

"ఎవరో శ్రేయోభిలాషిట!"

"ఆదస్తూరీ ఎవరిదో?" అన్నది

"ఏమో నాకేం తెలుసు?" అన్నాను

"మళ్ళీ ఇంకోమాటు నిదానించి చూడండి" అని నా మీదకు ఉత్తరం విసిరింది

జాగ్రత్తగా దస్తూరి పరీక్షించి, "ఎవరిదంటావు?" అన్నాను

"ఎవరిదా? ఇంకోమాటు చూడండి" అన్నది

"ఎంతమోసం! నీదే ఈ దస్తూరీ! కళ్ళు కప్పుకుపోయేయి నాకు".

"ఇప్పుడు తెలిసిందా?" అన్నది

"ఏమిటి తెలియడం" అన్నాను.

"ఆ విరగబడి నవ్వడమూ, ఈ ఉత్తరమూ నామీద మీకు అనుమానం కలగడానికే!"

"ఎందుకు అనుమానం కలిగించుకొన్నావు?"

"ఈ యేటి క్లబ్బు బహుమానం కోసం "

"బహుమానం ఇయ్యడానికి ఏమి చెయ్యాలన్నారేమిటి?"

"శీలానికి భంగం రాకుండా ఎవరైతే తమ భర్తలకు తమ గుణాన్ని గురించి అనుమానం కలిగిస్తారో వారికి బహుమానం "

"నీవొక్కర్తెవేనా ఏమిటి, మీ క్లబ్బుకంతకి అంత ప్రయోజకురాలివి మైలిటిల్ స్కాండ్రల్?"

"అందరికన్న మార్కులు నాకు ఎక్కువ వచ్చినవి కాబట్టి నాకు బహుమానం వచ్చింది "

"ఎలాగ ఆ మార్కులు నిర్ణయించారు?"

"జడ్జీలు గూఢంగా మెంబర్ల తాలూకు భర్తల చర్యలు ఈ రెండునెలల బట్టి కనిపెడుతున్నారు మీ బిక్కమొహం, మీరు క్లబ్బు చుట్టూ తిరగడం, నాతో మాట్లాడకపోడం - ఇవన్నీ చూచి నేనే నెగ్గానని నిర్ణయించారు "

"ఇలాంటి పనులు చెయ్యడం ప్రమాదం కాదూ? ఎటునుంచి ఎటువస్తుందో? సంసారాలు చెడిపోవూ "

"ఆ ధైర్యమున్నవాళ్ళే యిందులో ప్రవేశించారు. ఈ మాత్రం యడ్వెంచర్ సాహసం ఆడవాళ్ళకు లేకపోతే ఎందుకు పనికి వస్తారు?"

ఈ ప్రశ్నకింక సమాధానం లేదు నా మనస్సులో బెంగ తీరింది కుదుటబడ్డాను నిట్టూర్పు విడిచాను

నాభార్య కాఫీ, బిస్కత్తులూ, చోకలేట్లూ తెచ్చి బల్ల మీద పెట్టింది ఇద్దరమూ ఆరగిస్తూ సరదాగా ప్రసంగించుకొన్నాము

"నువ్వు మీ క్లబ్బుకంతటికీ ప్రయోజకురాలిలా గున్నావే! క్రిందటి ఏటి బహుమానం నీదే, ఈ యేటిదీ నీదే" అన్నాను

"షియర్ లక్, మీ సహాయం లేకపోతే నాకీ బహుమతులు వచ్చేవా చెప్పండి మరి "

"అల్లరిపిల్లా! అయితే నీతో కూడా ఈ యేడు ఈ పందెంలో ప్రవేశించిన వాళ్ళ సంగతి చెప్పావు కావు" అన్నాను.

"చెప్పనా, -- ఒకావిడ తానే తనకు ఎవరో పురుషుడు ప్రేమలేఖ వ్రాసినట్లు వ్రాసుకొని ఆ కవరు తన చేతిసంచీలో పెట్టి భర్తతో మాట్లాడడానికి వెళ్ళింది మాటల మధ్య కవరు కింద జారవిడిచి వెళ్ళిపోయింది భర్త ఆ కవరు తీసి చదువుకొన్నాడు కొంతసేపైన తరువాత భర్త దగ్గరికి వచ్చి బిక్కమొహంతో నా ఉత్తరం పడిపోయిందంది ఆ వుత్తరం తనకు దొరికిందనీ, తాను చదివేననీ భర్త చెప్పాడు ఆవిడ భయం నటించి గడ గడ వణికింది భర్త ఆవిడతో అన్నాట్ట, "ఇదివరలో ఎన్ని ఉత్తరాలు వచ్చాయి నీకు?"

భయపడుతూ, "ఇదే మొదటిది క్షమించండి" అందిట

"దీనికి సమాధానం రాశావా" అని అడిగేట్ట.

సందేహిస్తూ నెమ్మదిగా 'రాశా'నందిట

"రాశావా? ఎలా రాశావు మైడియర్ వైఫీ? దీనిలో అడ్రెసు లేదే!"

ఆవిడ తెల్లబోయిందట

"మళ్ళీ మీ క్లబ్బు వాళ్ళు మీచేత కోతిచేష్టలు చేయిస్తున్నారా యేమిటి?"

భర్తకు అనుమానం కలిగించలేక పోబట్టి ఆవిడకు బహుమానం లేదు

"ఇంకో ఆవిడుంది మాక్లబ్బులో ఆవిడకు సిగరెట్టు అలవాటు లేదు ఈ సంగతి భర్తకు

తెలుసును ఆమె భర్తకూ సిగరెట్టు అలవాటు లేదు ఒకనాడావిడ భర్త వచ్చే వేళకు రెండు ప్యాకెట్ల సిగరెట్లు కుంపటిలో వేసి ఆ పొగ యిల్లంతా చుట్టివేసుకొనేలా చేసింది ఇంతట్లోకే భర్త వచ్చి తలుపు తట్టాడు పది నిమిషాలదాకా తలుపుతియ్యలేదు ఈ పాటికి అనుమానం కలిగిఉంటుంది గదా అనుకొని తలుపుతీసి చీరా, పైటా సవరించుకోవడం మొదలెట్టింది భర్త లోపలికి వచ్చాడు సిగరెట్టు వాసన పీల్చాడు భార్యతో అన్నాడు గదా, "చెప్పావు కావు, క్లబ్బులో మెంబర్లంతా సిగరెట్లు కాల్చాలని నిబంధన వచ్చిందా ఏమిటి? అంత సిగ్గూ, దాపరికం ఎందుకు? చంపేశావే వీధులో నిలబెట్టి! ఈ మాత్రం కార్యానికి భయమెందుకు? నీ యిష్టమొచ్చినన్ని సిగరెట్లు కాల్చుకో నేనేమీ అనను రేపునుంచి 'నేవీకట్' సిగరెట్లు ఒక డబ్బా తెస్తానుండు " భర్తకు అనుమానం రాలేదు సరిగదా సిగరెట్లు అలవాటు అంటుకొంటుందని ఆవిడ భర్తతో నిజం చెప్పింది "నిన్నెప్పుడేనా అనుమానిస్తానా?" అని అన్నాడా భర్త.

"వింటున్నారా" అంది నా భార్య

"వింటున్నా" అన్నాను.

"అనుమానించేవాడు గొప్పవాడా? అనుమానించనివాడా?"

"నన్నేం చంపుతావు కానిద్దూ."

"ఆల్రైట్, డియర్ ---"

"ఇంకో ఆవిడ భర్త వీధిలో మొహం కడుక్కొంటూ వుంటే తాను ఆ సమయానికి వీధిలోకి వచ్చి యెదుటి యింటి పెద్దమనిషిని నిదానించి చూడ్డం మొదలుపెట్టింది పదిహేను రోజులీలాగ అయ్యేసరికి ఆ పెద్దమనిషి ప్రతిరోజూ వీళ్ళింటికి కాఫీకి తయారయ్యేవాడు. భర్త యెదుటే అతన్నెంతో ఆదరించి కాఫీ ఇచ్చేది. ఫలహారాలు పెట్టేది అతడు యింటికి వస్తే తాను ఎదురుగా వెళ్ళి కుశల ప్రశ్నలడిగేది. వెళ్ళిపోతూంటే షేక్‌హేండు చేసేది భర్తకీ ప్రవర్తనవల్ల ఆవిడ మీద ఎటువంటి అనుమానమూ కలుగలేదు. క్లబ్బు ఆచారాలు కొత్తగా నేర్చింది కాబోలు అనుకొన్నాడు. కాని ఒక ప్రమాదం వచ్చింది. అప్పటినుంచీ ఆ పెద్దమనిషి వదుల్చుకోవాలన్నా వదలకుండా పట్టుకొన్నాడు. చివరికి వాడిని వదిలించుకోవడం బ్రహ్మాండం అయింది."

"ఎలాగ వదిలించుకొన్నారు?" అన్నాను

"ఎలాగా? వాణ్ణి ఒక కూలివాడికిందకట్టి. ఆవిడ ఏమిచెపితే ఆ పనులు చేసేవాడు రోజూ పోష్టులో ఉత్తరాలు వెయ్యడం వాడే బజారునుంచి కూరలు తేవడం వాడే, తోటలో చెట్లకు గొప్పులు తవ్వడం , నీళ్ళుపొయ్యడం వాడే, పిల్లల్ని ఎత్తుకొని ఆడించడం వాడే. ఇలాగ పది పదిహేను రోజులు గడిపి విసిగి లేచిపోయాడు అప్పుడు ఆవిడ భర్త ఆవిడతో అన్నాడు గదా! "లేచిపోయాడేం ఆ పెద్ద మనిషి? జీతం బత్తెం లేని కూలివాణ్ణి సంపాదించావు గదా అని సంతోషిస్తూంటే "

ఆవిడకు బహుమానం వచ్చే విధం లేదు గదా ఇంక మీరు నన్ను అనూనించారు.

అనుమానిస్తే అనుమానించారు లెండి ఇప్పుడు బహుమానం వచ్చింది కాబట్టి బెంగలేదు. కాని యిక ముందెప్పుడూ నన్ననుమానించరుగదా అని మీసం పట్టుకోబోతూంటే అన్నాను గదా - "అయితే హనీ, నీ బహుమానం ఏమిటో చూపావు కావేమి?"

"ఇందాకటినుంచీ మీకోసం ఎవురుచూస్తోంది - అదిగో ఆ ట్రంకు"

"ఏమిటి? ఆ ట్రంకా? దాల్లో ఏమైనా ఉందా? వుత్త ట్రంకేనా?"

"తీసి చూడండి"

ట్రంకు తాళం తీసి మూత ఎత్తి చూశాను అందులో ఒక పట్టుచీరా, ఒక డజను బ్లౌజులూ, ఒక డజను పెసరీలూ ఉన్నాయి

"ఇవి ఆడవాళ్ళ సరుకు ముట్టుకోకూడదు కాబోలు" అన్నాను

"కూడకపోతే మాంతారా? మీరు ముట్టుకోకుండానే జరుగుతుందా?" అంది

"అయినా నాకెందుకు? నీ బహుమానాల సంగతి" అన్నాను

"మీకు మాత్రంగా కేమి? మనం పంచుకొందాం వాటిని" అంది

"ఎవరు పంపకం వెయ్యడం" అన్నాను

"నే వేతునా" అని చీరా, బ్లౌజులూ నా వళ్ళోపెట్టి పారిపోబోయింది పట్టుకొని చెవులో చెప్పాను గదా

"అవి మాత్రం మిగుల్చుకొంటావెందుకు - ఆ పెసరీలు అవీ నాకే యియ్యి"

నా భార్య నవ్వుతూ నన్ను లెంపమీద వాయించి చీరా, బ్లౌజులూ తీసుకుపోయి బీరువాలో పెట్టుకొంది

ఈ ట్రంకు కూడా తీసికెళ్ళు" అన్నాను

'మైడియర్ హబ్బీ! ఆ ట్రంకు మీది"

'థాంక్సు మై లిటిల్ మౌసీ"



# కథలు

1. దాసరి పాట

2. ఊరిపేరు

3. కిష్కింధలో కోతి

4. అభిప్రాయభేదం

5. భార్యమృతి

6. గోదావరి నవ్వింది

7. పెద్దమేడ

8. చెంచురాణి

9. సుగాలీదంపతులు

# దాసరి పాట

అతడు తెలగదాసరి అతని నివాసస్థలము తెలుగుదేశము అతని పరివారము, చుట్టములు, అతని భార్యే అతని ఆస్తి ఒక తాంబ్రా, ఒక గుమిసీ, ఒక జత అంజెలులు

అతని దృష్టి యెప్పుడూ పదములలో దాగియున్న తెలుగు వీరుల మీదనే అతని ఆశయము ఎప్పుడూ తెలుగు దేహములను పదములు పాడి పులకలెత్తించడమే

అతడు చూడని తెలుగు గ్రామము లేదు అతడు మెట్టని తెలుగు దేశము లేదు అతని పాటలు వినని తెలుగువారు లేరు - కొందరు నవనాగరీకులు తప్ప

మరాఠీ మనుష్యులవలె యెర్రని తలపాగా పెట్టుకొని చిరిగిపోయిన పాతకోటు వేసుకొని పాత జరీకండువా వల్లెవాటుగా ధరించి పంచె యెగగట్టి బుజము మీది తాంబ్రా వేళ్లతో మీటుతూ మెళ్లో పూసలు కదిలేటట్టు చిందులు తొక్కుతూ అతడు మరాఠీ కథ పదము చెప్పేటప్పుడు వీరరసము ఉట్టిపడేది అతని బొమముడికి పెట్టుకున్న నామము పెచ్చులు పెచ్చులుగా ఊడిపోయేది బొటనవేలుకి తర్జనకీ తగిలించుకొన్న ఒంజెళ్లు/ ఖంగున మోగేవి పక్కనే కూర్చున్న అతని భార్య గుమిసి మీద మోకాలు పెట్టి భర్త ముఖము మీదనే వీక్షణములుంచి గుమిసి వాయించునపుడు భర్త చెప్పు పదమునకు మరింత గాంభీర్యము వచ్చేది జనులు ముగ్ధులైపోయేవారు

అతనికి ఇరవయ్యోయేట పెళ్లైనది పెళ్లైనది మొదలు నేటి వరకూ అతని భార్య అతని వద్దనే ఉన్నది పెండ్లినాటి కామెకు పద్ధాలు గోయేడు ఆమె తండ్రికూడా ఒక తెలగదాసరే కాని అతడు అకాలమృత్యువువాత పడుట చేత ఆమె తల్లివద్దనే ఉండి చాలా దరిద్రమనుభవించింది కాని కొన్ని పదములు నేర్చుకుంది తల్లిదగ్గిరనున్న కాలములో ఆమెకు తల్లే సర్వమున్నూ, పెళ్లిచేసుకున్న తర్వాత ఆమెకు భర్తే సర్వమూ భర్త దగ్గిర ఆమె గుమిసి వాయించడం నేర్చుకుంది భర్త దగ్గిర ఆమె కొత్త పదము లనేకములు నేర్చుకొన్నది భర్త పాడేటప్పుడు అతని పాటకు తాను ఊతపదమును కలిపేది వారి హృదయాలకు అద్వితీయస్థితి లేనట్టే వారి పాటకు కూడా లేదు

పదములోని వీరరసమును భర్త వెలువరించేటప్పుడు ఆమె హృదయము వీర రసముతో ఉప్పొంగేది

కరుణారసము తన పదమునకు భర్త ఒప్పించేటప్పుడు ఆమె కళ్లవెంబడి వచ్చిన కన్నీళ్లు గుమిసిని తడిపేవి 'తందానతాన' అనే ఊతపదము గద్గదమయ్యేది

భర్త చమత్కారము చూపి చిరునవ్వు నవ్వినప్పుడు ఆమె గుమిసి దెబ్బలలో నవ్వు వినిపించేది

కొంటితనముతో అతడు మీసము మీద చెయ్యివేసి నాయికా నాయకుల శృంగారమును వర్ణించేటప్పుడు ఆమె తలవంచి గుమిసి తప్పు వాయించేది

భేదములేని వారి ప్రేమకు కౌటిల్య మెరుగనివారి ప్రేమకు, దేహములు వేరైనను వారి ఆత్మలను

ఒక్కటిగ చేసి వారి ప్రేమకు ఫలముగా వారికి ఒక కొడుకు పుట్టాడు వానికి ఇప్పుడు ఐదోయేడు

చదువుకున్న వాడంటే ఎవరు? వ్రాలు చేయగలవాడేనా? వ్రాలు చేయలేని భట్రాజులు, దాసరులు, జంగములు, సాతానులు, వీధిభాగవతులు - వీరిమాటేమిటి? భారత భాగవతములను, మహావీరుల దేశీయ కథలను ఇతరులకు బోధించగల వీరు చేవ్రాలు చేయలేని వారనే కారణం చేత చదువురాని వారని త్రోసివేయవచ్చునా? దేశములో కొందరు విద్యను పోషించవలెను కొందరు వృత్తులను పోషించేవారికి చదువులలో నిగ్గు తెలియాలి దాని కోసముసంఘములో కొందరు ఏర్పాటు కావాలి భట్రాజులు, దాసరులు మున్నగువారు ఇట్టివారు వీరు స్వర్వసౌఖ్యములను పరిత్యజించి భిక్షుకవృత్తి అవలంబించేరు పూర్వము ముఖ్యముగా మత ప్రచారముకొరకై వారూరూరు తిరుగుతూ భిక్షుకులై దేశములోని అజ్ఞానమును ఒక విధముగా పోగొట్టుచ్చున్నారు వీరిని చూచి నేటివారు 'కూలిపని చేసుకోకూడదా?' అనడం ఆచారమైనది వంశపారంపర్యంగా వస్తూన్న ఆచారాలని వొక్కమారు వదలిపెట్టడం కష్టం అయినా వారికి భైక్ష్యవృత్తి నీచము కాదు వారి దేవుడే వొక బిక్షుకుడు కాబట్టి

ఈ కాలపు ముద్రాశాలలకన్న వీరే సంఘమునకు ఎక్కువ ఉపయోగకరంగా ఉండేవారు అచ్చు యంత్రము చదువు వచ్చినవారికే, వీరు అందరికీ ఉపకారము చేస్తున్నారు

మనదాసరి చాలా పాటలు పాడగలడు బొబ్బిలి కథ, తిమ్మరాజు కథ, కోడి పుంజుల కథ, సర్వాయపాపడు కథ, కామమ్మ కథ, కాంభోజ రాజు కథ, చెంచు కథ మొదలైన కథలనేకములు రసవత్తముగా వినిపించగలడు ఈ పదములన్నీ ఇతని భార్యకు కూడా వచ్చును వీరి అయిదేండ్ల కొడుకుకు అప్పుడే అయిదారు కథలు ఒక మోస్తరుగా పాడటము వచ్చును

ఇంతవరకు వీర్రిని భగవంతుడు ఆదరముతోనే చూచేడు ఎక్కడికి వెళ్లినా వీరికి కడుపునిండా తిండి దొరికేది, తగిన బహుమానము దొరికేది ఈ దాసరి దంపతులకు మొదట వొకరి మీద ఒకరికి ఎంత అను రాగముండేదో వారి పాటల మీద కూడా వారికి అంత అనురాగమే ఉండేది ఇప్పుడు వారిద్దరూ వారి పాటల కన్న వారి కొడుకుని ఎక్కువ అనురాగముతో చూచుకొంటున్నారు కొడుకును వొకరువిడిచి ఒకరు ఎత్తు కొనేవారే గాని నడిపించేవారు గారు తమకు ఒక ముద్ద తక్కువ చేసుకొనేవారే గాని కొడుకు కడుపు నిండించే వారు అసాధ్యమైన కోరికలు చెల్లించి ఆ పూటకి ఉపవాసము చేయడము కూడా అప్పుడప్పుడు కద్దు

ఒకనాడు ఒక గ్రామములో దాసరి దంపతులు కోడిపుంజుల కథ చెప్పుచున్నారు దాసరి కూర్చుని ఉన్నాడు అతని ప్రక్కనే అతని భార్య వాద్యము వాయించుచున్నది ఆమె వొడిలో వారి పుత్రుడు పడుకున్నాడు దాసరి చూపులు అతని మీదనే తరుచుగా పడుచున్నవి ఆమె పిల్లవాణ్ణిఉండుండి అక్కున చేర్చుకొనుచూ ఊతపదము పలకడం మరిచిపోయేది కోడి పుంజుల యుద్ధము వర్ణించేటప్పుడు చూపే ఉత్సాహము దాసరి ఆ రోజున చూపలేకపోయాడు రాజపుత్రుల పౌరుష వాక్యములు ఆనాడు నీరసములైనవి ప్రజలందరు అతని పాటను విని పెదవి విరుచుకున్నారు కొందరు ముసలివాడైనాడితడు, 'ఇక పదములు చెప్పలే'డన్నారు గర్వము బలిసినదన్నారు మరికొందరు ఇతన్ని చూచి

ఆ రోజున వారికి రావలసినంత ఆదాయము రాలేదు

ఆ రోజుకు సరిపడేటంత ఆదాయమైనా రాలేదు

రాత్రి మూడు గంటలైనది కథ ముగిసినది ప్రజలందరు ఇండ్లకు వెళ్లిరి దాసరి తన కొడుకు వొంటి మీద చెయ్యివేసి చూచేడు వొళ్లు కాలిపోతూంది దాసరి భార్య తన కొడుకు కాలికి ఉన్న కట్టువిప్పినది దాసరి ఏదో పసరుముద్ద కాలిమీది గాయము మీద వేసినాడు ఆమె మళ్ళీ కట్టుకట్టి దాసరి తన తలపాగా మెత్తగా ఉండేటందుకు పక్కవేసేడు దాని మీద తన కోటు పరిచేడు దాసరి భార్య తనకొంగు ఆ ప్రక్కమీద వేసి దానిమీద బాలుని పడుకోబెట్టి అతని పక్కనే తాను పడుకొన్నది ఈవలిపక్క దాసరి రాళ్లమీద పడుకున్నాడు తూర్పున ఉదయించిన చంద్రవంక మేలుకొనియున్న దంపతుల కన్నీటి బిందువులలో ప్రకాశించింది ఊరుబయట చెట్టు క్రింద పడుక్కొని ఉన్న దాసరి కుటుంబమునకు మరునాడు పాటపాడితేనే గాని పొట్టనిండదు

రాత్రి యెనిమిది గంటలైంది రెండు కిర్సనాలు దీపాలు ఊరి చివరి చెట్టుక్రింద వెలుగుచున్నవి, చుట్టూ ప్రజలు కూర్చుని ఉన్నారు దాసరి ఒక బుజము మీద తాంబ్రా మీటుతున్నాడు బొబ్బిలికథ చెప్పుతున్నాడు కూర్చునే చెప్పుతున్నాడు యధాప్రకారము అతని భార్య అతని ప్రక్కనే కూర్చున్నది బుజము మీది వారి కొడుకు చిక్కి శల్యమైయున్నాడు కాలిమీది కట్టు మరింత పెద్దదిగా ఉన్నది ఉండుండి అతడు తలయెత్తి తండ్రికేసి, తల్లికేసి చూచి మళ్లీ బుజము మీద తలవాల్చి కూర్చుచున్నాడు ఆ రోజున జ్వరము తగ్గినదని తల్లికి ఆశ కల్గినది ఆ రోజున జ్వరము తగ్గినదని తండ్రికి బెంగగా ఉంది బొబ్బిలి కథ క్రమక్రముగా రక్తి కట్టుచున్నదని ప్రజలనుకొనుచున్నారు బొబ్బిలి కోట ముట్టడించడానికి సైన్యములు పూనుకొనుచున్నవి యుద్ధమును వర్ణించి దాసరి ప్రజల మెప్పును పొందేడు రంగారావు వీరకృత్యములు ప్రజలలో ఆవేశమును కలిగించినవి తాంబ్రా తీగెలు కదలిపోవుచున్నవి గుమిసి ఖంగుమనుచున్నది దాసరి యెలుగెత్తి రంగరాయ మరణమును విలపించాడు ప్రజలకు కళ్ల నీళ్లు గిర్రున తిరిగినవి తల్లి బుజము మీదనున్న కొడుకు వొంటిమీద చెయ్యివేసి చూచినది ఒళ్లు చల్లబడుచున్నది దాసరి ముఖము కేసి చూచినది అతడు విజయరామరాజు క్రౌర్యమును వర్ణిస్తున్నాడు కొడుకు హీన స్వరముతో 'అయ్యా' అన్నాడు ఒకచేతిలో సానురాగముగా కొడుకును నిమిరి అ తడు కథ సాగించాడు

తాండ్ర పాపయ్యకు బొబ్బిలి వీరుల మరణవార్త తెలిసినది రౌద్రాకారుడై వచ్చి అతడు విజయరామరాజును చంపిన వార్త దాసరి పాడి ప్రజలకు తెలియజెప్పాడు ప్రజలు తలవూపినారు కాని అనుకొన్నంత రసవత్తరంగా పాపయ్య శౌర్యమును వర్ణించలేకపోయినాడేమి చెప్మా అనుకున్నారు ప్రజలు

తల్లి తన కొడుకు వంటిమీద మళ్లీ చెయ్యివేసి చూసింది దాసరి తాంబ్రా కిందపెట్టి రెండుచేతులతోను కొడుకు నెత్తుకొని రెండో బుజము మీద వేసుకున్నాడు వేసుకొని బిక్కమొగముతో భార్యవంక చూచేడు

పాపయ్య బంధువుల మరణమునకై ఎన్నడూ ఎప్పుడూ విలపించనట్లు ఆ రోజున విలపించేడు దాసరి పాడిన పాట ఇంత కరుణామయుముగా ఎప్పుడూ లేదని అనుకొన్నారు ప్రజలు పాపయ్యతో పాటు దాసరితో పాటు ప్రజలు కూడా కన్నీళ్ళు విడిచి విలపించారు

ఆనాడాదాసరి ఆలపించిన విలాపగీతికకు దాసరి హృదయ తంత్రులే తంబురాతీగలై శ్రుతికలిపినవి

ఆనాడాదాసరి ఆలపించిన విలాపగీతికకు ఆ తల్లితన హృదయము మీద చేతులతో గుమిసి వాయించింది

# ఊరిపేరు

ఆ రాజ్యమును పాలిస్తున్న మహారాజు కీర్తి దేశదేశములా వ్యాపించినది ఎక్కడలేని పండితులూ, కవులూ, యాచకులూ, రాయబారులూ ఆ మహారాజు దర్శనం కోసము వస్తూపోతూ ఉండేవారు కవీ మహారాజును భోజుడన్నారు యాచకులీ మహారాజును కర్ణుడన్నారు పరరాజులీ మహారాజును ధర్మరాజన్నారు ప్రజలందరూ ఈ మహారాజును భగవంతుడన్నారు

ఈ మహారాజుగారి అసలు పేరు శ్రీ భావరాజుగారు గద్దెనెక్కి కొద్ది సంవత్సరములే అయినప్పటికీ ప్రజానురాగముగలిగి ప్రజాహిత కార్యములు చేస్తూ ఉండేవాడు

సమీప రాజ్యములోనున్న ప్రజలు కాటకముచేత మూడు సంవత్సరములబట్టి బాధపడుతూ ఉన్నారు అతివృష్టీ అనావృష్టీ కారణములుగా పంటలు పండక పోవడమూ ఒక కారణము కాటకముతో పాటు అంటువ్యాధులు కూడా ప్రవేశించినవి

ఇంక రాజ్యములో ఉండడము దుస్సాధ్యమని చెప్పి అక్కడి బ్రాహ్మణులు కొందరు మూటాముల్లె కట్టుకొని, భూములూ ఇళ్లూ వదలిపెట్టి పశువులను తోలుకొని భావరాజుగారి రాజ్యమునకు వచ్చినారు వచ్చి మహారాజుగారి దర్శనార్థమై వెళ్లినారు

"మహారాజా! మా రాజ్యములో కాటకములవల్లా, వ్యాధులవల్లా నిలువ నీడలేక

మీ అండ చేరుతున్నాము తృణకాష్ఠ జలసమృద్ధిగల మీ రాజ్యములో తలదాచుకోవడానికి చోటు దయచేయించాలి" అన్నారు

ఆ మహారాజుగారు మాబాగన్నారు ఫలవంతమైన భూముల మధ్య గృహములు నిర్మించి ఆ గృహములలో ఈ బ్రాహ్మణులను కాపురముండమన్నారు భావరాజుగారు ఒక్కొక్క కుటుంబమునకు సరి పోయే గ్రాసము నీయగల భూములను వారి వారికి పంచి పెట్టి వాటిపై పన్నులను స్వల్పముగా విధించినారు

మహారాజుగారిపై కృతజ్ఞత కొద్దీ ఆ బ్రాహ్మణులందరూ అగ్రహారమునకు భావాపురమని పేరు పెట్టినారు కొన్ని సంవత్సరాలు ఈ మోస్తరుగా జరిగినవి బ్రాహ్మణులందరూ కలిసి మహారాజుగారి దర్శనార్థమై వెళ్లినారు

"ఏమి వచ్చారు భూదేవులు" అన్నారు మహారాజుగారు

"మహాప్రభో! చతుర్వర్ణములవారూ లేకపోవడం వల్ల మా భావాపురం లోపసహితముగా వుండుకుంటున్నది అన్ని వృత్తులవారూ మా అగ్రహారమున లేకపోతే మేము మాత్రం బ్రతకడం ఎలాగ" అన్నారు

మహారాజు గారు సరే అన్నారు భావాపురం కొంతకాలమునకు అన్ని జాతుల వారికి ఆకరమై సిరిసంపదలతో తులతూగుతూ వున్నది మరికొన్ని సంవత్సరములు జరిగినవి భావాపురవాసులందరూ కలిసి మళ్లీ మహారాజుగారి దర్శనార్థమై వెళ్లినారు "ఇప్పుడేమి?" అన్నారు మహారాజుగారు

"మహారాజా! పంటలవల్ల గ్రాసము సరిపోవుచున్నది తాగుటకు కావలసినన్ని నీళ్లు కలవు మా పశువులకు గడ్డి లోపము లేదు మీ రాజ్యములో పండేపంటలూ, కూరగాయలూ, మీ రాజ్యములోని మంచి పశువులూ గ్రామములలో మంచి మంచి పనివాండ్రు తయారు చేసిన వస్తువులూ మాకు లభించడం ఎట్లాగ! మేము దూర దేశములు వెళ్లగలమా మహారాజా? అన్నారు" పురవాసులు

"అయితే ఏమికావా"అన్నారు మహారాజుగారు

"ఒక వారము మావూళ్లో సంత జరిపేటట్టు ఉత్తరువును పాలించాలి ప్రభువువారు" అన్నారు ప్రజలు

"సరే" అన్నారు మహారాజుగారు ఇతర గ్రామముల నుంచి వచ్చిన సరుకులు తాముకొంటూ తమ గ్రామములలోనివి ఇతర గ్రామముల వారికి అమ్ముతూ సంతుష్టిగా కాలము గడుపుతున్నారు భావాపురవాసులు మరికొన్ని సంవత్సరములు జరిగినవి ప్రజలందరూ కలిసి మహారాజుగారి దర్శనార్థమై వెళ్లినారు మళ్లీ.

"ఎందుకు వచ్చారు" అన్నారు మహారాజుగారు

"ప్రభులవారు మా విన్నపం పాలించాలి మా గ్రామములో వెలసిన శ్రీ కృష్ణస్వామికి దేవాలయం నిర్మించుకొని చాలాకాలమైంది దేశదేశములవారూ మాకృష్ణస్వామిని కొలిచి ఇష్టసిద్ధులుపొందవలెనని మేము ఆశిస్తున్నాము" అన్నారు ప్రజలు "ఏమి చేయమన్నారు" అన్నారు మహారాజుగారు "తమ రాజ్యములోవారూ ఇతర రాజ్యములో వారూ తమతమ రాజ్యములలో ప్రద్ధికెక్కిన పనివాళ్లు తయారు చేసిన రకరకముల సామానులతో మా ఊళ్లో దుకాణములు పెట్టవలెను అందరూ మా కృష్ణస్వామిని కొలువవలెను అందుకోసం మా భావాపురములో ఏడాదికొక మారు తిరునాళ్లు జరిగేటందుకు ఉత్తరువు దయచేయించాలి ఇంతే మా మనవి" అన్నారు

"సరే" అన్నారు మహారాజుగారు ప్రతియేడూ నేర్పరులైన శిల్పులు తయారు చేసిన లోహ విగ్రహములు, శిలా విగ్రహములు, కఱ్ఱ సామానులు ఇంకా ఇతర వస్తువులు చుట్టుపట్ల రాజ్యములలోని ప్రజలు తేగా భావాపురం కలకలలాడుతూ ఉండేది అనేక విద్యలలో ప్రవీణులైన వారు వచ్చి తమ విద్యలను ప్రదర్శించేవారు కాడి పట్టులూ, గుండ్లెత్తడాలు, మొదలైన బలమును సూచించేపనులు చేసేవారు చాలా మంది వీటితోపాటు అశ్వజవ పరీక్షలూ, వృషభ బల పరీక్షలూ కూడా జరుగుతూండేవి ఇవి గాక పురాణకాలక్షేపాలూ, హరికధలూ, వీధి భాగవతాలూ, యక్షగానాలూ, తోలుబొమ్మలాటలూ మొదలైనవి ప్రజలకు సంతోషాన్ని కల్పించేవి అన్నిటికన్నా గొప్ప విషయం ఏమంటే శ్రీకృష్ణస్వామి మహత్తు దేశదేశములా వ్యాపించింది

భావాపురం తిరునాళ్లు చాలా ప్రసిద్ధి కెక్కింది

ఈ రీతిగా చాలా సంవత్సరములు జరిగినవి

భావాపుర వాసులందరూ ఏ విధమైన లోటూ లేకుండా తమ ఏలిక వంటి ధర్మ ప్రభువులు ఇది వరకు పుట్టలేదనీ, ఇక పుట్టబోరనీ దృఢ విశ్వాసముగలవారై కాలమును పుచ్చినారు

శ్రీశ్రీ భావరాజుగారు కొన్నేళ్లకు కీర్తిశేషులైనారు

చాలాకాలము వరకూ ఆ రాజ్యమును వారి వంశస్థులు పరిపాలన చేసినారు కొన్ని తరములైన తరువాత ఆ రాజ్యము ఈ వంశస్థుల చేతి నుండి వేరొకరి వశమైనది

భావరాజుగారి వంశము వారు రాజ్యచ్యుతులైనప్పటికీ భావరాజుగారి కీర్తి భావాపురములో స్థిరస్థాయియై ఉన్నది గదా అని వారి వంశస్తులూ సంతోషించారు కొన్ని వందల సంవత్సరములు గడచినవి

రాజ్యముల సరిహద్దులు మారినవి స్వదేశ రాజుల పరిపాలనము అంతరించింది దూరదేశముల నుంచి భిన్న వేషభాషలు గల కొత్తవారు వచ్చి ఈ రాజ్యములను ఆక్రమించి ఏలడము ప్రారంభించినారు రాజ్యములలో అనుకోని మార్పులు అనేకములు సంభవించినవి,

భావాపురంలోని ప్రజలలో వేషభాల్లో మార్పులు పుట్టినవి రాజుల్ని బట్టి ప్రజలు మారడము సామాన్యంగా సహజం

వేష భాషలతో పాటు వారి వృత్తులు కూడా మారిపోయినవి మనః ప్రవృత్తులు మారినవి ఈ క్రొత్తసంప్రదాయాల స్వీకరించిన యువకులందరూ కలిసి ఒకనాడు గ్రామస్థుల సభ చేయించారు అందులో ముఖ్యముగా రాజవిద్యనభ్యసించినవారే యీసభ నలంకరించారు

అసలు సభ చెయ్యడానికి కారణం ఏమిటీ అంటే - ఆ చుట్టు పట్ల గ్రామముల నేలుతున్న ప్రతినిధి స్తోత్రప్రియుడు తానీదేశమున కొద్ది కాలమే ఉండువాడనే సంగతి గ్రహించి ఆ స్వల్ప కాలములో తన కీర్తిని ఆ ప్రాంతముల నెలకొల్పవలెననే అపేక్షతో ఉన్నాడు స్తోత్రప్రియుడికి స్తోత్రపారకులు దొరకడం ఏమి కష్టము? అందులో ఆయన సర్వాధికారియై ఉన్నప్పుడు భావాపురం యువకులు పెక్కురు ఆయన నాశ్రయించినారు ఆయన తన మనోభీష్టమును వీరికి వెల్లడి చెయ్యగా "అదెంత పని" అన్నారు వీరు

"అయ్యా! మీరా భావాపురము ననుసరించియున్న భూములను కొన్ని నివేశస్థలములుగా ప్రజలకు ఇప్పించాలి దానికోసమై మీరు స్వల్పముగా మాత్రము దరఖాస్తు సొమ్ము పుచ్చుకోవాలి" అన్నారం

"అయితే భూమి కోసం దరఖాస్తులు పెట్టించండి" అన్నాడాయన

యువకులు, అందరిచేతా, స్వల్ప మూల్యమునకు వస్తున్నాయని, నివేశస్థలముల కోసము దరఖాస్తులు పెట్టించినారు భావాపురము ననుసరించి కొద్ది కాలములో ఒకపేట, ఏర్పాటు కాబడ్డది ఆ పేటకు ప్రాముఖ్యము కలగడానికి ఆ అధికారి తన ఆఫీసుల నక్కడనే కట్టించుకున్నాడు యువకులందరూ కలిసి ఆ పేటకు ఆ అధికారి పేరు పెట్టి తీరాలి అన్నారు

ఆ పేటనందరూ కూపరుపేట అని పేర్కొన మొదలు పెట్టినారు కొన్ని సంవత్సరములు జరిగినవి,

"మీ పేరు మావూళ్లో శాశ్వతముగా ఉంటుంది కదా ఇంకెందుకు మీకు విచారం" అన్నారు యువకులు, అధికారిని చూచి "పేటకు అంత ప్రాముఖ్యము లేదు ఊరిపేరు దేశదేశములా తెలుస్తుంది పేట పేరు చుట్టు ప్రక్కల మాత్రమే చెప్పుకుంటారు" అన్నాడు అధికారి

"చిత్తము, అలాగే చేయిస్తాము" అన్నారు యువకులు "మేలు మరువను సుమండి" అన్నాడు అధికారి

భావాపురవాసుల సభ కరతాళధ్వనులతో బాగుగా జరిగనది అగ్రసనాధిపతి సభను జరిపించాడు యువకులు కొందరు ఉపన్యాసములిచ్చారు అగ్రాసనాధిపతి సభను జరిపించాడు యువకులు కొందరు ఉపన్యాసము విచ్చారు అగ్రాసనాధిపా,! సభ్యసోదరులారా ఈనాడు మనమిక్కడ సమావేశమైన సంగతి

మీకందరకు తెలిసినదే న్యాయ తీర్పరియు, ధర్మమూర్తియనగు మన యధికారి కూపరుగారి యెడల, మనము జూపవలసిన కృతజ్ఞత క్రియా పూర్వకముగా నుండవలెనని నేను మెండుగను సంపాదించుచున్నాడు అయ్యధికారి గుణములపుట్ట వన్నె పెట్టిన కుందనము త్రుప్పు పట్టిన యినుముగాడు ఈయన పేర మనమీపురమును పిలిచినట్లయిన మనకు అనేక విధములగు లాభములున్నవి ఆయన యెడల మనము కృతజ్ఞత చూపినవారమగుదుము మనయూరి ప్రస్తుత నామంబు చాలా ప్రాతపడియున్నది ఆపేరు మార్చినచో మన యూరి వారందరు పూర్వాచారా పరాయణులనియు, మూఢ విశ్వాసము కలవారయనియు పాలకులూహింతురు కాబట్టి మన యూరికి కూపరుపురమను నామధేయ ముంచవలెనని నేను మీ సమ్మతి కోరినాను నేను నుడివిన తెఱంగున మీరలాచరించిన నేనమందానందకందళిత హృదయారవిందుడనగుదును అప్పుడే మనము కూపరుగారి యెడల కృతఘ్నులము కాలేదని ప్రపంచమునకు ముక్త కంఠముతో నొక్కి వక్కాణించిన వారమగుదుము'' యువకులందరూ కరతాళధ్వనులు చేసి తమ సమ్మతిని తెలిపిరి ఒక మూల నుంచి ఒక ముసలివాడు లేచి "అయ్యలారా! మా పెద్దలు చెప్పగా విన్నాను ఏ మహారాజో మన పెద్దలకు ఉపకారం చెయ్యడం వలన మన పెద్దలీపురమునకు భావాపురమనే పేరు పెట్టినారట. నేను ములివాడిని నా మాటలు మీకు వినిపిస్తున్నాయో లేదో, పేరు మార్చడం దోషం, దోషం, తరువాత మీ చిత్తం''

యువకులందరూ గోలచేసినారు. అగ్రాసనాధిపతి గారు నోట్సు తీసుకున్నారు

పురమునకు కొత్తపేరు ఉంచవలెనని తేలింది అల్పాహారములతో సభ ముగిసింది

సభా తీర్మానములు దొరగారికితెలియజేశారు గ్రామ రికార్డులలో ఇప్పటి నుంచి కొత్తపేరే వాడుతూ ఉండవలసినదిగా వారు ఉత్తరువు చేసినారు ఆనాటి నుంచీ భావాపుర మనేపేరు అంతరించిపోయినది కూపరుపురమనే పేరు వ్యవహారములోనికివచ్చినది

సంవత్సరాది సమీపిస్తూ ఉన్నది యువకులందరూ అధికారితో ఎక్కువ చనువుగా ఉంటున్నారు అధికారి వీరివంటివారు లేరని స్నేహితులతోటీ పై అధికారులతోటీ చెప్పినాడు వీరిని గురించి పెద్ద పెద్ద ఉత్తరములు వ్రాసినాడు వారందరూ అందు బిరుదులిచ్చినారు కూపరు పురములోని యువకుల పేళ్లు మూడు ఆ పట్టికలో ఉన్నాయి సంవత్సరాది వచ్చినది బోలెడంత డబ్బు ఖర్చు పెట్టి అధికారిని యువకులు గౌరవించినారోజున సంవత్సరాది పట్టిక వచ్చినది దేశములోని ప్రముఖులగు వారందరూ ఎంతో ఆశతో కనిపెట్టుకొని వున్నారు

ఒకరికి "రావు'' అని బిరుదు వచ్చినది

రెండవ వారికి "దివాను'' అను బిరుదు వచ్చినది

మూడవ వారికి "సాహేబు'' అను బిరుదు వచ్చినది

యువకలు ముగ్గురూ గ్రామమంతా స్వంతఖర్చులతో పూరేగినారు ఈ అధికారివంటి ప్రభువు ఇంతకు ముందు పుట్టలేదు ఇంక ముందు పుట్టబోడని ఉపన్యసించారు కొంతకాలము గడిచింది

కూపరుపురం ప్రజల నోళ్లల్లోపడి క్రమక్రమంగా నలిగిపోయింది నేడు దానికి కుప్పాపురం అనే పేరు స్థిరమైంది నేటి కవులు తమ గ్రంధాల్లో దీనిని రాశీపుటభేదనమని వర్ణిస్తూ వస్తున్నారు

# కిష్కింధలో కోతి

ఆ కొండను మీరు చూచి ఉండరు నాటికీ నేటికీ ఎవ్వరూ కూడా ఆకొండను చూచి ఉండరు చూడరు, చూడడానికి ఎవ్వరికీ మనస్కరించదు అంత పాపభూయిష్టమైన కొండ అది, న్యాయానికి ఆ కొండది తప్పు కాదు దాని నాశ్రయించుకొని బ్రతికిన నా వల్ల ఆ కొండకు కళంకం వచ్చింది

పవిత్రమైన ఏటిగట్టున ఉన్నది ఆ కొండ, లోకాల కళంకాన్నంతా కడిగివేసే శక్తిగల ఆ యేరు ఆ కొండ కళంకాన్ని కడగలేదు నా వల్లనే ఆ కళంకం ఆ కొండకు పట్టుకుంది కాబట్టి

పవిత్రమైన ఏరు, అద్దరినీ ఇద్దరినీ దట్టముగా పెరిగిన ఫలవృక్షములు నీటి అంచుల నాశ్రయించి పెరిగిన రెల్లుదుబ్బులూ, రెల్లు దుబ్బుల నాశ్రయించిన చిన్న పక్షులూ, అనంత ప్రాణికోటి ఆ యేటి ఒక గట్టున నా కొండ, కొండకు అన్నివైపులా ఫలవృక్షములు ఎవరు పెంచారో మా కోసమని ఆ ఫలవృక్షములు, ఎవరు మా కోసమని పాల వంటి ఏటి నీళ్లు ఆ ప్రాంతముననే ప్రవహింపజేస్తున్నారో, మాకు ఇరుగు పొరుగుగా ఉండేటందుకు ఎవరు ఆ పాటలు పాడే పక్షులను, ఆ చిందులు త్రొక్కే మృగములను, ఆ గంతులు వేసే కీటకాదులను ఆ ప్రాణి కోటినంతనూ సమకూర్చారో, ఎవరి దయాదాక్షిణ్యములు ప్రాపుగా మేము ఆ అడవిలో కులాసాగా కాపురం చేస్తున్నామో - మాకు తెలియదు తెలుసుకుందామని ఊహ, ఇచ్ఛ మాకు కలుగ లేదు నేనూ, నా కుటుంబమూ ఆ కొండమీద కాపురము, ఆ అడవిలో సంచారము ఆ యేటి మీద విహారము సౌఖ్యమునకు ఇదేమేర కదా అనుకున్నాము మా కొండ మీద పెద్ద పెద్ద పాషాణములు పేర్చి పెట్టినట్లున్నవి ఆ పాషాణములే ద్వారముగా ఉన్నవి గదులుగా ఏర్పడ్డవి అంతఃపురములైనవి ఆ పాషాణములే వేదులు, జరుగుడు బండలు ఆ పాషాణములే కోట గోడలు, సొరంగములైనవి ఆ కొండ మా ఉనికి పట్టుగా, మా ఇల్లుగా మా నగరుగా మేము భావించుకొంటున్నాము

ఆ కొండ ప్రక్కల మీద నిలువుగా చెట్లు పెరిగినవి దట్టముగా పెరిగినవి, ఆ కొండ చుట్టూ దట్టముగా పెరిగిన చెట్లు, ఆ కొండ నుంచి చూపుకందనంత దూరము వరకూ దట్టముగా చెట్లు, ఆ చెట్లు మాకు సంచార భూములు, ఆ చెట్లు మాకు లీలోద్యానములు, సౌఖ్యమునకు ఆ కొండా ఆ అడవీ మేర అని మీకు మాత్రం తోచడము లేదూ?

ఆ చెట్ల కొమ్మలలో రాత్రివేళ మేము నిద్రించే సమయాన చిరుత పులులూ, పెద్ద పులులూ, ఏనుగులూ, సివంగులూ, తోడేళ్లు ఆ ప్రాంతమున సంచరిస్తూ బొబ్బరిస్తూ ఉంటవి మాకు అవి తలారులు, ఈ బొబ్బరింతలతో అడవి అంతా ప్రతిధ్వనిస్తుంటే మాకు హాయిగా నిద్రపట్టుతుంది

పగటివేళ లేళ్లు మా కొండచుట్టూ చెంగలిస్తూ తిరుగుతవి పక్షులు, వన్నెవన్నెల పక్షులు, రెక్కలు విప్పి చాచి ఎగురుతూ మాకు నేత్రానందము కలుగజేస్తవి రకరకముల గొంతుకలతో రకరకముల పాటలతో, రకరకముల పలుకులతో అడవిని మధురారావములలో ముంచి వేస్తవి కొన్ని పక్షులు రాలేక రాలేక చెట్ల సందులలో నుంచి సూర్య కిరణములు బలవంతముగా సందు చేసుకువచ్చి పచ్చికలమీద శయనిస్తవి మా కొండ ప్రక్కల మీద మేకలూ, జింకలూ, ఆవులూ మందలుగా వచ్చి తియ్యని పచ్చిక మేస్తవి

మాయేటి కీవలిగట్టునా ఆవలిగట్టునా పెరిగిన వృక్షములు కొమ్మలూ, కొమ్మలూ కలుపుకోవడం వల్ల మేమంతా ఏటి నడిమి భాగము చేరి నీడలతోనూ వెలుగులతోనూ ప్రవహించే సుళ్లు తిరిగే, తలక్రిందులయ్యే, చెంగునదాటే నీటినీళ్లను చూస్తూంటాము

ఈ సౌఖ్యోన్నతికి పశులమై తిండికీ నీటికీ లోటులేకుండా ఆ కొండమీద మేము కాపురము చేస్తున్నాము అప్పటికింకా ఆ కొండకు కళంకము రాలేదు.

ఒకనాడు ఒక పెద్ద కేక వినిపించింది ఆ కేకకు చెట్లకొమ్మలల్లల్లాడినవి కొండ గుహలు ప్రతిధ్వనించినవి ఆ కేకనందుకొని మా యేరు అన్ని దిక్కులా దానిని వ్యాపింప చేసింది

ఆ కేక వానర లోకాన్ని ఉద్దేశించినది వానరలోకానికంతకూ అది చాటింపు పుట్టినాడట లోకములో పుణ్య పురుషుడొక్కడు సంహరించినాడట వానర చక్రవర్తిని వాలిని

కట్టినాడట పట్టము కపిలోకమునకు సామ్రాట్టుగా సుగ్రీవునకు ఆ పుణ్యా పురుషుడు అవతార పురుషుడట ఆ అవతార పురుషుని నామమై పవిత్రమైనదట రామశబ్దము.

ఆ చాటింపు, ఆ కేక, ఆ పిలుపు మా శ్రవణ పుటములలో ప్రవేశించి హృదయమున హత్తుకొన్నది ఆ కేక మాకు ఆదేశమైనది

పుణ్యపురుషుడు అవతారపురుషుడు జన్మించిన కాలాన మీరు సమకాలీనులై ఉండటం తటస్థించిందా? అప్పుడు గాని మా సంతోషం మీకు బోధపడదు

పుణ్యా పురుషుని కనగలిగిన కాలము ఎంత మహత్తరమైనదో తత్కాలముననే ఉండే జనులెంత అదృష్టవంతులో ఆ కాలపువారికి తెలియకపోయినా తరువాతి ప్రజలు తెలుసుకొంటారు ఆ కాలమున తాముండకపోతిమిగదా అని వగతురు

కాలము అనంతమైనది అందులో కొన్ని భాగాలు ఉత్కృష్టములు ఉదయించే సూర్యుని శోభ ప్రభాతానికి పట్టినట్లు ఉదయించే మహా పురుషుని శోభ ఆ కాలానికి పట్టుతుంది

ఒక దివ్యకాంతి ఆ కాలాన్ని ఆవరిస్తుంది

ఒక దివ్య సౌరభము ఆ కాలములో ఇమిడి ఉంటుంది ఆ కాలానికే ఒక దివ్యమైన మాధుర్యం ఉంటుంది ఆ కాలములోనే పక్షులు మరీ శ్రావ్యముగ పాడుతవి ఆ కాలములోనే మేఘములు నెలకు మూడు వానలు కురుస్తవి పంచభూతములూ ఆ కాలభాగాన్ని అంటిఉన్న కల్మషాన్ని కడిగివెయ్యడానికి పూనుకొంటవి

మహాపురుషోదయాన్ని చూడగలిగిన ఆనాటి ప్రజలు ఎంత అదృష్టవంతులై ఉంటారు ఆ కాలపు ప్రజలందరూ అదృష్టవంతులా? ఆ కాలపువారికందరికీ సంతోషముంటుందా? కాదు, ఉండదు, కోరికలు పెంచుకొని పెంచుకొని ఆ కోరికలు సఫలపరచుకోవడమే సంతోషమనీ ఊహించేవారికి మహా పురుషోదయముతో ఏమి పని?

అధికారమును ఆశ్రయముగా చేసుకొని లోకమున కుపకారం చేస్తున్నామని చెప్పి అపకారం చేసేవారికి మహాపురుషోదయము అసంభవము

తమతమ శాసనములకు ప్రజలను లొంగదీసుకొని వాటినే మతముగా భావించుకోమని బోధించేవారికి మహాపురుషోదయమేటికి? మహాపురుషోదయమునాటి ప్రజలు అవతార కారణమైన మహాపురుషుని కార్యములు సాధించుకోడానికి సాధనములై ఉంటారు అందువల్లనే వారికి సౌఖ్యముండదు లోకులు సాధారణముగా దేనిని సౌఖ్యమని భావిస్తారో అది ఉండదు వారి జీవితమంతా కష్టభూయిష్టమై ఉంటుంది మహాపురుషునితోబాటు జన్మించినందుకు వారికి ఫలము ఈసడింపులు, బాధలు, మరణము కాని వారి మనస్సు మాత్రము నిండు శాంతితో నిండి ఉంటుంది

బాధలు తలచుకొని మహాపురుషుని ఆదేశములు లెక్క చెయ్యరు కొందరు

మహాపురుషుని ఆదేశనిర్వహణము స్వర్గతుల్యముగా భావించి సమస్తమూ అందుకొరకై ధారపోస్తారు కొందరు

ఆనాటి కపిలోకమునకు ఆజ్ఞ వచ్చినది, రాముని ఆజ్ఞ సుగ్రీవుని ద్వారా వచ్చినది

ప్రతి యొక్క కపినీ ఉద్దేశించి చేయబడ్డ ఆజ్ఞ అది రాక్షస సంహారమునకు పూనుకొమ్మని ఆజ్ఞ సుగ్రీవుని కేతనము క్రింద చేరి రామకార్యమును కపులందరూ నిర్వహించమని ఆజ్ఞ

అట్టి ఆజ్ఞలో ధనము లేదు సౌఖ్యము లేదు అట్టి ఆజ్ఞలో నిరంతర త్యాగమున్నది స్వర్గమున్నది

ఆ ఆజ్ఞ కిష్కింధ అంతటా వ్యాపించినది కిష్కింధావాసులందరూ దానిని పాటించారు సుగ్రీవునాజ్ఞ తలదాల్చి స్వధర్మ నిర్వహణార్థము బయలుదేరారు స్త్రీ పురుష విచక్షణ లేదు వృద్ధులూ, బాలురూ అనే విచక్షణ లేదు అందరూ ఒక్క హృదయముతో ఒక్క పట్టుదలతో, భక్తితో ఆవేశముతో సుగ్రీవుని కొండ చేరారు త్యాగమనే బుద్ధిలేదు కీర్తివచ్చుననే ఆశ లేదు శాశ్వతత్వము వారికి కలుగుననే ఆశ లేదు స్వామి కార్యము మీదనే బుద్ధి, మహాపురుషుని ఆదేశమును విధేయపూర్వకముగా అంగీకరింపవలెననియే సంకల్పము వారందరూ ధన్యులని వేరే చెప్పవలెనా?

ఆ ఆజ్ఞ మా కొండ నూ చేరినది మా చెవులలో కూడా పడ్డది ఆ ఆజ్ఞ విని మా కొండ, అచ్చటి వనము, ఆ యేరు పులకితములైనవి ఆ ఆజ్ఞను విన్న సంతోషము మాకు కలిగింది ఆ ఆజ్ఞను అందరూ పరిపాలిస్తున్నారనే వార్త మాకు సంతోషము కలిగించింది మా జాతి వారందరూ స్వామి కార్యధురంధరులనిన్నీ, మా జాతివారందరూ త్యాగశీలురు, పరాక్రమశాలులూ అనిన్నీ మాకు గర్వము కలిగింది మా హృదయములు కూడా ఉప్పొంగినవి

సుగ్రీవుని కేతనము క్రిందకు మేము కూడా సాయుధులమై చేరవలెను గదా! సోత్సాహులమై శ్రీరామ కార్యమునకు మేము మాత్రము పూనుకొనవద్దా? మమ్ము కూడా ఉద్దేశించినదే గదా ఆ ఆజ్ఞ స్వామి ఆజ్ఞ కెదురుపోవచ్చునా? దైవకార్యము కాదనవచ్చునా? ఎవరి కొరకు యీ దేహములు పెంచుకొనుచుంట - స్వామి కొరకే గదా!

ఎవరివల్ల యీ సౌఖ్యములు మాకు కలుగుతున్నవి - స్వామి వల్లనే కదా! జన్మకు సాఫల్యమేమిటి? బ్రతికినందువల్ల ఫలమేమిటి? - అవతార పురుషుడు వచ్చి తన కార్యము నిర్వహించమని ఆదేశించి

నప్పుడా వెనుకంజ వెయ్యడం? మేము మాత్రము కపులము గామా? కిష్కింధనేలే సుగ్రీవుడు మా రాజుగాడా? సుగ్రీవుని దేవుడు మా దేవుడు గాడా?

మేము కర్తవ్యమును నిర్ణయించుకోవలసిన పని యేమున్నది? మేము ఆలోచించవలసిన పనియేమున్నది? మేము సందేహించవలసిన పనియేమున్నది? కాని -

కాని మేము కర్తవ్యమును నిర్ణయించుకోవలసి వచ్చింది మేము సందేహించాము మేము ఆలోచించవలసి వచ్చింది! ఆలోచించడం మొదలు పెట్టాము సంశయాత్మ నశిస్తాడంటారు మేము సంశయించాము సంశయాలు తీర్చుకొని ఆలోచనలు సాగించి ముగించి తరువాత స్వామి కార్యానికి పూనుకోవలెనని సంకల్పము చేసుకొన్న వారాకార్యములలో ఎప్పుడైనా దిగడం సంభవిస్తుందా?

ఇక్కడ మా కొండ - సర్వసౌఖ్యాలకూ ఆలవాలమైన కొండ - ఇహసౌఖ్యాలకి మేర చూపించే కొండ!

అక్కడ లంకాపురి - భీషణవ్యాఘ్రగహ్వరము తెరచుకొని నృత్యము చేస్తున్న మృత్యుదేవత కాటపట్టయిన లంకాపురి - భయము, బాధ, భీభత్సముల కాకరమైన లంకాపురి!

ఇది మేలా? అది మేలా?

ఇక్కడి ఈ యేరు - ఈ వనము - ఈ మృగముల సందడి ఇక్కడి ఈ -సంచారములు ఈ సుఖములు - వీటికి బదులుగా అక్కడి సముద్రోత్తరణము, సేతు నిర్మాణము, దూర ప్రయాణము - ఆ రాక్షసుల కోలాహలము - అక్కడి గర్భనిర్భేదకమగు - రణభేరీశబ్దములు - అక్కడి రణ రంగ విహారములు, శత్రుదేశ సంచారములు - అక్కడి ఆ కష్టములు - ఇక్కడ ఉండుటమేలా? అక్కడికి పోవుటమేలా?

ఇహ సౌఖ్యములకూ పర సౌఖ్యములకూ సంఘర్షణ కలిగింది. ఇంద్రియ సౌఖ్యములకూ పర సౌఖ్యములకూ ప్రబల యుద్ధము తటస్థించింది

ప్రత్యక్ష సౌఖ్యములను చూపి ఇంద్రియములు పరసౌఖ్యముల నీసడించుచున్నవి

రానున్న శాశ్వతత్వమునకై ఆశా అందులో నిరవధికానందమునూ తెలిపి పర సౌఖ్యములు ఇంద్రియాలపై దాడి వెడలుచున్నవి

ఇంద్రియ సుఖములలో మృత్యువు నిత్యమూ సంచారం చేస్తూ ఉంటుంది

పరసౌఖ్యములోని తత్త్వము నిర్మలత్వము!

చేతులో సుఖములను వదిలిపెట్టి ఎప్పుడో రానున్న సుఖముల కపేక్షించడం వివేకమేనా? మా దేహములే మా స్వామి కేతనము కిందికి పోయి సహాయము చేయవలెనా? మా మనస్సుల కా శక్తి లేదా? మా ఇచ్ఛాశక్తి మా స్వామి ననుసరించి ఉండరాదా? మా సంకల్పబలము మా దేహబలముకన్న ఎక్కువ ప్రయోజనకారి కాకూడదా?

వానరసేనల విజయ ఘోషములు మా కొండను చేరినవి మా వానరసేనల సేతునిర్మాణములో మా సంకల్ప సహాయ్యము మేము చూచుకొన్నాము

మా వానరసేనల లంకాప్రవేశములో మా మనస్సులూ ఉన్నవి మా వానరసేనల భీషణ యుద్ధములో మా మనస్సులూ పాల్గొన్నవి

రాక్షస సంహారము జరుగుతున్నది వీరవానర హుంకారనాదములను మా కొండ ప్రతిధ్వనిస్తున్నది రాక్షస హాహా కారములు మా యేటి చప్పుళ్ళలో కలసిపోతున్నవి

రాక్షసరాజును రామభూపాలుడు సంహరించిన వార్త పంచభూతములూ, దశదిక్కులూ వ్యాపింపజేసినవి మా కొండకూ ఆ వార్త చేరినది

మా మనస్సులలో సంతోషము మేము తెచ్చిపెట్టుకున్నదా? నిజమైన దేనా? దానికి సహజత్వము లేదేమి?

లోకములో కొండలు తలలూపి ఆడినవి మా కొండ తలవూపి ఆడలేదు

లోకములో నదులు చెంగుచెంగున గంతులువేస్తూ ప్రవహించినవి మా యేరు మందమై శుష్కమైన ఇసుకతిన్నెల నంటిపెట్టుకుపోయింది

లోకంలో వనములు చిగురించినవి మొగ్గలు తొడిగినవి పుష్పించినవి పరిమళములను నల్గడల ప్రసరించినవి

మా వనము తలవాల్చినది పుష్పముల రాల్చినది వాయువును బంధించినది

లోకము ప్రకాశవంతమైనది మా నివాస మంధకారమయమైనది

లోకము నవ్వింది!

మా వాసస్థానము సిగ్గుచే తలవంచి దుఃఖముచే కుమిలిపోయింది

స్వామి కార్యనిర్వహణము మా వానర కులమునకు గర్వకారణమైనది

మాకు శాశ్వత కళంకము నాపాదించినది

లంకను గెలిచి కిష్కింధా రాజ్యమును మావారు చేరుకొన్నారట ఆ వార్త మాకు చేరినది మాకు ఉత్సాహము లేదు

మా కొండ మాకు భోజనము పెట్టడము మానుకొన్నది

మా యేటి స్వాదు జలములిప్పుడు చేదైనవి

మాకు విహారములు లేవు

పశ్చాత్తాపముపట్ల లాభముంటుందా? స్వామి కార్యమును లక్షించని సేవలకు గతి వున్నదా?

అవతార పురుషుని ఆదేశమునే అంగీకరించని మందుల కెన్నటికైనా మోక్ష లాభమున్నదా? ఆ కొండకు కళంకం నా వల్ల వచ్చింది, ఆ కొండవల్ల నాకు కళంకం వచ్చినదని చెప్పి నా పాపమును నేను వృద్ధిచేసుకోను ఆ కొండను మీరు చూచి ఉండరు, చూడరు

# అభిప్రాయబేధం

ఆయనకు కూతురు తప్ప ఇంకెవరూ సంతానము లేదు ఆయన వడ్డీ వ్యాపారం చేసే షాహుకారు వద్ద గుమాస్తా ఆయన ద్వారానే షాహుకారు బదుళ్లు ఇచ్చేవాడు ఆయనే పద్దులు వ్రాసేవాడు అప్పులు వసూళ్లు చేసేవాడు ఆయనకు ముప్ఫయి రూపాయల జీతం ఇదిగాక నూటికి రూపాయచొప్పున తాను బదులిప్పించిన వారిదగ్గర నుంచి రుసుము వసూలు చేసేవాడు దానాదీనా ఆయన జీవయాత్ర గడుపుతున్నాడు ఇల్లు కొన్నాడు, తోట వేయించాడు

ఈ మధ్యనే ఆయన భార్యకొక కాసులపేరూ, కూతురికొక కంటె చేయించాడు కూతురు కంటె పెట్టుకొని ఆడుకొంటూంటే తల్లిదండ్రులు చూచి సంతోషించేవారు. కూతురికి ఆయిదోఏడు

ఆ ప్రాంతాన యానాదిమనిషి కాపురముంది ఆమెకు ఒక కూతురు ఆ కూతురికి మూడోయేడు రెండు సంవత్సరములైనది భర్త ఆమెను వదలిపెట్టి ఎక్కడికోవెళ్లి అప్పటి నుంచి ఆ యానాదిమనిషి దొరికినప్పుడు కూలీనాలీ చేసుకొంటూ ఏ చెట్టుకిందో ఏ పంచనో నిద్రపోతూ కూతురిని పెట్టుకుని కాలక్షేపం చేస్తూ ఉన్నది రెండు మూడు రోజుల పాటు తిండి దొరకనప్పుడూ కూతురుని పోషించడానికి మార్గం కనపడక ఆమె వీధుల వెంట ముష్టికి బయలుదేరేది

ఆ యానాదిమనిషికి ఆ కూతురే సర్వమూ, ఇరుగుపొరుగు వాళ్లను యాచించి తెచ్చుకొన్న చిరుగుచొక్కాలతోనూ, పరికిణీలతోనూ కూతురుకు ముస్తాబు చేసేది ముస్తాబు చేసిన కూతురిని చూచి ఆ తల్లి హృదయం ఉప్పొంగేది

నల్లని, నున్నని, బూడిద అంటిన శరీరం, చిక్కుకట్టిన నల్లని జుట్టూ, తళతళలాడి నవ్వేకళ్లు, అకారణముగా పెదవులు విడిపడడం చేత కలిగిన నవ్వూ రోజురోజూ చూచే ఆమెకు భర్తలేని లోపం కనిపించలేదు దీనికితోడు కొంత ముస్తాబు కూతురికి చేస్తేకాని ఆ తల్లికి మనశ్శాంతి లేకపోయేది

అందుకని బయళ్లలో వికసించిన తంగేడు పువ్వులు తీసుకువచ్చి ఆమె కూతురికి చెవులో జూకాలుంచేది, మెళ్లో పేరులు వేసేది

ఒకమారు పచ్చగన్నేరు పువ్వులూ, ఒక మారు తురాయి పువ్వులూ, ఒకమారు తంగేడు పువ్వూలూ సంపాదించి కూతురికి ముస్తాబు చేసేది కాని ఆమెకు ఇంకా తృప్తి కలగలేదు కారణం ఏమిటంటే?

పండుగలకూ పబ్బాలకూ నాగరీకుల పిల్లలు బంగారు నగలు ధరించడం ఆమె చూచింది అవి చాలా బాగున్నవని ఆమె అనుకుంది తన కూతురు కూడా అలాంటి నగలు పెట్టుకుంటే ఎంత బాగుంటుందో - ఎంత బాగుంటుందో! ఆ పూటకు తిండి లేని ఆ యానాదిమనిషికి బంగారు నగలు ఎక్కడ నుంచి వస్తవి?

సంవత్సరాదినాడు అందరూ ముస్తాబైనారు అందరూ వేపపువ్వు తిన్నారు

ఆ యానాదిమనిషికి సంవత్సరానికి ఇతర దినములకూ తేడా ఏమీ లేదు అన్ని రోజులూ ఒక్కటే అన్ని రోజులూ తిండికీ బట్టకూ తాపత్రయపడవలసిన రోజులే

అప్పుడు తంగేడు పువ్వులు పూయడం లేదు రాధామనోహరం పువ్వులూ నందివర్ధనం పువ్వులూ కలవు వాటితోటే ఆమె కూతురికి అలంకరించింది కాని వెనుకటి కోరిక ఇంకా సఫలం కాలేదు తన కూతురికి బంగారు నగలుంచి ముస్తాబు చేసి ముద్దు పెట్టుకుంటే - ముద్దు పెట్టుకుంటే -

ఆనాడు మధ్యాహ్నం కూతురిని చంకను పెట్టుకొని వీధివెంట నడచి వెళుతున్నది యానాదిమనిషి కూతురు తల్లితో ఏవేవో ఊసులాడుతున్నది

ఒక చోట అంటే ఆయన షాహుకారు దగ్గిర గుమాస్తా - కూతురు ఆడుకుంటున్నది కంటె మెళ్లో పెట్టుకొని ఆడుకొంటున్నది ఆ యానాదిమనిషి ఆ పిల్లను చూచింది తన కూతురికి - ఆ కంటె - అలాంటి కంటెపెడితే -పెడితే ఎంత బాగుంటుందో - అలాంటి కంటె ఎలాగ పెట్టడం? పోనీ ఆ కంటె పెట్టితే - అమ్మో! ఆ కంటే?

ఆ తల్లి ప్రాణం ఉండబట్టింది కాదు ఆ యానాదిమనిషి ఆ పిల్ల దగ్గరికి వెళ్లింది పళ్లుపెడతానని మంచిమాటలాడింది మెళ్లో కంటె తీసింది తన కూతురు మెళ్లో పెట్టింది చూచింది తల్లి ప్రాణం కుదుట పడింది తన కూతురిని ముద్దు పెట్టుకొంది కాని ఒక సందేహం కలిగింది తంగేడు పువ్వులవల్ల కలిగే అందం కంటే ఈ కంటెవల్ల ఏమి ఎక్కువ అందం కలిగింది? ఎందుకో ఈ భాగ్యవంతులు ఈలాంటి నగలు పెట్టుకుంటారు?

కంటె మెళ్లో నుంచి తీసిన గుమాస్తా కూతురు కెవ్వున కేకవేసింది యానాదిమనిషి భయపడింది ఆ పిల్లకేక విన్నవాళ్లు వెంట పడ్డారు పట్టుకున్నారు తన్నినారు చితకామతకా ఆ యానాదిమనిషిని

కంటె తీసినట్లు ఆమె ఒప్పుకుంది కాని కారణం చెప్పింది కాదు ఆమె కూతురు మెళ్లో కంటె వాళ్లు తీసుకున్నారు కూతురు ఏడ్చింది యానాదిమనిషి కూతురు ఏడ్పువిని జాలి చెందింది

పొట్టగడవక ఆమె దొంగతనం చేసిందని పోలీసు వాళ్లకు ఆమెను అప్పచెప్పారు

గుమాస్తా న్యాయముగా సంపాదించిన డబ్బుతో చేయించిన కంటె అన్యాయంగా దొంగిలించినందుకు యానాదిమనిషి కొంతకాలం చెరసాలలో కూతురుతోపాటు కూడా ఉండవలసి వచ్చింది దొంగతనము చేసినందుకని ప్రజలన్నారు తన కూతురికి ముస్తాబు చేసినందుకని ఆమె అనుకున్నది

# భార్యస్మృతి

ఆ దేశమును ఒక రాజు పాలిస్తున్నాడు అతడు ధర్మశీలుడు, ఏకపత్నీవ్రతుడు

ఆ రాజు వివాహమాడిన కన్య బాల్యము నుంచీ అతని ప్రేమ దృష్టులలోనే పెరిగింది ఆమె హృదయాన ప్రేమాంకురాలు పుట్టడానికి అతని ప్రేమ దృష్టులే కారణము ఆమెలో ప్రేమాంకురాలు పుట్టిన నాటి నుంచి అతని హృదయము రాజ్యము మీద నుంచి మళ్లి ఆమె మీదనే పూర్తిగా లగ్నమయిపోయింది

వారికి వివాహమైనది ఎడబాటెరుగని ప్రేమసౌఖ్యములకు వారే పరమావధి అనిపించుకొన్నారు

వారి ప్రేమ బాల్యములో పుట్టింది, లేతమామిడి చిగురులాగ నవ నవలాడింది యౌవనములో మందార పుష్పమువలె వారి ప్రేమ వికసించింది మల్లెపువ్వులాగ వాసించింది

యౌవనము సడలుతోంది వారి ప్రేమ దృఢమౌతుంది

వారి ప్రేమకు ఫలముగా వారికి రత్నాలవంటి కొడుకులూ కూతుళ్లూ పుట్టారు

సుఖదుఃఖాల కారకమైన సంసారములో పడ్డవాళ్లు మహారాజులైనా, ఎంతటి ప్రేమ వాళ్లలో ప్రజ్వలిస్తూ వున్నా, వాటి ఫలాలను వారనుభవించక తీరదు

రాణీగారి కష్టలేశము రాజుగారికి మహాకష్టమయ్యేది రాణీగారి దగ్గరికి దుఃఖలేశమైన చేరకుండా రాజుగారు తమ జాగ్రత్తను, దైవ భక్తిని, అధికారాన్ని, హృదయాన్ని కాపలా ఉంచేవారు

ఈ విధంగా చాలాకాలం జరిగింది

విధివశాన ఒకనాడు రాణీగారికి చిన్న జబ్బు చేసింది మందులిచ్చారు కుదరలేదు జబ్బు తీవ్రమయింది రాజ్యములో ఉండే వైద్య శిఖామణులందరూ ఆలోచించి వైద్యము చేశారు రోగము తిరుగుముఖము పెట్టలేదు ఆనాటికానాడు రోగము ముదిరిపోయింది వాడివాడి, కొమ్మ నుంచి పువ్వు రాలిపోయినట్లు ఆవిడ ఇహలోకాన్ని విడిచిపోయింది రాజుగారికి రాజ్యములో ఉండే ప్రజలంతా అనునయము కల్పించడానికి ప్రయత్నించారు రాజుగారెంత దుఃఖించారో ప్రజలంతగా దుఃఖించారు రాజ్యము రాజ్యమంతా దద్దరిల్లిపోయింది

రాజుగారికి దుఃఖము తీరలేదు రాజ్యకార్యములనుంచి విరమించి రాజు తన ప్రేమమూర్తిని నిరంతరమూ ధ్యానిస్తూ కాలం వెళ్లబుచ్చుతున్నాడు దుఃఖము తీరడం లేదు, స్నేహితులు, బంధువులు, ఆప్తులు ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు ఆయన ముఖాన మందహాసమైనా ఎప్పుడూ అంకురించడం లేదు

రాణీగారిని విడిచి రాజుగారు అట్టేకాలం ఉండలేరు అనుకొన్నారు ప్రజలు ప్రజల భగవత్ప్రార్థనలు కూడా రాజుగారి దుఃఖాన్ని అరికట్టలేకపోయినవి

ఆ రాజ్యములోనే ఒక మర్రిచెట్టుకింద ఒక బిచ్చగాడున్నాడు అతనికి నడివయస్సు దాటింది అతన్ని

ఆశ్రయించి, నడివయస్సులో ఉన్న ఒకస్త్రీకూడా ఆ చెట్టునీడనే ఉన్నది వారిద్దరూ ఆ చెట్టుకిందే నక్షత్రాలనూ, చంద్రుణ్ణి సాక్షులుగా పెట్టుకొని చాలాకాలం కిందటనే పెళ్లి చేసుకొన్నారు

చిన్నతనములో ఆ బిచ్చగాడు ఆ మర్రిచెట్టు నీడను చేరాడు ఎందుకు చేరాడో అతనికి తెలియదు తనను కనిపెంచిన తల్లిదండ్రులెవరో అతనికి తెలియదు తోటి బిచ్చగాళ్ల సహవాసమువల్ల అతడు బిచ్చమెత్తి పొట్టపోసుకోవడం నేర్చుకున్నాడు తన చెట్టుకంటే సౌఖ్యప్రదమైన ఆవాసము వేరే ఇంకొక్కటి ఉండవచ్చునని అతడనుకోలేదు

వేసవికాలంలో సూర్యుడు నిప్పులు కురుస్తూన్నప్పుడూ ఘాళువులు కొట్టుతున్నప్పుడూ ఆ చెట్టు నీడే అతన్ని కాపాడింది వానాకాలంలో జోరున వానధారలు పడుతూన్నప్పుడూ, ధనికులు తాము వెచ్చగా ఇళ్లల్లో హాయిగా ఉండేటప్పుడూ - ఆ చెట్టునీడ పక్షులకువలెనే అతనికి శరణమయ్యేది శీతాకాలంలో చలి గడగడ వణికించేటప్పుడూ, రాజులు రకరకాల కంబళీలతో చలిని తరిమివెయ్యడానికి ప్రయత్నించేటప్పుడూ, ఆ చెట్టునీడే అతనికి - చిరుగుగుడ్డలు కప్పుకునే అతనికి - వెచ్చనిచ్చేది వసంత కోయిలలు అతని చెట్టుమీద కూర్చుని కూసేవి చిలకలు పలికేవి సాయంకాలము కాగానే ఆ చెట్టుతొర్రలో కాపురముండే రెండు గుడ్లగూబలు బయటకు వచ్చి అతన్ని పలకరించేవి

అప్పుడప్పుడు అతని స్నేహితులు - తోటి బిచ్చగాళ్లు ఆ చెట్టు కిందికి వచ్చి అతనితో ఇష్టాగోష్ఠి జరిపేవారు

అతనికి యౌవనము అంకురించింది యౌవనానికి జాతి మత విచక్షణలేదు ధనముతో సంబంధము లేదు జంతువులూ, మనుష్యులూ అనే భేదం లేదు వందలకొద్ది భార్యలను పెండ్లాడగల రాజులనే ఆశ్రయించాలని దానికుండదు కూటికి జరుగని బిచ్చగాళ్ల నాశ్రయించడమెందుకనుకోదు, యౌవనం రాజుల నాశ్రయించిన తాను బిచ్చగాళ్లనాశ్రయిస్తే పరువులోపమేమో ననుకోదు నల్లవాళ్ల నాశ్రయిస్తే తెల్లదొరలకు కోపం వస్తుందేమోనని కూడా అనుకోదు

అతనికి యౌవనం అంకురించడంతోనే ఏదో ఒక "వదలని కోరిక" అతనిని పట్టుకొంది ఏమిటో తెలియదు బిచ్చమెత్తుకొని పొట్టనింపుకోవాలనే సంగతి అప్పుడప్పుడు మరిచేవాడు

ఒకనాడు రైలు స్టేషనులో అడుక్కోడానికి అతడు వెళ్లాడు ఆ రైలు నుంచి ఒక ఆడపిల్ల దిగింది చిరుగు గుడ్డలలో నుంచి పడుచుతనపు లావణ్యము పైకి ఉరుకుతోంది పిల్ల గేటుదగ్గరికి వచ్చింది, టిక్కట్టులేదు బంట్రోతు మెడమీద చెయివేసి గెంటాడు తూలి కింద పడింది జారిపోయిన బట్టలమూట తీసుకొంది నవ్వింది బిచ్చగాడు చూచాడు తన బసకు ఆమెను తీసుకువెళ్లాడు ఆనాడే ఆ చెట్టుకిందే వారికి వివాహం జరిగింది

ప్రతిరోజూ వారిద్దరూ కలిసి బిచ్చానికి బయలుదేరేవారు

ఆ కోయిలల కూజితములలో, ఆ చిలుకపలుకులలో, ఆగుడ్ల గూబల కూతలలో, ఆ వెన్నెలలో, ఆ ఘాళుపులలో, ఆ చలిలో, ఆ ఎండలో తమ జీవితాన్ని కలిపివేసుకొని ఆ చెట్టునీడలో వాళ్లు సుఖమూ

అనుభవించారు రాజులనుభవించే సుఖమే గొప్పవాళ్లనుభవించే సుఖమే దుఃఖమూ అనుభవించారు రాజులూ, గొప్పవాళ్లు అనుభవించేలాంటి దుఃఖమే!

వాళ్లకు మధ్యమధ్య సంతానం కూడా కలిగింది పిల్లలు కాలు రావడంతోనే ఏదో ఒక చిప్పపట్టుకొని తల్లిదండ్రులను వదలిపెట్టి ఏదో ఒక చెట్టునో, ఒక వీధినో ఆశ్రయించేవారు వారికి కలిగిన సంతానమంతా ఈ విధముగా అన్ని దిక్కులకూ చెదిరిపోయారు బిచ్చగాడూ వాడి భార్య ఈ విధంగా కాలక్షేపం చేస్తూ ఉండగా ఒకనాటి సాయంకాలం విధివశాన ఆమెకు చిన్న జబ్బు చేసింది రాత్రల్లా మేలుకొని ఆమె జబ్బును తన ఆలోచనలతో కోరికలతో పోగొట్టవలెనని అతడు ప్రయత్నించాడు తెల్లవారే సరికి జబ్బు నిమ్మళించలేదు సరికదా ఆమె బిచ్చానికి బయలుదేరడానికి కూడా ఓపిక లేకపోయింది ఆమెను ఈ చెట్టుకిందే పడుకోబెట్టి తన భుజం మీద గుడ్డ ఆమెకు కప్పి బిచ్చగాడు తన చిప్పా, కఱ్ఱా పుచ్చుకొని బిచ్చమెత్తుకోడానికి బయలుదేరాడు బయలుదేరకపోతే ఎట్లా? ఆ రోజుకు గంజేదీ?

ఒంటరిగా వచ్చేవేమని తోడిబిచ్చగాళ్లు అడిగారు చెప్పాడు, అందులో ఒకడు మాత్ర ఇచ్చి ఆమెకు వెయ్యమన్నాడు బిచ్చగాళ్లలోనూ వైద్యులున్నారు కొన్ని వీధులు తిరిగి కొంచెం బియ్యం బిచ్చమెత్తుకొని ఇంటికివచ్చి భార్యకు మాత్రవేశాడు బియ్యం చెట్టు కిందే ఉడికరిచాడు తానింత తిన్నాడు భార్య తినేస్థితిలో లేదు మిగిలిన గంజీ కూడా అక్కడ వదలిపెట్టి భార్య దగ్గిర చేరి ఆమెకు ఉపచారం చేస్తున్నాడు రోగం మాత్రం ముదురుతోంది కొన్నాళ్లు గడచినవి ఆమెకు బ్రతికే యోగ్యతలేదని బిచ్చగాళ్లు నిశ్చయించారు. ఒకనాటి రాత్రి ఆమె ఆ చెట్టుకిందే ప్రాణాలు వదలిపెట్టింది. బిచ్చగాడు ఆమె పక్కనే కూచున్నాడు. అతడుపడ్డ కష్టాలూ, అతడు పొందిన దుఃఖమూ ఆ మఱ్ఱిచెట్టుకు తప్ప ఇంకెవరికీ తెలియవు.

రెండు రోజులయింది ఆ బిచ్చగాడు ఒక్కడూ ఆ చెట్టుకిందే పడిఉన్నాడు మూడోరోజువచ్చింది ఆకలి వేసింది జోలి చూచుకొన్నాడు కుక్కలు జోలి పీకివేసి బియ్యం తినివేసినవి. తోడి బిచ్చగాళ్లు తమ పొట్టకోసం తంటాలుపడుతూ అతని సంగతే మరిచారు చిరిగిన జోలి చేత్తో పుచ్చుకొని తూలుతూ ఆ బిచ్చగాడు ఇంటింటికి బిచ్చమెత్తడానికి వెళ్లాడు "మొద్దులావున్నావు, కూలి చేసుకోకూడదా" అన్నారు కొందరు మామూలు ప్రకారం "చెయ్యి ఊరుకోలే"దన్నారు కొందరు "పాడితేనేగాని బియ్యం వెయ్య"మని కొందరు పిల్లలన్నారు మధ్యాహ్నమయింది ఒక ముసలి ముత్తయిదువ 'గంజి తాగుతావా అబ్బీ' అంది దాక పట్టేడు ఆమె పోసిన గంజి తాగాడు మఱ్ఱిచెట్టు కిందికి వచ్చాడు జోలి తలకింద పెట్టుకొని కళ్లు మూసుకొన్నాడు

రోజురోజూ అతడు బిచ్చానికి వెళ్లుతూనూ ఉన్నాడు పొట్ట నింపుకొంటూనూ ఉన్నాడు ఏదో ఒక విధంగా, భార్యనప్పుడప్పుడు తలుచుకొంటూనూ ఉన్నాడు యధాప్రకారం కోయిలలు కూస్తూనూ ఉన్నవి చిలకలు పలుకుతూనూ ఉన్నవి గుడ్లగూబలు సాయంకాలం కావడంతోనే అతన్ని - అతన్ని ఒక్కణ్నే పలకరిస్తూ ఉన్నవి

# గోదావరి నవ్వింది

సాయంకాలము పెద్ద ముత్తైదువలాగ సూర్యుడు పసుపూ కుంకుం పూసుకొని గోదావరిలో మునుగబోతున్నాడు పక్షులు గూళ్లకు చేరుకుంటున్నవి పశువులు ఇళ్లకు మళ్లుతున్నవి నాగరీకగర్వమెరుగని జానపదులు కూడా తమతమ యిండ్లకు పోతున్నారు నాగరీకులు క్లబ్బులకు వెళ్లుతున్నారు నాగరీకుణ్ణి నేను షికారు పోతున్నాను!

గోదావరి యిద్దరి గట్టు మీద నుంచి నడిచి వెడుతున్నాను గోదావరి గాలి తగిలినప్పుడు తప్ప, మిగిలిన సమయాల్లో గట్టు గట్టంతా పట్నవాసపు వాసన కొడుతోంది ఒకచోట ఒక పెద్దమనిషి కాఫీకి బదులు ఇంకో పానీయమేదో పుచ్చుకుంటే దేహానికి ఆరోగ్యకరంగా ఉంటుందని ఒక సువాసినితో ముచ్చటిస్తున్నాడు ఒకచోట ఇద్దరు వర్తకులు ధరల తేడాలను గురించీ, లాభాలను గురించీ ప్రసంగించుకొంటున్నారు తాను తొడుక్కొన్న "జపానుపట్టులాగూ, పోలో కాలరు షర్టూ" తలుచుకొంటూ ఆనందం పొందుతున్నాడు ఒక బీద విద్యార్థి

వెళ్లగా వెళ్లగా క్రమక్రమంగా ఈ వాసన తగ్గడం మొదలెట్టింది కొంతసేపటికి ఒక కొత్త వాసన వేసింది అది పల్లెటూరి వాసన

చెట్ల నుంచి కమ్మని గాలి కొట్టుతోంది - గోదావరి మీద నుంచి వచ్చిన గాలి మోటారు కార్ల బూడిద సోకని చెట్ల ఆకులు పచ్చగా, నున్నగా, అందంగా, జేగురు

ఎండలో ఆడుతున్నాయి గట్టుకు రెండువైపులా స్వేచ్ఛగా పెరిగిన దుబ్బులు ఆ దుబ్బులలో ముగ్గురు ఆడపిల్లలు సంచరిస్తున్నారు సిగ్గు వాళ్ల హృదయాలలో ప్రవేశించబోయే వయస్సు కాళ్లకు జోళ్లు తొడుక్కొన్నారు జపాను తోళ్ళు కావు ఈ కాలపు చదువుకొనే ఆడవాళ్లు వేసుకొనే వన్నెల చిన్నెల నగిషీ స్లిప్పర్సు కావు వాళ్ల గ్రామంలో, వాళ్ల అన్నలో తమ్ముళ్లో మామలో తండ్రులో కుట్టించిన జోళ్ళు పాదాలను కాపాడే జోళ్ళు జోళ్ళవల్ల అందం సంపాదించుకోగోరే పాదాలు కావు వారివి పాదాల వల్లనే జోళ్ళకు అందం వస్తోంది ఏ సభలోనూ తీర్మానం చేసుకొని తదనుగుణంగా ధరించిన జోళ్ళు కూడా కావవి

ఆ దుబ్బులలో ఆ ముగ్గురు ఆడపిల్లలూ ఏం చేస్తున్నారు? వాళ్లు ఆ దుబ్బులలో పాడుకొంటున్నారు చుట్టుపట్ల చెట్ల మీద చిన్న చిన్న పక్షులు కూడా పాడుకొంటున్నవి గోదావరిలో చిన్న చిన్న అలలు కూడా నాగరీకులకు వినిపించకుండా పాడుకొంటున్నవి

వాళ్లు వేసుకొన్న బట్టలు బీద బట్టలు - చిరుగుల బట్టలు - కాని జపాను బట్టలు మాత్రము కావు ఈ కాలపు చదువుకొన్న స్త్రీలు కట్టుకొనే తళుకుతళుకు బట్టలు చూచే నా కళ్ళకి వాళ్ళ బీద చిరుగు బట్టలే అందముగా కనిపించేయి సొంత సొమ్ములకీ ఎరువు సొమ్ములకీ ఉండే తేడాలాంటిదే యీ బట్టల తేడా అనుకుంటా

వాళ్ల ముఖములు సహజ సౌందర్యమును బూడిదతో కప్పుకోలేదు వాళ్ల తలకట్లకు జపాను ఇంగ్లండు దేశములు అందము తీసుకురావడం లేదు

గోదావరి గట్టున పెరిగే మోదుగు మొక్క దోర ఎరుపు పువ్వుల్లాగ వాళ్లు పుట్టినట్లే ఉండి మెరసిపోతున్నారు

సూర్యబింబం గోదావరిలో సగం దిగిపోయింది

చిదుకులూ, కఱ్ఱముక్కలూ, వెళ్ళూ నింపిన తట్టలను తలపై పెట్టుకొని ఆ ముగ్గురు కన్యలూ నెమ్మదిగా గట్టెక్కి ఇంటి మొగము పట్టారు తోవలో వాళ్లను చూస్తున్న నేను వాళ్ల కళ్లకు తగిలేను

పట్నవాసపు మనుష్యుల్ని పల్లెటూరి గేదెలు చూస్తే ఏం చేస్తాయి? అలాగే పట్టణవాసపు నన్ను వాళ్లు అలాగ బెదురుగా తప్పించుకుపోయారు

నాగరీక గర్వమే నా తలకెక్కి ఉన్నట్లయితే వాళ్లని "పశువు"లని ఇంగ్లీషున తిట్టి వుందును ఆలోచించి నన్ను నేనే అనుకొన్నాను ఆ మాట ఎందువల్లనంటే వాళ్లు మొక్కలు పూసే పువ్వులు నేనూ నా తెగ వాళ్లమూ కాగితపు పువ్వులము

వాళ్ల వెంబడే నేను నడుస్తున్నాను కొంత దూరంగా సంక్రాంతి రోజులవడంవల్ల గొబ్బిపాటలు విందామని కొంచెం వాళ్లను సమీపించాను వాళ్లు పాట ఆపి కళ్ల తళుక్కుమనిపించారు నేను వెనక్కి తగ్గాను

అప్పుడే గేదెలనూ ఆవులనూ తోలుకుంటూ గొల్లపిల్లలు యిళ్లకు వెడుతున్నారు మీవేనా పశువులంటే మావే అని నాకేసి వింతగా చూచి గేదెల నదలించారు

పల్లెలకు వెళ్లుతున్నారు - పట్నవాసమునకు కార్యార్థులై వచ్చిన స్త్రీపురుషులు కొందరు స్త్రీలు కావళ్ళు మెడల మీద వేసుకు వెళ్లుతున్నారు - వట్టి కావళ్ళు - బరువులేని కావళ్ళు పట్నవాసపు సరుకులు కొనుక్కొని పొట్లాలు మోసుకుపోతున్నారు కొందరు - ఇంగ్లండులో ప్రచురించే ఇంగ్లీషు న్యూసు పేపర్లతో కట్టిన పొట్లాలు

ఎవరి పనిమీద వారు వెడుతున్నారు పనిలేకుండా ఆ గోదావరి గట్టున ప్రాణమున్న జీవమేదీ లేదు చదువుకొన్న నేనొక్కణ్ణి తప్ప!

సూర్యబింబం ఇంకా గోదావరిలో మునగలేదు పూర్తిగా మేఘాలు సూర్యుడి రంగులతో అలంకరించుకొన్నాయి గోదావరిలో అలలు పెద్దవౌతున్నాయి

ఆడపిల్లలు ముగ్గురూ ఊసులాడుకుంటూ వెడుతున్నారు తట్టల బరువు మూలాన్ని నడిచేటప్పుడు ఆ పిల్లలకు అందమైన మెడవంపులు కలుగుతున్నాయి

వాళ్లగ్రామం సమీపించాము తాటాకు యిళ్లగ్రామం పశువులు దూడల కోసం పరుగెత్తుకు వెళ్లాయి పశువుల కాపర్లు వాటి వెనకనే వెళ్లి కట్టివేస్తున్నారు

ఆ ముగ్గురు పిల్లలూ వాళ్ల వాళ్ల యిళ్లకు చేరుకున్నారు వాళ్ల తల్లులప్పుడే బజారు నుంచి బియ్యం కొనుక్కు వచ్చి యిళ్లకు చేరుకొన్నారు వాళ్ల తండ్రులూ అన్నలూ తమ్ములూ అప్పుడే కూలి పనులు ముగించి కూలి డబ్బులతో యిళ్లకు వచ్చారు

ఆ పిల్లలు వాళ్లు తెచ్చిన చిదుకులూ కఱ్ఱలూ వాళ్లమ్మలకు వప్పగించారు వాళ్లమ్మలు ఆ చిదుకులతో ఉడుకు నీళ్లు కాచి వాళ్ల నాన్నలకూ అన్నలకూ స్నానం చేయిస్తున్నారు ఆ చిదుకులతోనే వాళ్లమ్మలు వాళ్ల కుటుంబానికంతకీ అన్నం వండుతున్నారు

ఆనాటితో ఆ బియ్యం సరి ఆ చిదుకులు సరి మర్నాడు యథా ప్రకారం పిల్లలు చిదులకు, తల్లి బియ్యానికీ, నాన్నలూ అన్నలూ కూలికి

పక్షులకూ వాళ్లకీ ఏమీ తేడా నాకు కనిపించలేదు ' వాళ్లకీ పక్షులకీ దేవుడు మీద - వాళ్లను పుట్టించిన దేవుడు మీద - విశ్వాసముంది

ఒక పక్షి దగ్గిరకు వెళ్ళి, పక్షీ పక్షీ, రోజూ ఎందుకు తిండికి తంటాలు పడతావు, ఒకనాడే కూడబెట్టుకొని సుఖంగా కొంతకాలం కూచుని గడుపుకోరాదా అంటే ఏమంటుంది? ఈ ప్రపంచం అంతట్లోనూ భగవంతుడు జీవకోటికి కావలసిన యావత్తూ కూడబెట్టి ఉంచాడు ఇంకెక్కడ నేను వేరే కూడబెట్టుకోవడం అంటుంది నాగరీకుడికి నాకా మాటలలో సత్యం కనిపించదు

గోదావరికేసి తిరిగి చూచాను సూర్యుడు మాయమయ్యాడు గ్రామంలో జానపదులు భోజనాలు చేసి సుఖనిద్రలో మునిగిపోయారు

నేను గోదావరి గట్టు చేరుకున్నాను పక్షులు నిద్రపోతున్నాయి చెట్లూ నిద్రపోతున్నాయి నేను గట్టంట ఈదురోమంటూ నడిచి వచ్చి పట్నం చేరుకున్నాను పట్నంలో ప్రజలు ఇంకా ఇళ్ల మొహం పట్టలేదు

నాకు పట్నవాసం మీద అసహ్యం పుట్టింది ఆ పల్లెటూరికి వెళ్లి అక్కడే ఉండిపోతె బాగుంటుందనిపించింది ఉదయమే గొల్లపిల్లలతో బయలుదేరి పశువుల్ని తోలుకుంటూ వెళ్లి ఏ చెట్టు నీడలోనో కూచుని ప్రకృతితో ఊసులాడుకుంటూ ఉంటే ఎంత బాగుంటుంది! చద్దిమూటలు విప్పుకొని చెట్ల నీడల్లో తినీ నా పశువులతో పాటు నేనూ ఆ గోదావరి నీరు తాగి ఆ చెట్ల నీడల్లో ఆడుకొంటూ ఉంటే! ఆ ప్రకృతి ఒళ్ళోనే అక్కడే నిద్రపోతే!

లేకుంటే, ఆ పిల్లలతోపాటు నేనూ ఒక గంప తీసుకొని చెప్పులు తొడుక్కొని పాటలు పాడే పక్షులు దాక్కొనే ఆ దుబ్బులలో చిదుకు లేరుతూ ఉంటే! పిల్లలతోపాటు 'నేనూ పాటలు పాడితే! మాతోపాటు ఆ పక్షులూ పాడితే! మా పాటలన్నీ గోదావరి వింటే!' అయితే నాగరీకుణ్ణి ఆ పిల్లలు దగ్గరికి రానిస్తారా? మనిషి ముట్టుకొన్న పక్షిని మళ్ళీ పక్షులు తమలో చేర్చుకోవట! నన్నా పిల్లలు వాళ్లలో చిదుకులేరనిస్తారా?

ఆ గ్రామంలోనే ఉండిపోయి ఆ గ్రామస్థుల వలనే నేను నిర్విచార జీవనం చేస్తూ ఉంటే! ఆలోచించి చూస్తే నేనా పనికి తగనేమో అనిపించింది కూలి పనిచేసి కాయలు కాసిన చేతులు కావు నావి ముళ్ళల్లోనూ, చేలగట్లనూ తిరిగి మొద్దుబారిన పాదాలు కావు నావి శీతోష్ణాల నొక మాదిరిగా గ్రహించగలిగే దేహము కాదు నాది ఉన్న దానితో సంతోషపడే చదువుకొన్న బుద్ధికాదు నాది ప్రపంచాన్నంతనూ నా యింట్లో పెట్టుకోవాలని ఆశించే చదువుకొన్న బుద్ధి నాది శీతోష్ణాలను నిరంతరమూ ప్రతిఘటించవలెనని ప్రయత్నము చేసే దేహము నాది భూమి మీద మోపితే దాని మీద నుండే రోగ క్రిములను ఆకర్షించే పాదాలు నావి బడి పుస్తకాలు మోసిన చేతులుగాని బండరాళ్ళు మోసిన చేతులుగావు నావి

అయినా మనస్సమాధానము చేసుకొన్నాను పోనీ నేను చదువుకొన్న వాడను గదా, నాకు వచ్చిన చదువు ఆ గ్రామస్థులకు చెప్పి తద్వారా జీవనోపాధి కల్పించుకోకూడదా అనుకొన్నాను కొన్నాళ్ళు ఆ గ్రామంలోనే ఉండి గ్రామసేవ చేస్తూ వాళ్ల కృతజ్ఞత పొందకూడదా అనుకొన్నాను - చూచారా, నా చదువుకొన్న ఊహ! నేను చదువు చెప్పినందుకు వాళ్లు నాకు కృతజ్ఞత చూపాలిట! కూలిపని చేసే వాళ్లు యజమానులు తమకు కృతజ్ఞత చూపాలనుకొంటున్నారా? చిదుకులేరుకొనే ఆ కన్యలు తమ తల్లులు తమకు కృతజ్ఞత చూపాలనుకొంటున్నారా? పశువులు కాసేవాళ్లు ఆ పశువులు తమకు కృతజ్ఞత చూపాలంటున్నారా? సూర్యచంద్రాదులు కృతజ్ఞత నాశిస్తున్నారా? చదువు చెప్పబోయే నాకు మాత్రం ఆ గ్రామస్థులు కృతజ్ఞత చూపాలనుకొంటున్నాను!

తరువాత కొన్నాళ్లు ఉన్న తరువాత ఆ గ్రామంలోనే గృహ నిర్మాణం చేసుకొని ఒక యింటివాణ్ణి లవుతే! ఆ చిదుకులేరుకునే ఒక పిల్లను పెళ్లి చేసుకొని -

ప్రతిరోజూ గోదావరి గట్టున షికారు వెళ్లడం మొదలు పెట్టాను క్రమక్రమంగా ఆ గ్రామస్థులతో

పరిచయం కల్పించుకొని, తరువాత వాళ్ల సమ్మతిని గ్రామంలో ప్రవేశించవలెనని సంకల్పం ఊరి పెద్దల పరిచయం సంపాదించి ఒక చిన్న బడి పెట్టి తెలు, ఇంగ్లీషు, లెక్కలూ, సివిక్సూ వగైరా శాస్త్రాదులు వాళ్లకు బోధించవలెనని అనుకున్నాను

ఆ ముగ్గురి పిల్లలలో ఒక పిల్లతో స్నేహం సంపాదించుకొని క్రమక్రమంగా ఆమె ప్రేమ దుర్గాన్ని ముట్టడించి పట్టుకోవాలనుకొన్నాను

ఒకనాటి సాయంకాలం గోదావరి గట్టుమీద నిలబడ్డాను చెట్ల ఆకులు ప్రతిరోజూ నన్ను చూస్తూండడంవల్ల నన్ను పరిచయస్తుణ్ణిగా భావించినవి

చిన్న చిన్న పక్షులు కిలకిలమంటున్నవి ఆ దుబ్బులలో నా కళ్ళు వెతకడం మొదలుపెట్టినవి ఎవరి కోసమో నేను చెప్పడమెందుకు? మీకు తెలుసును దుబ్బులు వట్టి చేతులు తిప్పి నాకు ప్రత్యుత్తర మిచ్చినవి

ఎదురుగా గోదావరి గోదావరి అవతల చిన్న చిన్న మేఘాలు పొదిగిన ఆకాశం ఆ గోదావరి అంచునుంచీ ఒక పాట ప్రవహించి నా చెవులలో పడ్డది అటు చూచాను ఒక నల్లని విగ్రహం కనిపించింది ఒక చితుకులేరుకొనే పిల్ల ఒక పాట పాడుతోంది కాబోలు

ఆ చోటికి కొద్ది దూరంలో ఒక మడి ఆ మడిలో పనిచేస్తూన్న ఒక పిల్లవాడు ఆ పిల్లవాడు ఆ పాటను విని ఎడుమెత్తి గోదావరికేసి తిరిగి ఒక చిన్న పల్లెటూరి పాట ఆ పిల్లకేసి పంపేడు ఆ పిల్లకూ ఆ పిల్లవాడికి మధ్యనున్న అవకాశం వాళ్ల పాటలకు బాట అయినది ఆ బాటగుండా వాళ్ల హృదయాలు ప్రయాణం చేస్తున్నవి ఆ బాట/గుండా ప్రయాణం చేసి వచ్చిన ఆ పిల్ల హృదయాన్ని వాడు పట్టుకొని దాచుకొన్నాడు ఆ పిల్లవాడి హృదయాన్ని ఆ పిల్ల పట్టుకొని దాచుకుంది గోదావరి ఈ తమాషా అంతా చూచి నవ్వింది. ఇదంతా చూచి నేను బిక్కమొహం వేశాను

ఆ పిల్లవాడు మడి వదిలి ఆ పిల్లకేసి వస్తున్నాడు ఆ పిల్ల చిదుకుల బుట్ట నెత్తిమీద పెట్టుకొని ఆ పిల్లవాడికేసి వస్తోంది వాళ్లిద్దరూ చేతులు కలుపుకొని గట్టువేపు వస్తున్నారు ఇళ్లకు వెడుతున్నారు ఆ పిల్ల బీద చిగురుల బట్టలే కట్టుకొంది ఆ పిల్ల చిదుకుల గంప యిటూ అటూ ఆడి ఆ పిల్ల ముఖాన్నీ మెడనీ ఇటూ అటూ తిప్పించి అందాలు కురిపిస్తోంది ఆ పిల్ల కళ్లలోంచి ఆ పిల్లవాడి హృదయం తొంగి చూస్తోంది ఆ పిల్లవాడి చేతులో కర్ర, తలకు తలపాగా, మొలకు గోచీ, వంటికి నల్లని తళతళ, కళ్లల్లో నుంచి ఆమె హృదయం తొంగి చూస్తోంది

వాళ్లు నన్ను చూచారు చేతులు వదిలేశారు దూరదూరంగా నడవడం మొదలు పెట్టారు నన్ను వాళ్లు సమీపించారు ఆ పిల్ల నన్ను చూచింది నిత్యమూ నేను ఆ పిల్లకోసం ఏరి ఉంచుతూ ఉన్న చిదుకులు ఆ నాడు పిల్ల తీసుకోలేదు ఆ పిల్లవాణ్ని నేనెరుగుదును వాడు నన్ను పలకరించకుండానే వెళ్లిపోయాడు

నేను కొంతసేపు అక్కడే నిలబడిపోయాను

ఊరి పెద్దలతో ప్రసంగించాను చదువుకోడానికి పిల్లలకి తీరుబడిలేదన్నారు జీవనోపాధి వాళ్లకు భగవంతుడేదో కల్పించే ఉన్నాడు కాబట్టి వేరే ఈ చదువు జీవనోపాధి కోసమే కాదనిన్ని జ్ఞానాభివృద్ధి ఇత్యాదిగా చెప్పాను చెప్పేటప్పుడు నా అంతరాత్మ నాకు జ్ఞాపకం చేసింది - ఏమనంటే, నేను చదువుకొన్నది జీవనోపాధికే అనీ, లోకమంతా ఇప్పుడు చదువుకుంటూ ఉన్నది జీవనోపాధికే అనీ, ఆ గ్రామములో నేను

చదువు చెప్పదలచుకొన్నది జీవనోపాధికే అనీ

వాళ్లడిగారు నన్ను, ఏమి చదువు చెప్పుతావని  ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు, హిష్టరీ వగైరా పేర్లు చెప్పాను  వాళ్లొకమాట చెప్పేరు  వాళ్ల ఊళ్లో ఒక అమ్మాయి చదువుకోడానికి పట్నవాసం వెళ్లిందట  ఎవరో వచ్చి తీసుకువెళ్లారుట  ఆ పిల్లకు తల్లిదండ్రులు లేకపోవడంవల్ల వెళ్లవీలయిందిట  ఆ పిల్ల చదువుకొందిట దానికి ఫలంగా ఆ పిల్లకి వచ్చిందేమిటంటే! వేషాలు వేసుకుందామని తీరని ఆశా, వాళ్ల దేవుళ్లని కొలవకపోవడం, తన గ్రామస్థులను చూచి అసహ్యించుకోవడమూ, అన్నిటికన్న గొప్ప విషయం - పెళ్లి చేసుకోకపోవడం  నిజానికి పెళ్లి చేసుకోకపోవడంలో ఆ పిల్లది తప్పేమీ లేదుట  ఎందువల్లనో ఏ సంబంధమూ కుదురలేదుట  కాబట్టి వాళ్ల దేవుళ్లని మరిపించే చదువు వాళ్ల కక్కరలేదన్నారు  వేషాలు పెంచే చదువు వాళ్ల కక్కర్లేదన్నారు  పెళ్ళిని చంపే చదువు వాళ్ల కక్కరలేదన్నారు

అయితే ఏమంటారన్నాను నేను  ఆ గ్రామస్థులకు చదువు చెప్పే మాటయితే రాత్రివేళ రామాయణమో, భారతమో, భాగవతమో పారాలు చెప్పమన్నారు - నన్ను - ఇంగ్లీషు చదువుకొన్న నన్ను! నేను మాట్లాడలేదు నూటికి ముప్పై మూడున్నర తెలివితేటలు తెలుగులో సంపాదించిన నేను భారత భాగవత రామాయణాదులు పారం చెప్పడమా? సెలవు పుచ్చుకొని బయలుదేరాను

సాయంకాలము గోదావరి గట్టునే వస్తున్నాను  పల్లెలకు పోయే స్త్రీ పురుషులు ఎదురుపడ్డారు అలవాటు చొప్పున దుబ్బులకేసి చూచాను  దుబ్బులు నన్ను చూచి నవ్వాయి  ఆ పిల్లకోసం గోదావరి తీరం అంతా కళ్లతో పరీక్ష చేశాను  ఆ పిల్ల ఒక చెట్టుకొమ్మమీద కూచుని ఎండు పుల్లలు విరిచి కింద పడేస్తోంది ఆ పిల్లవాడి కోసం చూచాను  వాడు దూరాన్నున్న పశువుల నదలించి ఇంటిముఖం పట్టిస్తున్నాడు  నేనక్కడ ఆగాను  ఆ పిల్లవాడు చెట్టు మొదటకు వచ్చాడు  ఆ పిల్ల విరిచి పడవేసిన పుల్లలన్నీ ఆ గంపలోకి ఎత్తాడు ఆ పిల్లచెట్టు దిగుతోంది  ఆ పిల్లకేసి చూస్తున్నాడు  వెనక్కు విరిచికట్టిన చీర, మెడమీదికి దిగజారుచున్న ముడివేసిన పెద్ద జుట్టు, కళ్లకు కడియాలు, పెదవులకు నవ్వులు, కళ్లకు తళుకులు

పక్షి చెట్టు కొమ్మమీద గెంతడం చూచారా? చెట్టునంటిపెట్టుకొని పాకే తీగను చూచారా? తొడిమి వీడి కిందికి దిగజారే పువ్వును చూచారా? పిల్ల కిందకు దుమికింది చిన్న కొమ్మమీద నుంచి  పిల్లవాడు నవ్వాడు పిల్లవాడు బుట్ట ఆమె నెత్తిమీద పెట్టాడు

వాళ్లు పాటలకు మెరుగులు పెడుతూ నడిచి వస్తున్నారు  చెట్ల పూవు లొక్కొక్కటి వాళ్లమీద రాల్తున్నాయి  గట్టుపక్క మోదుగు పువ్వులు రెండు తుంపి పిల్లవాడు ఆ పిల్ల కర్ణాల నలంకరించాడు  పక్షులు కిలకిలలాడుతున్నాయి  సూర్యుని అరుణకిరణాలు లోకాన్నంతనీ కప్పాయి  కాని వాళ్లమీద మరింత దట్టంగా పడ్డాయి  గోదావరి వాయువు ద్వారా వాళ్ల కాశీర్వచనాలు పంపింది  వాళ్లు గబ్బెక్కారు  నన్ను చూచారు "వెడుతున్నా, పిల్లా!" అన్నాను  "మంచిది, అన్నయ్య గారు! మళ్లీ ఎప్పుడొస్తా"రంది  ఆ పిల్ల విగ్రహమంతా నన్ను చూచి నవ్వినట్లయింది

"వెడుతున్నానురా, అబ్బీ!" అన్నాను  "మచింది, బాలయ్యా!" అన్నాడా పిల్లవాడు

వాళ్లు నన్నుదాటిపోయారు  గోదావరి కేసి చూచాను  నిజమో కాదో నేను చెప్పలేను గాని గోదావరి కూడా నన్ను చూసి నవ్వినట్లయింది

# పెద్దమేడ

ఆ వీధిలో ఒక పెద్దమేడ ఉన్నది

ఆ దారిని పోతూవున్న వాళ్లు తలెత్తి ఆ మేడకేసి చూచి మళ్లీ తల కిందికి దించరు ఆశ్చర్యపోతారు

వాళ్లు ఆ మేడలో అందమే చూస్తారో, ఉన్నతే చూస్తారో, ధన దేవతనే చూస్తారో, చెప్పడము కష్టము

ఆ మేడను ఆశ్రయించుకొని చాలా ఇళ్లు ఉన్నవి మండువా ఇళ్లూ, పూరిళ్లు, గుడిసెలూ ఆ ఇంటి పక్కనే రాములవారి కోవెల ఉన్నది ఆ పెద్దమేడ మేఘ మండలాలలో నుంచి కోవెల కేసి పెంకెతనపు చూపు చూస్తూ ఉంటుంది చూపు తగిలి కోవెలలో ఉన్న రాములవారు ఒక మూలకు ఒదిగిపోయారా అనిపిస్తుంది

ఆ మేడను డబ్బుతో కట్టారు

మండువా ఇళ్లనూ, పూరిళ్లనూ, గుడిసెలనూ మర్యాదతో కట్టారు

కోవెలను భక్తితో కట్టారు

ఆ మేడను ఆశ్రయించుకొని కొందరు మనుష్యులున్నారు వారు ఎప్పుడూ రూపాయల చప్పుడులో మునిగి ఉంటారు

ఆ రూపాయల చప్పుడులో పక్క కోవెలలోని తూర్యనాదాలు వారికి వినిపించవు పక్క కుటీరాలలోని స్వచ్ఛ హృదయ పరిమళము వారా ఘ్రాణించలేరు

ఆ మేడలో గూడు కట్టుకొనడానికి ఒక పిచ్చికైనారాదు

ఆ మేడమీద విశ్రాంతి తీసుకోవడానికి ఒక పావురమైనా వాలదు గంగడోలు గోకించుకోడానికి ఒక ఆవైనా ఆ మేడముందు నిలువదు

ఆ గుడిసెలలో కొందరు మనుష్యులు కాపురమున్నారు ఆ గుడిసెల చూరులలోనే కొన్ని పిచికలు కూడా కాపురమున్నవి ఆ గుడిసెల పంచ పెరిగిన పచ్చ చెట్ల మీద చిలకలు కబుర్లు చెప్పుకుంటవి

ఆ గుడిసెల పంచలలో మేక పిల్లలు సరదాగా ఆడుకొంటవి

ఆవులు ఆ పంచలలో చేరి మెడామెడా రాచుకొంటూ కూర్కు చెందుతవి మనుష్యులూ, పక్షులూ, జంతువులూ, అరమరిక లేకుండా అక్కడ కాపురము చేస్తున్నారు

కోవెలలో శ్రీరామచంద్రమూర్తి వెలిశాడు రాములవారి పాదదర్శనము కోరి ప్రతి ఉదయమూ గుడిసెలలోని ప్రజలు ఆలయములో మూగుతారు

రాములవారి ద్వారా ధనదేవతను ఉపాసించడానికి మేడలోని వారు బట్టలూ, పువ్వులూ, పండ్లు లనే లంచాలతో అక్కడికి ప్రతి ఉదయమూ వస్తారు.

కోవెల గూళ్లను పావురాలు స్వగృహాలు చేసుకొన్నవి కోవెల ముందున్న వరికంకులను పిచికలు స్వేచ్ఛగా అనుభవిస్తవి కోవెల గోపురాల మీద చిలకలు విశ్రాంతికై వాలి మనశ్శాంతి పొందుతవి

కోవెల ముందు ఆ దారిని పోయే ఆవులు ఆగి కనురెప్పలతో నమస్కారాలు రాములవారి పాదాలకు సమర్పిస్తవి

రాముల వారి ఎదుట పావురాలు మొగ్గలు వేసి వినోదము కల్పిస్తవి

రాములవారి ఒడిలో పిచికలు సుఖనిద్ర పొందుతవి

రాములవారి పలుకులు అనుకరించబోయి చిలకలు చిన్న బుచ్చుకొంటూ ఉంటే రాములవారు విలాసముగా నవ్వుతారు

రాములవారికి వసంతోత్సవము జరిగే కాలాన కోకిలలు తూర్యనాదాలతో తమ స్వరాలు కలిపి ఆ ఉత్సవానికి కొత్త అందము తీసుక వస్తవి

గోవులు తమ కోమల హృదయ కోరకాలను రాములవారికర్పించి సమాధి చెందినట్లు కోవెల పంచ నిద్రపోతవి

మేడలో వారు బజారులో కొని తెచ్చిన పువ్వులను శిఖలలో ధరిస్తారు గుడిసెల ముందు పూల మొక్కలు నవ్విన పువ్వులు రాములవారి దేహము నాశ్రయించి పావనమౌతవి తరువాత గుడిసెలలో వారి శిఖలలో ప్రవేశిస్తవి

సంక్రాంతి పండుగ వచ్చింది

రాములవారికి ప్రతిరోజూ ఉత్సవాలు జరుపుతున్నారు ప్రజలు ఆ ఉత్సవాలు చూచి మనుష్యులూ, పశు పక్ష్యాదులూ అందరూ సంతోషిస్తున్నారు

సంక్రాంతి పండుగనాడు గుడిసెలన్నీ ముస్తాబైనవి గుడిసెల ముందు రకరకాల ముగ్గులు వికాసము చూపుతున్నవి

పెద్దమేడ కూడా ముస్తాబైంది ఆ ముస్తాబు చమ్కీ బట్టల ముస్తాబులాగ ఉన్నది

కోవెలకు దివ్యతేజస్సు ఆనాడు వచ్చింది రాములవారి హృదయము భక్తుల ప్రార్థనలవల్ల మహాసముద్రమై ఉప్పొంగిపోతూ ఉన్నది రాములవారు ఆనాడు చాచిన రెండు చేతుల మధ్యకూ ఎందరైనా పోయి దివ్య సౌఖ్యములు పొందవచ్చు నన్నట్లున్నవి ఆ దేవుని కౌగిలి అనంత కైవారము ఆ కౌగిలిలో ఊహకు అందని ఆనందము నిబిడీకృతమై ఉన్నది ఆ కౌగిలిలో ఆనందము నూతన జీవనమును ప్రసాదించగలదు అటువంటి కౌగిలి ఆనాడు ప్రజలు రాములవారి అపార కృపా విశేషముచేత కలిగింది

గుడిసెలలోని వారు ఆ కౌగిలిలో చిక్కుకొన్నారు చిలకలూ, కోయిలలూ, గోవులూ, మున్నగు భక్తులందరూ కౌగిలి విందు గైకొని సౌఖ్యముననుభవిస్తున్నారు మేడవారికి రాములవారి కౌగిలి కనబడలేదు రాములవారు చేసుకొన్న ముస్తాబు మాత్రమే చూచి వారు మురిసినారు

కోవెల ముందు కూడా సంక్రాంతి ముగ్గులు పెట్టారు పెద్ద రథము, గంటల రథము, జెండాల రథము సర్వాంగ సుందరమై కోవెల ముందు అది జీవకళలతో ప్రకాశిస్తున్నది ఆ రథము మీద లంతటా పువ్వులు హసిస్తున్నవి ఆ రథము మీద పసుపూ కుంకుమ పావనత్వాన్ని వెదజల్లుతున్నవి ఆ రథం మీద రాములవారు కూర్చున్నారా అన్న మోస్తరుగా అది ప్రకాశిస్తున్నది పెద్దమేడముందు కూడా ముగ్గులున్నవి రథములు, గుంటల కోనేళ్లు, తాబేళ్లు, పాములు, గుమ్మడి పండ్లు ఎన్నో రకాల ముగ్గులు ఆ ముగ్గుల మీద పువ్వులూ ఉన్నవి అవి అన్నీ కునుకు పాట్లు పడుతూ ఉన్నట్లున్నవి

మహా వైభవముతో తాను చేసుకొన్న ముస్తాబు చూచుకొని, ప్రక్క గుడిసెల ముస్తాబు ఆ కళ్లతోనే

చూచి పెద్దమెడ నవ్వింది  గుడిసెలు తమ ముస్తాబు చూచుకొని పెద్దమేడ ముస్తాబు చూడజాలక కోవెల పక్కకొదిగి ప్రతి నవ్వు నవ్వినవి

మేడ కోపముతో ప్రశ్నించింది!

"ఎందుకు నన్ను చూచి నవ్వుతారు?"

"నీ నవ్వుకు ప్రతిగా మేము నవ్వాము "

"నా అంతస్థులు విశాలములు  అందులో కళాశోభితములైన స్థంభాలు సుందరములు, నా గోడలమీది చిత్రములు రంగులతో పులకరిస్తూ ఉంటవి  నా శిఖరము మీది గోపురము లతాద్యలంకారాలతో కిరీట శోభ పొంతున్నవి  నాలో అందమంతా ఇమిడి ఉన్నది  వీటిని అతిశయించే నా ఉన్నతి మీరు కళ్లెత్తి చూడరానిది నా నవ్వుకు కారణము ఇప్పుడు మీకు బోధపడిందా?"

"ఆ ఉన్నతి చూచుకొని నీవు నవ్వావు కాబోలు  నీ అంతస్థుల అమరిక మా ధైర్యమువల్ల కలిగిందే కళాశోభితమైన స్థంభాలు మా కౌశలమునే ప్రకటిస్తున్నవి  గోడలమీది చిత్రాలు మా ఓర్పుకూ, నేర్పుకూ నిదర్శనాలు  నీ కిరీటము నీకు మేము పెట్టిందే  నీ ఉన్నతి నీకు మేము కల్పించిందే "

"మీ ధైర్యమును, మీ కౌశల్యమును, మీ ఓదార్పును, మీ ఓర్పును, నేను మీకు ప్రతిఫలమిచ్చి కొనుక్కున్నాను  అందువల్ల వాటి ప్రసక్తి మీకు ఉండరాదు "

"మా కౌశల్యాదులు తుచ్ఛమైన ధనముతో సరితూగవు "

ఈ సంభాషణ విని కోవెల ఫక్కున నవ్వింది

ఆ నవ్వు విని గుడిసెలు సిగ్గుతో తలలు వంచుకొన్నవి  ఆ నవ్వు చూచి పెద్దమేడ అపరిమితమైన ఆనందము పొందింది.

చాలాకాలము గడచింది

గుడిసెలుండే చోట ఒక వనము పెరిగింది  ఆ వనములో పూల మొక్కలూ, పళ్లచెట్లూ, దుబ్బులూ పెరిగినవి  పూల మొక్కల మీద తుమ్మెదలూ, సీతాకోకచిలుకలూ ఆడుకొంటూ ఉంటవి ఎప్పుడూను పళ్లచెట్లమీద నివాసము ఏర్పాటు చేసుకొని రకరకాల పక్షులు పళ్లు తింటూ గానము చేస్తూ ఉంటవి దుబ్బులలో అనేకరకాల కీటకములూ, చిన్న జంతువులూ, చిన్న పక్షులూ తలదాచుకుంటూ ఉంటవి  ఆ వనమంతా ఎప్పుడూ కలకలలాడుతూ ఉంటుంది

కోవెల ఉండేచోట ఒక రావిచెట్టు మొలిచింది  ఆ రావిచెట్టు ఆ ప్రాంతాల జంతుజాలానికంతకూ చలువ ఇస్తూ ఉంటుంది  ఆ రావిచెట్టు మొదటా,  కొమ్మలమీదా, ఆకులమీదా అంతా జీవకోటే  రావిచెట్టు ఆకుల గలగల జంతుజాలాని అంతనూ జోకొట్టుతూ ఉంటుంది

పెద్దమేడ ఉండేచోట రాళ్లగుట్టలు ఉన్నవి  ఆ గుట్టల చుట్టూ బొమ్మచెముడు మొలిచిపోయింది  ఆ గుట్టల నిండా పాముల పుట్టలు  రాత్రివేళ గుడ్లగూబలు ఆ గుట్టలెక్కి కూస్తూ ఉండడం కూడా కద్దు

రావిచెట్టు ఆగుట్టల మీద కూడా పళ్లురాల్చి మొక్కలు మొలిపించాలని చూస్తూ ఉంటుంది  కాని జంతువులు ఆ మొలకలను బతకనియ్యవు

# చెంచురాణి

కర్నూలు నుంచి శ్రీశైలము వెళ్లేటప్పుడు తోవలో నాగలూటి అనే గ్రామము వద్ద - యాత్రికులు మజిలీ చేస్తారు ఆ చిన్న గ్రామములో కాపురమున్న వాళ్లందరూ చెంచువాళ్లే దానికే ఈ మధ్య బైరాగి కట్ట అని మొండికట్ట అనీ పేర్లు వచ్చాయి

నాగలూటిలో దేవాలయము ఉన్నది దానికి ఎదురుగా నెగళ్లు వెలిగించి యాత్రికులు రాత్రులు గడుపుతారు కొందరు దేవాలయ మండపము మీదకెక్కి పడుకుంటారు

నాగలూటి గ్రామము అడవుల మధ్య ఉన్నది మామిడి చెట్లూ, వెదురు దుబ్బులూ అక్కడ ఎక్కువగా పెరిగి ఉన్నవి మాఘమాసములో తాండ్రచెట్లు బాగా పుష్పిస్తవి ఆ పువ్వుల సౌరభము రాత్రివేళ నాగలూటి ప్రాంతాల వ్యాపిస్తుంది అప్పుడే మామిడికాయలూ చిలక కొట్టులూ రాలటం ఆరంభం చెంచువాళ్లు ఆ కాయలూ పళ్లు తిని పొట్ట నింపుకొంటారు

వేసవి కాలములో నాగలూటి వద్ద మృగభయము కద్దు రాత్రివేళ అప్పుడప్పుడు నీళ్లు తాగడానికి ఒక్కొక్క పెద్దపులి ఆ ప్రాంతాలకు వస్తూ ఉంటుంది అందుకోసమే

యాత్రికులు నిద్రమాని నెగళ్ల చుట్టూ కూర్చుంటారు

నాగలూటి దగ్గిర చిన్న నీళ్లకుండు (పుష్కరిణి) ఉన్నది ఆ కుండలోకి ఎప్పుడూ పాతాళగంగ ధారగా వచ్చిపడుతూ ఉంటుంది ఆ కుండులోనే యాత్రికులు స్నానము చేయడము ఆ నీళ్లే గ్రామస్థులు తాగడము ఆ నీళ్ల కోసమే పెద్దపులులు రాత్రివేళ రావడము కూడాను

నల్లమల కొండలు అరణ్యమయము అక్కడక్కడ చెంచు గూడెములు చాలా కలవు నాగలూటి అటువంటి చెంచుగూడెమే ఈ కొండలోనే పుణ్యక్షేత్రములు కలవు శ్రీశైల మన్నిటిలోను మహత్తు కలదని ప్రసిద్ధి కెక్కినది శ్రీశైలము మీది రాళ్లన్నీ శివలింగములేనట శ్రీశైలము మీది చెంచులందరూ సిద్ధులేనట

శ్రీశైలమును బట్టి నల్లమల కొండలకూ అందలి అరణ్యములోని చెట్లకూ కూడా మహత్తు కలిగింది

ఒకయేడు శివరాత్రికి శ్రీశైలము వెళ్లి తిరిగివస్తూ కొందరు యాత్రికులు నాగలూటి సమీపాన వంట చేసుకొంటున్నారట వారికి ఆ నాటికి ఒక చెవులపిల్లి ఆహారము కానున్నది కుండలో దాని మాంసముంచి కూర వండుతూ కలియబెట్టడానికి ఏమీ లేక కర్రముక్క పక్కన పడిఉంటే దానితో ఆ కూర కలియబెట్టేసరికి కుండలో నుంచి చెవులపిల్లి బుడుంగున బయటికి దుమికి పారిపోయిందట సంజీవినికున్న ప్రభావము నల్లమల కొండమీది కొన్ని చెట్లకు కలదట

చెట్లకే కాకుండా అక్కడ వాసముచేసే సిద్ధులకు కూడా ఇటువంటి మహత్తు కలదట

మనుష్యులకు ఆకలి లేకుండా ఉంటే ఎంత బాగుంటుందో, ఏ తాపత్రయమూ లేకుండా హాయిగా భగవన్నామస్మరణ చేస్తూ కాలం గడపవచ్చును కదా అనుకునేవాడు ఒక బ్రాహ్మడు అతడు అగుపించిన బైరాగులనందరినీ ఆశ్రయించి ఆకలి లేకుండా చేసుకొందామని చాలా ప్రయత్నించినాడు ఒకమారు అతడు నల్లమల కొండలలో ఒక సిద్ధుడిని చూచాడు ఆ సిద్ధుడు ఏదో పసరు తాగించి ఆ బ్రహ్మడికి ఆకలి లేకుండా చేశాడు అప్పటికి సంతోషించినప్పటికీ ఆ బ్రహ్మడు తరువాత పడ్డ ఆందోళన ఇంతా అంతా కాదు

భగవన్నామస్మరణ అంటుండగా తనకేదో జాడ్యము సంభవించినట్లు అతడు భావించి ఎన్నో మందులు మింగాడు లాభము లేకపోయింది తుదకొక బైరాగి అతనికి తటస్థపడ్డాడు ఆ బైరాగి అతనికో మందిచ్చినాడు ఆ మందు ప్రభావము వల్ల అతడు పూర్వము తానుతిన్న పసరు కక్కివేసినాడు ఆ బైరాగి ఆ పసరు తాను తిని క్షుధను జయించి అంతరాయరహితమైన సమాధిలో ప్రవేశించాడు నల్లమల కొండల ప్రభావము అట్టిదని లోకులు చెప్పుకొంటారు

నాగలూటి గూడెములో చాలా వెదురు గుడిసెలున్నవి కాని ఒక గుడిసె మాత్రము దూరముగా ఒక మామిడి చెట్టు కింద పుష్కరిణికి సమీపముగా ఉన్నది ఆ గుడిసెలో ఒక చెంచెత ఒక చెంచు బాలుడూ కాపురమున్నారు

చెంచుది ముసలిది నల్లని శరీరము వయస్సులో అందకత్తె ఇప్పుడు శరీరమంతా ముడతలు పడ్డది చెంచుబాలుడు చామనఛాయ రంగు, నీలిరంగు కళ్లు, రాగి వెంట్రుకలు, చెంచుబాలునకు ఇరవై సంవత్సరముల వయస్సు ఇతడు ముసలిదాని కొడుకే పగలు వేటాడి తనకూ తల్లికీ సరిపోయినంత ఆహారము సంపాదించేవాడు ముసలిది ఎప్పుడూ గుడిసెముందు ఏదో పరధ్యానముగా ఆలోచిస్తూ కూర్చుంటుంది అక్కడ చెంచువాళ్లందరూ ఆమెను చెంచురాణి అని పిలుస్తారు

యాత్రికులు ఆమెను చూచి చెంచురాణీ అని పిలవడము విని ఆమె గొప్ప సిద్ధురాలని భావించి కొబ్బరి కాయలూ అరటిపళ్లూ ఆవిడకు సమర్పిస్తూ ఉంటారు ముసలిదాని దృష్టి పళ్లమీదగాని యాత్రికులమీదగాని ఎప్పుడూ పడలేదు అప్పుడప్పుడామె ఈ రీతిగా గొణుగుకొనేది 'సముద్రాలు, సముద్రాలమధ్య దేశం దేశంలో ఊళ్లు ఒక ఊళ్లో నా దేవుడు "యాత్రికులకు ఈ మాటలు అర్థమయ్యేవి కావు

ముసలిదానికి చిన్నతనములో తల్లిదండ్రులుంచిన పేరు లచ్చి మధ్యకాలములో వచ్చిన పేరు బెస్సీ అంత్యకాలములో వచ్చిన పేరు చెంచురాణీ ఆమె కొడుకు పేరు వీరభద్రుడు

ఆమె ఇతరులతో ఎప్పుడూ మాట్లాడలేకపోయినప్పటికీ కొడుకుతో అప్పుడప్పుడు ప్రసంగించేది సముద్రాలు దాటి దేశాలుదాటి తనను తన కొడుకు తీసుకొని వెళ్లగలడేమో అని అడిగేది సముద్రాల మధ్య దేవతల దేశాలు చూడడానికి అతనికి కుతూహలము ఉన్నదేమోనని కనుక్కొనేది అక్కడ అడవులు ఉంటాయా అక్కడ వేటాడవచ్చునా అక్కడ చెంచువాళ్లుంటారా అని అతడడిగేవాడు అక్కడ మన దేవుడున్నాడు పెద్దవాడవైనాక అక్కడకు నన్ను తీసుకొని వెళ్లవా అని ఆమె ప్రశ్నించేది వీరభద్రుడు ఆమె మాటలర్థము చేసుకొనలేక ఒక్కొక్కప్పుడు ప్రత్యుత్తరమిచ్చేవాడే కాదు

ఉడులొడ్డిపట్టి తెచ్చిన క్షుద్రజంతువులూ, కాయలూ పళ్లూ ఊచబియ్యమూ తేనెపట్టుల మైనమూ ఆమె దేహాన్ని పోషిస్తున్నవి ఆమె హృదయమును పోషించడమునకు తన కొడుకు విగ్రహమూ తన ఆలోచనలూ ఉండేవి

అప్పుడప్పుడామె నిట్టూర్పు విడిచేది వాయువు కూడా అప్పుడే ఏ చెట్ల సందునుంచో నిట్టూర్పు విడిచేది

ఆమె అప్పుడప్పుడు కన్నీళ్లు విడిచేది చెట్ల ఆకుల నుండి అప్పుడే మంచు బిందువులు రాలేవి

ఆమె అప్పుడప్పుడు కొడుకును కౌగిలించుకొని నీవే నా దేవుడవా అనేది నేను కాదనేవాడతను కాని ఆ మాటలామెకు వినబడకుండా వెదురు దుబ్బులు కీచుమని ధ్వనిచేసేవి

ఆ ప్రాంతములలో నివాసము చేసే చెంచువాళ్లందరూ వీరభద్రుణ్ణి చెంచురాణీ కొడుకనే పిలిచేవారు

అతనిని వాళ్లందరూ గరవముగా చూచేవారు వీరభద్రుడు వేటాడడములో నేర్పరి విల్లమ్ములు పుచ్చుకొని అడవిలోకి వేటకువెళ్లి అతడెప్పుడూ వట్టిచేతులతో ఇంటికి రాలేదు

తాను అందరూ చెంచువాళ్లలాగా ఉండకపోవడమూ తననూ తన తల్లినీ అందరూ గౌరవముగా చూడడమూ అతనికి బోధపడినదికాదు అందుకు కారణమేమై ఉండునా అని అతడు చాలా మందిని అడిగాడు ఏ కారణముచేతనో వాళ్లు అతనికి సరియైన కారణము చెప్పారుకారు తన తల్లి తప్ప ఇంకెవరూ తనకు చెప్పరని ఊహించి అతడు ఒకనాడు తల్లిని చెప్పవలసిందని తొందర పెట్టినాడు తల్లి సందేహించి సందేహించి తుదకు చెప్పింది పాతాళగంగ కొండలమధ్య నుంచి ప్రవహిస్తూ ఉన్నదనీ ఆ పాతాళగంగ అక్కడకు తూర్పుగా ఎక్కడో అరణ్యాము మధ్యకొండలలో మలుపు తిరిగినదనీ ఆ మలుపు దగ్గర నీరు చలనము లేకుండా ఉంటుందనీ, ఆ మలుపు గుహవలె ఉంటుందనీ, దానిపేరు పీనుగుల గొంది అనీ అక్కడకు వెళ్లినట్లయితే ఇద్దరు చెంచువాళ్లు కనిపిస్తరనీ ఆ చెంచువాళ్లను కలుసుకొని తాను లచ్చి కొడుకు నని చెప్పి, లచ్చి సముద్రాలు మధ్యకు వెళ్లుతున్నదని చెప్పవలసినదనీ వాళ్లే నీకు జన్మవృత్తాంతము యావత్తూ చెప్పుతారనీ ఆమె చెప్పింది వీరభద్రుడికి అక్కడికి వెళ్లవలెనని కుతూహలము కలిగెను కాని తల్లిని ఒక్కదానిని వదలిపెట్టి ఎలాగ వెళ్లడం? చెంచురాణి ఆ సంగతి గ్రహించి తనకు అక్కడ ఉన్న చెంచు వాళ్లు తిండి పెట్టుతూ ఉంటారు కాబట్టి ఆ విషయమై అతడు బెంగ పెట్టుకోవలసిన అవసరము లేదని చెప్పింది

వీరభద్రుడు ప్రయాణానికి సిద్ధపడ్డాడు విల్లమ్ములు తీసుకొన్నాడు మొలలో పెద్దకత్తి దోపుకున్నాడు కట్టుకొన్నబట్టా పై మీద బట్టతోటీ బయలు దేరాడు అడవులలో నడవడము ప్రారంభించాడు

తెల్లవారుజామున బయలుదేరి బారెడు పొద్దు ఎక్కేసరికి పెద్ద చెరువు చేరుకున్నాడు అక్కడ చెంచు గూడెము, లంబాడీ గూడెమూ ఉన్నవి

ఆ గూడెములవైపు పోక అతడు తోవలో సంపాదించిన మామిడి కాయలూ, టుంకిపళ్లూ, చింతగుల్లలూ తిని, చెరువులో నీళ్లు తాగి ప్రయాణం సాగించాడు తోవలో చెంచువాళ్లు అతన్ని చూచి ఎవరో పరాయివాడు వచ్చాడనుకొనిని బద్దా అలుగులూ సర్దుకొన్నారు సమీపమునుంచి చూచి చెంచురాణీ కొడుకు చెంచురాణి కొడుకు అని అరుస్తూ పారిపోయినారు.

నడవగా నడవగా కృష్ణానది కానవచ్చినది బండలమీద నుంచి మందముగా ప్రవహిస్తూ ఉంది దానిగట్టునే అతడు నడిచిపోతున్నాడు వెదురు దుబ్బులలో నుండి అడవికోళ్లు కూయడం ప్రారంభించినవి కోతులమందలు అతనిని చూచి ఒక బండమీద నుంచి ఇంకొక బండ మీదికి దుముకుతూ పోయి అదృశ్యమైనవి తోవలో టేకుచెట్లూ, మద్దిచెట్లూ గొడుగు తుమ్మచెట్లూ, మంచిగంధపు చెట్లూ, వెదురు పొదలూ ఎన్నో ఉన్నవి అతడు వానిని చూడకుండా తల్లి సంగతీ తన సంగతీ తలచుకొంటూ వెళ్లుతున్నాడు సాయంత్ర మయ్యేసరికి శ్రీశైలము చేరుకున్నాడు తోవలో చెంచువాళ్లెవళ్ళు అతనికి తటస్థపడలేదు అతనికి ఆకలి వేసింది కత్తితో ఒక ఈతచెట్టు పడగొట్టి దానిని నరికి మొవ్వ తిని ఆకలిదప్పులు అణచుకొన్నాడు శ్రీశైల దేవాలయానికి ఎదురుగా ఉన్న సత్రపు గదులలో ఆ రాత్రి నిద్రపోయాడు రాత్రి నాలుగో జామున లేచి, నలిగిన బాటగుండా వెళ్లినాడు తోవలో వెలుగుబంట్లు అతన్నీ అతని విల్లునూ చూచి తప్పుకున్నవి జింకలమందలు చెంగుచెంగున దాట్లువేస్తూ పారిపోయినవి చాలా దూరం నడిచిపోగా అతనికి పాతాళ గంగ గోచరమైంది పాతాళగంగను అనుసరించి అతడు నడిచి పోయాడు చిటచిటలాడుతూ ఎండ కాస్తున్నది పాతాళ గంగలో స్నానము చేసి కడుపునిండా నీళ్లు తాగి ఒక బండప్రక్క నీడలో విశ్రమించాడు అతనిచుట్టూ

పెద్ద కొండలు, అక్కడక్కడ వెదచల్లినట్లు పెద్ద పెద్ద రాళ్లు కొండలనిండా చెట్లు పెద్ద పులులు సంచారం చేసే చోటది అతనికి అక్కడ కునుకు పట్టింది ఎంతసేపు నిద్రపోయాడో తెలియదు కళ్లు తెరచేసరికి అతనికి ఎదురుగా ఒక బండమీద ఒక చెంచుపిల్ల కనబడింది నల్లని పడుచు చెంచు పిల్ల పదహారు సంవత్సరముల ఈడుగలది అతనిని పరకాయించి చూస్తున్నది ఆమె పక్క ఒక బుట్ట, బుట్టలో పళ్లూ కాయలూ కత్తీ ఉరులూ మొదలైన వస్తువులున్నవి

చెంచు పిల్లలో నుంచి లావణ్యము సూర్యబింబము నుంచి వచ్చే కిరణములలాగ వచ్చి అతని మనస్సు నాకర్షించింది అతని మనస్సు మనస్సులో లేదు

"నీవు చెంచువేనా?" అని ప్రశ్నించింది చెంచుపిల్ల

"అవును" అన్నాడు వీరభద్రుడు

"మన మిద్దరమూ ఈ కొండలలో ఉండిపోదాము నాతోకూడా ఉంటావా?'

"నీకు తల్లిదండ్రులు లేరా?"

"లేరు, ఉన్నారు నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పవేం?"

"నాకు పీనుగుల గొంది చూపిస్తావా?"

"చూపిస్తే నా నేస్తమవుతావా?"

"మా అమ్మ నడుగుతాను "

"మీ అమ్మ ఎక్కడుంది?"

"నాగలూటిలో"

"నాగలూటిలో అడివేలేదు ఇక్కడెంత అడవో, మనం స్వేచ్ఛగా తిరుగ వచ్చుకాదూ?"

"అవును"

ఈ రీతిగా కొంతసేపు సంభాషణ జరిగింది వీరభద్రుడికి చెంచు పిల్ల కడుపునిండా పళ్లు పెట్టింది ఇద్దరూ కలిసి కేకలు వేసుకొంటూ పాతాళ గంగ అవతలి గట్టుకు ఈదుకుపోయారు తోవలో ఎన్నో ఊసులు కథలు చెంచుపిల్ల చెప్పింది ఎన్నో పాటలు పాడింది ఆ రాత్రి ఒక చెట్టుమీద గడిపారు కబుర్లు చెప్పుకుంటూను తెల్లవారకుండా లేచి వాళ్లిద్దరూ ప్రయాణం సాగించారు నలగని బాటలగుండా ఇతరులకు తెలియని మార్గాలగుండా చెంచుపిల్ల అతన్ని తీసుకుపోయింది

పాతాళ గంగ కొండల మధ్య నుండి ప్రవహిస్తూ ఉన్నది ఒక చోట పాతాళ గంగకు అడ్డముగా పర్వతము నిలచి ఉన్నది కృష్ణనది ఆ పర్వతము చుట్టూ తిరిగి ప్రవహించవలసిన చోటు ఇక్కడ వరదల రోజులలో కృష్ణానది పర్వతమును పొడిచివేస్తూ ఉంటుంది చాలా కాలము ఈ రీతిలో చేయడమువల్ల ఆ కొండలలో ఒక మోస్తారు గుహ ఏర్పాటైనది వరదలు లేని కాలములో ప్రవాహము మందముగా ఉండడము చేత గుహలోని నీళ్లు చలనము లేకుండా ఉంటవి నదిలోపడ్డ మ్రాకులు వగైరా అన్ని వస్తువులనూ కృష్ణానది ఈ గుహలో దాచుకుంటుంది నదికి ఎగువను ఉన్నతమైన కొండ ఒకటి ఉన్నది ఆ కొండకు సరాసరి క్రింద పాతాళ గంగ ఆ కొండ అంచున ఒక నున్నని రాయికలదు ఆ రాతిమీద రెండు పాదచిహ్నములున్నవి, వాటికి

"సిద్ద రామయ్య పాదుక"లని పేరు మోక్షము నాశించే యాత్రికులు ఈ పాదుకల మీద నిలబడి పాతాళగంగకు తమ్ము తామర్పించుకొంటారు అటువంటి వారినందరినీ కృష్ణానది ఈ గుహలోకి చేర్చుతుంది దీనికే పీనుగుల గొంది అని పేరు

పీనుగుల గొందికి అవతలివైపున ఒక చిన్న చెంచుగూడెమున్నది ఆ చెంచు గూడెముకు నాయకులిద్దరు గంగడు, గురవడు

చెంచుపిల్లా వీరభద్రుడూ కలిసి ఈ గూడెము చేరుకున్నారు. చెంచుపిల్ల ఈ గూడెము వారికి చాలా పరిచితురాలే గూడెములో స్త్రీ పురుషులు చెంచుపిల్ల స్వాతంత్ర్యము చూచి ముక్కుమీద వేలుంచుకుంటారు వారి ఆచార వ్యవహారములతో గాని వారి కట్టుబాట్లతో గాని చెంచు పిల్లకు ఏమీ ప్రసక్తి లేదు ఒకరి చెప్పుచేతులలో లేకుండా స్వేచ్ఛగా పెరుగుకు వస్తూ ఉంది ఆ చెంచుపిల్ల

వీరు గూడెము చేరుకునే సరికి గూడెములోని స్త్రీ పురుషులు చాలా మంది వేటకు పోయారు వీరభద్రుడు చెంచుపిల్లా కలిసి దుబ్బుల వెంట పచారు చెయ్యడం మొదలు పెట్టారు సాయంకాలము వరకూ వారు ఆ ప్రాంతాల తిరిగి కడుపు నింపుకొని చివరకు గూడెము చేరుకున్నారు

ఒక రోజున చెంచుపిల్ల అక్కడ స్త్రీ పురుషుల నందరనూ పోగుచేసి నాట్యమాడించింది

గంగడూ, గురవడూ, వీరభద్రుడూ ఆ నాట్యములో చేరక కొంత దూరముగా ఒక బండమీద కూర్చున్నారు వీరభద్రుడిని చూడడముతోనే అతను లచ్చి కొడుకని వాళ్లిద్దరూ గుర్తించారు

"నీవు ఇంతదూరం ఇప్పుడు రావటానికి కారణమేమి?" అని వాళ్లడిగారు

"మా అమ్మ సముద్రాల మధ్యకు వెళ్లుతుందట ఆ సంగతి మీతో చెప్పమన్నది" అని వీరభద్రుడు చెప్పాడు

"గౌరిని నీవెక్కడ చూచావు?" అని వారడిగారు

"గౌరి ఎవరు?"

'నీతో వచ్చిన చెంచుపిల్ల"

"తోవలో తటస్థపడి నాకు దారి చూపించింది "

"అయితే నీవదృష్టవంతుడవే!"

"ఎందుచేత?"

"గౌరి ఇంతవరకు ఏ పురుషుడితోటీ కలిసిమెలిసి ఉండలేదు " వీరభద్రుడు మాట్లాడలేదు

"గౌరి చిన్న చెంచురాణీ "

"మా అమ్మను చెంచురాణీ అనీ నన్ను చెంచురాణీ కొడుకని పిలవడానికి కారణమేమిటి?' అని వీరభద్రుడు అడిగాడు

వారిద్దరిలో కొంచెము పెద్దవాడైన గంగడు ఆ వృత్తాంతమంతా వీరభద్రుడితో ఈ విధముగా చెప్పాడు

లచ్చి చిన్నతనములో చాలా అందముగానూ చురుకుగానూ ఉండేది ఆమె ఎక్కలేని కొండలూ చెట్లు లేవు పురుషులతో సమానముగా వేటాడుతూ ఉండేది అంతేకాకుండా అడవులలో తిరిగి మందులూ

మాకులూ సంపాదించి వైద్యము చేయడమే కాకుండా కొంతవరకు మంత్రములు కూడా నేర్చుకొన్నది ఆ కారణము చేత చెంచువాళ్లకు లచ్చి అంటే భయము భక్తి

చిన్నతనములో లచ్చీ నేను చాలా స్నేహముగా ఉండేవాళ్లము ఇద్దరమూ టకలిసి వేటకు వెళ్లేవాళ్లము. ఇద్దరమూ ఏటిలో ఈదులాడే వాళ్లము ఇద్దరమూ నది ఒడ్డున పొంచుండి, ఇసుకలో పడుకోవడమూ మొసళ్లు వచ్చినప్పుడు వాటిని ఉచ్చులతో పట్టుకొనేవాళ్లము అప్పుడు మాకు భయమంటే ఏమిటో తెలియదు ఒక్కొక్కప్పుడు చాలా రోజుల వరకూ మేము అడవుల్లో వేటాడుతూ ఉండిపోయేవాళ్లము

ఆ కాలములోనే లచ్చి నన్ను పెళ్లాడతానని చెప్పింది

అప్పుడు చెంచువాళ్లకు చాలా కష్టదినములు అడవులలో పండిన పంటంతా అధికారులు తీసుకుపోయేవారు మాకు తినడానికి తగిన తిండి ఉండేది కాదు ఎన్ని విధాలు తంటాలుపడ్డా మాకు ఆకలి అణిగేది కాదు అప్పుడు మేమందరమూ ఆడవాళ్లు, మగవాళ్లు ఆలోచించాము మాలో గురవడు చాలా బుద్ధిమంతుడు అనేక మంది అనేక సలహాలు చెప్పారు తుదకు అప్పుడు తీర్మానించుకొన్నాము అధికారులను అడవులలో కాలు పెట్టనివ్వకూడదని అయితే ఆ రీతిగా చెయ్యడం ఎలాగ? అందరూ ఆలోచించారు ఎవరికీ మార్గం తోచింది కాదు ఎవరైనా సరియైన మార్గం ఆలోచించినట్లయితే వారిని లచ్చి పెళ్లాడతాన్నది గురవడు తాను చేస్తానన్నాడు నాకు దుఃఖము కలిగింది లచ్చిమీదా గురవడి మీదా నాకు కోపం వచ్చింది పగలు తీర్చుకోవడానికి సమయముకాదది

గురవడు చెంచువాళ్ల నందరినీ పది జట్టులకింద విడదీసి ఒక్కొక్క జట్టుకు ఒక్కొక్క పెద్దను ఏర్పాటు చేశాడు కొన్ని జట్టులను రోడ్లు కాయడానికి పంపాడు కొన్ని జట్టులను అడవులలో ఉన్న అధికారుల మీదకు పంపాడు

తరువాత గురవడు లచ్చిని పెళ్లి చేసుకున్నాడు లచ్చి తల్లి దండ్రులకు నాలుగు జతల ఆవులనిచ్చి లచ్చిని తీసుకుపోయాడు ఒకనాడు రహస్యముగా లచ్చిని కలుసుకొని చిన్నతనములో అది అన్నమాట జ్ఞాపకము చేశాను లచ్చి నవ్వింది ఈ రీతిగా చెప్పింది "చిన్నతనములో నిన్ను పెళ్లి చేసుకొన్నాను ఇప్పుడు గురవడిని పెళ్లి చేసుకొన్నాను నాకిద్దరు భర్తలు ఉండకూడదా?" రహస్యముగా ఇద్దరు భర్తలుండకూడదని నేను చెప్పిన మాటలు పెడచెవిని పెట్టింది పర్యవసానమేమి జరిగిందంటే - లచ్చి గురవడితో సంసారము చేస్తూ ఉన్నప్పటికీ మేమిద్దరము భార్యాభర్తలవలె ఉండడానికి నిశ్చయించుకున్నాము ఈ విషయము మాత్రము రహస్యముగా ఉంచాము

ఆ రోజులలో చెంచువాళ్ల ప్రతాపము లోకానికి వెల్లడయింది రోడ్లమీద ఎవరు ప్రయాణము చేసినప్పటికీ వాళ్లు చెంచువాళ్లఅలుగులకు గురి అయ్యేవారు మావాళ్లందరూ అధికారులను దొరికినంతమట్టుకు వాతసర్చారు అడవి సమీపానికి రావడానికి అందరూ భయపడ్డారు ఆరోజులలో ఎందరిని చెంచువాళ్లు చంపారో ఎందరిని చెర పెట్టారో చెప్పడానికి వీలులేదు అడవి రాజ్యం కొంతకాలం మళ్లీ చెంచువాళ్లు ఏలారు మా కప్పుడు కడుపు నిండా తిండి దొరికింది సంతోషించాము

కాని తలవని తలంపుగా పోలీసుపటాలాలు అడవుల్లో ప్రవేశించినవి మాకూ వాళ్లకూ అనేక యుద్ధాలు జరిగినవి మాకు అలుగులూ దబ్బలూను, వాళ్లకు తుపాకులు ఆ కారణముచేత చెంచువాళ్లు చాలా మంది చచ్చిపోవడం సంభవించింది అందువల్ల వాళ్లు భయపడి పారిపోవడం మొదలు పెట్టారు పోలీసువాళ్లు వాళ్లని

అడవులలో జింకలను వేటాడినట్లు వేటాడారు. కొంత కాలానికి అడవి రాజ్యం చెంచువాళ్ల వశం తప్పి తెల్లవాళ్ల స్వాధీనమైనది చావగా మిగిలిన చెంచువాళ్లు తెల్లవాళ్ల రాజ్యాన్ని ఒప్పుకోక తప్పింది కాదు మాయలు పన్ని లంచాలిచ్చి ఒక తెల్లదొర చెంచునాయకులను కొందరిని పట్టుకొని ఉరి తీయించాడు. దానితో అల్లరులు సర్దుకొన్నవి

చెంచువాళ్ల కోపం చల్లార్చడానికి, వాళ్లల్లో మళ్లీ కలవరం కలగకుండా ఉండడానికి, వాళ్లకు సరియైన జీతాలిచ్చి పని చేయించడానికి ఒక తెల్లదొర ఏర్పాటైనాడు అతడు జాలిగుండెవాడు, మంచి వాడు, అతడు నాగలూటి దగ్గిర బంగళాలో ఉండి అన్ని కార్యములూ న్యాయముగా చక్క పెట్టేవాడు చెంచువాళ్ల నందరినీ దయతో చూచేవాడు వాళ్లు కష్టసమయంలో ఉన్నప్పుడు వాళ్లకు డబ్బిచ్చేవాడు చెంచువాళ్లందరకూ అతడంటే గౌరవమూ భక్తీ కలిగినవి అందరూ సంతోషం చెంది కాలక్షేపం చేస్తున్నారు

లచ్చి నాతో చనువుగా తిరుగుతున్నదనే సంగతి గురవడు గ్రహించాడు గురవడు లచ్చీ కలసి ఒకనాడు వేటకు వెళ్లారు. నేనూ స్వతంత్రముగా వేటకు వెళ్లాను ఆ రోజు మధ్యాహ్నము మే మొకచోట తారసపడ్డాము గురవడికి నన్ను చూడడంతోనే కోపం వచ్చింది నా మీదకు వచ్చిపడ్డాడు మే మిద్దరమూ కలియబడ్డాము లచ్చి నా పక్షము వహించింది. గురవడిని తోసి పారేసింది గురవడు మాట్లాడకుండా వెళ్లి పోయాడు ఆ రోజున లచ్చీ నేనూ సాయంకాలమయ్యేవరకూ అడవుల్లో తిరిగి ఇంటికి చేరుకున్నాము

గురవడు చెంచులలో పెద్దవాళ్లనందరినీ పిలిచి తగువు పెట్టాడు పెద్దలందరూ విచారణకు పూనుకొన్నారు ఈ విషయము నిజమేనా అని నన్ను అడిగారు నేను నిజమే నన్నాను నిజమేనా అని లచ్చిని అడిగారు నా ఇష్టమని లచ్చి నిర్లక్ష్యముగా సమాధానం చెప్పింది నేరము నిర్ధారణ అయినది కాబట్టి పెద్దలందరూ తీర్పు చెప్పారు గురవడి భార్యయైన లచ్చిని గంగడు మోసం చేసి తన భార్యగా చూచుకొంటున్నాడు కాబట్టి ఈ రోజు నుంచీ గంగడే లచ్చిని ఏలుకోవలసి ఉంటుందనీ గురవడికి అపకారం జరిగింది కాబట్టి అతనికి గంగడు పదిహేను రూపాయలు దండుగ ఇచ్చుకోవలసి ఉంటుందనీ" తీర్పు

లచ్చి నా వశమైనందుకు నేనూ లచ్చికూడా సంతోషించాము కాని పదిహేనురూపాయల దండుగ ఇచ్చుకోవడమెలాగ? నావద్ద అప్పుడు ఒక్క రూపాయైనా లేదు నాకు చెప్పతగ్గ ఆస్తిఏమీ లేదు దండుగ ఇచ్చుకోక పోయినట్లయితే నన్ను ఏమైనా వాళ్లు చేయవచ్చును ఏమీ చెయ్యడానికి తోచక నేను లచ్చిని మాత్రం స్వీకరించి దండుగ మాట తలపెట్టకుండా చాలారోజులూరుకున్నాను చెంచు పెద్దలకు కోపం వచ్చింది నన్ను శిక్షించడానికి సిద్ధపడుతున్నారు నా బంధువులూ స్నేహితులూ నా పక్క నుంచి నన్ను కాపాడుటకు ప్రయత్నిస్తున్నారు అప్పుడు మాలో ఒక యుద్ధము జరగవలసినదే కాని తప్పి పోయింది కారణమేమిటంటే .

నాగలూటిలో ఉన్న తెల్లదొరకు మా వివాదవృత్తాంతం తెలిసింది అతడు వచ్చి సంగతి సందర్భములను తెలిసికొని వివాదమునకు కారణము పదిహేను రూపాయలే కదా అనుకొని ఆ రూపాయలు అతడు గురవడికి నా తరపున ఇచ్చి వెళ్లిపోయాడు కాని ఒక చిక్కు తటస్థించింది పదిహేను రూపాయలు ఎవరిస్తే వారికే లచ్చి కూడా చెందవలసి ఉంటుంది లచ్చి నాకే చెందవలసి ఉంటుందని నేను ఎంత చెప్పినా పెద్దలు చెవిని పెట్టారు కారు అది ఆచారం అన్నారు మరునాడు వాళ్లు లచ్చిని వెంటబెట్టుకొని తీసుకువెళ్లి "ఈమె నీ భార్య" అని చెప్పి తెల్లదొరకు అప్పచెప్పారు తానిచ్చిన రూపాయలకు తనకీ ప్రతిఫలము ముట్టినదని తెల్లదొరకు వారు నచ్చ చెప్పారు తెల్లదొర ఆశ్చర్యపోయాడు కాని తాను చెంచువాళ్ల ఆచారములకు

బద్ధుడైనట్లు తలచి విధికి తలవంచి ఊరుకున్నాడు అతడు బ్రహ్మాచారి కూడాను లచ్చి ఆనాటి నుంచి తెల్లదొర ఇంట్లో ఉండడము తటస్థించింది

లచ్చిని చెంచు పెద్దలందరూ ఈ రీతిగా చెయ్యడం నాకు కష్టమని పించింది గురవడికి కూడా కష్టమనిపించింది ఆ కారణము చేత అతనూ నేనూ స్నేహితులమయాము తెల్లదొర దగ్గిరనున్న లచ్చిని తీసుకరావడానికి ప్రయత్నాలు చేశాము అందువల్ల చెంచువాళ్లందరికీ మాట వస్తుందని మిగిలిన చెంచువాళ్లు మమ్మలిని మందలించారు అయినా చెంచు కుటుంబములో పుట్టిన చెంచుదాన్ని పరాయి వాళ్ల కర్పించడం న్యాయము కాదు అని వాళ్లతో చెప్పాము వాళ్లు విన్నారు కాదు అప్పుడు మే మిద్దరమూ మా స్నేహితులను బంధువులనూ తీసుకొని, అక్కడ చెంచువాళ్లని కులం తక్కువవాళ్లని నిందించి, బయలుదేరి వచ్చి ఇక్కడ ఈ పీనుగులగొంది దగ్గిర ఒక గూడెము నిర్మించుకొని కాపురం చేస్తున్నాము మా ఇద్దరికీ లచ్చిమీద అభిమానం పోలేదు ఎప్పటికైనా దానిని మా వశం చేసుకోవలెననే ఆశతో ఉన్నాము

లచ్చి దొరగారింట్లో ప్రవేశించింది కొన్నాళ్ల వరకూ లచ్చికీ దొరగారికీ సంభాషణ జరగలేదు కాని అక్కడి నుంచి లేచి పారిపోయి వస్తే దొర ఏమి చేసిపోతాడో అని భయం అది అటుండగా అక్కడ కూటికీ బట్టకూ లోటులేకుండా దివ్యముగా జరిగిపోతున్నది అటువంటి భాగ్యము వదలిపెట్టడానికి కూడా ఆమెకు మనస్కరించింది కాదు దొర గారు క్రమక్రమముగా లచ్చితో మాట్లాడడం మొదలు పెట్టారు "నా ప్రియ, ఇటు వచ్చుము నాకొక ముద్దు నిచ్చుము'' అనే వారట లచ్చికీ విలువయైన బట్టలూ నగలూ మంచి మంచి ఆహారమూ పెట్టేవారట దానాదీనా వారిద్దరికీ అన్యోన్యం కుదిరింది ఇద్దరూ భార్యాభర్తలలాగ ఉంటున్నారని చెంచువాళ్లకు తెలిసింది చెంచువాళ్లు దొరగారితో మాట్లాడవలసి వచ్చినా, దొరగారితో తమ కష్టసుఖాలు చెప్పుకోవలసి వచ్చినా, దొరగారిని ఏమైనా కోరవలసివచ్చినా, లచ్చి ద్వారానే ఆ పనులు చేసేవారు లచ్చి క్రమక్రమముగా చెంచువాళ్లందరకూ దేవత వంటిదైనది

తెల్లదొర లచ్చిని "బెస్సీ, నా ప్రియా, బెస్సీ'' అని పిలిచేవాడు. చెంచువాళ్ల వ్యవహారాలు పరిష్కరించవలసి వచ్చినప్పుడల్లా తెల్లదొర తన బెస్సీ సలహా లేనిదే ఏపనీ చేసేవాడు కాదు లచ్చి చెంచువాళ్లందరికీ సాధ్యమైనంతవరకూ ఉపకారం చేసేది

తెల్లదొరా బెస్సీ కలిసి అప్పుడప్పుడు, కొందరు చెంచువాళ్లను తీసుకొని, షికారు వెళ్ళేవారు ఆ సమయాలలో బెస్సీ తుపాకీ గురి తప్పకుండా కాల్చడం నేర్చుకొన్నది ఇది చూచి చెంచువాళ్లు బెస్సీ అంటే భయముతో ఉండేవారు ఆ రోజులలోనే చెంచువాళ్లు లచ్చికి చెంచురాణి అనే పేరు పెట్టారు దొరగారు కూడా ఈ మాట విని సంతోషించి చెంచురాణి అని ఆమెను పిలిచేవారు

ఒకనాడు నేను గురవడూ కలిసి నాగలూటి వెళ్లాము అక్కడ కొన్నాళ్లు వేచి ఉండి సమయము కనిపెట్టి లచ్చిని రహస్యంగా కలుసుకొన్నాము మేము కొత్తగా నిర్మించిన కొత్త గూడెముకు తీసుకొని పోతే వస్తుందేమోనని అడిగాము

లచ్చికి మామీద అభిమానం తగ్గలేదు కాని మాతో వచ్చినట్లయితే దొర ఏమైనా చేసిపోతాడనీ, మాకే కాకుండా చెంచువాళ్లందరకూ అది శ్రేయస్కరము కాదనీ ఏమేమో సాకులు చెప్పి తప్పించుకొన్నది మా ప్రయత్నాలు నిష్ఫలమైనవి అప్పుడు లచ్చి కడుపుతో ఉంది దొర ఆవిడను రోజు రోజూ ఎక్కువ ఆదరముతో చూస్తున్నాడు ఆ రోజులలో లచ్చిని కాలు కదపనిచ్చేవాడు కాడు రాత్రింబవళ్లు తన దగ్గిరే గడిపేవాడు లచ్చికి దొర అంటే ఎక్కడాలేని ప్రేమ ఇట్లా అన్యోన్యముగా ఉంటూ ఉండగా ఇంతట్లోకి దొరకు బదిలీ అయినది

ఆ సంగతి లచ్చితో చెప్పితే తనను కూడా తీసుకువెళ్లమని ఎంతో ప్రార్థించింది అది పొసగదన్నాడు దొర చివరకు లచ్చి ఒప్పుకొన్నది దొర ఆవిడకు కొన్ని బహుమతులిచ్చి అక్కడనుంచి వెళ్లిపోయాడు చెంచురాణీ ఒక్కర్తె ఆ ప్రాంతాల గుడిసె వేయించుకొని అందులో ఉంటూ ఉన్నది

ఈ సంగతి తెలిసి నేనూ గురవడూ కలిసి మళ్లీ నాగలూటి వెళ్లినాము లచ్చి మమ్ములను చూచి కళ్లనీరు పెట్టింది మాతోరమ్మని ఆమెను కోరితే తనస్థితి మా తో చెప్పి రానన్నది అప్పుడు ఒక తుపాకీ, ఒక వెండి సిగరెట్టు కేసూ, మూడు కాసులూ మా చేతికి జాగ్రత్త చేయమని చెప్పి ఇచ్చింది తాను కోరినప్పుడు వాటిని తిరిగి ఇయ్యవచ్చునని చెప్పింది నీవు వచ్చావు కాబట్టి, అవి నీ తండ్రివి కాబట్టి నీకే చెందవలసినవి నీవు చిన్న శిశువుగా ఉన్నప్పుడు మేము మళ్లీ నాగలూటి వెళ్లి లచ్చిని రమ్మన్నాము తెల్లదొర ఎప్పుడైనా ఆ ప్రాంతాలకు రావచ్చుననీ అందుచేత తానక్కడనే ఉండవలెననీ ఎప్పటికైనా తాను తెల్లదొర దేశం వెళ్లవలెననీ, తన కొడుకు పెద్దవాడైనాక తన్ను తప్పకుండా తన తండ్రి దగ్గిరికి తీసుకువెళ్లుతాడనీ ఏమేమో ఆటంకములు చెప్పింది తెల్లదొర కాపురం చేసే రోజుల్లో అతడు తన దేశాన్ని గురించీ తన దేశస్థులను గురించీ వారి వేషభాషలు ఆచార వ్యవహారములను గురించీ ఆమెతో చెప్పాడు. అప్పటి నుంచీ లచ్చికి ఆ దేశం వెళ్లవలెననీ ఆ దేశంలో తన భర్తతో కూడా కాపురం చేయవలెననీ కోరిక''

వీరభద్రుడు తన తల్లి కథ ఆమూలాగ్రముగా విన్నాడు తన పుట్టుక సంగతి తెలుసుకున్నాడు ఉండుండి తన తల్లి సముద్రాల మధ్యకు వెళ్లిపోతానని చెప్పడం అప్పుడతనికి బోధపడింది

గౌరి ఇంతట్లోకి పరుగెత్తుకొని వచ్చి "ఇంతసేపూ ఏమి చేస్తున్నావు నాకు కనిపించకుండా రా నాట్యమాడదాం రా" అని చెయ్యి పట్టుకు తీసుకుపోయింది చాలా సేపు వారు చెంచువాళ్లందరితో కలిసి ఆడుతూ సరదాగా గడిపారు

వీరభద్రుడు ఆ రోజుననే తుపాకీ వగైరా వస్తువులు గంగడు, గురవల్ల దగ్గిర పుచ్చుకొని ఇంటికి వెళ్లడానికి ప్రయాణమయ్యాడు చెంచుపిల్ల కూడా వస్తానన్నది

వాళ్లిద్దరూ మరుసటి దినం ఉదయం ప్రయాణమయినారు కొత్త దోవల గుండా చెంచుపిల్ల అతన్ని తీసుకుపోతున్నది

ఆనాటి సాయంకాలం వారు ఒక కొండకోలను దగ్గర విశ్రమించారు సంతోషముగా కబుర్లు చెప్పుకొన్నారు చెంచుపిల్ల అక్కడ అప్పుడు తనను పెళ్లి చేసుకోమని అతనిని కోరింది "మీ తల్లిదండ్రులకు కట్నము కింద ఆవులను ఇస్తేనేకాని లేకుంటే పేచీ వస్తుందేమో" అన్నాడు "నన్ను అందరూ చిన్న చెంచురాణీ అంటున్నారు నేనే అందరినీ శాసిస్తాను నాకు చెప్పేవాళ్లెవళ్లూ లేరు" అని ఆమె చెప్పింది

"నీవు చిన్న చెంచురాణీ వయితే నీకంటే పెద్ద చెంచురాణీ ఒకతె ఉండవచ్చు కదా, ఆమె మాటలూ వినవా?"

"ఎవరు పెద్ద చెంచురాణీ?"

"నా తల్లి"

"నిజంగా! అయితే వింటాను అందుచేతనే నిన్ను పెళ్లి చేసుకొందామని నాకు తోచింది"

"నేను నిన్ను పెళ్లాడనంటే ఏమి చేస్తావు?"

"నిన్ను నేను పెళ్లాడుతాను నేను చిన్న రాణీని నా మాట నీవు వినాలి"

"పెళ్లి చేసుకొన్న తరువాత కూడా నీ మాట నేను వినవలసి ఉంటే నేను పెళ్లి చేసుకోను "

"అప్పుడు నీ మాట నేను వింటానులే" అని చెంచుపిల్ల అతనిని సమీపించి బతిమాలేటట్టు నిలుచున్నది వీరభద్రుడు చిట్టచివరకు పెళ్లి చేసుకోవడానికి ఒప్పుకున్నాడు కాని తన తల్లితో చెపితేనే కాని ముందుగా మాట ఇవ్వనన్నాడు చెంచుపిల్ల కొంతసేపు కోపగించి కొంతసేపు ఏడ్చింది అక్కడ నుంచి వెనక్కు వెళ్లిపోతానన్నది ఇక ముందు అతనికి తోవ చూపించనంది ఇన్నీ చేసి చివరకు అతని కంఠాన్ని కౌగిలించుకొని అక్కడ అప్పుడు తనను పెళ్లి చేసుకుంటేనే గాని వదలిపెట్టనన్నది వీరభద్రుడు చివరకు ఒప్పుకున్నాడు

కొండసరస్సు నీళ్లలో నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నవి చెట్ల కొమ్మల సందులలో నుంచి గాలి నెమ్మదిగా వీస్తున్నది వెదురు పొదలలో రొదలు వినబడతున్నవి అప్పుడే పక్షి దంపతులు గూళ్లల్లో నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నవి ఒక పక్షి మాత్రము కొమ్మమీద కూర్చుని చల్లగా పలుకుతున్నది ఆ సమయాన ఆ స్థలాన ఆ చెంచు పిల్లకూ చెంచు వాడికీ వివాహము జరిగింది పెండ్లి పెద్దలు లేని వివాహము, కట్నములులేని వివాహము జరిగింది

మొదట మానవ దంపతులకు ఇటువంటి సందర్భములలోనే వివాహము జరిగి ఉంటుంది

తమ వివాహము స్థిరపడినట్లు నిదర్శనముగా వారు ఒకరినొకరు ముద్దు పెట్టుకున్నారు ఒక్కమారు ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగినారు చెట్టుమీద పక్షి మరీ మధురముగా పాడింది

తెలవారుజామున చెంచులిద్దరూ కిలకిలాడుతూ కబుర్లు చెప్పుకుంటూ నాగలూటి వైపు నడిచివెళ్లారు వారికి ప్రపంచమంతా కలకలలాడుతున్నది నడక శ్రమగా లేదు చెంచుపిల్ల మాటలలో, నడకలో, కథలలో అవయవములలో అంతటా ఉత్సాహమే, అంతా నవ్వే

వారిద్దరూ నాగలూటి చేరుకున్నారు వీరభద్రుడు తన గుడిసె దగ్గిరికి చెంచు పిల్లను తీసుకువెళ్లాడు అక్కడ అతని తల్లి కనిపించింది కాదు పొరుగు చెంచువాళ్లు వచ్చి అతనితో ఈ రీతిగా చెప్పారు అతడు వెళ్లిన మరునాడే చెంచురాణీ జబ్బు పడినదనీ ఆ జబ్బులోనే "నేను సముద్రాల మధ్యకు వెళ్లిపోతున్నా" అని ఉండుండి చెప్పి మరణించిందనీ

వీరభద్రుడు చాలాసేపు దుఃఖించాడు చెంచుపిల్ల అతనిని ఓదార్చింది మరునాడే వారిద్దరూ నాగలూటి పుష్కరిణిలో స్నానము చేసి దట్టముగా ఉన్న అడవులలో వన్యమృగములతోపాటు కాపురము చెయ్యడానికి వెళ్లిపోయారు

వీరభద్రుడు ఇంకా విచారముగా ఉండడము చూచి చెంచుపిల్ల గౌరి అతనితో అన్నది "నీ తల్లి చెంచురాణీ సముద్రాల మధ్యకు పోయింది నీ భార్య చెంచురాణీ నిన్ను వదలకుండా ఈ అడవులలోనే నీతో తిరుగుతున్నది ఇంకా నీకెందుకు విచారం?"

# సుగాలీ కుటుంబం

పాత అధికారి వెళ్లి కొత్త అధికారి వచ్చాడన్న వార్త చుట్టు పట్లనున్న గ్రామాల కన్నింటికీ తెలిసింది ఇంత త్వరలో తెలియడానికి కారణము లేకపోలేదు

ఆ ప్రాంతపు దేశమంతా అడవిమయము ఆ అడవిలో ఒక భాగమునకు ఈయన అధికారి ఏ వూరివాడో తెలియదు అధికారము చెలాయించేటప్పుడు ముక్కుకు సూటిగా వెళ్లడం ఈయన మతము ఈ సంగతి ఈయనే పలువురతో చెప్పటం కద్దు లోకులు ఈ సన్మార్గమును కారిన్యమన్నారు

ఒకనాటి సాయంకాలము ఈయన - పాత్రకు పేరు ఉండవలెను గనుక ఈయనను మునిస్వామి అందాము - కంసాలి వానికి వర్తమానము చేసినాడు ముప్పై తులముల బంగారముతో చేయబడిన కంటె ఒకటి ఆయన భార్య పెట్టుకొనే అలంకారములలో ఒకటి ఈ కంటెను చెరిపించి నలభై తులాల బంగారపు కంటె చేయించి పెట్టమని భార్య అడగడము కంసాలిని పిలించడమునకు కారణము

కంసాలి వచ్చినాడు. అతనికి చెప్పవలసిన మాటలు చెప్పుతుండగా అడవి కాపరులు ఒక మనిషిని పట్టుకుని మునిస్వామి వద్దకు తీసుకు వచ్చారు

అడవిలో నల్ల మద్దికొమ్మ కొట్టి ఈ మనిషి తీసుకొని పోతూండగా కాపరులు పట్టుకొన్నారు

మునిస్వామి విచారణతో తేలిన విషయమిది ఈ మనిషి బండి చక్రమునకు కొన్ని ఆకులు విరిగిపోయినవట కొనడాని కెక్కడా కర్రలు దొరకలేదట బండి తోలుకుని జీవించడమే అతని ప్రధాన వృత్తిట అందుచేత అడవిలో కొమ్మ కొట్టినమాట వాస్తవమట.

సన్మార్గగామియైన మునుస్వామి అతనిపై కేసు చేసినాడు అడవి కేసులకు సాక్ష్యము మొదలైనవి అక్కరలేదు అధికారిమాటా, మేజిస్ట్రేటు శిక్షా నేరస్థుని కొంప గుండము అడవి పరిపాలనలో న్యాయ చక్రము పై మూటిమీద ఎప్పుడూ వర్తిస్తూ ఉంటుంది

ఆ మనిషికి రెండు సంవత్సరముల కఠినసరకము పడినది మునుస్వామి వచ్చిన నెలలోపుగా ఇట్టివెన్నో జరిగినవి ఆయన కీర్తి చంద్రికలు నాల్గువేపులా వ్యాపించిన వంటే ఆశ్చర్యమేమి

రాక్షసనామ సంవత్సరమున సకాలమున వర్షములు లేకపోవుట చేత కొన్ని చోట్లా, వర్షములు వెనుక బట్టుట చేత కొన్ని చోట్లా కాటకము సిద్ధించినది పచ్చని చేలుండవలసిన తావులందు పత్రభూములు కానవస్తున్నవి సూర్యుని వేడిమి నానాటికీ సహింపశక్యము గాకున్నది నాగళ్లు, గొఱ్ఱులు, జడ్డిగాలు, పాపటలు, మెట్టులు, అన్నియు మూలకొదిగినవి నూతులందునీరు నానాటికీ లోనికి పోవుచ్చేది చెరువలెండుకు పోయినవి విత్తనములకొరకై వెనుకటి సంవత్సరముదాచుకొన్న దాన్యము, జొన్నలు, కొఱ్ఱలు ఈ సంవత్సరము గ్రాసమునకు వినియోగపడుచున్నవి భూమిపై గడ్డి మొలవలేదు అడవిలో చెట్టు చిగుర్చలేదు ఆవులకు మేత లేదు. మనుష్యుల కావుపాలు లేవు

"ఈ యేడు వర్షములు లేక పంటలు లేవు తినడానికి తాటిపళ్లేనా పడడంలే"దని మాలవాడు విలపించాడు

ఈ కాలమున మునుస్వామి అధికారములోనున్న అడవికి సమీపమున ఒక ఊరిలో ఒక సుగాళీ కుటుంబము కాపురమున్నారు ఈ కుటుంబము ఊరికి రావడమునకు పూర్వము ఎర్రకొండలలో ఉండేదిట అక్కడవున్న చెంచువాళ్ళు వీళ్ల కొంపలో పడి దోచుకొనడము చేతనూ, వీళ్ల పశువులను తోలుకుపోవడం చేతనూ జీవనాధారం లేక ఇక్కడికి వచ్చినారు అడవిలో నివసిస్తే చెంచువాళ్లు బాధపెడతారనే భయము చేత ఊళ్లోనే కాపురమున్నారు

ఈ కుటుంబము కడు బీద స్థితిలో ఉన్నది భార్యా, భర్త ఏడుగురు పిల్లలూను వీరిపై దయదలచి ఒక బ్రాహ్మడు తన దొడ్డిలో వీరి నుండనిచ్చెను ఆ దొడ్డిలో పాక వేసుకొని వాళ్లున్నారు

సుగాలీవాళ్లు అడవి జాతికి చెందినవాళ్లే చెంచులు, ఎరుకులు, కోయలు, ఒడ్డెలూ ఇట్టి అడవిజాతులే సుగాలీలు వాలి సుగ్రీవుల సంతతివారమని చెప్పుకుంటారు

సుగాలులకు కొండలూ, అడవులూ నివాసస్థానము వీళ్లు అడవులకు పిల్లలవంటివారు అడవులు వీరిని కనును, అడవులు వీరిని పోషించును అడవులు వీరిని భరించును అడవులకు వీరు తమ అస్థుల నర్పింతురు

సుగాలీ స్త్రీలు అలంకార ప్రియులు వివాహితయైన సుగాలీ స్త్రీ చేతులకు ఎముకలతో చేసిన కంకణములను మోచేతివరకు ధరిస్తుంది బొంతలలో చిన్న చిన్న అద్దములు కుట్టి, గవ్వలను మాలలుగా కుట్టి బొంతల కతికించి ఆ బొంతలను లంగావలె కట్టుకొనును రంగు రంగుల గుడ్డలతో ఈ బొంతలు చేస్తారు. రంగులన్న వారికి ప్రీతి వారీ బొంతతోనైన టోపీని తలపై ధరించడం కూడా కద్దు సుగాలీ స్త్రీలు సొగసుగా ఉంటారు ఆరోగ్యము సౌందర్యమునకు వన్నె తెస్తుంది వీరికి ఆరోగ్యము సౌందర్యము కూడా కలవు.

పురుషులును స్త్రీలును కలిసి పండుగదినములలో నృత్యము చేస్తారు సుగాలీ భాషలో పదములు పాడతారు.

అడవులలో కట్టెలను కొట్టి మోపులుగా గట్టి ఊరూరు తిరిగి వాటినమ్మి జీవిస్తారు వీరు. ఇది కొందరి వృత్తి కొందరు అడవులలో పశువులను మేపుకొని జీవిస్తారు ఈ సుగాలులు ఇతర అడవి జాతులవలెనే అప్పుడప్పుడు దారులు కాచి దొంగతనం చేయడం కద్దు అందు స్త్రీలు కూడా పాల్గొంటారు వీరిలో సాధారణముగా స్త్రీలు పురుషులకన్న బలాఢ్యులు

కాటకము నానాటికీ తీవ్రమైపోయింది మర్యాదగా కూలిపని చేసుకొని గుక్కెడు అంబలి త్రాగేవాళ్లందరికీ చిప్ప చేతికి వచ్చింది ఊళ్లల్లో యాచకుల సమ్మర్థము ఎక్కువ అయిందని పత్రికలలో మొరలు వినిపించాయి వీధులలో పాటలు పాడుకుంటూ యాచకులు సంచారము చేస్తున్నారు "వానదేవుడు పదములు" అంతటా వినబడుతున్నాయి

వానదేవుడా! ఓ వానదేవుడా!
ఇగ నెందుకున్నావు జగమేలు నాసామి
చిన్న చిన్న మొలకలు జింకల పాలాయె
వేసిన చేలన్ని ఎండెండిపోయె
చక్కంటి మొగవాళ్లు సూదులైపోయిరి

ఏకంత మొగవాళ్లు ఎదవాడిఉండిరి
గుంటిక కొట్టెవాళ్ల గుండెలారుకుపోయె
నాగలి పట్టేవాళ్ల నడుము లెండుకుపోయె
నెత్తిమీద సూర్యుడా నెలవన్నె కాడా
తలమీద సూర్యుడా దండంబు నీకు
ఏనుగం తెద్దులా ఎత్తుబడి పోతాయి
గాడికట్టిన పసరం గండేకు పోలేదు
ఎక్కడావున్నావో గ్రక్కునా కదులయ్య
కురిపించు నాసామి కుంభవర్షాలు
కురవాక మాతోడ కువ్వారమేల
వానలు కురిపించి ప్రాణాలు రప్పించు
వంకలూ నిండంగ వాగులూ నిండ
కురిపించు నాసామి కుంభవర్షాలు
వానదేవుడా! ఓ వానదేవుడా
ఇగ నెందుకున్నావు జగమేలు సామి

ఈ సుగాలీ కుటుంబము కూలీపనులున్న రోజులలో కూలీపని చేసుకొని పొట్టపోసుకునేవాళ్లు కాటకము రావడం, కూలిపనులు పోవడం ఒక్కమారు తటస్థించాయి కట్టెలు కొట్టుకొని అమ్మి జీవిద్దామంటే అడవి స్వాధీనములో లేదు పశువులను కాచుకుందామంటే పశువులు లేవు అడవి జాతివాళ్లని అడవిని అనుభవించ వద్దనడం పిల్లను తల్లివద్ద పాలు తాగరాదనడమే

ఈ సుగాలీ కుటుంబము యజమాని పేరు రూపల్ నాయక్, అతని భార్యపేరు చంద్రి వీనికి కొడుకులు కూతుళ్లూ పాలుత్రాగే పిల్ల మొదలుకుని 15 యేళ్లవరకు వయస్సువచ్చిన పిల్లలు ఏడుగురు, సూర్యనాయక్, రామనాయక్, పాటేల్ నాయక్, లక్ష్మి, సీత, బద్ధి, భారతి వాళ్లపేర్లు తండ్రీ తల్లీ పాటుపడి పిల్లలనందరనూ పోషించవలెను పెద్దపిల్ల లక్ష్మికి వివాహమయినది పంద్రెండవయేట అత్తవారు తీసుకుపోయి బాధలు పెట్టడం వల్ల అత్తవారింటినుంచి పారిపోయి వచ్చి తల్లి ఉన్న ఊళ్లోనే ఒక శూద్రకుటుంబములో చాకిరీకి ప్రవేశించి పొట్టపోసుకుంటూంది లక్ష్మి

తొలికోడి కుయ్యడంతోనే రూపల్ నాయకుడూ, చంద్రీ బయలుదేరి కొండలు మీదికి అడవులలోకి పోతూ ఉండడం వాడుక పిల్లలందరూ ఇంటివద్దనే ఉందురు అడవికి పోయి అక్కడ దేవదారుకూర, పింకి కాయలు, పాలపళ్లు, వెలగపళ్లు - ఏవి దొరికితే అవి తీసుక వచ్చి ఊరూరు తిరిగి జొన్నలు కొర్రలు పోగుచేసుకొని మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వచ్చే వాడు, అప్పుడు కొట్టిన్నమో, జొన్న సంకటో జొన్న రొట్టో తయారు చేసి తామింత తిని పిల్లలకిరత పెట్టి ఆరోజు గడుపుకునేవాళ్లు

సుగాలీ వాళ్లు కష్టపడి పనిచేసి ఇంత తింటారు గాని ఒకరిని దేహీ అని చెయ్యిచాపి అడగరు, ఇస్తే వద్దనరు

కొంతకాలం ఈ రీతిగా జరిగింది ప్రజలలో క్షామము ప్రవేశించింది ఆకుకూరలూ పండ్లూ కొనేవాళ్ల సంఖ్య నానాటికీ క్షీణించింది ఇక చేయవలసినదేమి? చేయడానికి కూలిపనులు లేవు కాయడానికి పశువులు లేవు ఆకు కూరలు కొనడానికి మనుష్యులు లేరు ఇలాంటి స్థితిలో నున్నవారే కొందరు యాచకులౌతారు ఇట్టిస్థితి నున్నవారే కొందరు దారులు కొట్టుటకు మొదలు పెడతారు, ఎవరి దీ తప్పు? వారిదా?

అయిదారుగురు పిల్లలు రోటిచుట్టూ మూగినారు, వారెవరు? మోకాలుపై తల నుంచి ధ్యానము చేస్తూ కూర్చున్నాడొకమూల, అతడెవరు? వారి ముఖములు తేజోవిహీనమై యున్నవేల? వారి కడుపులు నడుముల కంటుకుపోయిన వేల? రోకలి చేతబూని ఒక్కరీతిగా దంచుచున్నది అవియేమి? ఆమె ఎవరు?

ఈతపండ్ల నక్కడక్కడ పోగుచేసుకొని వచ్చి వాని నెండబెట్టి తరువాత దంచి గింజలను పారవేసి ఆ పొట్టుతో రొట్టెలను కాల్చుకొనుచున్నారు రూపల్ నాయక్ కుటుంబము మార్గము లేనివారికి భగవంతుడొక మార్గము కల్పించక మానునా! కాలినది ఈతపొట్టుతోనయిన రొట్టె ఒకటి, తినడానికి సిద్ధముగా నున్నవారు ఎనమండుగురు

కొంతకాలమిట్లు గడిచింది ఈతపళ్లు కూడా కొన్నాళ్లకరుదై కావూ? చెంచువాళ్లూ, మాలమాదిగెలూ, సుగాలీ వాళ్లూ ఇందరికీ ఎంత కాలము ఈతపళ్లుఆధారమై ఉండగలవు ఇంక సాధన మేమిటి?

ఒకనాటి ఉదయము రూపల్ నాయక్, చంద్రీ ఇద్దరూ తట్టలు చేతితో పట్టుకుపోయినారు వాళ్ల పిల్లలు ఊరిలో వీళ్ల గడపలూ, వాళ్ల గడపలూ పట్టుకొని కాలము బుచ్చుతున్నారు మధ్యాహ్నమయేసరికి భార్యాభర్తలిద్దరూ తట్టెడు చింతగింజలను తెచ్చినారు అవి ఎందుకు? ఆ చింత గింజలను రోటిలో ఇద్దరూ దంచినారు నీళ్లలో నానవేసి కడిగినారు ఎండబెట్టి తిరుగలితో విసిరినారు తెల్లటి పిండి తయారైనది వీరు చేసే పనులను పన్నెండు కన్నులు చూస్తూ ఉన్నవి ఈ పిండితో సాయంత్రమయేసరికి రెండు రొట్టెలు తయారైనవి మెడపట్టులు పట్టుకొంటూ తమకు తక్కువైనదని కొట్లాడుచూ పిల్లలూ దంపతులూ ఆ రొట్టెలను తిన్నారు ఇంత నీరు త్రాగినారు ఆ దినమున భగంతుడింత ఇచ్చినాడు హాయిగా రాత్రి అందరూ వెన్నెలలో విచారము లేకుండా నిద్రపోయినారు

కొంతకాలమీరీతిగా జరిగింది చింతగింజలకు కూడా కరువైనది కొన్నాళ్లకు చింత గింజలను వర్త కులు అమ్మ మొదలుపెట్టిరి, పడి అర్ధణా! అర్ధణా ఆ సుగాలీలకు ఎక్కడ నుంచి వస్తుంది? ఇక చేసేదేమిటి?

ఒకనాటి సాయంకాలము ఒక సుగాలీ కుటుంబము ఆరుబయట ఆకులలో నల్లటి పదార్థము పెట్టుకొని ఆత్రముగా తింటున్నారు ఆ నల్లటి పదార్థమేమిటి? చింతచిగురూ, చింతపండూ బూడిదలో కలిపి పొయ్యిమీద ఉడికించగా తయారైన పదార్థము ఈ అంబలి త్రాగి కడుపు నిండా నీళ్లు త్రాగి చింతలేక హాయిగా నిద్రపోయారు ఇట్లు కొన్నాళ్లు అడవిలో చింతపండు తెస్తూన్న వాళ్లకు శిక్షపడుతూందని వదంతి పుట్టింది ఇక చేయవలసినదేమిటి?

దేవదారుకూర మిగిలిన ఆకుకూరలవలెగాక కొంత సువాసన కలిగి ఉంటుంది దీనిని బ్రాహ్మలు

షప్పులో వేసి వండుకొంటారు అడవులలో తిరిగేవాళ్లు ఈ కూరను వూరివారికి బియ్యానికి, జొన్నలకూ అమ్ముతారు కొనేవాళ్లు లేనప్పుడో?

అడవి సమీపమున నున్న దేవదారుచెట్ల నాశ్రయించి మధ్యాహ్నమయ్యేసరికి ఒక తట్టెడు దేవదారు కూర తెచ్చినారు ఈ సుగాలీ దంపతులు కుండలో ఆ కూరను నీరుబోసి వుడకబెట్టి దించినారు ఆకులలో బెట్టుకొని పిల్లలూ, తల్లీ, తండ్రీ కడుపునిండా తిన్నారు హాయిగా నిద్రపోయినారు

ఈ రీతిగా కొన్నాళ్లు జరిగింది అడవియంచులనున్న కూర నానాటికీ తరిగిపోయింది ఇక చేయవలసిన దేమిట? నడిరాత్రి బయలుదేరి ఎవ్వరూ చూడకుండా ఇంత దేవదారు కూర కోసుకుని వచ్చి తెల్లవారు సరికి ఇల్లుచేరి ఆ రోజు గడుపుకొనవలసి వచ్చింది ఇట్లు కొంతకాలము గడిచింది ఒకనాడు తోవలో నలుగురు మాలవాళ్లు కనిపించినారు రెండు రోజులకు ముందు వారు దేవదారుకూర ఆ రీతిగా తీసుకుపోతూండగా అడవికాపరులు పట్టుకొన్నారట నూతనోద్యోగి కడకు తీసుకుపోయారట బొటనవ్రేలి ముద్రలను వేయించుకొన్నారట ఈ వర్తమానము సుగాలీ దంపతులకు తెలియవచ్చింది ఇక అడవికి పోవుట ఎట్లు? పొట్ట పోషించుకోవటమెట్లా? పిల్లలను పోషించడం ఎట్లా?

రెండు రోజులపాటు సుగాలీ కుటుంబమునకు తిండి లేదు దిగుడు బావిలో నుంచి తెచ్చుకున్న నీళ్లే తిన్నారు ఆ నీళ్ల త్రాగారు వెన్నెలలో సుఖముగా నిద్రపోయినారు రెండు రోజులు గడిచినవి ఇట్లెన్ని రోజులు గడచును?

కష్టములలో ఉన్నవారికి భయము తక్కువ ఏమన్నా భయముండదు అధికారులంటే భయమా? మృగములంటే భయమా? తోడివారంటే భయమా ఆపత్తులు సంభవిస్తవని భయమా? భయము లేకుంటే నేమవుతుంది? కష్టములు వచ్చును ఉన్న కష్టములలో అవి కలసిపోతవి ఇంక భయమెందుకు

మరింత జాగ్రత్తగా దేవదారు కూర అడవులలో నుంచి వారు తెచ్చుకొనక తప్పినది కాదు కొంతకాలము సరిగానే జరిగింది ఒకనాడు రూపల్ నాయక్ అడవిలో దేవదారు కూర కోస్తున్నాడు చంద్రి కొండలలో ఒక చరియిలో ఈతచెట్లకు పళ్లున్నవని విని ఆ పళ్ల కోసము అక్కడకు వెళ్లింది రూపల్ నాయకుడు వొడినిండా కూరకోసుకుని అడవి దాటివస్తూ ఉన్నాడు ఇద్దరు అడవి కాపరులు అతనిని అడ్డగించినారు పారిపోయినాడు పరుగెత్తి వానిని పట్టుకొన్నారు అతనిని పరీక్షించినారు దేవదారు కూర కానవచ్చినది మునుసామి కడకు తీసుకుపోయినారు దేవదారు కూర కోసినట్లును, కొమ్మలను విరిచినట్లును కేసు కూర కొయ్యడం తప్పుకాదు, కొమ్మలు విరవడం నేరము కొమ్మలు విరవడం ఎందుకు? అమ్ముకుందామనేకదా? అడవికి నష్టము కలుగజేయవలెననే ఉద్దేశ్యమే కదా! మేజిస్ట్రేటు వద్ద కేసు జరిగింది రూపల్ నాయకుడు దీనముగా చెప్పుకున్నాడు తనకు ఏడుగురు పిల్లలనీ కూలీపనీ చేసుకోవడము వృత్తనీ, కూలిపనులు లేవనీ, తిందామంటే ఈతపళ్లు కరువయినవనీ బూడిద తాగుదామంటే చింతపండు కరవయిందనీ చింత పిక్కలు తిందామంటే ఖరీదైనవనీ, దేవదారు కూర్పై అతని కుటుంబమంతా ఆధారపడియున్నదనీ, అతడు కొమ్మలు విరవలేదట కూర కోసుకున్నట్లు ఒప్పుకున్నాడు

మేస్ట్రీటు నూతనోద్యోగి చాకచక్యమును మెచ్చుకున్నాడు సుగాలీవానికి నాలుగు సంవత్సరముల ఖయిదు విధించినాడు

చంద్రి ఈతపళ్లని ఇంటికి తెచ్చు సరికి రూపల్ నాయకుడు ఇంటికి రాలేదు ఎక్కడైనా కూలికి పోయినాడేమో అని సంతోషించింది ఈత రొట్టెలను పిల్లలకు పెట్టి తాను తిన్నది రెండుమూడు రోజులపాటు రూపల్ నాయకుడు ఇంటికి రాకుండడము అలవాటే

రెండు రోజులు పోయినమీదట తన భర్తకు ఖయిదు వేసినారని చంద్రికి తెలిసింది ఏమీ చేయగలదు? తన రెక్కలతో ఇందరిని పోషించగలదా, ఎడపిల్లను పెద్ద పిల్లకు అప్పగించి చంటి పిల్లను చంక బెట్టుకొని ఒకనాడు ప్రయాణమై తెల్లకొండల కేసి పోయింది తెల్ల కొండలలో దాని చుట్టాలున్నారట ఈ సంగతి ఊరివారికి తెలియదు

పాకలో నలుగురు పిల్లలు తల్లిదండ్రుల కోసము ఆనాటి మధ్యాహ్నము వరకూ వేచి యున్నారు ఎవ్వరూ రాలేదు పాకను విడిచి ఊరిలో ఆ నలుగురూ వేర్వేరు దిక్కులకు పోయారు వారేమయినారో ఎక్కడుండిరో ఎవరికీ తెలియదు భూదేవి వారిని కన్నది భూదేవి వారిని మళ్లీ స్వీకరించింది

రూపల్ నాయకుడు నాలుగేండ్లయిన తరువాత ఆ ఊరు వచ్చినాడు. తన కుటుంబములేదు భార్య తెల్లకొండలలో ఎక్కడికో పోయిందనీ పిల్లలెక్కడికో పోయినారనీ పొరుగువాళ్లు చెప్పినారు రూపల్ నాయకుడు ఆ రోజునే బయలుదేరి తెల్లకొండలకు పోయినాడు అక్కడవాని భార్య కానరాలేదు

మునుస్వామి నానాటికి ధనము గడించడము మొదలు పెట్టినాడు సాలుకు ఇంత ఇచ్చే పద్ధతి మీద తనకు తెలియకుండా అడవి సరకు తెచ్చుకొనవచ్చునని లోపాయకారిగా అడవి మనుష్యులతో రాజీ పడ్డాడు కేసులు తక్కువ అయినవి అధికారి సామర్థ్యమునకు దొరతనము సంతోషించింది

అది విషజ్వరముల కాలము ఊరూరా, దేశదేశములా విషజ్వరములే యెందరో దాని వాతపడిరి మునుసామి ఇంట ప్రవేశించినదీ విషజ్వరము భార్యా, ఇద్దరు పిల్లలూ పదిరోజులలో యెగిరిపోయినారు

మునుసామి ఒక్కడు, "నా" అన్నవాళ్లు లేరు. ధనమునే చుట్టముగా చూచుకొన మొదలు పెట్టినాడు

క్రమక్రమముగా మునుసామి ప్రవర్తన పై అధికారులకు తెలియవచ్చింది విచారణ జరిగింది మునుసామిని ఉద్యోగము నుండి తొలగించారు

చిన్ననాటి బంధువులతోనూ, మిత్రులతోనూ జీవితము గడప వచ్చునని స్వగ్రామము పోయినాడు మునుస్వామి మిత్ర బంధుకోటి ఆ గ్రామమున అతనికి కరువైంది



# అనువాదాలు

1 ఎర్రజెండా (రష్యన్‌కథ)

2 ప్రపంచచరిత్ర

3 మనభారత్

4 శ్రీమద్భవద్గీత - విశ్వరూప సందర్శనయోగము

# ఎర్రజెండా

(రషియాదేశపు కధ)

సెవొలోద్ మిఖలోవిచ్ గార్షిన్

'సీమన్ ఇవనోవ్' - రైల్వే లైనుమీద కాపలావాడు, అతడు కాపురమున్న యింటికి పన్నెండు వెర్స్టుల* దూరమున ఒక రైలు స్టేషనున్నూ 10 వెర్స్టుల దూరమున ఒక రైలు స్టేషనున్నూ ఉన్నవి అక్కడకు నాలుగు వెర్స్టుల దూరములో ఒక మిల్లు నిరుటి సంవత్సరము కట్టినారు దాని ఎత్తైన నల్లని చిమ్నీ (పొగ స్తంభము) అడవిని దాటి కనిపించుచున్నది ఇంతకు సమీపములో యితడు కాపురమున్న యింటివంటి కాపలావాళ్ల తప్ప, మనుష్యులు కాపురముండే యిళ్ళు లేవు 'సీమన్ ఇవనోవ్' వ్యాధిగ్రస్తుడు చాలా చితికిపోయాడు మనిషి. తొమ్మిది సంవత్సరములకు పూర్వము ఒక సైనికోద్యోగి వద్ద, వార్తలు కొనిపోయే సైనికుడుగా ప్రవేశించి యుద్ధమయ్యే పర్యంతము అతని కొలువులోనే ఉన్నాడు అతడు ఆకలి వేసి బాధపడ్డాడు, చలిలో వడవడ వణికాడు, ఎండలో మలమల మాడాడు, ఘాళుపులుగా ఉన్నప్పుడూ, హిమము కురిసేటప్పుడూ నలభై యాభై వెర్స్టుల దూరము నడిచాడు, ఫిరంగిబారుల కెదురుగా ఉన్నాడు, - కాని దైవ బలముచేత కాబోలు ఒక్క తుపాకిరవ్వ అయినా అతన్ని రాసుకుపోలేదు పూర్తిగా ఒక వారము రోజులు, సైనికదళము సైన్యముఖమున ఉండెను ఆ రోజులలో వారూ, వారి కెదురుగా పల్లములో ఉన్న తురుష్కులూ ఎడతెగకుండా ఫిరంగుల బారు పెట్టుకుంటూనే ఉన్నారు ఉదయము మొదలు సాయంకాలము వరకూ కాల్చడం ఆగలేదు సీమన్ యొక్క కామందు సైన్య ముఖములోనే ఉన్నాడు రోజుకు మూడుమార్లు, అతడు తన ఉద్యోగస్థునకు, కొండచరియలో ఉన్న సైనికుల వంట యింటి నుండి టీ కాచేపాత్రా, భోజన సామగ్రీ తీసుకొని పోయేవాడు వంటయింటి నుండి టీ పాత్ర పట్టుకొని ఉద్యోగస్థుని దగ్గిరకు వెళ్ళడానికి ఒక బయలు దాటవలసి ఉన్నది తుపాకి గుళ్ళు విజ్జుమని అతని సమీపము నుంచి పరుగెత్తి రాళ్ళకు తగిలి శబ్దము చేసేవి సీమన్ భయపడి ఏడ్చేవాడు కాని తాను వెళ్ళడం మాత్రము మానలేదు ఉద్యోగస్థులందరూ అతన్ని చాలా మెచ్చుకొన్నారు - ఎప్పుడూ వారికి వెచ్చ వెచ్చని టీ దొరికేదీ! యుద్ధములో గాయపడకుండా అతడు తిరిగి వచ్చినాడు కాని పాపము కాళ్ళలోను చేతుల్లోను నొప్పులు పట్టుకొన్నవి అప్పటినుంచీ అతడు చాలా చిక్కులు అనుభవించాడు ఇంటికి వెళ్ళాడు - అతని తండ్రి కాలం చేశాడు, నాలుగేళ్ళ కొడుకు కూడా గొంతుకలో జబ్బుచేసి మరణించాడు సీమనూ అతని భార్యా మాత్రం మిగిలారు వ్యవసాయం చేస్తే పని సాగింది కాదు ఎల్లా సాగుతుంది? కాళ్ళూ చేతులూ వాచిపోయి ఉంటే భూమి దున్నడం ఎలాగ? ఇంక స్వగ్రామంలో

* ఒక వెరెస్టు 2/3 మైలుకు సమానం

ఉండడం ఇష్టంలేక సౌఖ్యం కోసం వెతుక్కుంటూ కొత్త స్థలానికి వెళ్ళారు సీమనున్నూ, అతని భార్యా 'ఖార్కోవు'లోను 'డాను'లోనూ రైల్వేలో ఉద్యోగం కోసం ప్రయత్నించారు ఎక్కడా వారికి అదృష్టదేవత ప్రసన్నం కాలేదు కొన్నాళ్ళకు అతని భార్య నౌకరీకి వప్పుకుంది అతడు తిరగడం ప్రారంభించాడు ఒకమాటు అతను రైలుమీద ప్రయాణమై వెళ్ళడం తటస్థించింది ఒక చిన్న స్టేషను దగ్గిర అతడు బయటకు చూచాడు స్టేషను మేష్టరు తనకు పరిచయుడా ఏమిటి చెప్మా అనిపించింది సీమన్ స్టేషను మేష్టరుకేసి చూచాడు, స్టేషను మేష్టరు సీమన్‌కేసి చూచాడు, ఒకరినొకరు పోల్చుకున్నారు తాను పనిచేసిన పైనికోద్యోగి యితడేకదా అనుకున్నాడు సీమన్

"నీవు ఇవనోవ్ కావా?" అన్నాడాయన

"అవును, దేవరా, నేనే!"

"నీ విక్కడకు ఎలాగ వచ్చావు?"

సీమన్ యావద్వృత్తాంతము అతనితో చెప్పినాడు

"ఇప్పు డెక్కడకు వెళ్ళుచున్నావు నీవు?"

"నాకు తెలియదు, దేవరా!"

ఏమిటీ, త్వాష్ట్రం, నీకు తెలియదూ?"

"అవును, దేవరా, ఎక్కడ పనిచెయ్యడానికి సిద్ధపడినా లాభం లభించదు ఉంది ఎక్కడైనా పని దొరుకుతుందేమోనని నేను ప్రయత్నాలు చేస్తూ ఉండవలసిందే కదా దేవరా!"

స్టేషను మేష్టరు అతనికేసి చూచి ఆలోచించి అప్పుడన్నాడు, 'చూడబ్బాయి, ఇప్పటి మట్టుకు స్టేషను దగ్గిర ఉండు నీకు పెళ్ళి అయిందనుకుంటాను కాదూ? నీ భార్య ఎక్కడ ఉంది?'

"అవును దేవరా, నేను పెళ్ళి చేసుకొన్నాను నా భార్య 'కుర్సక్'లో ఒక వర్తకుని వద్ద నౌకరీ చేస్తున్నది"

"సరే నీ భార్యకు ఉత్తరం వ్రాయి ఆమెను ఇక్కడకు రమ్మని చెప్పు, ఆమెకు ఫ్రీ పాసు ఇప్పిస్తాను కాపలావారి యిళ్ళలో ఒకటి త్వరలోనే కాళీ అవుతుంది ఈ సెక్షన్ ప్రధానోద్యోగితో నీ సంగతి చెప్పుతాను"

"నేను కృతజ్ఞుడను దేవరా!"

అందుచేత అతను స్టేషను దగ్గిర ఉండిపోయాడు స్టేషను మేష్టరు వంటింట్లో అతడు సాయం చేస్తూ ఉండేవాడు పుల్లలు కొట్టేవాడు, పెరడు తుడిచేవాడు, ప్లాటుఫారం తుడిచేవాడు, రెండువారాల్లో అతని భార్య వచ్చింది. సీమన్ తన సామాను ఒక తోపుడు బండిలో పెట్టి తన

కాపలాయింటికి వెళ్లాడు కాపలా ఇల్లు కొత్తది, వెచ్చగా ఉంది అతనికి కావలసినంత వంట చెరుకు ఉంది ఇతనికి పూర్వం ఆ ఇంట్లో కాపురమున్నవాడు పాదులూ కూరమొక్కలూ పెంచుకు వెళ్లి పోయాడు అవి వీరికి దక్కినవి లైను పక్క సుమారు అర ఎకరం దున్నడానికి వీలుగా ఉన్న భూమి ఉన్నది సీమన్ చాలా సంతోషించాడు భూమిని ఎల్లా సేద్యం చెయ్యడమో, ఒక ఆవునీ ఒక గుఱ్ఱాన్ని ఎలా కొనుక్కోవడమో, ఆలోచించడము మొదలు పెట్టాడు

అతని పనికి కావలసిని వస్తువులన్నీ అతనికిచ్చారు - ఒక ఆకుపచ్చజెండా, ఒక ఎఱ్ఱజెండా, ఒక లాంతరు, ఒకబూరా, ఒక సుత్తి, స్క్రూళ్లు బిగించడానికి రెంచీ, ఒక గునపమూ, ఒక తవుగాలా, ఒక చీపురూ, కొన్ని మర మేకులు, ఇనపగడ్డ గోరులూ, అతనికి రెండు పుస్తకాలు కూడా ఇచ్చారు. రైల్వే రూల్సు, టైమ్‌టేబిల్ మొట్టమొదట సీమన్‌కు రాత్రిళ్లు నిద్రపట్టనేలేదు అస్తమానం టైమ్‌టేబుల్ చదవడమే ఇక రెండు గంటలకి రైలు వస్తుందంటే అతను తనబీటు తిరిగి వచ్చి ఇంటివద్ద ఉన్న బెంచి మీద కూచుని చూస్తూండేవాడు - రైలు పట్టాలు అదురుతున్నాయేమోననీ, రైలుబండి చప్పుడు వినిపించదాఅనీ రైల్వేరూల్సు అన్నీ అతనికి కంఠతా వచ్చాయి వర్ణక్రమం చేసుకుంటూ చదువుకోవలసివచ్చినా అతడు సర్వమూ నేర్చుకోగలిగాడు

అది వేసంగి పని చులాగ్గానే ఉంది మద్ద మంచు కురియడం లేదు కాబట్టి అది తీసివేసి బాగుచెయ్యవలసిన పని తప్పింది. ఆ లైనుమీదకు అట్టే రైళ్లురావు కాబట్టి సీమన్ రోజుకు రెండుమార్లు తను చూడవలసిన వెర్స్టు చూచేవాడు అక్కడ ఒక్కొక్క మేకు బిగించడమూ, పట్టాలమధ్య మన్ను సరిగ్గా ఉందా లేదా అని చూడడమూ పట్టామధ్య నుంచి నీరు పోవడానికి పెట్టిన కాలవ గొట్టాలు బాగా ఉన్నాయో లేవో చూడడమూ అయిన తర్వాత ఇంటికి వచ్చి భూమి సేద్యం సంగతి ఆలోచిస్తూ ఉండేవాడు కాని ఇంటిపనులు చేసుకోడానికి మాత్రం ఒక చిక్కు ఉన్నది అతడు ఏమైనా చేద్దామని అనుకున్నట్లయితే రైలు రోడ్డు మేస్త్రి ఉత్తరువు కోసం వ్రాసుకోవాలి ఆ మేస్త్రి సెక్షను ప్రధానోద్యోగికి రిపోర్టు పంపాలి ఇవన్నీ అయి అతనికి ఉత్తరువు వచ్చేటప్పటికి పుణ్యం కాలం రవంతా అయిపోయేది సీమన్‌కూ, అతని భార్యకూ చేతినిండా పనిలేక ఏమీ తోచడం లేదు.

రెండు నెలలు గడచినవి సమీపంలో ఉన్న కపలావాండ్లతో సహవాసం చేయ మొదలు పెట్టాడు సీమన్ అందొకడు చాలా ముసలివాడు అతడు ఇల్లుదాటి బయటకు రావటమునకైనా శక్తి లేనివాడు తన్ని తీసివేసి ఇంకొకరిని ఆస్తానే వేస్తారని గట్టి వదంతు కద్దు. అతని భార్య అతపి బదులు లైనుమీద పని చేసేది, ఇంకో కాపలావాడు బక్క పల్చగా ఉంటాడు కాని కండలు ఆవుపిస్తూ ఉన్నవి కుఱ్ఱవాడే ఇద్దరు బీటులూ కలిసేచోట సీమన్ మొట్టమొదట అతనిని కలుసుకున్నాడు సీమన్ టోపీతీసి బుఱ్ఱ వంచి సలాము చేశాడు "ఖులాసాగా ఉన్నావా అబ్బాయీ" అన్నాడు సీమన్

అబ్బాయి ఓరచూపుతో అతనిని చూశాడు "నీవు ఎలాగ ఉన్నావు" అని సమాధానం చెప్పి

వెనక్కు తిరిగి వెళ్లిపోయాడు కొన్నాళ్ళైన తర్వాత వారి భార్యలు ఒకరినొకరు కలుసుకున్నారు సీమన్ భార్య 'అరీనా' పొరుగు కాపరి భార్యను పలకరించింది ఆవిడ ఏవో రెండు ముక్కలు చెప్పి వెళ్లిపోయింది. ఈమ నొకమారు ఆమెను కలుసుకొని, "ఏమిటి సంగతి, అమ్మాయి నీ భర్త మాట్లాడనే మాట్లాడడు?" అన్నాడు అమ్మాయి మొదట మాట్లాడక ఊరుకొని తర్వాత అన్నది కదా, "నీతో ఏ విషయమై అతను మాట్లాడాలి?" ఎవరి గొడవ వారిది మీ గొడవ మీరు చూచుకుందురూ, పుణ్యముంటుంది "

అయితే యేమి, ఒకనెల గడవకుండా వారిద్దరూ స్నేహితులై నారు సీమనున్నూ, 'వాసిలీ' యున్నూ రైలు లైను మీద కలుసుకొన్నప్పుడు వారిద్దరూ గట్టుమీద కూర్చొని పొట్టి పొగాకు గొట్టాలు వెలిగించి ఏ రీతిగా జీవితం గడిపేరో చెప్పుకుంటూ ఉండేవారు 'వాసిలీ' సాధారణముగా మాట్లాడేవాడు కాడు కానీ సీమన్ తన స్వగ్రామాన్ని గురించీ, యుద్ధాన్ని గురించీ చెప్పేవాడు.

"జీవితంలో ఇన్నీ అన్నీ కాదు నేను పడ్డ కష్టములు కానీ భగత్కృపవల్ల అట్టేకాలం కష్టపడలేదు భగవంతుడు నాకు అదృష్టం దయచేశాడు కాడు. పరమేశ్వరుడు ఎంత అదృష్టం ఇస్తే అంతే అదీ సంగతి, వాసిలీ ష్టిపేనిచ్" అని సీమన్ చెప్పాడు

వాసిలీ ష్టిపేనిచ్ తన పొగాకు గొట్టములో నుసి రైలు పట్టామీద కొట్టి దులిపి నిలబడ్డాడు "భగవంతుడిచ్చే అదృష్టం కాదు మనకు వ్యతిరేకంగా ఉంట, మనుష్యులు, మనుష్యులను మించిన క్రూరమృగములు ఎక్కడా లేవు తోడేళ్లు తినవు, మనుష్యులు బ్రతికి ఉన్న ఇతర మనుష్యులను తింటారు " "అన్నా, కాదు, తోడేళ్లు తోడేళ్లను తింటవి అబద్ధమంటావా?"

"అప్పటికి వచ్చినమాట ఏదో అన్నాను అయితే ఏమి? ఇంత కంటే క్రూరమైన మృగములు వేరేలేవు మనుష్యుని దుర్మార్గతా, ఆశా, లేకపోతే బ్రతకవచ్చు ప్రతివాడు నిన్ను బ్రతికి ఉండగా పట్టుకొని మ్రింగివేద్దామని వడుపువేసుకు ఉంటాడు - నోటితో కొరికి మ్రింగి వెయ్యడానికే"

సీమన్ ఆలోచించాడు

"నాకు తెలియదు అన్నా, బహుశః అలాగు అయి ఉండవచ్చు, కానీ, అలాగ అయినట్లయితే అది భగవదాజ్ఞ"

వాసిలీ అన్నాడు కదా, "అలాగయితే మనము ఒకరితో ఒకరు మాట్లాడతగ్గ దేదీలేదు, మనకు జరిగే ప్రతి అన్యాయమూ భగవంతుని మీద పారవేసి కూర్చుని దుఃఖించే మాటయితే మనము మనుష్యులము కాము, పశువులము, నేను చెప్పేదది "

అతడు వెనక్కు తిరిగి వెడతానని చెప్పకుండా వెళ్లిపోయాడు సీమన్ కూడా లేచి నిలబడ్డాడు "అన్నా, నాతో అంత కఠినంగా మాట్లాడతావేమి" అని వెనకనుంచి కేకలేశాడు

అతడు తిరిగి చూడలేదు మళుపు దగ్గిర పల్లములో అతను దిగి అగుపించకుండా ఉండేదాకా అతనికేసి సీమన్ నిలబడి చూశాడు అప్పుడతడు ఇంటికి తిరిగి వచ్చి భార్యతో అన్నాడు, "అరీనా, మన పొరుగువాడు మాదొడ్డవాడు! వాడు మనిషికాడు, పగబట్టే మృగము "

అయినా వారిద్దరూ విరోధపడలేదు త్వరలోనే వారిద్దరూ మళ్లీ కలుసుకొని పూర్వమువలెనే ప్రంగించారు ఎప్పుడూ ఒక్కటే విషయం

"చూచావు స్నేహితుడా, ఆ మనుష్యుల మూలాన్ని కాకపోతే మనము కాపలాఇళ్లలొ కూర్చోనే కూర్చోము" అన్నాడు వాసిలీ "కాపలాయిళ్లకేమి? అవి పాడుగా లేవు వాసయోగ్యముగానే ఉన్నవి "

"వాసయోగ్యమే, వాసయోగ్యమే అంతకన్న నీవేమీ చెప్పుతావు ఇంత కాలము నీవు జీవించావు ఏమీ నేర్చుకోలేదు ఇంతకాలం నుంచి చూస్తున్నావు, ఏమీ చూడనేలేదు ఏమీ చూడనేలేదు కాపలా ఇంటిలోనైతేనేమి, ఇతర స్థలాల్లో అయితేనేమి, బీదవాడు బ్రతికే బ్రతుకు ఏమాదిరిగా ఉంటుంది నెత్తురు పీల్చేవాళ్లు, నిన్ను పీల్చి పిప్పి చేసి నీవు ముసలి వాడవైన తరువాత పందులకు పనికివచ్చే తుక్కు కింద తీసి పారవేస్తారు, నీకు ఎంత జీతమిస్తున్నారు?"

"కొంచమే వాసిలీష్టి పేనిచ్, 12 రూబుళ్లు, "నాకు పదమూడున్నర, ఎందుకీతేడా ఉండాలి? కంపెనీ రూల్సు ప్రకారం మన అందరికీ ఒక్కటే జీతం నెలకు పదిహేను రూబుళ్లు, దీపమూ వంట చెరుకూ ఉచితం నీకు పన్నెండు రూబుళ్లు, నాకు పదమూడున్నర రూబుళ్లు ఇవ్వమని ఎవరు ఉత్తరువు చేశారు? అదీ నిన్నడగవలసిన ప్రశ్న కాలక్షేపం చెయ్యవచ్చు కదా అంటావు కాబోలు! రూబులున్నరల వాళ్లు పదిహేనూ ఇవ్వడం తటస్థించితే మూడు రూబుళ్ల తేడాకోసంనే చెప్పడం లేదు క్రిందటి నెల రైల్వే డైరక్టర్ ఈ దారిని వెళ్లినప్పుడు నేను స్టేషన్ దగ్గిర ఉన్నాను అప్పుడు ఆయన్ని చూశాను ఎన్నో గౌరవచిహ్నములున్న వాయనికి, ప్రత్యేకంగా ఒక బండి వేయించుకొని అందులో ఆయన ప్రయాణం చేస్తున్నాడు ఇవతలికి వచ్చి ఆయన ఫ్లాటుఫారం మీద నిలబడ్డాడు నే నిక్కడ అట్టేకాలం ఉండేది లేదు ఎక్కడకు తోస్తే అక్కడికి వెళ్లిపోతాను

"ఎక్కడికి వెళ్లుతావు నీవు, ష్టిపేనీచ్? పోనిద్దూ, ఇక్కడ నీకో ఇల్లు ఉన్నది వెచ్చగా ఉంటున్నావు, కాస్త పొలం ఉన్నది పని చెయ్యగల భార్య ఉన్నది."

"కాస్తపొలం! నాకాస్తపొలంకేసీ నీవెప్పుడైనా చూచావా? ఒక రెమ్మైనా అందులో లేదు పోయిన వసంత ఋతువులో కొన్ని కాబేజీలు అందులో మొలవేశాను రోడ్డు మేస్త్రి వచ్చి, 'అప్లికేషన్ పెట్టుకొన్నవా? ఉత్తరువు పొందావా? ఈ క్షణంలో అవి లాగి పారవెయ్యి, వాట్ల ఆనవాళ్లేనా అక్కడ ఉండడానికి వీలులేదు' అన్నాడు అప్పుడు తప్ప త్రాగి ఉన్నాడేమో అలాగ అన్నాడు ఇంకొకప్పుడైతే మాట్లాడక ఊరుకొనును మంచీచెడ్డా తెలియని మత్తుస్థితిలో ఉన్నాడు "మూడు రూబుళ్లు

జుల్మానా!''

వాసిలీ తన పొగాకు గొట్టమును మాట్లాడకుండా కొంతసేపు పీల్చి ఈరీతిగా అన్నాడు "అంతటితో సరిపెట్టేడు, లేకపోతేనా, చచ్చేదాకా తన్ని వదలిపెట్టేవాడిని '

"కానీ, కానీ అబ్బాయీ, నీవు తొందర మనిషివి, చెప్పు చున్నాగా ''

"నేను తొందర మనిషిని కాను సత్యాన్ని గురించే నేను ఆలోచిస్తూ ఉంటాను, సత్యాన్నే మాట్లాడుతాను. అవలేదు, వాడిపని పడతానులే సెక్షన్ ప్రధానాధికారికి ఫిర్యాదు చేస్తాను ''

అతడు ఫిర్యాదు చేశాడు

సెక్షన్ ప్రధానాధికారి లైను పరీక్ష చేయడానికి వచ్చాడు, ఇంక మూడు రోజులకు 'పీటర్సుబర్గు పట్టణము నుంచి కొందరు గొప్పవాళ్లు ఆ దారిని రైలుమీద వెళ్ల బోతున్నారు వాళ్లు రావడానికి ముందు సమస్తమూ సక్రమంగా ఉండవలెను కాబట్టి లైను పరీక్ష జరుపవలసి వచ్చింది అవసరమైన చోట మన్ను రాళ్లు పట్టాల మధ్యపోసి దట్టించారు, ఎత్తుపల్లాలు సరిచేశారు, పట్టాలక్రింది అడ్డదూలాలు పరీక్ష చేశారు బంధాలు పట్టాలకు సరిగా ఉన్నవో లేవో అని సుత్తులతో కొట్టి చూచారు మరమేకులు గట్టిగా బిగించారు స్థంభాలకి కొత్త రంగులు పూశారు లెవెల్ క్రాసింగుల దగ్గిర పచ్చమన్ను చల్లారు ముసలి కాపలావాని భార్య పట్టా ప్రక్కలను పెరగిన మొక్కలను లాగి పారేయడానికి అతనిని బయటకు పంపించింది సీమన్ ఒకవారం బాగా కష్టపడి అంతా రైటు చేశాడు అతడు త న 'కాఫ్టన్' ఉతికి బాగుచేసి చిరుగులు కుట్టుకున్నాడ వాళీబిళ్ల ఇటిక పొడుముతో ధగధగ మెరిసేలాగ తోమినాడు వాసిలీ కూడా చాలా కష్టపడి పనిచేశాడు సెక్షన్‌ప్రధానోద్యోగి తోపుడు బండిలో వచ్చాడు నలుగురు కూలివాళ్లు ఆ బండి నడపడానికి పని చేస్తున్నారు బళ్లచక్రాలు బఝుమని చప్పుడవుతున్నాయి బండి గంటకు ఇరవై వెర్స్టుల వేగముతో పరుగెత్తుచున్నది చక్రాలు హోరుమంటున్నవి సీమన్ కాపలాయింటికి అది రంయని వచ్చింది, సీమన్ పరుగు పరుగున వెళ్లి సిపాయివలె నిలబడి సర్వమూ నివేదించాడు సమస్తమూ సక్రమంగా ఉన్నది

"ఎంత కాలం నుంచి నీవు ఇక్కడ ఉంటున్నావు'' అన్నాడు ప్రధానాధికారి

"మే నెల రెండవ తేదీ నుంచి దేవరా!''

"సరే, మంచిది నూటఅరవై నాలుగో నెంబరు దగ్గర ఎవరున్నారు?''

తోపుడు బండిలో అతనితో కూడా వచ్చిన రోడ్డు మేస్త్రీ "వాసిలీ స్పిరిడోనొవ్'' అని చెప్పాడు.

"స్పిరిడోనోవ్, స్పిరిడోనొవ్ ? ఊహూ క్రిద టేడు చివాట్లు తిన్నాడు వాడేనా?'

"అవునువాడే ''

"సరే చూద్దాము పోనియ్యి"

కూలివాళ్లు తోపుడు బండి నడపడానికి పూనుకున్నారు. బండి బయలు దేరింది. సీమన్ దానివైపు చూస్తూ అనుకున్నాడు "నా పొరుగు వాడు ఏదో తమాషా చేస్తాడు మొత్తం మీద"

రెండుగంటలైన తర్వాత సీమన్ తనపని చేసుకోడానికి వెళ్లాడు పల్లములో ఉండగా ఎవరో ఒక మనిషి లైను ప్రక్క నుంచి నడుస్తూ ఉన్నట్టు చూచాడు అతనికి తలమీద ఏదో తెల్లగా ఉన్నట్టు కనిపిస్తోంది సీమన్ జాగ్రత్తగా చూచాడు వస్తూన్నవాడు 'వాసిలీ' చేతులో ఒక కఱ్ఱ భుజం మీద ఒక మూటా పెట్టుకుని వస్తున్నాడు ఒక చెంప మాత్రం జేబురుమాలుతో కట్టు కొన్నాడు

"ఎక్కడకు వెళ్లుతతున్నావోయి అబ్బాయి" అని సీమన్ కేక వేశాడు

వాసిలీ చాలా సమీపానికి వచ్చాడు అతని ముఖము వికలముగా ఉంది సుద్దలాగ తెల్లబడిపోయింది కళ్లు ఉగ్రముగా ఉన్నవి మాట్లాడటానికి ప్రయత్నించాడు కాని మాట సరిగా వచ్చింది కాదు "నేను పట్టణానికి, మాస్కో, బోర్డుకు వెళ్లుచున్నాను"

"బోర్డు దగ్గిరకా అలాగా! ఫిర్యాదు చేయడానికి కదూ? వదలిపెట్టుదూ, వాసిలీ స్టిఫెచ్, మరిచిపోదూ!"

"కాదన్నా, నేను ఎంత మాత్రమూ మరచిపోను మరిచిపోయే రోజులు వెళ్లాయి చూడు నన్ను మొహం మీద ఎలా కొట్టాడో, రక్తం కారిపోతుంది బ్రతికి ఉండగాను మరిచిపోతానా? ఇలాగ వదలి పెడతానా?"

సీమన్ అతని చెయ్యి పట్టుకొన్నాడు "వదిలిపెట్టుదూ, స్టిపెనిచ్ నేను చెప్పే మాట సత్యం, ఇప్పుడున్న పరిస్థితులు బాగుపడవు సుమీ" "పరిస్థితులు బాగుపడడమా? నేను బాగు చెయ్యలేనని నాకు తెలుసును భగవంతుడిచ్చే అదృష్టాన్ని గురించి నీవు చెప్పిన మాట వాస్తవమే నా అదృష్టం నేను బాగు చేసుకోలేను కాని సత్యాన్ని అనుసరించవలసి ఉంటుంది కదూ"

"ఏమిటి జరిగిందో చెప్పు"

"ఏమిటి జరిగిందా! అన్నీ పరీక్ష చేశాడు తోపుడు బండి దిగి ఇంట్లోకి వెళ్లాడు జాగ్రత్తగా ప్రతీది పరీక్ష చేస్తాడని నాకు తెలుసు అంచేతనే అంతా సరిగ్గా ఉంచాను వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉండగా నేను ఫిర్యాదు చేశాను నన్ను చూచి మండిపడి అన్నాడు గదా, 'ఇది గవర్నమెంటు తనిఖీ నీవు పాదులను గురించి ఫిర్యాదు చెయ్యడానికి వచ్చావా? ప్రీవీ సభ్యులకు సంబంధించిన విషయమిది నీ కాబేజీల గొడవతో ఇప్పుడా రావడం?' నేను అనకుండా ఉండలేక పోయాను ఒక్కమాట అన్నాను అట్టేలేదు కాని అతనికి కోపం వచ్చింది నన్ను మొహం మీద ఒక్కటి వేశాడు, నేను అలాగ నిలబడి పోయాను వాళ్లు బండి తీసుకుపోయారు నేను తెలివితెచ్చుకొని మొహం కడుక్కొని బయలుదేరాను'

"కాపలాయింటి సంగతి?"

"నాభార్య అక్కడ ఉంది ఆమె అంతా సరిగ్గా చూస్తుంది వాళ్లూ వాళ్ల రైళ్లూ విరగడైపోను " వాసిలీ లేచి వెళ్లిపోవడానికి సిద్ధ పడ్డాడు

"సెలవు, ఇవనిచ్ నాకు న్యాయం జరుగుతుందని చెప్పలేను "

"నడిచివెళ్లాలనా ప్రయత్నం "

"స్టేషను దగ్గిర బూర్జులబండి మీద వెళ్లనివ్వమని అడుగుతాను రేపు మాస్కోలో ఉంటాను ' ఒకరివద్ద ఒకరు సెలవు తీసుకొన్నారు వాసిలీ ప్రయాణమై వెళ్లాడు చాలాకాలం అతడు ఎవరికీ కనిపించలేదు అతని భార్య అతని పనంతా చేస్తున్నది రాత్రింబగళ్లు నిద్రలేదు పెనిమిటి కోసం కనిపెట్టుకు ఉండడం వల్ల సగమైపోయింది మూడవ రోజున ఇన్స్పెక్టర్‌గారి రైలు ఆదారిని వెళ్లింది ఒక ఇంజనూ, ఒక సామానుబండి రెండు ఫస్టుక్లాసు బండ్లూను వాసిలీ అప్పుడక్కడ లేనేలేడు నాల్గవ రోజున సీమన్ వాసిలీ భార్యను కలుసుకున్నాడు అస్తమానం ఏడవడం వల్ల ఆమె మొహం పొంగి ఉన్నది కళ్లు ఎర్రగా ఉన్నవి "నీ పెనిమిటి తిరిగివచ్చాడా?" అని ప్రశ్నించాడు

ఆమె చెయ్యి ఆడించి ఏమీ చెప్పకుండా వెళ్లిపోయింది

చిన్నతనములో సీమన్ 'విల్లో' శాఖలతో పిల్లం గ్రోవులు చెయ్యడం నేర్చుకున్నాడు విల్లో కర్రలో బెండు ఊడకొట్టి అవసరమైన చోట్ల రంధ్రాలు పొడిచి చివర పీపి చేసి ఎంతో బాగా ఏ పాట పాడితే ఆ పాట పాడడానికి వీలుగా ఉండేటట్లు పిల్లంగ్రోవులు చేసేవాడు పని లేక ఖాళీగా ఉన్నప్పుడు చాలా గొట్టాలు చేసి బూర్జుబండి గార్డుకూ, తనకూ, పరిచయం ఉండడం వల్ల అతని ద్వారా పట్టణం పంపించే వాడు మార్కెట్టులో అమ్మగా ఒక్కొక్కదానికి రెండు కోపెక్కుల వంతున అతనికి ముట్టేది. తనిఖీ అయిన మూడో రోజున ఆరు గంటల బండి చూడడానికి భార్యను ఇంటివద్ద అట్టేపెట్టి కత్తి తీసుకొని పిల్లంగ్రోవులకు కర్రలను కొట్టడానికి అతను అడవిలోకి వెళ్లాడు తన బీటు చివరదాకా వెళ్లి రైలు మార్గం మోచేతి మలుపు తిరిగిన చోట గట్టుదిగి అడవిలోకి వెళ్లాడు అరవెర్స్టు దూరం పైన ఒక పెద్ద తేమ ప్రదేశమున్నది దాని సమీపంలో పిల్లంగ్రోవులు చెయ్యడానికి అనుకూలంగా ఉండే విల్లో కర్రలు దొరుకుతవి ఒక మోపుకర్రలు కొట్టి ఇంటికి వెడదామని బయలుదేరాడు, అడవిలో నడుస్తున్నాడు సూర్యుడు పడమర అస్తమించబోతున్నాడు, అంతా నిశ్శబ్దము పక్షుల రుతుములూ, కాలిక్రింద పడ్డ ఎండాకుల చప్పుడూ మాత్రం వినపడుచున్నవి సీమన్ మరికొంతదూరం నడిచాడు రైలు పట్టాలు సమీపించాడు ఒక లోహపు వస్తువు మీద ఇంకో లోహపు వస్తువును కొట్టితే పుట్టే శబ్దము వంటి శబ్దము అతను విన్నట్టు భావించాడు సీమన్ వడివడిగా నడుస్తున్నాడు ఆ ప్రాంతాల రైలుపట్టాలకు ఏమీ మరమ్మతులు లేవు "ఏమిటి ఈ శబ్దము" అని అతడాలోచించాడు అడవి

పొలిమేర దాటాడు రైలు గట్టు కనిపించింది రైలు లైను మీద ఎవరో కూర్చుని ఏమో చేస్తున్నారు నెమ్మదిగా సీమన్ అతన్ని సమీపించాడు ఎవరో మరమేకులు ఎత్తుకు పోవడానికి వచ్చారని అనుకున్నాడు సీమన్ చూచాడు ఆ మనిషి లేచాడు అతని చేతులో గునపమున్నది దానిని ఒక పట్టాక్రింద పెట్టి ఒక వైపుకు కదిపాడు సీమన్ కళ్లు చీకట్లు గ్రమ్మినవి కేక వేదామనుకున్నాడు మాటరాలేదు ఆ మనిషి వాసిలీ అని అతడు చూచాడు అతనికేసి గబగబ పరుగెత్తుకు వెళ్లాడు వాసిలీ గునపమూ, రెంచీ చేత్తో పుచ్చుకొని గట్టు అవతలవైపు నుంచి పారిపోయాడు.

"వాసిలీ స్టిఫేనిచ్! అన్నా! నాయనవు గావు! తిరిగిరావు! గునపము నాకియ్యి! రైలుపట్టా యధాప్రకారం పెట్టుదాము ఎవరికీ తెలియదులే తిరిగిరా, పాపపంకం తగలకుండా నీ ఆత్మను కాపాడుకో "

వాసిలీ తిరిగి రాలేదు అడవిలోకి వెళ్లిపోయాడు

ఊడదీసిన పట్టాదగ్గిర సీమన్ నిలబడ్డాడు కర్రలమోపు క్రింద పారవేశాడు అప్పుడు వచ్చేబండి సామానుబండి కాదు ప్రయాణీకులుండే బండే దాన్ని ఆపడానికి అతనివద్ద సాధనాలేమీ లేవు జెండాలు లేవు వట్టిచేతుల్తో రైలుపట్టా సరియైన స్థలంలో పెట్టడము సాధ్యము కాదు మేకులు బిగించడమూ సాధ్యము కాదు ఎక్కడికైనా పరుగెత్తాలి సాధనాలు తేవడానికి తప్పకుండా అతను తన ఇంటికి పరుగెత్తవలసి ఉన్నది భగవంతుని సహాయం ఉండాలి!

వగర్చుకొంటూ సీమన్ ఇంటివైపు పరుగెత్తాడు పరుగెత్తుతున్నప్పుడు ఏ క్షణం క్రిందపడిపోతానో అని అనుకున్నాడు అడవి వెలువడి పరుగెత్తాడు అతని ఇంటికి ఇంక దూరం సుమారు రెండువందల గజాలు ఉన్నది మిల్లు తాలూకు కూత అప్పుడే వినిపించింది ఆరు గంటలయ్యింది ఆరు గంటల రెండు నిమిషములకు రైలుబండి రానై ఉన్నది కరుణామయుడా! భగవంతుడా, ఏ పాపమూ ఎరగని ప్రయాణీకులకును కాపాడవా! సీమన్‌కు జరగబోయే సంగతి అంతా కనిపిస్తూనే ఉంది ఇంజను వస్తుంది ఊడదీసిన పట్టాతో దాని ఎడమవైపు చక్రాలు తగులుకుంటవి ఇటూ అటూ ఊగులాడుతుంది తిరగబడుతుంది రైలు పట్టాలను పైకి లాగుకుపోతుంది పట్టాక్రింద దూలాలు వదలి పోతవి సరిగ్గా అక్కడే లైను మలుపు తిరిగింది, గట్టు ఇరవై అయిదు గజాలు ఏటవాలుగా ఉన్నది అక్కడ ఆ రైలుబండిలో మూడోక్లాసు బం స్త్రీలు, చిన్న పిల్లలు క్రిక్కిరిసి కూర్చుని ఉంటారు ఏమి వస్తుందో తెలియకుండా వారంతా కూర్చుంటారు భగవంతుడా! ఏమి చెయ్యమన్నావు ఎంతగట్టిగా పరుగెత్తినా ఇంటికెళ్లి తిరిగి రావడమునకు వ్యవధి చాలదు ! సీమన్ ఇంటికి వెళ్లలేదు అంతకన్న వడిగా పరుగెత్తుకొంటూ వెనుకకు వెళ్లాడు ఒళ్లు తెలియకుండా తరవాత క్షణంలో ఏమి జరగబోతోందో తెలియకుండా పరుగెత్తాడు రైలు ఊడదీసిన స్థలానికి పరుగెత్తి వెళ్లాడు అతడు పడవేసిన కర్రల మోపు అక్కడే ఉన్నది వంగి ఒక కర్ర తీసుకొని ఎందుకో తెలియదు ఇంకా ముందుకు పరుగెత్తాడు

రైలుబండి వస్తూన్నట్టు అతను భావించాడు దూరము నుంచి రైలు కూత వినిపించింది రైలు పట్టాలు కొంచెము కొంచెము అదురుతున్నవి ఇంకా పరుగెత్తడానికి అతనికి శక్తి చాలదు పట్టా ఊడదీసిన స్థలానికి రెండువందల గజాలు ముందు ఆగాడు ఆ క్షణంలోనే అతడు ఏమి చేయవలసి ఉంటుందో ఛట్టున తట్టింది తన టోపి తీసివేశాడు అందులో నుంచి ఒక జేబురుమాలు తీశాడు తన కాలిజోడులో నుంచి కత్తిని పైకి లాగాడు సిలువవంటి చిహ్నము తన ముందు వ్రేలితో గాలిలో వేసుకొన్నాడు భగవంతుడా రక్షించు

మోచేతిపైన ఎడమ దండలో కత్తిని గుచ్చాడు వేడి నెత్తురు ప్రవాహము ఉబికి వచ్చింది జేబురుమాలు ఆ కర్దములో తడిపాడు ముడతలుతీశాడు. విడదీసి కఱ్ఱకు కట్టాడు ఎత్తుగా ఎత్తి పట్టుకొన్నాడు అతని ఎఱ్ఱజెండా

జెండా ఊపుతూ అక్కడే నిలుచున్నాడు అప్పుడే అతడు రైలు బండి చూచాడు ఇంజను డ్రైవరు మాత్రం అతనిని చూడలేదు బండి సమీపిస్తుంది రెండువందల గజాల దూరంలో బరువుబండి ఆపడం ఎవరకీ శక్యం కాదు

దెబ్బ నుంచి రక్తము ఊరికే కారిపోతోంది చేతిని ప్రక్కకు అణచి పెట్టాడు దానివల్ల ప్రవాహం కట్టుపడుతుందనుకొన్నాడు కాని రక్తం ప్రవహిస్తూనే ఉంది రెక్కలోపడ్డ గాయం లోతుగా ఉంది అతనికి తల తిరుగుతోంది కళ్ల ముందర నల్లటి ఈగలు ఎగురుతూన్నట్లు ఆయింది కళ్లు చీకట్లు గ్రమ్మినవి చెవుల్లో గంటలు వాయించిన శబ్దము వినిపించడం లేదు అతని మనసులో ఒక్కటే ఆలోచన! "నేను నిలబడలేను - నేను పడిపోతాను - జెండా క్రింద పడవేస్తాను బండి నా మీద నుంచి పోతుంది అయ్యో దేవుడా! రక్షించవా !" అతని కళ్లు మసకలు గ్రమ్మినవి మనస్సు శూన్యమైనది జెండా వదిలేశాడు నెత్తురు జెండా క్రిందపడలేదు ఎవరిచెయ్యో దానిని పట్టుకున్నది ఎవరిచెయ్యో వచ్చేబండికేసి పైకెత్తి ఉంచింది ఇంజను డ్రైవర్ దానిని చూచాడు వాల్వుమూసివేశాడు ఇంజను మరల వెనక్కు త్రిప్పాడు రైలుబండి ఆపివేశాడు

ప్రయాణీకులు బళ్లుదిగి గుంపులు గంపులుగా వచ్చారు వాళ్లంతా రక్తంతో ఒకడు స్మృతితప్పి పడి ఉండడం చూచారు ఇంకొకరు అతని ప్రక్క నిలబడి కఱ్ఱకు కట్టిన నెత్తురు జెండా ఎత్తి పట్టుకొని ఉండడం చూచాడు

వాసిలి ఒకసారి చుట్టూచూచి తలవంచుకొన్నాడు

అతడన్నాడు, "నన్ను కట్టివేయండి రైలుపట్టా ఊడదీసింది నేను "

* * * *

# ప్రపంచ చరిత్ర

## మొదటి భాగము
## ఆంగ్ల మాతృక
## జవహర్ లాల్ నెహ్రూ

# జన్మదిన లేఖ

ఇందిరా ప్రియదర్శినికి — నైనీ కేంద్ర చెరసాల

పదమూడవ పుట్టినరోజున — అక్టోబర్ 26, 1930

నీవు పుట్టినరోజున బహుమతులను, ఆశీస్సులను అందుకొనుట నీ కలవాటు ఈ మాటుకూడ నీ వాశీస్సులు పుష్కలముగా అందుకొనగలవు కాని ఈ నైనీ చెరసాలనుండి నీ కెట్టి బహుమతులను నేనంపగలను ? నేను పంపు బహుమతులు వస్తురూపమున నుండజాలవు వాయురూపమునగాని, మనోరూపమునగాని ఉండవచ్చును ఏ యభిమాన దేవతయైన నీ కీయగలిగిన విట్టి పారితోషకములే వీనిని పంపుటకు చెరసాల ఎత్తుగోడలుసైత మడ్డు రాజాలవు

ఉపదేశములు చేయుట, మంచిసలహాలనిచ్చుట నాకిష్టము లేని పనియని నీలెరుగుదువుగదా, చిట్టీ తల్లీ ? ఇట్లు చేయు నాకు బుద్ధి పుట్టినప్పుడు నేనొకమారు చదివిన కథజ్ఞప్తికి తెచ్చుకొనుచుందును అది " మిక్కిలి తెలివిగల మనుష్యుని" కథ ఈ కథ గల గ్రంథమును ముందుముందు నీవే చదువుదువేమో, పదమూడువందల సంవత్సరములకు పూర్వము, చీనా దేశమునుండి ఇండియాకు, వివేకము జ్ఞానము నార్జించు ఉద్దేశముతో ఒక గొప్ప బాటసారి వచ్చెను అతని పేరు యువాన్ చ్వాంగ్ ఉత్తర దిక్కున నున్న కొండలను దాటి, ఎడారులను దాటి ఆతడు వచ్చెను ఎన్నియో అపాయముల నుండి అతడు తప్పించుకొనెను ఎన్నో యంతరాయముల నాతడు గడచెను - అతని జ్ఞానపిపాస యంత గొప్పది నేడు పాట్నా యని పేర్కొనబడుచున్న పాటలీపుత్ర మను నగరమునకు సమీపమున ఆకాలమందున్న నలందా విశ్వవిద్యాలయమునం దాతడు ముఖ్యముగా తాను విద్యనభ్యసించుచు, ఇతరులకు విద్యగరపుచు పెక్కేండ్లు గడపెను యువాన్ చ్వాంగ్ విద్యాధికు డాయెను అతనికి ధర్మాచార్యుడను బిరుదము లభించెను ఇట ధర్మమన బౌద్ధధర్మమని యభిప్రాయము అతడు హిందూదేశమంతయు తిరిగెను ఆ కాలమున నీ దేశమున నివసించు ప్రజల నాతడు చూచెను వారనిగురించి తెలిసికొనెను తరువాత నీతడు తన యాత్రలను గూర్చి యొక గ్రంథమును రచించెను నాకు జ్ఞాపకము వచ్చిన కథ ఈ గ్రంథములో నున్నది దక్షిణ హిందూ దేశమునుండి ఒక పురుషుడు కర్ణసువర్ణ నగరమునకు వచ్చెను. బీహారురాష్ట్రమున నేడు భగల్పూరున్న చోటికి సమీపమున ఆ కర్ణసువర్ణ నగర ముండెను ఇతడు నడముచుట్టును రాగి రేకులు ధరించియుండెను తలపై వెలుగుచున్న జ్యోతిని పెట్టుకొనెను దండమును చేతబూని, సగర్వముగా, గంభీరముగా నాత

డీ వింత దుస్తులతో తిరుగుచుండెను ఇట్టి వికృతవేషమునకు కారణ మెవ్వరైన అడిగిన నాతడు చెప్పు సమాధాన మేమన - నే నెంతో విద్యావంతుడను అందుచే నా కడుపు పగులునను భయముచే నడుముచుట్టును రాగి రేకులు బిగించితిని మూర్ఖులగు ప్రజలు అంధకారమున మునిగియుండుటచే జాలిజెంది తలపై జ్యోతిని పెట్టుకొంటిని అయితే తెలివి అధికమై పగిలిపోవుదునేమో యన్న భయము నాకు లేదు కాబట్టి రాగిరేకులనుగాని, కవచమునుగాని ధరించవలసిన అవసరము నాకు లేదు అయినను నాకున్న తెలివి తేటలు నా కడుపులో లేవు అవి ఎక్కడ ఉన్నను, అధికమునకు ఇంకను ఎంతో చోటు ఉన్నది చోటు లేకపోవుట యను సందర్భమెప్పటికి నుండదు తెలివితేటలు ఇట్లు పరిమితముగా నున్నప్పుడు నేను జ్ఞానవంతుడనని ఎట్లు చెప్పుకోగలను ? ఇతరుల కెట్లు సదుపదేశములను చేయగలను ? న్యాయాన్యాయములను, కర్తవ్యాకర్తవ్యములు నిర్ణయించుటకు ఉపదేశములు చేయుట సరియైన మార్గము కాదనియు, ప్రసంగించుట, చర్చించుటవల్లనే నిజము బయల్పడుననియు నా నమ్మకము నీతో చేసిన ప్రసంగములు నాకిష్టమైనవి మన మెన్నో విషయాలు ముచ్చటించుకొంటిమి, చర్చించుకొంటిమి పృధివి విపులమైనది మన లోకమున కావల వింతలోకము లెన్నో కలవు కాన క్రొత్త విషయములు నేర్చుకొనుటకు మనకు విసుగు జనించరాదు యువాన్‌చ్వాంగ్ చెప్పిన కథలోని గర్వియగు తెలివి తక్కువ పురుషులవలె, తెలియదగిన సర్వమును తెలిసితిమనియు, పండితుల మైతిమనియు అనుకొనరాదు మనము మిక్కిలి తెలివిగలవార మగుట కూడ కోరదగ్గది కాదు అట్టివా రెవరైన నున్నచో, ఇక తెలిసికోదగిన దేదియు లేదుకదా యని వారు విచారగ్రస్తులు కాక తప్పదు క్రొత్త విషయములను కనిపెట్టుటలోను, క్రొత్త విషయములను గురించి నేర్చుకొనుటలోను గల యానందమునకు వారు దూరు లగుదురు కోరినచో నట్టి యానందము మనకు చిక్కదుగదా!

కాబట్టి నేనుపదేశములు చేయరాదు అయిన నే నేమి చేయవలసి యుండెను ? జాబు ప్రసంగమువంటిది కాదు జాబులో ఒక్కరి భావములే వెల్లడియగును కాన నేను చెప్పు విషయములలో మంచి సలహాలవలె తోచు విషయ ముండిన దానిని పరిగ్రహించుము మ్రింగరాని చెడ్డమాత్రవలె దానిని పరిహరించుము మన ముభయులము ప్రసగించుకొనుచున్నట్లే యూహించి అట్టి విషయములు నేను నీకు నీ వాలోచించుకొనుటకై చేసిన సూచనలుగా భావించుము

జాతులు తమ జీవితములో గొప్ప యౌన్నత్యము చెందిన కాలముల గూర్చియు, గొప్ప కార్యములు గూర్చియు మనము చరిత్రలో చదువుదుము ఒక్కొక్కప్పుడు ఆయా కాలములందు మన మున్నట్లును ప్రాచీన వీరపురుషులవలెను, వీరనారులవలెను సాహసకార్యములు చేయుచున్నట్లును ఊహించుకొని కలలు కనుచుందుము నీవు మొట్ట మొదట జోనఫార్క్‌ను గురించి చదివినప్పుడు ఎంతటి యానందమును జెందితివో జ్ఞాపకమున్నదా? ఆమెవలె నీ వుండవలెనని యువ్విళ్లూరితివి గదా ! సామాన్య స్త్రీ పురుషులు సాధారణముగా వీరులు కారు తిండిని గూర్చి వారు తంటాలుపడుచుందురు కాని ఒక మహత్కార్యము సాధించుటకై ప్రజలు పూనుకొనవలసిన తరుణము వచ్చినప్పుడు సామాన్య స్త్రీ పురుషులు సైతము వీరు లగుదురు చరిత్ర యుద్రేక పూరిత మగును నవయుగారంభ మగును మహాపురుషులలో నేదియో శక్తి యిమిడియున్నది వారు ప్రజలలో నావేశము పుట్టించి వారిచే ఘనకార్యములు చేయింతురు

నీవు పుట్టిన సంవత్సరము (1917) చరిత్రలో జ్ఞప్తియుంచు కొనవవలసిన సంవత్సరములో నొకటి అప్పుడొక మహానాయకుడు ఆర్తులపట్లను, పేదలపట్లను కరుణారసపూరితహృదయుడై, ఎన్నటికిని విస్మరింపరాని గొప్ప అధ్యాయమును చరిత్రలో తన ప్రజలచే వ్రాయించెను నీవు పుట్టిన నెలలోనే లెనిన్ మహావిప్లమును ప్రారంభించెను దానిచే రష్యా, సైబీరియా దేశముల స్వరూపమే మారిపోయెను నేడు ఇండియాలో వేరొక మహానాయకుడు - ఆర్త జనరక్షణ పరాయణుడు మన ప్రజలను పౌరుషమునకు పురిగొల్పి వారిచే మహాత్యాగములు చేయించెను మరల వారు స్వేచ్ఛ నందుటకును, క్షుధార్తులు, దరిద్రులు, పీడితులు బాధా విముక్తి నందుటకే ఈ మహాప్రయత్నము, బాపూజీ (గాంధీమహాత్ముడు) చెఱసాలలోనున్నాడు కాని యా మహాపురుషుని సందేశమను ఇంద్రజాలము హిందూ దేశ ప్రజాకోటిహృదయముల బ్రవేశించెను స్త్రీలు, పురుషులు, చిన్న పిల్లలు సైతము తమ చిన్న గూళ్ళనుండి బయటకి వచ్చి ఇండియాకు స్వాతంత్ర్యము సంపాదింప సైనికులైరి ఇండియాలో మన మినప్పుడు చరిత్రను సృజించుచున్నాము ఈ మహోద్యమమున మనమును శక్తికొలది పాల్గొనుచున్నాము మన మెంతటి యదృష్ట వంతులమో !

ఈ మహోద్యమముపట్ల మన మెట్లు మెలగవలెను ? మనమేమి చేయవలెను ? ఏమి మన పాలబడునో నేను చెప్పజాలను అది యేమైనను మనము జ్ఞాపముంచుకొనదగిన విషయ మొకటియున్నది మన యుద్యమమునకుగాని, మనప్రజలకుగాని దుష్కీర్తి నాపాదించు కార్యములను మనము చేయరాదు ఇండియా స్వేచ్ఛకు పోరాడుయోధులముగా మనముండదలచినచో ఇండియా ప్రతిష్ఠ మన చేతులలో నుండును దానిని నిలుపుట మన పవిత్రమగు బాధ్యత, తరుచు మనము కర్తవ్యవిమూఢలము కావచ్చును ఏది సరియైన మార్గమో ఏది కాదో నిర్ణయించుట సులభము కాదు సంశయముగా నున్నప్పుడెల్ల నీ విషయమును జ్ఞప్తియందుంచుకొనుము. దానివల్ల నీకు లాభముండును ఏకార్యమును రహస్యముగా చేయకుము దాచవలె నను కోరిక భయలక్షణము భయపడుటమంచిది కాదు, నీకు తగదు ధైర్యము వహించియుండుము పిమ్మట సర్వమును సక్రమముగా నడచును నీవు ధైర్యముగా నున్న నీకు భయముండదు సిగ్గుపడవలసిన పని ఎట్టిదియు నీవు చేయజాలవు. బాపూజీ నాయకత్వమున నడచుచున్న మన గొప్ప స్వాతంత్ర్యోద్యమమున రహస్యవ్యాపారములకు తావులేదు దాచుకోవలసినది మనకేమియు లేదు మనము చెప్పు మాటలను చూచి మనము భయపడము పట్టపగలు సూర్యకాంతిలో మనము పనిచేయుదుము అట్లేమన సొంతజీవితములందు సైతము సూర్యునితో సఖ్యము చేయుదుము సూర్యకాంతిలో పనులు నెరపుదుము రహస్యముగా మన మే కార్యములు చేయవద్దు చాటు మాటులు మన కుండవచ్చును ఉండవలసినదే కాని రహస్యము వేరు, చాటుమాటులు వేరు తల్లీ, ఈ విధముగా నీవు చేసిన యెడల నీవు పెరిగి పెద్దదానవై వెలుతురుబిడ్డ వగుదువు. నీకు భయముండదు ఏది ఎట్లు వచ్చినను క్షోభచెందవు శాంతముతో నుందువు

నీకు చాల పెద్ద జాబును వ్రాసితివి ఇంకను నీకు చెప్పదలచుకొన్న దెంతయో కలదు జాబులో అదంతయు ఎట్లిముడగలదు ?

నేను చెప్పినట్లుగా నీ వదృష్టవంతురాలవు. మన దేశమున విజృంభించిన స్వాతంత్ర్యోద్యమము నీవు కన్నులారా చూచుచున్నావు మీ అమ్మ ఎంత ధైర్యశాలిని ! ఎంత ఉత్తమురాలు ! ఇట్టి తల్లి నీకుండుట ఎంతటి అదృష్టము నీ కెన్నడైన సంశయము కలిగినను, చిక్కులు తటస్థించినను ఆమెకన్న నీకు ప్రియమగు సఖు లెవరు ?

ఉందునా యింక, చిట్టితల్లీ ! హిందూ దేశమునకు సేవ చేయుటకై నీవు ధైర్యశాలివి వగు యోధాగ్రణి వగుదువుగాక ! నీకు నా ప్రేమాశీస్సులు

# 1

# సంత్సరాది బహుమానము

సంవత్సరాది, 1931

నీవు ముస్సోరీలోను, నేను అలహాబాదులోను ఉన్నప్పుడు, రెండు సంవత్సరాల క్రితము, నేను నీకు వ్రాసిన జాబులు జ్ఞాపక మున్నవా ? అవి బాగున్నవా ? అవి బాగున్నవని నీవు నాతో చెప్పియుంటివి అట్టి జాబులను మరల వ్రాసి ఈ మన ప్రపంచమును గూర్చిన అధిక విషయములు నీకు చెప్పకూడదా యని యాలోచించుచుంటివి కాని అట్లు చేయుటకు సంకోచించితిని ప్రపంచము యొక్క గత చరిత్రను, మహా పురుషులను, నారీమణులను, మహత్కార్యములను స్మరించుట సంతోషముతో కూడిన పనియే చరిత్ర చదువుట మంచిదే. అంతకన్న మనోజ్ఞమైన, సంతోషకరమైన విషయము చరిత్రను నిర్మించుటకు తోడ్పడుట ఈ దేశములో నేడు చరిత్రనిర్మింపబడుచున్నదన్న విషయము నీకు తెలిసినదే కదా ! ఇండియా పూర్వ చరిత్ర పెద్దదే కాని అది అజ్ఞాతముగా నున్నది అందుకొంతభాగము విచారకమైనది , దుఃఖకరమైనది తలచుకొన్నచో మనము తలలువాల్చి కంట తడిపెట్టుకోవలసివచ్చును కాని మొత్తము మీద ఇండియా పూర్వచరిత్ర దివ్యమైనది మనము గర్వింపదగినది తలచుకొని సమ్మోదము నందదగినది అయినను పూర్వచరిత్ర స్మరించుటకు నేడు మనకు తీరిక లేదు ఇండియా భావియే మన హృదయముల నా క్రమించుకొన్నది ఈ భావికే మన మిప్పుడు రూపము నిచ్చుచున్నాము మన కాలమును, శక్తిని దేని కొరకై వినియోగించుచున్నామో అట్టి వర్తమానమునుకూడ మన మనస్సుల నాక్రమించు కొన్నది

ఇక్కడ నైనీచెరసాలలో ఇష్టము వచ్చినట్లు చదువుటకు గాని, వ్రాయుటకుగాని నాకు తీరిక కలదు కాని నామనస్సు కుదురుగా నుండుట లేదు బయట జరుగుచున్న గొప్ప పోరాటమును గూర్చి నే నూహించుకొనుచుందును ఇతరు లేమి చేయుయున్నారో, వారితో నున్న నే నేమి చేసియుండెడివాడనో యని ఆలోచించుకొనుచుందును వర్తమానమును, భావియు నన్ను పూర్తిగా ఆక్రమించికొన్నవి గత కాలమునాటి విషయములను తడవుటకు నాకు తీరిక యేదీ ? కాని నాయభిప్రాయము పొరపాటని నే ననుకొనుచున్నాను బయట జరుగు కార్యములలో నేను కలుగుజేసికొన లేనప్పుడు నే నేల విచారించవలెను ?

అయితే నేను వ్రాయకుండుటకు నిజమైన కారణము - రహస్యముగా నీ చెవిలో చెప్పుదునా - వేరొకటి యున్నది నీకు బోధించుటకు నా కెంతమాత్రము జ్ఞానమున్నదని నేను సందేహించుచున్నాను

నీవా ? ఆనాటికానాడు వడివడిగా పెరుగుచున్నావు జ్ఞానార్జన చేయు చున్నావు. నేను పాఠశాలలోను, కాలేజీలోను, తరువాతను నేర్చు కొన్నదంతయు నీకు నేర్పుటకు చాలినంత లేదు అథవా అది నీకు తెలిసిన విషయమై చప్పగా నుండవచ్చును కొంత కాలమైనపిమ్మట నీవే నాకు తెలియని విషయము లెన్నో బోధించవచ్చును నీ జన్మదినమున నీకు వ్రాసిన జాబులో చెప్పినట్లు నేను మిక్కిలి తెలివి గల పురుషుని వంటివాడను కాను తెలివి యధికమై పగిలిపోదునేమో యన్న భయముతో నాతడు రాగిరేకులను తన చుట్టును బిగించుకొన్నాడట

నీవు ముస్సోరీలో నున్నప్పుడు ప్రపంచము యొక్క బాల్యమును గూర్చి నేను నీకు వ్రాసియుంటిని, అప్పుడు వ్రాయుట నాకు సులభముగానే యుండెను ఏలయన ఆ కాలమునకు సంబంధించిన విషయములు మనకు స్పష్టముగ తెలియవు అతి ప్రాచీన కాలమునుండి వెలువడిన తోడనే చరిత్ర క్రమక్రమముగా ప్రారంభమగును మానవుడు వివిధ ప్రాంతముల తన వింతజీవితయాత్ర ప్రారంభించును ఒకప్పుడు వివేకయుక్తముగానూ, వేరొకప్పుడు పిచ్చిగాను, తెలివితక్కువగానూ ఉండు మానవుని చర్యలను గ్రహించుట సులభసాధ్యము కాదు గ్రంధసహాయమున గ్రహించుటకు మనము ప్రయత్నించవచ్చును కాని నైనీ చెరసాలలో పుస్తక భాండాగారము లేదు పూర్వాపరసందర్భములతో ప్రపంచచరిత్ర నీకు చెప్పవలెనని యున్నదిగాని అట్లు చేయుట సాధ్యముకాదని తోచుచున్నది , " బాలబాలికలు ఒక్క దేశముయొక్క చరిత్ర మాత్రమే నేర్చుకొనుట - అదైనను ఏవో కొన్ని సంవత్సరములు, కొన్ని యంశములు కంఠస్థము చేయుట - నా కెంతమాత్రమిష్టము లేదు అన్యోన్యసంబంధము కలిగి సమగ్రముగా నుండునది చరిత్ర ప్రపంచమున ఇతర భాగములందు జరుగు వృత్తాంతముల తెలిసినగాని ఏ యొక్క దేశ చరిత్రయైనను నీ కర్థము కాదు ఒకటి రెండు దేశములకు సంబంధించిన చరిత్రను మాత్రమే, యిట్టి సంకుచిత పద్ధతిని నీవు నేర్చుకోవని నమ్ముచున్నాను ప్రపంచచరిత్రను పరీక్ష చేయుదు వనియు నమ్ముచున్నాను

మనమనుకొనునట్లు వివిధమానవవర్గములలో గొప్పభేదము లేదని సదాజ్ఞప్తియందుంచుకొనుము పటములును, అట్లాసులును వేర్వేరు రంగులతో దేశములను మనకు ప్రదర్శించును మానవులలో భేదములున్న మాట వాస్తవమే కాని వారిలో దగ్గరపోలికలు కూడా ఉన్నవి పటములలోని రంగులనుబట్టిగాని , దేశముల పొలిమేరలను బట్టిగాని మనము భ్రమపడరాదు ఈ విషయమును మనముమనస్సులో పెట్టుకొనవలెను

నాకిష్టమున్న చరిత్రగూర్చి నేను నీకు వ్రాయజాలను, గత కాలమును గూర్చియు, గతకాలమున నివసించు ప్రపంచనాట్యరంగమున పెద్దపాత్రలు ధరించినట్టి పురుషులను గూర్చియు నీ కప్పుడప్పుడు వ్రాయుదును

నా జాబులు నీ కిష్టముగా నుండునో లేదో, అవి నీ కౌతుకమును రేపెట్టునో లేదో నేను చెప్పలేను నిజమునకు వాని నెప్పుడు నీవు చూచితివో, అసలు చూతువో లేదోకూడా నాకు తెలియదు చిత్రము ! మన మింత సమీపములో నుండియు ఇంత దూరముగా నున్నాము ముస్సోరీలో నీవు

ఎన్నియో వందల మైళ్ల దూరములో నున్నావు అయినను నా కిష్టమైనన్ని మారులు నేను నీకు జాబులు వ్రాయగలను. నిన్ను చూడవలెనని గట్టిగా బుద్ధిపుట్టిన నేను నీ కడకు పరిగెత్తి రాగలను ఇప్పుడు మనము యమునానది కద్దరిని యిద్దరిని ఉన్నాము గదా ! దూరములో లేము కదా !అయినను చెరసాల ఎత్తైన గోడలు మనలను కలిసికోకుండా చేయుచున్నవి పక్షమునకొక జాబు నేను వ్రాయవచ్చును పక్షమునకొక జాబు నాకు రావచ్చును పక్షమునకొకసారి ఇరువది నిమిషములపాటు మిత్రులో, బంధువులో నన్ను సందర్శించి మాటాడుటకు రావచ్చును అయినప్పటికి ఇట్టి కట్లుబాట్లు మంచివే సులభముగా లభించు వస్తువులపై మనకు గౌరవముండదు కారాగారానుభవము వాంఛింపదగిన విద్యాశిక్షణ యని నాకు నానాటికి నమ్మకము కలుగుచున్నది ఎంత యదృష్టమోకాని నేడు మన దేశ ప్రజలు వేలకొద్ది యిట్టి విద్యాశిక్షణ నందుచున్నారు !

ఈ జాబులు నీవు చూచి ఇష్టపడుదువో లేదో నేను చెప్పజాలను నా యానందముకొరకే నేను వీనిని వ్రాయ సంకల్పించితిని, అవి నిన్ను నా సమీపమునకు తీసికొనివచ్చును నీతో సంభాషణ చేయుచున్నట్లే నేను భావించుకొందును తరుచుగా నేను నిన్ను తలచుకొనుచుందును ఈరోజున నా మనస్సులో నీవు లేని క్షణము లేదు ఈ దినము సంవత్సరాది తెల్లవారుజామున పరుపులపై పరుండి నక్షత్రములను చూచుచు గతించిన సంవత్సరమునుగురించియు, అది తెచ్చిపెట్టిన ఆశలు, సంతాపములు సంతోషములనుగురించియు నేను మననము చేసితిని ఎరవాడ చెరసాలగదిలో కూర్చుండి, తన ఇంద్రజాలస్పర్శవల్ల మన మాతృదేశమునకు మరల యౌవనమును, శక్తిని కలిగించిన బాపుజీని స్మరించితిని తాతను, ఇతరులను పెక్కురను స్మరించితిని ముఖ్యముగా మీ అమ్మను, నిన్ను తలచుకొంటిని తరువాత కొంత సేపటికి ఉదయమున వార్త వచ్చినది - మీ అమ్మను పట్టుకొని జైలుకు తీసికొని వెళ్లిరని అది నాకింపైన ఉగాది బహుమానము ఇట్లు జరుగునని ఎంత కాలమునుండియో అనుకొనుచున్నాను అమ్మ పూర్తిగా సుఖముగాను, సంతుష్టితోను ఉండుననుటకు సందేహము లేదు

కాని నీవు ఒంటరివి అయితివి పక్షమున కొకమారు నీవు అమ్మను చూడవచ్చును పక్షమున కొకమారు నీవు నన్ను చూడవచ్చును మా సందేశము లొకరివి ఇంకొకరితో చెప్పవచ్చును అయితే కాగితము, కలము తీసుకొని నేను కూర్చుందును నిన్ను తలచుకొందును అప్పుడు నీవు సన్న సన్నగా నా పజ్జకు వత్తువు. మన మెన్ని యో విషయములను గూర్చి ప్రసంగించుకొందము గత కాలమును గూర్చి కలలుకందము గతకాలము కన్న భావికాలమును గొప్పగా చేయుటకు మార్గము కనుగొందము కాబట్టి సంవత్సరాది దినమున మనము దృఢసంకలక్పము చేసికొందము ఈ సంవత్సర మవసానదశకు వచ్చి అంత మొందుటకు పూర్వమే మనము భావిని గూర్చి కన్న కలలను వర్తమానమునకు దగ్గరగా తీసికొని రాగలుగుటకు సంకల్పము చేసికొందము ఇండియా గత చరిత్ర కొక దేదీవ్యమాన మగు పుటను చేర్చగలుగుటకు సంకల్పము చేసికొందుము

# 2

# చరిత్ర మనకేమి బోధించును ?

జనవరి 5, 1931

చిట్టీ, నీకు నేనేమి వ్రాయను ? ఎక్కడ మొదలుపెట్టను గత కాలమును స్మరించినంతనే అసంఖ్యాకములగు చిత్రములు నామనస్సులో పరుగులుదీయును కొన్ని చిత్రము మిగతావానికన్న ఎక్కువకాలము నిలుచును అవి నీకు ప్రియమైనవి వానిని గురించి నేను మననముచేయ ప్రారంభింతును అనుకొనకుండనే గత సంఘటనలనతో పోల్చుదును అందుండి నాకు మార్గదర్శకముగా నుండు ఉపదేశములను కనుగొనుటకు ప్రయత్నింతును కాని మానవుని మనస్సు ఎంతటి వింత కలగూరగంప ? సంబంధము లేని ఆలోచనలు, క్రమముగా తప్పిన చిత్రములు దానినిండ యుండును అది ఒక క్రమములో చిత్రపటముల మర్చని ఒక చిత్రశాలవంటిది అయితే తప్పు పూర్తిగా మనది కాదు మనలో పెక్కురము తమ మనస్సులలో జరిగిన కార్యము లోక క్రమపద్ధతిని ఇంతకన్న చక్కగా నమర్చుకొనగలము కాని ఒక్కొక్కప్పుడు అ కార్యములెంతో వింతగా, క్లిష్టముగా నుండి ఏ క్రమపద్ధతిలోను ఇముడవు

ప్రపంచము నెమ్మదిగానైనను నిస్సందేహముగా నభివృద్ధి జెందినదనియు, సామావ్యఅల్ప జంతువులు పరిణమించి పెద్ద జంతువులుగా మారినవనియు, చివరకు ఉత్తమ జంతువగు మానవుడు వచ్చినాడనియు, మేధాశక్తివలన నితరజంతువులను మించినాడనియు చరిత్ర మనకు బోధించవలయు నని ఇదివరలో నీకు వ్రాసియుంటి నని నాయూహ అనాగరిక స్థితినుండి నాగరికస్థితికి మానవుడు అభివృద్ధి చెంది వచ్చుటయే చరిత్ర చెప్పవలసిన యశ మందురు జనులందరును కలిసిమెలిసి పనిచేయవలెన భావము - అనగా సహకార భావము ఎట్లు వృద్ధియైనదో నేను కొన్ని యుత్తరములలో వ్రాసియుంటిని లోక కళ్యాణముకొరకు మన మందరము కలిసి పనిచేయుట మన యాదర్శముగా పెట్టుకొనవలననియు కొన్ని లేఖలలో నేను నీకు తెలియజేసితిని. కాని ఒక్కొక్కప్పుడు పెద్ద చరిత్ర భాగములను చూచినప్పుడు ఈ ఆదర్శము ముందడుగు వేసినదాయని సందేహము కలుగును, మనము నాగరీకులము, అభివృద్ధి చెందితిమి అని చెప్పుటకు నోరాడదు నేడు సహకారలోపము కావలసినంత యున్నది స్వార్థ పర్వతములతో ఒక దేశ మింకొక దేశములపైని, ఒకజాతి యింకొక జాతిపైని బడి పీడించుచున్నవి ఒక మానవు డింకొక మానవుని లోబరుచుకొని లాభమందుచున్నాడు కోట్లకొలది సంవత్సరములయభివృద్ధి యనంతరమున మన మిట్టి హీనస్థితిలో, లోపములతో నున్నప్పుడు వివేకము, విజ్ఞానముగల మానవులవలె సంచరించుట నేర్చుకొనుటకు మరెంత కాలముపట్టునో ! ఒక్కొక్కప్పుడు, మన కాలమున కంటెను మెరుగుగా కనిపించు గత కాలమును గురించి మనము చరిత్రలో చదువుదుము అప్పటి వారెక్కువ విజ్ఞానవంతులుగను, నాగరీకులుగను కనిపింతురు ఇది చదివినప్పుడు మన లోకము ముందుకు పోవుచున్నదో, వెనుకకు పోవుచున్నదో చెప్పుట సందేహాస్పదముగా నుండును గత కాలమున మన

దేశచరిత్రలో నిస్సంశయముగా, దివ్యత్ ఘట్టములు కలవు నేటికాలమునకన్న నన్ని విధముల నుత్తమమైనవి

పలుదేశములలో గతకాలమున దివ్యఘట్టము లున్నమాట వాస్తవమే - ఇండియాలో, ఈజిప్టులో, చీనాలో,గ్రీసులో, ఇంకను ఇతర దేశములలో ఈ దేశములలో అనేకము హీనస్థితికి పడిపోయిన మాట కూడా వాస్తవమే ఇట్లు జరిగినప్పటికిని మన మధైర్యము జెందరాదు ప్రపంచము విపులమైనది కొంతకాలముపాటు ఒక దేశము ఉచ్చస్థితికి వచ్చినను, నీచస్థితికి పడిపోయినను దానివలన లాభముగాని, నష్టముగాని మొత్తము ప్రపంచమునకు ఉండదు

నేటికాలమున పలువురు మన గొప్ప నాగరీకతను తలచుకొనియు, శాస్త్రము కనిపెట్టిన యద్భుత విషయములను తలచుకొనియు మురిసిపోవుట కద్దు శాస్త్రము ఆద్భుత విషయములను కనిపెట్టిన మాట నిజమే శాస్త్రజ్ఞులు గౌరవార్హులే కాని డాబులుకొట్టువారెన్నడును గొప్పవారు కారు అనేక విషయములలో మానవు డితర జంతువులకన్న నెక్కువయభివృద్ధిలోనికి రాలేదని జ్ఞాపకముంచుకొనుట మంచిది కొన్ని విషయములలో కొన్ని జంతువులు మానవుని కన్న ఉత్తమస్థితిలో నున్నవని చెప్పవచ్చునేమో ! ఇది తెలివితక్కువ మాటగా తోచవచ్చును తెలివితక్కువ మనుష్యులు నవ్వవచ్చును నీ విప్పుడే మిటర్లింకువ్రాసిన తేనెటీగజీవితమును గురించియు, చెద పురుగులను, చీమలను గురించియు చదివియున్నావు ఈ కీటకములు తమ సంఘముల నెట్లు క్రమపద్ధతిలో పెట్టుకొన్నవో చూచి నీ వాశ్చర్యపడియుందువు చేతనములందెల్ల నీ కీటకములు మిక్కిలి నీచములని మనము వీనిని ఈసడింతుము అయినప్పటికి ఈ చిన్న జీవులు మానవుని కంటె బాగుగా సహకార విద్య నేర్చుకొన్నవి సంఘ క్షేమమునకై ఆత్మార్పణము చేయుట నేర్చుకొన్నవి అన్యోన్య సహకారము, సంఘశ్రేయస్సును గోరి ఆత్మార్పణము చేయుట నాగరీక లక్షణములైనచో చెదపురుగులును, చీమలును మానవునికన్న మిన్నలని చెప్పక తప్పదు

మన ప్రాచీనసంస్కృతి గ్రంథములలో నొక శ్లోకమున్నది దాని భావమిది - " కుటుంబము కొరకు వ్యక్తిని పరిత్యజించుము, సంఘము కొరకు కుటుంబమును పరిత్యజించుము " ఆత్మయన నేమో బహుకొద్దిమందికి తెలియును వారు దానిని గురించి చెప్పగలరు మనలో ప్రతియొక్కడు దానికి ఒక్కొక్క విధముగా అర్థము చెప్పవచ్చును కాని ఈ సంస్కృత శ్లోకమును బట్టి మనము నేర్చుకొనవలసిన విషయము - సహకారము, సంఘక్షేమమునకై ఆత్మార్పణము చాలా కాలమునుండి మనము గొప్పతనమునకు దారి చూపు ఈ పరమధర్మమును విస్మరించితిమి అందువల్లనే పతితులమైతిమి కాని మరల నేడు దానిఛాయలు పొడగట్టుచున్నవి దేశము నందు కదలిక పుట్టినది పురుషులు, స్త్రీలు, బాలురు బాలికలు చిరునవ్వుతో మాతృదేశ విముక్తికై కష్టములను, భాధలను గుణించకుండా ముందంజవేయుట చూచిన ఎంత యాశ్చర్యకరముగా నుండును వారు మందహాసము చేయవలసినదే సంతోషముగా నుండవలసినదే మహదుద్యమమున పాల్గొను ఆనందము వారిది కాదా ! అందదృష్టవంతులకు త్యాగానందముకూడా రాగలదు నేడు మనము ఇండియా సంకెళ్లు

సడలించుటకు ప్రయత్నించుచున్నాము అది మహత్కార్యము అంతకన్న మహత్కార్యము మానవకోటికి శ్రేయస్సుకొరకు పనిచేయుట, బాధను, దుఃఖమును పారదోలుటకు మానవకోటి చేయుచున్న పోరాటములో మన పోరాట మొకభాగమని మనము భావించుచున్నాము కాబట్టి లోకకల్యాణమనకు చేతనైనంతవరకు మనమును సహాయము చేయుచున్నట్లు భావించుకొని సంతసింపవచ్చును

అంతదనుక నీవు ఆనందభవనములో కూర్చుండుము మీ అమ్మ మలక్కా చెరసాలలో కూర్చుండును నేనీ నైనీ చెరసాలలో కూర్చుందును ఒకరి నొకరము చూచుకోలేకపోతిమి గదా యని అనుకొనుచుందుము కదూ ! మనము ముగ్గురము మరల కలిసికొనబోవు రోజున తలుచుకొనుము ఆరోజు ఎప్పుడు వచ్చునాయని నేను కనిపెట్టుకొని యుందును ఆ యాలోచనవల్ల నాగుండెలో బరువు తగ్గినట్లుండును నాకుత్సాహము కలుగును

# 3

# ఇంకిలాబ్ జిందబాద్

జనవరి 7, 1931

ప్రియదర్శినీ - దృష్టికి ప్రియముగానుందువు నీవు దృష్టిసాధ్యము కానప్పుడు ప్రియతమవు నీకు వ్రాయుటకు నేడు నేనిచ్చట కూర్చుండగా దూరముననుండి వచ్చు మేగఘర్జనములవలె అస్పష్టధ్వనులు నాకు వినిపించెను అవి యెట్టిధ్వనులో మొట్ట మొదటి నాకు అవగతము కాలేదు కాని ఆధ్వనులు నాకు పరిచితముగా వినిపించుచున్నవి నా హృదయమున ప్రతిధ్వనించి ప్రత్యుత్తరము పొందుచున్నవి క్రమక్రమముగా ఆ ధ్వనులు సమీపించుచున్నట్లున్నవి పెద్ద వగుచున్నవి త్వరలోనే వాని నిజస్వరూపము తెలియవచ్చింది "ఇంకిలాబ్ జిందబాద్" "ఇంకిలాబ్ జిందాబాద్ !" అను వీరహుంకారములకు కారాగారము మారుమ్రోగెను. ఆ కేక విన్న మా హృదయములు సంతసించినవి. చెరసాల వెలుపల, నాకెంతో సమీపమునందు మన రణదుందుభి మ్రోయించినవా రెవరో నాకు తెలియదు వారు నగరము నుండి వచ్చిన స్త్రీ పురుషులో ? పల్లెలనుండి వచ్చిన జానపదులో ? నేడు వారట్లు ఎట్టిసందర్భములో చేయుచున్నారో కారణమూహింపలేను వారెవరైననేమి? మా కుత్సాహము కల్పించిరి వారి పరామర్శకు మేము మౌనముగా సమాధాన మిచ్చితిని ఆ సమాధానముతో మా యభినందనములును వెళ్ళినవి

" ఇంకిలాబ్ జిందబాద్" అని మన మేల ఘోషింపవలెను? విప్లవమును, మార్పును మన మేల కోరవలెను ? నేడు మన ఇండియాలో గొప్ప మార్పు కలుగువలసినయున్న మాట వాస్తవమే కాని మన మందిరము కోరు మార్పు ఇండియాకు వచ్చినపిమ్మట ఇండియా స్వాతంత్ర్యమును సాధించిన పిమ్మట మనము చేతులు కట్టుకొని కూర్చుండ వీలులేదు ఈ లోకమున ప్రాణమున్న ప్రతిజీవియు మారుచునే యుండును దినమునకు దినము, నిమిషమునకు నిమిషము ప్రకృతి సర్వమును మారును ప్రాణముపోయిన జీవి మార్పుచెందిమ కదలక మొదలక పడియుండును నదీజలముకూడ అంతే జాతి జీవితము కూడా అంతే మన కిష్టమున్నను లేకున్నను ముసలితనము వచ్చును శిశువులు

చిన్నపిల్ల లగుదురు చిన్నపిల్లలు స్త్రీలగుదురు స్త్రీలు ముదుసలు లగుదురు ఈ మార్పులను మనము సహించి యుండవలసినదే కాని ప్రపంచము మారునని ఒప్పుకొననివారు పలువురున్నారు వారు తమ మనస్సులను మూసికొని బీగమువేసికొందురు నూతనాభిప్రాయములను వారు సమీపమునకు రానీయరు స్వతంత్రముగా ఆలోచించుటకు వారు భయపడుదురు కాని పర్యవసానమేమి ? ఇట్టివారున్నప్పటికి ప్రపపంచము కదిలిపోవుచునే యున్నది మారుచున్న పరిస్థితులలో ఇముడని యట్టివారును, వారివంటివారును ఉన్నారు కాబట్టి అప్పుడప్పుడు ఉత్పాతములు సంభవించుచున్నవి పెద్ద విప్లవములు పుట్టుచున్నవి నూట నలుబది సంవత్సరముల క్రితము రేగిన ఫ్రెంచివిప్లవము, పదమూడు సంవత్సరముల క్రితము రేగిన రష్యన్ విప్లవము అట్టివే ఆ విధముగానే మనదేశమునందును నేడు మనము విప్లవము మధ్య నున్నాము మనకు కావలసినది స్వాతంత్ర్యమే, కాని మనకు కావలసిన విషయము లింకను ఉన్నవి మురుగు గుంటలను బాగు చేసి స్వచ్ఛజలము నంతటను ప్రవేశపెట్టవలసి యున్నది మనము మనదేశమునుండి మాలిన్యమును, దారిద్ర్యమును, దుఃఖమును తుడిచివేయవలెను మనము చేయబూనిన ఘనకార్యములను గురించి ఆలోచించి సహకారము చేయుటకు పలువురి మనస్సులు సమ్మతించుట లేదు చేతనైనంతవరకు అట్టివారి మనస్సులనంటియున్న బూజునుకూడా మనము తుడిచివేయవలెను మనము చేయబూనినది గొప్పపని వెంటనే జరగదు కొంతకాలము పట్టునేమో, అయినా అధమపక్షము, దానిని కొంచెము ముందుకు నెట్టుదము - ఇంకిలాబ్ జిందబాద్ !

మన విప్లవగేహాళిపై మన మిప్పుడు నిల్చియున్నాము భావి కాలమున నేమి జరుగనున్నదో చెప్పలేము మన కష్టములకు మంచి ప్రతిఫలము వర్తమానమునందు సైతము మనకు ముట్టినది హిందూదేశ స్త్రీలను పరికించుము ఈ పోరాటమున వారెంత గంభీరముగా ముందంజ వేసికొని పోవుచున్నారో ! శాంతముతో కూడిన ధైర్యము, స్థైర్యము - వా రెట్లు ఇతరులకు మార్గదర్శకులై యున్నారో, ఇక ఘోషామాట - మన ధీరురా డ్రగు సౌందర్యవంతులను మరుగుపరచిన ఘోషా. వారికిని, వారి దేశమునకును చేటు తెచ్చినఘోషా- అది ఇప్పుడు ఎక్కడ నున్నది ? ప్రాత కాలము నాటి వస్తువులను జాగ్రత్తపెట్టు ప్రదర్శనశాలల బీరువాలలోతల దాచుకొనుట కది చల్లగా జారుచున్నది కాదా ?

పిల్లలను - బాలబాలికలను కూడాపరికించుము - ఆ వానర సేనలు, అ బాలసభలు, ఆ బాలికాసభలు ఈ పిల్లల తల్లిదండ్రులు పెక్కురు వెనుక భీరువులవలెను, బానిసలవలెను ప్రవర్తించియుండవచ్చును కాని మనతరమునందలి బాలబాలికలు బానిసత్వమును, భీరుత్వమును సహింపలేనమమాట ఎవరు సందేహింప సాహసింతురు ?

ఈ విధముగా పరివర్తనచక్రము తిరుగుచుండును క్రిందకు వచ్చినవారు పైకి పోవుదురు పైకి వచ్చినవారు క్రిందకు పోవుదురు మన దేశమున నాచక్రము ఇదివరలోనే తిరుగవలసినది కాని ఈ మారు మనము దానిని గట్టిగా త్రిప్పి వదలితిమి ఎవ్వరును దాని నాపలేరు

" ఇంకిలాబ్ జిందబాద్ !"

# మన భారత్ - 1953

## మినూమసాని కృతము

## హిందూస్థాన్ హమారా

ఈ పుస్తకము చదువుచు మీలో కొందఱీ విధముగా ననుకొనుచున్నట్లు నాకు వినిపించెను - 'ఎంత చక్కని గాలిమేడలు కట్టుచున్నాఁడు!' అని పిడకలు కాల్చివేయకుడు! సహకార వ్యవసాయ క్షేత్రము లేర్పఱచుడు! బట్టలు దిగుమతి చేయకుడు! ముతుక ఇనుము నధికముగా ఉక్కుగా మార్చివేయుడు! దేశమునంతయు విద్యున్మయము చేయుడు! అవసరమగు యంత్రములన్నియు తయారుచేయుడు! ఇది చేయుడు, అదిచేయుడు, ఇండియా స్వర్గ భాగ్య మనుభవించును సరే, ఇదంతయును బాగుగానే ఉన్నది ఈ పనులన్నియు చేయించువారెవరు? అని నీవనుకొనుచున్నావు. అవును, ఎవరు? గట్టి ప్రశ్నే! కాలికి బందము వేసినట్లయినది

నా సమాధానము తెలిసికొనవలెనని యున్నదా? అయితే, ఇదిగో - ఈ పనులన్నియు చేయించునది నీవే, అవును బుచ్చితండ్రీ నీవే! అవును చిట్టితల్లీ, నీవే! ఈ పుస్తక ప్రారంభమున ఒక సమస్యను గూర్చి చర్చించుకొంటిమి ఈ సమస్య యొక్క వేర్వేఱు భాగములను నీవే సమకూర్చగలవు వానితో అందమైన చిత్ర పటమును నీవే నిర్మించగలవు అసలీదేశము నీదే కదా! నీవే చేయలేని పక్షమున మఱియెవరు చేయుదురని నీయూహ?

'అయితే ఎట్లు చేయుట?' అని నీ ప్రశ్న ప్రపంచమందలి జనులందఱును వారివారిపనులెట్లు చేసికొనుచున్నారు? తమ ప్రభుత్వముల ద్వారా చేసికొను కార్యములు కొన్ని, మిగత కార్యములు తమకొరకు తామే చేసికొనుచున్నారు ప్రభుత్వము వారే కార్యమునైనను ప్రారంభించువరకు ప్రజలూరుకొని యుండజాలరు తమ కొఱకు తామే కొన్ని పనులు చేసికొనవలసి యుండును

దురదృష్టవశాత్తు ప్రభుత్వము లెన్నఁడును సాధారణముగా చుఱుకుగా పనిచెయ్యవు వానికిని సోమరితనమే! ప్రజలు తొందరపెట్టి చేయమన్న పనిని మాత్రము చేసియూరుకొంటవి ప్రజలు తొందర పడక, నిర్లక్ష్యముగా నున్న ప్రభుత్వమును నట్లే యుండును 'ప్రజల యోగ్యతకు అనుగుణముగానే ప్రభుత్వము నుండును ' అని ఎవరో అన్నారు మీరెట్టి పౌరులు కాఁబోవుచున్నారో, మీ దేశమును గూర్చి మీకెంతవరకు తెలియునో మీ దేశసమస్యలు మీరెంతవర కవగాహనము చేసికొన్నారో - ఈ యంశములపై సమస్తము నాధారపడియున్నది

ఇట్టి విషయములను గ్రహించుటకీ చిన్న పుస్తక ముపకరించును దీనిని చదివి మీరేమి నేర్చుకొంటిరో కాని నేను నేర్చుకొన్న విషయము మాత్రము మీకు కొంత చెప్పెదను - అవివేకముగా భారతీయులమైన మనము, మనకున్నదంతయు ధ్వంసమగుచుండ చూచుచు ఊరుకొనుచున్నాము ఏలయన, మనదేశ జీవితమెట్లుండవలెనో నిర్ణయించుకొన మనము ప్రయత్నించుటలేదు మనమా పూటకాపూట ఉన్నదానితో పొట్టనింపుకొనుచు తల తోకలేని బ్రదుకు బ్రదుకుచున్నాము చూచి తిరిగదా, మనమెట్టి దుస్థితిలో చిక్కుకొన్నామో!

**1947** సంవత్సరమున మనకు స్వపరిపాలనము చేఁజిక్కిన తోడనే మన ప్రభుత్వ మొక ప్రణాళికను సిద్ధము చేయుటకు పూనుకొన్నది. ఏదియు దుర్వినియోగము కాకుండ నిలుపుటకును, మన దేశమునుండియు, ప్రజలనుండియు రాఁబట్టగలిగినంత రాఁబట్టుటకును ఈ ప్రణాళిక యేర్పడినది అది యొక ప్లానింగ్ కమీషన్‌ను స్థాపించినది అందు ఎనమండ్రు సభ్యులు వారందందు సంచారము చేసి నానా శాస్త్రప్రవీణులను కలిసికొని వారి సలహాలు తీసికొనిరి ఈ కమీషన్ కేంద్రప్రభుత్వమును, రాష్ట్రప్రభుత్వములును అనుసరించుటకై ప్రధమ పంచవర్ష ప్రణాళికను తయారుచేసెను

ఇట్టి ప్రణాళికను తయారుచేయువారికి తటస్థించు చిక్కులలో నొకటి ఏమనిన - చేయవలసిన పనులన్నియు ఒక్కమాఱు చేయుటకు వీలుండదు' చేయవలసిన పెద్దమార్పు లొక్కొక్క దానికిని ధనము కావలెను, శక్తి కావలెను ఒక్కమారట్టి మార్పు లన్నియు ప్రవేశపెట్టదలచినచో నందులకై యవసరమగు ధనమును, శక్తియు ఇండియాలో లేవు ఒక్క సంవత్సరములో ఇదియు, అదియు, వేఱొకటియు అన్నియు మనము చెయ్యలేము మొట్టమొదట ఇది చేయుదమా లేదా అది చేయుదమా యన్న ప్రశ్న సర్వదా తలయెత్తుచునేయుండును

మఱియు ప్రణాళికనేర్పాటు చేయదలఁచినవారు, ప్రజలజీవన విధానమెట్లుండవలెనని కోరుదురో, ఎట్టి సంఘమును వారు అభిలషింతురో ముందుగా నాలోచించుకొనవలెను ప్రణాళిక నిర్ణయించుట కందఱును ఒప్పుకొందురు కాని ఎందులకీ ప్రణాళిక? పెద్ద నగరములతో నిండిన ఇండియా కావలెననియా? లేదా చిన్న పట్టణములతోను పల్లెలతోను నిండిన ఇండియాకావలెననియా? బ్రహ్మాండమైన కర్మాగారములలో అసంఖ్యాకులైన కార్మికులు పనిచేయు ఇండియా కావలెననియా? లేదా కుటీరములలో నివసించు శిల్పకుటుంబములతో నిండిన ఇండియా కావలెననియా? పెద్దసహకారక్షేత్రములు గల ఇండియా కావలెననియా? లేదా, చిన్న చిన్న భూఖండములుచేయు రైతులు గల ఇండియా కావలెననియా?

అమెరికా, జర్మనీ, ఇంగ్లాండు దేశములలోని యద్భుతయంత్రములను చూచి మెచ్చుకొనుచు, ఇండియాలోకూడ పెద్ద పెద్ద కర్మాగారములు, కార్ఖానాలు పెట్టిన బాగుండునని యనుకొందురు పలువురు యువకులు గొప్పసాహుకార్లుకూడ ఆవిధముగానేకోరుదురు యంత్రముల వద్ద కూలి

వాం(డ్రచేత చాకిరీచేయించి పెద్ద లాభములు కొట్టవచ్చునని వారియాశ ఇంక రెండవ పక్షమువారును ఉన్నారు వారిలో మహాత్మాగాంధియొక్కరు. వారు పైసూచనలు సహించరు ప్రజలుతమకు కావలసిన సమస్తమును తమతమిండ్లలోతామే చేసికొనవలసియుండునందురు

'మనకు సహాయముచేయుటకు యంత్రములున్న యెడల ప్రతిదినము ననేకగంటల కాలము మనము మనము పనిచేయవలసిన యగత్యముండదు కనుక విశ్రాంతితీసికొనుటకు, జీవితసౌఖ్యములనుభ వించుటకు మనకు కొంతతీఱికచిక్కును' అని నవీనుఁడనును

'తీఱికవల్ల మనకునష్టమేగాని లాభముండదు చివరకది యవినీతిగా పరిణమించును చేతినిండపనిలేనివాఁడేదోయొక దురాలోచనచేయుచునే యుండునన్న మాట మరచిపోరాదు ' అని నొక్కి చెప్పి తప్పించుకొనును గ్రామజీవనవాది

'అట్లైన రాటము, నాగలి మాత్రముమనకేల? వానిని కూడా వదులుకొని వట్టిచేతులతో దినమునకు 24 గంటలును పొట్టనింపుకొనుటకు పాటుపడరాదా' అని నవీనుఁడుపరిహసించును

'పెద్దయంత్రములు నడుపుటకు మానవులకింకను యోగ్యతరాలేదు వారు యంత్రములకు బానిసలౌదురు వారు యంత్రముల మాదిరిగా మారిపోగల ప్రమాదముసైత మున్నది వారు తమ ఆత్మలు కోల్పోవుదురు వట్టికీలుబొమ్మజీవితము వారు గడపవలసి వచ్చును అంతేకాదు యంత్రముల ద్వారా సరకులుత్పత్తి చేయుటవలన నిరుద్యోగసమస్య పొడచూపును కర్మాగారములో నొకనూతన యంత్రము ఇరువదిముప్పదిమంది మనుష్యులకు పనిలేకుండా చేయును వారు చేయవలసినదేమి? యంత్రము వారిని పోషించదు ' అని గ్రామజీవనవాది జవాబు చెప్పును

యంత్రపక్షవాది ప్రత్యుత్తర మేమన, 'అది సరికాదు యంత్రములను బానిసగా చేసికొన్నది మానవుఁడే! యంత్రము లుండుటవలననే సొంత చేతులతో నిష్టములేని యసహ్యారకమగు

పనినాతఁడు చేయ నవసరము లేకుండ పోవును సాయంత్రమగుసరికి ఎక్కువ ూలి డబ్బు చేతిలో వచ్చి పడును యంత్రముల వల్లనే వస్తువులు చౌకగా దొరుకుతవి ఇతర సందర్భములలో నతఁడు కొనలేని వస్తువులు కొనవచ్చును కొలఁది మంది ధనవంతులు, స్వలాభమునకై యంత్రములను తమవశములో నుంచుకొనుట వల్లనే నిరుద్యోగము పొడచూపుచున్నది!' అని

ఈ విధముగా వాదోపవాదములు సాగుచునే యుండును ఉభయపక్షములవారును చెప్పు విషయము లనేకమున్నవి ఒక్కొక్కరి వాదమును గుఱించి యొక్కొక్క గ్రంథము వ్రాయవచ్చును వాదధర్మము ననుసరించి చూచినచో ఉభయపక్షవాదములందును చాల సత్యమున్నది మహాత్మగాంధి ఒక మా రేమన్నారనఁగా 'నేను యత్రములన్న పిచ్చిపడవద్దను చున్నాను కాని యంత్రములువద్దనుట లేదు ఆ మాటకు వచ్చిన రాట మెంతటి దివ్య యంత్రమో చూడుడు '

ప్రకృతి శాస్త్రమును బట్టి నిర్మించిన యితర సాధనముల వలెనే యంత్రమును మంచిదనుటకు గాని, చెడ్డదనుటకుగాని వీలులేదు. అది తటస్థముగానే యుండును విమానము బాంబులను వదలి ప్రాణములు తీయను గలదు. దూర ప్రదేశముల వైద్యసహాయమవసరమైనప్పుడు, వైద్యునో, ఔషధమునో అక్కడికి శీఘ్రముగా కొనిపోయి ప్రాణములు నిలుపను గలదు. మనమెట్టి ప్రయోజనములకు పెట్టిన యంత్రములట్టి విధముగానే ప్రవర్తించను కాబట్టి యంత్రములను ధ్వంసముచేయుట వివేకముకాదు వానిని తెలివితేటలతో, దాక్షిణ్యముతో నుపయోగించు విధము ప్రజలకు నేర్పుటయే వివేకము

మఱియు, ఇండియా విషయములో మాత్రము ఇది కర్మాగారముల దేశము, యంత్రాల దేశము అగునేమో యని ఉప్పొంగనవసరమును లేదు, దిగులుపడ నవసరమును లేదు మన దేశములో నూటికి 70 మంది జనము వ్యవసాయదారులు, నేటికి 83 మంది గ్రామవాసులను మాట మరచిపోకూడదు సుమారు 25 లక్షల జనులు మాత్రము కర్మాగారములలో పనిచేయుదురు పెద్ద పరిశ్రమల నతివేగముగా స్థాపించుచు పోయినప్పటికినీ, మన జనాభా అతివేగముగా వృద్ధియగుచుండుట వలన, అయిదేండ్ల తరువాత మన పరిశ్రమలలో మఱి 35 లక్షల మంది ప్రవేశించినప్పటికి 26 కోట్ల మంది వ్యవసాయము చేసికొని తీరవలెను

కాఁబట్టి మన మూహించగలిగినంత యభివృద్ధి మనదేశమునకు కలిగినను, ఇండియా వ్యవసాయ దేశముగా నుండి తీరవలసినదే! అనఁగా పల్లెలలో నివసించు రైతులు, శిల్పులు గల దేశముగానే యుండును గాని పట్టణములలో నివసించు కార్మికుల దేశముగా నుండదు

మనకొక ప్రణాళిక యవసరము ఉన్న జనశక్తిచే (manpower) సాధ్యమైనంతవరకు లాభకరముగా పనిచేయించుటకును సాధ్యమైనంత సరుకు వారిచే ఉత్పత్తి చేయించుటకును ప్రణాళిక కావలెను అత్యధిక సంఖ్యాకులకు పనిచెప్పుట + అత్యధిక ఉత్పత్తి చేయుట + న్యాయముగా పంచుట ఇవి మన కార్యసూత్రమై యుండవలెను

పరిశ్రమల సమస్యలు మనము పట్టించుకొన నవసరము లేదనియా దీని యర్థము? కాదు. సరిగదా, జనసంఖ్య వృద్ధి యగుటవలన వ్యవసాయము మీఁదనే అందఱును విరుచుకొని పడకుండ, వెంటనే మనము ఇండియాలో పరిశ్రమలుపెట్టుటకు పూనుకోవలెనని యర్థము అయిదు సంవత్సరములుదాటిన తరువాతనైన పట్టణములోని పెద్ద పరిశ్రమలుగ్రామము లందంతట అలుముకు పోవలెనని యర్థము గ్రామములలోను చిన్న పట్టణములలోను అవినిలువద్రొక్కుకొనవలెను ఈవిధముగా వ్యవసాయమువల్ల జీవనోపాధి గడించలేనివారు ఇల్లుకదలకుండ వేఱుపనులు చేసికొనివచ్చును పనిలేనికాలములో రైతులు ఏదొయొక చేతిపని చేసుకొనవచ్చును. వ్యవసాయము

నకవసరము లేనిజనులు వివిధములగు కుటీరపరిశ్రమల నవలంబించవచ్చును

అనేక విధములగుకుటీర పరిశ్రమ లందుబాటులో నున్నవి జనసమ్మతమగు నేఁటికుటీర పరిశ్రమలు-రాటముమీఁద నూలు వడకుట, నూలుబట్టలు, పట్టుబట్టలు,ఉన్నిబట్టలు చేమగ్గముల మీఁదనేయుట, అనునవి నేఁడు లక్షలకొలఁది జనమీగ్రామవృత్తుల నవలంబించియున్నారు

శతాబ్దుల కాలమునుండియు ననేకవిధములగుయితరకుటీర పరిశ్రమలు ఇండియాలో సాగుచునేయున్నవి యంత్రములవల్ల ఉత్పత్తి యైనవస్తువులు పోటీచేయుచున్నప్పటికిని నేఁటివరకు నవిబ్రదికియుండగలిగినవి చూడుడు - లోహములమీదఁచేయు చెక్కడపుపని, ఇంఁక మనపల్లెటూరి కమ్మరి యుండనేయున్నాఁడు గదా! ఇంతేకాదు, ఇత్తడితో, రాగితో, వెండితో, బంగారముతో వంటపాత్రలు మొదలుకొని సున్నితమగు యాభరణములవరకు నేర్పుగా తయారుచేయు యద్భుతమగు పనివాండ్రు - శిల్ప కౌశల్యముకలవారు నున్నారు

కొందఱు, దంతపుపని చేయుదురు కొందఱు చలువరాతి చెక్కడపుపని చేయుదురు మఱికొందఱు తివాసీలు నేయుదురు ఇఁక కఱ్ఱపను లన్నివిధములైనవి కలవు పడవలు మున్నగు కఱ్ఱసామాను మొదలుకొని చిన్నపిల్లల ఆటవస్తువులవరకు తయారు చేయుదురు మృతజంతువుల చర్మములు బాగుచేయువారు, వానితో చెప్పులకుట్టువారు నున్నారు

గింజలు గానుగలో నదిమి నూనెతీయుదురు నూనెతో సబ్బులు చేయుదురు చెఱకురసముతో బెల్లమువండుదురు వడ్లు చేతితో దంపి బియ్యము చేయుదురు చేదంపుడు బియ్యము మిల్లు బియ్యముకన్న పుష్టికరము పండ్లు నిలువచేయవచ్చును సిరా,కాగితము చేతితో చేయవచ్చును నేపాళదేశములో తయారు చేసిన కాగితము వెయ్యిసంవత్సరముల కాలము చెక్కుచెదరకుండ నుండునట

పాడిచేసికొనువారికి, పశువుల పెంచుకొనువారికి- ఆవులు, బఱ్ఱెలు, మేకలు, కోళ్లు కలవు తేనెటీఁగలపెంపకములాభకరమైన పరిశ్రమ

కుటీర పరిశ్రమ లెన్నియుండగా మన రైతు లీవృత్తులలోనికి అధికముగా నాసక్తితో ప్రవేశించుటలేదేమి? గ్రామశిల్పులింతటి దుస్థితికి పాలైనారెందువల్ల?

సమాధానమేమన- వారికిలోటుగానున్నవి మూఁడు అవి పెట్టుబడి, కౌశల్యము, మార్కెట్టు (గిరాకీ) మనపల్లెలలో చాలమంది కటికదరిద్రులు ముడివస్తువులుగాని, కొసకుపనిముట్లుగాని కొనుక్కొనుశక్తి వారికిలేదు వారికి కౌశల్యముతక్కువ వారి యభిరుచులు మంచివైనప్పటికి ప్రాతకాలపువి ఇంకచేసిన వస్తువెట్లమ్మవలెనో, ఎక్కడఅమ్మవలెనో వారికి తెలియదు

ఈ చిన్న పరిశ్రమలు వృద్ధిజెందవలెనన్న, జనసమ్మతముగా నుండవలెనన్న వానికి చాలా సహాయము చేయవలసి యుండును ప్రభుత్వమువారు కుటీరపరిశ్రమలకు తాము స్వయముగానో సహకార సంఘములద్వారానో అప్పు నీయవలసియుండును అంతకన్న మంచిపని వారికి ముడి వస్తువులిచ్చుట ఇట్లుచేసిన ఋణదాతలబాధనుండి వారు విముక్తులగుదురు

తరువాత చేయవలసినపని - పారిశ్రామిక విద్యాశాలలను స్థాపించుట అక్కడ క్రొత్త సాధనములను, క్రొత్తపనిముట్లను కనిపెట్టవచ్చును శ్రమతగ్గించు సాధనములను, క్రొత్తపనిముట్లను కనిపెట్టవచ్చును కొందఱు పనివాండ్రనెంచి తీసికొని వారికి శిక్షనీయవచ్చును వారు గ్రామములందు సంచరించుచు, క్రొత్త యుపకణములను వాడు విధమును, మంచివస్తువులను తయారు చేయు విధమును జనులకు బోధించవచ్చును

తయారైనవస్తువులనమ్ముటకు మార్కెటింగు ఉద్యోగస్తులైనను, సహకారసంఘములైనను తగినయేర్పాట్లు చేయవలసి యున్నది ఇట్లుచేసిన సరియైనధర పనివాండ్రకు ముట్టును

జపాను స్విట్జర్లండు మున్నగుదేశములలో నీవిధముగానే చిన్న పరిశ్రమలు విరివిగా వ్యాపించి జనసమ్మతి నందినవి

గ్రామపరిశ్రమలకు కావలసిన వస్తువులను సరఫరాచేయుటకు నగరములందలి పెద్దయంత్రశాల లవసరము పెద్ద ఇంజనీరింగు కార్ఖానాలు, చిన్న యంత్రములను మంచిపనిముట్లను వారికి సరఫరాచేయవలసియున్నది పెద్ద రసాయనిక కర్మాగారములనుండి రంగులు, రసాయన పదార్థములు వారికి కావలెను పనిముట్లనుచేతితో నడుపుటకన్న విద్యుత్తుతో నడిపినచో నెక్కువ వేగముగా పనిజరుగును కాఁబట్టి గొప్పజలవిద్యుద్యంత్రశాలల నుండి వారికి చౌకగా కావలసినంత విద్యుత్ప్రవాహము కావలెను చూచితిరా,

గ్రామములకును, నగరములకును ఎట్టిదగ్గిరసంబధమున్నదో! ఒకటిలేకున్న రెండవ దెట్లు నిలువజాలదో!

మన పెద్ద కార్ఖానాలును, కర్మాగారములును నడుపఁబడు విషయమున మనము మిక్కిలి జాగ్రత్తగా నుండవలెనన్న మాట మంచిపనిముట్లను, చౌకగా, ఆనాఁటికానాఁడు అధికముగా, గ్రామస్థులకు అందించవలెను

నాగళ్లవంటి ఏ ప్రత్యేకసాధనమునైనను అనేక కర్మాగారములుత్పత్తి చేయుచున్నచో, ఈ కర్మాగారముల యజమానులు మంచి పనివాని తనముచూపి మంచి నాగళ్లను వ్యవసాయదారులకు సాధ్యమైనంతచౌకగా నీయగోరుదురని మనమాశింతుము అట్లుచేయని యజమాని కర్మాగారములోని నాగళ్లువిడుదలయగుట లేదని గ్రహించును వీనికి బదులు ఇతరకర్మాగారములలో తయారైన

నాగళ్లే కొందురు కర్మాగారములయజమానులందఱును చేరి నాగళ్లన్నింటని నధికమూల్యము పెట్టకుండ ప్రభుత్వము చూడవలసియున్నది అధిక మూల్యము పెట్టుట వ్యవసాయ దారులను మోసము చేయుటయే

యధార్ధమునకు ప్రభుత్వమే నాగళ్లను తయారుచేయుటకొకటి రెండు కర్మాగారములను సొంతముగా స్థాపించవచ్చును ఇట్లు చేసిన కర్మాగారముల యజమానులు చేరి ధర యెక్కువచేయుటగాని పనికిమాలిన నాగళ్లను అమ్ముటగాని పొసగదు ప్రభుత్వకర్మాగారములు సమర్ధతతో నడిపినయెడల, ఇతర ఫాక్టరీయజమానులును తమఫాక్టరీలను సమర్ధతతో నడుపజూతురు ప్రభుత్వముకన్న కూడ సామర్ధ్యముతో ఒకరిద్దరువర్తకులు తమకర్మాగారములను నడుపగలిగియుందురు అంతకన్న మంచి నాగళ్లను వారికంటే చౌకగా నమ్మగలియుందురు

కాన, భావిభారత చిత్రపటములో మనము చూచునది గవర్నమెంటువారి యత్నము యొక్కయు, ప్రజలస్వతంత్ర్యోద్యమము యొక్కయు కూడిక; ప్రభుత్వమునడుపుకర్మాగారములును, ప్రజలుగాని ,కంపెనీలు గాని లాభముకొఱకునడుపు ఫాక్టరీలును ఒక దాని ప్రక్కనొకటి పనిచేయుట ఇట్టి యేర్పాటువలన నందఱును మఱింత సామర్ధ్యముతో పనిచేయుదురు మఱింత వర్థిల్లుదురు పట్టణములలోను పల్లెలలోను శిల్పులు సహకారసంఘములుగా నేర్పడి, చిన్న పరిశ్రమలు నడుపు చుండుట మనకుగోచరమగుచున్నది పెద్దవి, చిన్నవియగు ఫాక్టరీల, కార్ఖానాల ప్రక్కనే మన బ్రహ్మాండమగు పరిశ్రమ, వ్యవసాయముండనేయున్నది.

దేశముయొక్క ఆర్థికజీవితములో పాల్గొనుచున్న ఆముగ్గురును, ఒకరికొరకు సహాయపడుచు, ఒకరినొకరు పోషించుకొనుచునుండుట మనముపటములో చూడవచ్చును

అభివృద్ధి చెందిన ఇతర దేశములకు బానిసచాకిరీ చేయుచున్న భారతదేశముముఖ్యముగా వ్యసాయదేశము తలబరువగుట వలన ప్రమాదముసంభవించునేమో అనిపించు పారిశ్రామిక దేశము ఇంగ్లాండు ఇటు నేఁటిఇండియావలె గాక అటు ఇంగ్లండు వలెగాక మధ్యమార్గము నవలంబించుటకు మనము ప్రయత్నించవలెను ఇది మనము చేయవలసినపని మనకింకను పరిశ్రమలనేకము కావలెను కాని యవి కుటీరములకు వ్యాపించవలెను చిన్న కార్ఖానాలకు వ్యాపించ వలెను ఇవి దేశము నందంతటను అలముకొనిపోవలెను ఈ విధముగా చేసిన యంత్రముల వల్ల కలుగుప్రమాదములను తొలగును లాభములను కలుగును

ఇతర దేశప్రజలవలెనే మనమును మంచి పదార్థములుతినుచు మంచిబట్టలుకట్టుకొనుచు, మంచి వస్తువులు వాడుచునుండవలెనని కోరుదుము జీవితమునందవే అత్యుత్తమ పదార్థములని భావించి వానినిమనముకోరుటలేదు ఎందులకు కోరుచున్నా మన జీవితమందలి సర్వోత్తమాంశమును

పురుషులును, స్త్రీలును ,బాలురును అనుభవించుటకవి తోడ్పడును కాఁబట్టియు, వారిలోని ఉత్కృష్టగుణములను ప్రదర్శించుట కవి తోడ్పడును కాఁబట్టియు, మన గుణములను ప్రదర్శించుట కవి తోడ్పడును కాఁబట్టియు, మన చుట్టును విశాల భారతదేశముకలదు మనలో ప్రతి వ్యక్తిలోను కూడ మన ఇండియా స్వల్పాంశము కలదు. మనచుట్టునున్న దానియభివృద్ధిని మనము కోరుచున్నాము అందుచేమనలోని భారతత్వము వర్ధిల్లగలదు మనదేశమును చూచి మనము గర్వించుచున్నాము మనలనుచూచి మనదేశము కొద్దిగానైనా గర్వించవలెనని యాశించుచున్నాము

కాఁబట్టి మనమందఱముకలసి మన కవిశేఖరులలోనొక్కఁడగుమహమ్మదుఇక్బల్ రచించిన పాట పాడుదము

సారేజహాన్‌సే అచ్ఛా హిందూస్థాన్ హమారా
హంబుల్బులోం హై ఇస్కీ, యహ్‌గులిస్తాన్ హమారా,
పర్బత్ వహసబ్‌సే ఊంఛాహబసాయ ఆస్మాన్‌కా,
వహసంతరిహమారా, వహపాస్‌బార్ హమారా,
గొదీమేఖేల్తీహై ఇస్కీహజారోంనదియా
గుల్‌షన్ హై జిస్కేదంసే రష్కేజహాహమారా
మఝుబ్‌నహి సిఖాతాఆపస్‌మే బైర్ రఖ్నా,
హిందీ హైహంవతన్ హై హిందూస్థాన్ హమారా

ఈ పాటకు అర్థము మీకు తెలియునో లేదో (న్యాయమునకు మీకు తెలిసియుండవలసినదే!) దీని యభిప్రాయమిది

ప్రపంచమండలి ప్రశస్తదేశము భారతదేశము మనదేనోయ్,
బుల్బుల్ పిట్టల మోయ్ మనమంతా మనదేనోయ్ ఈ గులాబితోట
ద్వారపాలనము మనకై చేయుచు, దేశరక్షణము మనకై చేయుచు
శిఖరాగ్రంబున గగనమునంటే అత్యున్నతగిరి హిమాద్రిమనదే,
హిమాద్రి యొడిలోనాటలనాడే వేలకొలది ఈనదులును మనవే,
మనదేశమునిది పూలతోటగామార్చెను, లోకులకిది కన్నెఱ్ఱ,
పరస్పరంబును వైరముపూనుట మత మెన్నండున ఉపదేశించదు,
భారతీయులము మనమందఱమును భారతదేశము మనదేనోయ్

# శ్రీమద్భగవద్గీత

## విశ్వరూప సందర్శన యోగము

అర్జునుడు -

పరమమును, ఆధ్యాత్మ విషయము,
గోప్యమగు వాక్యంబు నన్ను న
నుగ్రహించి వచించి నాడవు
దాన నా యవివేకముడిగెను 1

వింటి విపులముగాను కృష్ణా!
భూతముల ఉత్పత్తి లయముల
వింటి నవ్యయమైన నీ మా
హాత్మ్యమును నీనోటనే 2

అవును నిజమే నీవు చెప్పిన
ఆత్మ విషయము సర్వమును, నీ
దివ్య వైష్ణవ రూపమును, పురు
షోత్తమా! నేజూడగోరితి 3

నేను చూడగ తగుదునని నీ
వెంచితే యోగేశ్వరా ! ప్రభు!
అవ్యయంబగు నీ స్వరూపము
నీవు నాకును చూపుమా 4

శ్రీకృష్ణుడు -

చూడు పార్థా ! నా స్వరూపాల్,
వందలాదియు వేలకొద్దియు,
దివ్యములు నానా విధంబులు,
పెక్కు వర్ణాకృతులునున్ 5

చూడు మాదిత్యులను వసువుల
రుద్రులను, అశ్వినుల భారతా!
మరుద్గణమును చూడు - ఎన్నడు
చూచి యెరుగని పెక్కు వింతల 6

చూడు - ఈ నాదేహమందున
నిపుడు నొకచో చరాచరమౌ
సర్వజగమును, అన్యమింకా
చూడ దలచిన చూడు మర్జున! 7

చూడ జాలవు నన్ను నీవీ
కళ్లతో, నే దివ్యదృష్టిని
ప్రసాదింతును, చూడు నాదౌ
యోగ మహిమంబున్ 8

సంజయుడు -

ఇట్లు రాజా ! మహాయోగే
శ్వరుడు, కృష్ణుడుపలికి పిమ్మట
పరమ మైశ్వర్యమైన రూపము
పార్థునకు చూపెన్ 9

పెక్కు ముఖములు, పెక్కు కన్నులు,
అనేకాద్భుత స్వరూపంబులు,
పెక్కు దివ్యాభరణములు ది
వ్యోద్యతాయుధములును, పెక్కులు 10

దివ్య మాల్యాంబర ధరంబును
దివ్య గంధ విలేపనంబును
మహైశ్వర్య మయంబు దీప్తము
విశ్వతోముఖ మనంబును 11

ఒక్కమారుగ వేయి సూర్యులు
దివి వెలింగిన పుట్టు తేజము
ఆ మహాత్ముని దివ్యకాంతికి
సాటి రాగలదా? 12

అర్జునుండీక్షించె నప్పుడు
వివిధగతుల విభక్తమగు జగ

మెల్ల నొక్కట దేవ దేవుని
దివ్య దేహమునన్ 13

చూచి విస్మయమంది పార్థుడు
పులకలెత్తుచు మస్తకాంజలి
కూర్చి చేతులు చేర్చి పలికెను
దేవదేవునితోన్ 14

అర్జునుడు -

చూచుచుంటిని దేవ! నీ దే
హంబు నందున - దేవతాళిని
సర్వభూత విశేష సమితిని
ఈశు కమలాసనుని బ్రహ్మను
సర్వ ఋషులను దివ్యఫణులను 15

అంతమే లేనట్టి రూపము
లంతటా గల నిన్న నేకము
బాహువులతో ఉదరములతో
వక్త్రములతో నేత్రములతో
చూచుచుంటిని, లేదు అంతము,
లేదు మధ్యము, లేదు ఆదియు
విశ్వరూపా! విశ్వేశ్వర! 16

నిను కిరీటిని గదాధారిని
చక్రస్తుని దివ్యతేజో
రాశి నెల్లడ దీప్తిమంతుని
దుర్నిరీక్ష్యుని, జ్వలత్ భాస్కర
వహ్ని తేజుని, అప్రమేయుని
చూచుచుంటిని అంతటా 17

తెలిసికోదగు పరబ్రహ్మవు
విశ్వమున కాధారభూతుడ
వవ్య యుండవు నీవు శాశ్వత
ధర్మరక్షకుడవు సనాతన
పురుషుడవు - అని నా మతంబు 18

ఆది మధ్యాంతములు లేని య
నంతవీర్యు ననంత బాహుని
అర్క శశినేత్రుని జ్వలించే
అగ్ని వక్త్రు మస్త జగమును
స్వీయ తేజస్సున తపింపగ
జేయు వానిని చూచు చుంటిని 19

నీవొకండవె భూమ్యా కా
శముల మధ్యను సర్వ దిక్కుల
నిండి యుంటివి, ఉగ్రమద్భుత
మైన నీ యీ రూపమును గని
మూడు లోకంబులు మహాత్మా!
భీతితో వణకెన్. 20

ప్రవేశించుచు నుండె నీలో
దైవ సంఘము లివ్వి, కొందరు
భీతి ప్రాంజలులై స్తుతించుచు
నున్నవారలు, స్వస్తిపలుకుచు
పుష్కలంబగు స్తోత్రములతో
పొగడుచుండ్రి మహర్షిసంఘాల్
సిద్ధ సంఘములున్ 21

రుద్రులాదిత్యులును లీసువులు
సాధ్య విశ్వదేవతులు, అ
శ్వినులు, పితరులు, మరుద్గణములు
యక్షులును, గంధర్వులసురులు
సిద్ధులును విస్మయములో ని
న్నరయు చున్నారందరున్ 22

మహాబాహో ! నీ స్వరూపము
మహత్తరమై వెలుగుచున్నది
వక్త్రములు నేత్రములు ఎన్నో
బాహువులు ఊరువులు ఎన్నో
పాదములు ఉదరములు ఎన్నో
భయంకరమగు కోరలెన్నో
లోకు లిది గని అడలుచుంటిని
నేను భయమున వణుకుచుండిరి. 23

నభము నంటుచు నున్నవాడవు
దీప్తరూపము; పెక్కురంగులు

తెరచి పెట్టిన నోళ్లు, వెలిగే
వెడదకన్నులు - నిన్ను చూస్తే
మనసులో భయమొదలె విష్ణూ!
ధైర్యముడిగెను, శాంతి తప్పెను 24

ప్రళయకాలానల సమంబులు
వికృత దంష్ట్రా భీకరంబులు
నీ ముఖంబుల జూచి - దిక్కులు
తెలియలేకున్నాను, సుఖమా
శూన్యమైనది? దేవదేవా!
కరుణ చూపు జగన్నివాసా! 25

రాజులందరితోడ కూడుకు
ధార్తరాష్ట్రులు అందరును ఈ
కర్ణుడును, భీష్ముడును, ద్రోణుడు
అట్లె మా యీ యుద్ధవీరుల
తోడు కూడుకు త్వరత్వరగా 26

వికృత దంష్ట్రా భీల ముఖముల
ప్రవేశిస్తున్నారు, కొందరు
చితికిపోయిన తలలతో నీ
పళ్లసందున యిరుకుకొని కని
పించు చున్నారు 27

వడిగపారే నదుల నేకము
లబ్ధిముఖమై అందు పడుగతి
ప్రజ్వలించే నీ ముఖమ్ముల
ప్రవేశిస్తున్నారలీ నర
లోక వీరానీకముల్ 28

ఎట్లు మిడుతలు నాశమున కతి
వేగమున పడు మండు వహ్నిని,
అట్లు ప్రాణులు నాశమున కతి
వేగమున నీ నోళ్లు జొచ్చెడి 29

ప్రజ్వలన్ముఖాలతో లోకా
లెల్ల పూర్తిగ మ్రింగి యాస్వా
దించుచుంటివి, అంతటను, నీ
ఉగ్రకాంతులు సర్వజగమును
నిశిత తేజము తోడ నిండి త
పింప జేయుచునుండె విష్ణూ! 30

ఉగ్రరూపము దాల్చు నీవె
వ్వడవో నాకును చెప్పవయ్యా
దేవదేవా! నీకిదే నా
నమస్కార మనుగ్రహింపుము
అద్యుడవు నిన్నెరుగ గోరితి
నీ ప్రవృత్తిని నేనెరుంగను 31

శ్రీకృష్ణుడు -

లోకముల నాశము చేసే
ప్రబల కాల స్వరూపుండను
లోకముల సంహారమొనరుప
ప్రవర్తించుచునుంటి నిప్పుడు
నీవుఏమీ చెయ్యకున్నా
శత్రు సేనలలోని యోధులు
ఎవ్వరున్నా బ్రదుక జాలరు. 32

కాన లెమ్ము యశమ్ము పొందుము
గెలిచి పగతుర శత్రు రహితం
బైన రాజ్యము ననుభవింపుము
వీరలందరు పూర్వమందే
నిహతులైనారయ్య నాచే
కాన నీవు నిమిత్తమాత్రుడ
వై మెలంగుము సవ్యసాచీ 33

నేను మునుపే సంహరించిన
ద్రోణ భీష్ముల జయద్రథ క
ర్ణులను, మిగిలిన యుద్ధవీరుల
నీవు చంపుము, భయము వీడుము
పోరుసల్పుము, రణమునందున
శత్రుజయ మొందుదువు పార్థా! 34

సంజయుడు -

కేశవుని యీ మాటలను విని

కంపమొందుచు కృతాంజలియై
నమస్కారము చేసి పార్థుడు
భీతితో ప్రణమిల్లి మళ్లీ
ఎలుగు రాలగ పలికె నీగతి 35

అర్జునుడు -

జగము నిను గీర్తించి హర్షము
చెందుచుంటయు, ప్రేమ చూపుచు
నుండుటయు రాక్షసులు భయమున
దిక్కులకు పరుగెత్తుచుంటయు
బద్ధులందరు నిన్ను గూర్చే
వందనంబులు చేయు చుంటయు
యుక్తమేకద హృషీకేశా! 36

ఆదిరక్తవు బ్రహ్మకంటెను
శ్రేష్ఠుడవును మహాత్మా ! నిన్ను న
మస్కరించక యెందుకుందురు
నీవు అక్షరమున్ను,సత్తు, న
సత్తు, తత్పరమును, అనంతా!
దేవదేవ! జగన్నివాసా! 37

ఆదిదేవుడవీవు కృష్ణ ! పు
రాణ పురుషుడవీవు కృష్ణా!
నీవు యీ జగమునకు పరమం
బౌ నిధాన మనంతరూపా!
వేత్తవును, వేద్యమును నీవే
పరమధామము నీవె కృష్ణా!
విశ్వమంతయు వ్యాప్తమైతివి
నీవు శ్రీకృష్ణా! 38

వాయువును యముడునూ అగ్నియు
వరుణుడును చంద్రుడును బ్రహ్మయు
నీవె, ప్రపితా మహుడవీవె
వేయి మారుల నీకు దండము
మరల దండము మరల దండము 39

ముందు దిక్కున నీకు దండము
వెనుక దిక్కున నీకు దండము
సర్వ దిక్కుల నీకు దండము
సర్వుడా ! ఓ కృష్ణమూర్తి ! అ
నంతవీర్యా మిత పరాక్రమ
శాలివీవే, సర్వజగముల
నిండియుంటను సర్వరూపుడ
వీవె శ్రీకృష్ణా! 40

నీదు యీ మాహాత్మ్య మెరుగక
సఖుడవంటూ తలచి, అజ్ఞా
నంబు చేతనొ ప్రేమ చేతనొ
ఓరి కృష్ణా! ఓరి యాదవ!
ఓరి సఖుడా! అనుచు పలికిన
దురుసు మాటలకును క్షమించుము 41

తిరుగునప్పుడు తినేటప్పుడు
పండుకొన్నప్పుడు కూర్చు
న్నప్పుడూ నీ ఒకని యెదుటో
పరుల యెదుటో పరిహసిస్తూ
అసత్కారము చేస్తి, అచ్యుత !
అప్రమేయుడవైన నిన్ను, క్ష
మియించమంటూ వేడుకొందును 42

ఈ చరాచర లోకమునకును
నీవె తండ్రియు, నీవె పూజ్యుడ
వీవె శ్రేష్ఠంబైన గురువువు
నీకు ముల్లోకముల తుల్యుడు
లేడు, అప్రతిమప్రభావా!
అధికుడెందుండున్. 43

కాన ఇదె దండప్రణామము
ఈశ్వరా! పూజ్యుడా! కృష్ణా!
నీ ప్రసాదము పొందగోరితి,
కొడుకు తప్పులు తండ్రివలెనే
సఖుని తప్పులు సఖునివలెనే
చెలియ తప్పులు ప్రియునివలెనే
నీవునా తప్పులను మన్నిం

పవా, కృష్ణా ! దేవదేవా! 44
చూచి యెరుగని విశ్వరూపము
చూచి సంతోషిస్తి కృష్ణా!
భయముచే నా మనసు కలగెను
దేవదేవ ! జగన్నివాసా!
పూర్వరూపము నాకు చూపియ
ను గ్రహింపగదే! 45

విశ్వమూర్తి ! సహస్రబాహూ!
నిను కిరీటిగ, గదాధారిగ
చక్రపాణిగ చూడవలెనని
కోరుచుంటిని చతుర్భుజముల
వెలయు వెనకటి రూపమందుము 46

శ్రీకృష్ణుడు -

పరమమును తేజోమయంబును
ఆద్యమును నీకంటే పూర్వము
ఎవ్వరును చూడనిద నంతము
నీ కొరకు ఈ విశ్వరూపము
నే ప్రసన్నుడనగుచు అర్జున!
ఆత్మయోగము చేత చూపితి 47

వేద యజ్ఞా ధ్యయనములచే
దానములచే క్రియలచేతను
ఉగ్రతపముల చేతగానీ
నన్ను ఆ రూపమున నరలో
కమున గాంచగ సాధ్యపడదు 48

ఘోరమౌ ఈ నాస్వరూపము
చూచి దుఃఖము మానుమయ్యా
భీతి మానుము ప్రీతితో నా
పూర్వ రూపముచూడు మళ్లీ 49

సంజయుడు -

కృష్ణుడిట్టుల అర్జునునితో
పలికి నిజ రూపంబు చూపెను
సౌమ్య రూపముదాల్చి మళ్లీ
ఆ మహాత్ముడు భీతిచెందిన
అర్జునిని ఓదార్చెను 50

సౌమ్యమగు నీ మనుజరూపము
తోడ నిను చూడంగ కృష్ణా
తేటతేరె మదీయ చిత్తము
పొందినాడను స్వస్థతన్ 51

శ్రీకృష్ణుడు -

చూచినాడవు చూడశక్యము
కాని ఈ నా విశ్వరూపము
దేవతలు నిత్యమును ఈ రూ
పంబు చూడగ కోరుచుందురు 52

వేదములచే తపస్సులచే
దానములచే యజ్ఞములచే
నా స్వరూపము నీవు చూచిన
రీతి చూడగ సాధ్యపడునా! 53

విశ్వరూప ధరుండనగునను
యధార్థముగా తెలిసికొనుటకు
చూచుటకు, పొందుటకు పార్థ! య
నన్య భక్తియె సాధనం. 54

కర్మలను నాకొరకు చేయుచు,
పరమగతి నేనని చరించుచు,
సంగరహితుడు, భక్తుడును,
పొందు నన్నే అర్జునా! 55

ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రము మాధవార్జున!
సుసంవాదంబైప శ్రీమద్
భగవద్గీతయందు విశ్వరూప సందర్శన
యోగమనే పేరుగల పదకొండో
అధ్యాయము
ఓం తత్ సత్

# వ్యాసాలు

1. బాలవాఙ్మయం
2. బాలసాహిత్యం
3. తెలుగు బోధన పద్ధతులు

# బాలవాఙ్మయం

విద్యావిధానాన్ని బాగుచెయ్యాలెననీ, అందరినీ అక్షరాస్యులను చెయ్యాలెననీ దేశమందంతట ఉత్సాహము చెలరేగుతోంది దొరతనములు అందుకై నడుములు బిగించినవి ఈ సందర్భములో బాలుర కుచితమైన వాఙ్మయము మనకు కద్దా అని విచారిస్తే లేదని చెప్పాలి ఇట్టి లోపములు తీరిస్తేనేతప్ప విద్యాబోధ సరియైన పునాదుల మీదపడే అవకాశం లేదు ఈ లోపము తీరడానికి (1) ప్రాచీన వాఙ్మయాన్ని ఉద్ధరించంలసియున్నది (2) నవ్యకవులు నూతనసృష్టి చేయవలసియున్నది మన ముద్ధరించవలసిన ప్రాచీన బాలవాఙ్మయ స్వరూప మెట్టిదో కొద్దిగా చూదాము శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వీడేవరకు కూడా వాని మనస్సుకు రంజకంగా ఉండే వాఙ్మయము వానికి అందుబాటులో ఉండాలి తెలుగు తల్లులు తమ బిడ్డలకు ఉగ్గుపాలతో పాటు కావ్యరసమున్నూ పోశారనడానికి జోలపాటలూ, లాలిపాటలూ నిదర్శనము

## జోలపాటలు

రామ లాలీ మేఘశ్యామ లాలీ
తామరస నయానా దశరధ తనయ లాలీ
అద్దాల తొట్టెలో నీవు అమరిఉండగా
ముద్దుపాప డంచు నిన్ను మురిసి చూచారు ॥రామ లాలీ॥

ఇందు ఒకే దేవుణ్ణి ఉద్దేశించి పాడడముండవచ్చు లేదా పసిపాపల చిన్న బుద్ధులకు కూడా అర్థమయ్యే విషయములతో కూడి ఉండవచ్చు

ఉదాహరణము

(1) హాయి వారమ్మాయి నీళ్ళ కెళ్ళింది
పాలైన యివ్వవే ఓ కుక్క పిల్లా
(2) అల్ల వారింటీకీ చల్ల కెడితేను
అల్ల వారీ కుక్క బొంయి మన్నాది
నా కాళ్ళ గజ్జల్లు ఘల్లు మన్నాయి
నా చంకలో బిడ్డ కేరు మన్నాడు
(3) పిల్లెమ్మ వెళ్లింది పల్లెల్లు దాటి
అబ్బాయి వెళ్ళేడు రచ్చల్లుదాటి

కుక్కపిల్లలూ, పిల్లిపిల్లలూ ధ్వన్యనుకరణములూ బాలురను ఆకర్షించేవే కదా. పిల్లలను ఆడించేటప్పుడు పాడే చందమామ పాటలు, గుమ్మడి పాటలూ, దాదం దక్కచ్చి మొదలయినవి కూడా వారిని ఆకర్షించేవే

కొందరు పిల్లలు చేరి ఆడుకొనేటప్పుడు పాడే పాటలు వారి చిత్తవృత్తుల కనుగుణమైవుంటవి
(1) కాళ్ళగజ్జి కంకాళమ్మ మొదలైనవి
(2) గుడుగుడు గుంచం గుండారావం పాములుపట్టం మొదలైనవి
(3) ఒక్కా వోచెలియా , రెండూ లోగిళ్లూ మొదలైనవి
ఇవి ముఖ్యముగా అర్థములేని అనుప్రాస ప్రధానమయిన పాటలుగా ఉంటవి

## కిండరు గార్డెన్ పద్ధతి పాటలు

కిండరు గార్డెన్ మార్చెస్‌కు అనుగుణమయిన పాటలు కూడా ఉన్నవి
(1) చినచిన దొంతుల్ చిటారి దొంతుల్
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మీ రేటివారే, చిలకా మీ కేటివారే మొ॥
(2) బుజబుజ రేకుల పిల్లుందా
బుజ్జారేకుల పిల్లుందా
తాడిమేడి పిల్లుందా
తామరగిరీ మొగ్గల్లు

## కట్టుకథలు

ఇక కథావాఙ్మయము ఎట్టిదంటే ప్రథమమున తల్లులుగాని, ముసలమ్మలుగాని చెప్పే చిన్ని కట్టుకథలు మొట్టమొదట మన యిళ్ళలో శిశువులు వినే చిన్నకథ చీమకథ అట్టివే నల్లి, పేను వగయిరా జంతుకథలు ఇవి గాక, యంత్రాలకు సంబంధించిన మజిలీకథలూ, పంచతంత్ర కతలూ, యధార్థ కథలూ క్రమక్రమంగా పిల్లలు నేర్చుకుంటున్నారు ఈ పాటలలోనూ, ఈ కథలలోనూ అద్భుతరసము ప్రధానముగా ఉంటుంది బాలుర నాకర్షించే రసము కూడా అద్భుతరసమే కాకుండా , బాలుర చిన్న బుద్ధులు గ్రహించగలిగే హాస్యరసము కూడా వాటిలో కద్దు మచ్చు చూపుతాను

(1) వదినా వదినా వల్లంకి పిట్టా
గదిలో పెట్టా గంజి నీళ్లోయ్యా
నీ కొడుకుట్టా నాపేరెట్టా
అన్నయ్య కొట్టా, నువ్వేడ్వా, నేనవ్వా
(2) బావా బావా పన్నీరు
బావను పట్టుకు తన్నేరు
మూలా మంచం వేశారు
మూడు గుద్దులు గుద్దేరు
నులకామంచం వేశారు
నూరూ గుద్దులు గుద్దేరు

(3) బుర్రుపెట్ట బుర్రుపెట్ట తుర్రు మన్నది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామ తెచ్చిన మల్లెపువ్వులు ముడువ నన్నుది
పడమంటింటీ కాపురమ్మూ చేయనన్నది
మొగుడు కొడితే మొత్తుకుంది
బిడ్డ పుడితే ఎత్తుకుంది

## కొన్ని పసిడితునకలు

ఇంతే కాకుండా ఈ బాలవాఙ్మయంలో ఏ దేశపు సారస్వతానికైనా వన్నెదెచ్చే దివ్యకవిత్వపు పసిడితునకలు దొరుకుతవి

మచ్చుకు -

1) ఆట మాణిక్యమే పాట మాణిక్యం
నట్టింట అమ్మాయి రత్నమాణిక్యం
(2) ఆడుకొని అబ్బాయి వచ్చె కాబోలు
అందెళ్ళ చప్పుళ్లు పందెళ్ళలోన
చదువుకొని అబ్బాయి వచ్చె కాబోలు
సరస్వతీ చప్పుళ్లు సావిళ్లలోన
(3) అందరీ మామల్లు మేనమామల్లు
అమ్మాయి మామల్లు చందమామల్లు
(4) ఏడవకు ఏడవకు వెర్రి నాగన్నా
ఏడిస్తె నీ కళ్లు నీలాలు గారు
నీలాలు కారితే నే చూడలేనూ
పాలయిన గారవే బంగారు కళ్లు

మాతృ ప్రేమ నంతనూ కొద్దిమాటల్లో యిమడ్చడమే యీ పాటలలోని ప్రతిభకు లక్షణం ఇంకా ఈ పాటల్లో పరిశోధకులకు పనికి వచ్చేటట్టులు అనేకం వున్నవి ఈ పాటలూ, కధలూ కొన్ని నన్నయ్యకు కూడా పూర్వమందు పుట్టి, నేటివరకూ నిలిచి ఉన్నవి

(1) కధలలో ఈగ కధ మిక్కిలి ప్రాచీనమైనది ఈగకు "ఈ" అనేపేరు ఎప్పుడు వాడుకలో ఉండేదో, అప్పటినుంచీ ఈ కధ తెలుగు దేశంలో వ్యాప్తిజెంది ఉన్నది ఈ క్రింది గేయభాగములు పరిశోధనార్హములేమో నిర్ణయించాలి

(2) అగడం, పగడం, కవిలికి దంతం గిరగిర చక్రం, గింజప్ప, ఆహ్, ఊహ్, క ళింగ పాపడు కడ్డీ కడ్డీ కడ్డీ - ఎవరీ కళింగ పాపడు?

(3) బోడిగుండు, బొప్పాయిగుండు
తిమ్మరాజుగారి దివిటీగుండు

ఎవరీ త్పిమ్మరాజు? దివిటీగుండంటే ఏమిటి?
(4) ఏడవకు ఏడవకు వెర్రి నాగన్నా
ఏడిస్తె నీకళ్ళ నీలాలు గారు
(5) పిల్లి పిల్లీ పిల్లి పిల్లల్ల మర్రీ
మర్రి క్రిందావాడు తొర్రినాగన్నా!
ఎవరీ నాగన్న? ఆంధ్రులకు పూర్వకాలంలో నాగన్న అనే నేరు సాధారణంగా ఉండేది కాబోలు
(6) కొండా మీద వెండి గిన్నె
కొక్కి రాజు కాలు విరిగె
ఎవరీ కొక్కిరాజా? సారంగధరుడని కొందరనేమాట వాస్తవమేనా?
(7) చందమామ యిల్లూ కట్టి
జాజిపూల తోటలోను
అమ్మా నేను చిన్నాదాన్ని
అల్లుడు వస్తే అంపాబోకు
ఢిల్లీకోట చల్లాగుంటె
దినానికి టంకం నే దెస్తా

ఆంధ్రులకూ, ఢిల్లీ సామ్రాజ్యానికీ సంబంధమున్నూ, దినానికి టంక సంపాదించే ముగ్ధల సామర్థ్యమున్నూ యిందు గ్రహించవలెను

కట్టుకథలలో ఒక విశిష్టగుణ మున్నది అది బాలుర జ్ఞాపక శక్తిని వృద్ధిచేయడానికి ఏర్పాటైనది శబ్దసంబంధంవల్లనూ, అర్థ సంబంధం వల్లనూ గ్రహణధారణ శక్తులు పెద్దవి కాగలవని సైకాలజి చెప్పుతోంది ఇట్టి శబ్దార్థ సంబంధా లీకథలలో గోచరిస్తవి ఉదాహరణమునకు ఈగ కథ

ఒక ఈగ ఇల్లలుకుతూ తన పేరు మరచిపోయిందట సర్వదేశాలలోను సర్వచిక్కులూ విడగొట్టే పేదరాలి పెద్దమ్మ దగ్గిరికి వెళుతుంది తనకు తెలియదు కొడుకును అడగమంటుంది ఈవిధంగా ఒకరిని బట్టి ఒకరిని అడుగుతూపోయింది చిట్టచివరకి ఈగ గుర్రం కడుపులో పిల్ల దగ్గిరికి వెళ్ళి అడుగుతుంది, ఏమనీ - పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా, కొడుకు చేతిలో గొడ్డలీ, గొడ్డలి కొట్టే మానా, మానుమీదుండే పక్షుల్లారా, పక్షులు తాగే నీళ్ళల్లారా, నీళ్ళలో వుండే చేపల్లారా, పట్టే పల్లెవాడా, వండే వంటలక్కా, తినేరాజా, రాజెక్కే గుర్రమా, గుర్రం కడుపులో పిల్లా, నా పేరేమిటి అని గుర్రం పిల్ల నవ్వుతుంది -ఈ ఈ ఈ అని అప్పుడు ఈగకు తన పేరు జ్ఞాపకం వస్తుంది ఈగకు ప్రాచీనరూపం "ఈ" అని పరిశోధకులు చెప్పుతారు ఒకమారు పిల్లవాడు ఇట్టి కథ వింటే ఇక మరిచిపోడు

## బాలవాఙ్మయ కర్త తల్లి హృదయం

బాల వాఙ్మయంలో చాలా పాటలకూ, కథలకూ తల్లిహృదయమే కర్తృత్వం వహిస్తుంది ఒక్కొక్క పట్టున బాలుర ఊహాశక్తి, లయజ్ఞానము కూడా కారణమై ఉండవచ్చు మరిన్నీ బాల్యము

కోల్పోని కవుల కల్పనాశక్తికూడా యిందుకు కారణమై ఉండవచ్చును ఇట్టి ప్రాచీన వాఙ్మయాన్ని పునరుద్ధరించి పారశాలలో ప్రవేశపెట్టవలసియున్నది ఇంతే కాకుండా దీని ననుసరించి నూతన వాఙ్మయ సృష్టికూడా జరగవలసియున్నది బాల వాఙ్మయానికి తగిన వస్తువు దొరకదేమోనని మనము భయపడనక్కరలేదు పురాణ పురుషులు పెక్కురుబాలురు మనకున్నారు వారి బాల్యచరిత్రలు కథావస్తువుగా మనము గ్రహింపవచ్చును

## అదిష్ఠానదేవత బాలకృష్ణుడు

బాలవాఙ్మయానికి అధిష్ఠానదేవత బాలకృష్ణుడు తెలుగు దేశంలో బాలవాఙ్మయం కొంతవరకు బాలకృష్ణ క్రీడలపై ఆధారపడి ఉన్నది జోలలూ, మేలుకొలుపులూ, ఆటలూ, పాటలూ, కొంటెపనులు వర్ణించే కథలూ, గేయాలూ, బాలకృష్ణుణ్ణి ఉద్దేశించినవి పెక్కు లున్నవి

మిగిలిన బాలవీరులు - ధ్రువుడు, ప్రహ్లాదుడు, చిరకారి, మార్కండేయుడు, రాముడు, బలరాముడు, ప రశురాముడు, వామనుడు మొదలయినవాళ్లు ఉన్నారు ఉచితమైన బాలభాషలో వీరి చరిత్రలు వ్రాస్తే బాల వాఙ్మయం కొంత ఏర్పడుతుంది

## సూరి, సీతి, వెంకీ కథ

మరిన్నీ, ఇతర దేశపు బాల వాఙ్మయాలతో మనము ఈ కాలంలో పరిచయము సులభముగా సంపాదించవచ్చు స్టీవెన్‌సన్, హాథారన్, గ్రిమ్, ఆండర్ సన్ మున్నగువారు వ్రాసిన కథలూ, స్లైడ్‌పుస్తకములు మనము ఆదర్శప్రాయంగా వుంచుకొని మన వాఙ్మయాన్ని వృద్ధిచేసికోవచ్చు

నేను ముగ్గురు తెలుగు పిల్లల బాల్యజీవనమును "సూరీ - సీతీ - వెంకీ" అనే పేరుతో కొన్ని కథలుగా వ్రాశాను ఒక కథాభాగం వినిపిస్తున్నాను

"ముగ్గురూ వెళ్ళి నడవలో కూర్చున్నారు సూరి రెండో తరగతి వాచకమూ, సీతి ఒకటో తరగతి వాచకమూ, వెంకి పలకా, పలక పుల్లా పట్టుకున్నారు "

సూరి పుస్తకం జాగ్రత్తగా అట్టవేసుకుంది కొత్తబట్టలమీది బొమ్మలు అట్టలమీద అంటించుకొంది పుస్తకంలో ఒక నెమలి కన్నూ, దాని దగ్గరే పువ్వారమూ పెట్టింది "సీతోయి, చూడవే చూడవే ఈ నెమిలికన్నే ఎంతపువ్వారం తినేసిందో ఒకపిల్లనైనా పెట్టదు-పాడు" అంది సూరి సీతి తన పుస్తకంలో నెమిలి కన్నున్న పేజీ తీసి "నా పువ్వారం కొంచెం తింది నా నెమిలికన్ను చూడే, అక్కా చూడే ఎంత చిన్న పిల్లని పెట్టిందో ! చూడే ఒసే" అంటూ సీతి ఒకచిన్న నెమిలి వెంట్రుక సూరికి చూపింది

"అది పిల్లా ఏమి టమ్మా" అంది సూరి

"కాదా ఏమి టమ్మా" అంది సీతి

"నా కదియ్యవూ" అంది వెంకి వెంకిని మభ్యపెట్టి సీతి కన్ను దాచేసుకుంది సీతి పుస్తకము అంతా నలిగి చిరిగిఉంది

" అక్కయ్యా ఈపారం చెప్పవుటే నాకు" అంది సీతి

" ఏం పారం" అని అడిగింది సూరి

" కుక్క ఏం పారం" అంది సీతి

"కుక్క పార మేమిటి అసయ్యం  ఇంకా పారా ల్లేవూ" అంది సూరి

"పిల్లి పారం, ఏనుగు పారం, సోమరిపిల్లవాడి పారం ఉన్నాయి" అంది సీతి

"అ వేం పారాలే పాడు పారాలు  కథలు లేవూ" అని సూరి అడిగింది

"నృగుని కథ, హరిశ్చంద్రుని కథ ఎడ్వర్డు కథ, ఫ్రాంక్లిను కథ ఈ కథలున్నాయి" అంది సీతి

"అ వేం కథలే, ఎంచక్కటి కథ లేమీ లేవూ మనం చెప్పుకునీలాంటివి" అంది సూరి

"ఏమో నమ్మా నాకు తెలియదు" అంది సీతి

"పోనీ పద్యం చదువు" అంది సూరి

"చివ రున్నాయే పద్యాలు, చదవనా -"

"క్షేత్రంబు పురుషకారము

ధాత్రీశ్వర బీజ మరయ దైవము రెండున్

సూత్రపడ గూడెనేనియు -"

"ఏమో అమ్మా ఆపద్యాలు నాకు తెలియవు  అ వేం పద్యాలోగాని" అంది సూరి

"సూరోయి, ఇదేం నాలుగో వాచకం" అంది సీతి

"ఆసి దొంగా, ఇంకా నీ పుస్తకం అనుకుంటున్నాను" అంది సూరి

"పోనీ నీ పుస్తకంలో కథలు చదవవే" అంది సీతి.

"నా పుస్తకమూ ఆలాగే ఉందమ్మా పాడు" అంది సూరి

"ఒకటి చదవ్వే పోనీ" అంది సీతి

"అయితే చదువుతా విను" అని సూరి ఇలా చదివింది

"పూర్వకాలంబున నుజ్జయినినా బట్టణం బొండు కలదు    "

"బొండు బొండు బొం డేమిటే సూరీ" అంది సీతి

"వినవే మరి" అని సూరి చదవడం సాగించింది

"అందు వీరసేనుండను భూతలేంద్రుండు రాజ్యము సేయుచుండెను  అతనికి జంద్రకళయను పేరం బరగు కళత్రంబు సకల గుణోపేత    "

"పేత పేత పేతేమిటి పీత" అంది సీతి

"పోనీ అమ్మా నే చదవను" అని సూరి పుస్తకము మూసేసింది

నేను వ్రాసిన లక్కపిడతలలోంచి ఒక గేయం

బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు
బాజాలతో వచ్చె పల్లకీ అదుగో

పల్లకీలో ఉంది పార్వతీదేవి
పార్వతీదేవికీ జేజేలు పెట్టు
బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు

ఇంకా బాల వాఙ్మయాన్ని సృజించిన, సృజిస్తున్న గ్రంధ కర్తలు మనలో ఉన్నారు గురజాడ అప్పారావుగారి ఆడపిల్లలపాట చిత్తగించండి -

"ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
కలువల కన్నెల కన్నెల్లారా
పిల్లలగన్న తల్లుల్లారా

విన్నారమ్మ ఈ కధను -

కొండల నడుమను కో నొకటుంది
కోనకి నడుమ కొల నొకటుంది
కొలని గట్టున కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ
ఏయే ఋతువుల పూచే పువ్వుల
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను బక్తితొ కొలిచెను
పుత్తడిబొమ్మ పూర్ణమ్మ"

పసితనమందు పిల్లలకు యిట్టి సారస్వతముతో పరిచయము కలిగినప్పుడే, వారి జీవితవృక్షానికి సరియైన దోహద మేర్పడుతుంది

"ఫక్కున సూర్యుడు నవ్వేడంటే
పట్టపగలు ఈ లోకముకు
ఫక్కున చంద్రుడు నవ్వేడంటే
చల్లని వెన్నెల జగములకు
ఫక్కున పాపాయి నవ్వే డంటే
పరమానందం నీకూ నాకూ
నవ్వడ మెందుకు నిజము పలకవే
అవునో కాదో అలివేణి"

* * *

# బాల సాహిత్యం

వెనకటి కాలంనుంచీ తెలుగు దేశంలో బాల బాలికలకోసం ఉద్దేశించబడ్డ సారస్వతం ప్రచారంలో వున్నది కాని కవులూ, గ్రంధకర్తలూ కావ్యనాటకాదులు తాటాకులమీద వ్రాసినట్లుగా బాల సారస్వతం వ్రాసి వుంచలేదు వ్రాసివుంచిన భాగం కూడా లేకపోలేదు కాని అట్టి గ్రంధాలు పెద్దలు తమ వశం చేసుకొని, వాటిని తమ గ్రంధాలుగా వాడుకొంటున్నారు ప్రాచీనులు బాలుర కొరకని ఉద్దేశించిన గ్రంధాలు కొన్ని ఈ విధంగా పెద్దల పాలైనవి ఇట్లా జరగకుండానే ఉంటే, బాలుర కింకా చాలినంత సారస్వతం వారి ఉపయోగంలో ఉండేది

లిఖితరూపంలో లేని సారస్వతం ఆనోటినుంచి ఆనోటికి పరం పరాగతంగా నేటివరకూ వచ్చింది తాతలూ, తండ్రులూ, తల్లులూ, ముసలమ్మలూ తమ వశంలో ఉన్న బాలసారస్వతాన్ని పిల్లలవశం చేసేవారు ఇంగ్లీషు చదువులు వచ్చాక, మనకు మన పెద్ద లిచ్చిన ఆస్తి మనం కాపాడుకోవడంలేదు పొరుగింటి పుల్ల కూరమీద మనకు మనసుపోయింది ఇందువల్ల ప్రాచీనకాలంనుంచి నేటి కాలంవరకూ పరంపరాగతంగా వస్తూన్న బాల సారస్వతం నశించే పరిస్థితులు తటస్థించాయి ఇప్పుడు వాటిని ఉద్ధరించి నిలబెట్టే ఉద్దేశముతో లిఖితంచేసి పుస్తకరూపంలోనికి తేవాలని ప్రయత్నిస్తున్నాము ఈ విషయంలోకూడా మన మంత పట్టుదల చూపడంలేదు

నాటుకధలు (Folk tales), నీతి కధలు (Fables), అద్భుతకధలు (Fairy tales), బాలగేయాలు (Childrens rhymes), అభినయగీతాలు (Action songs), సమస్యలు, పొడుపుకధలు (Riddles) మున్నగునవి లిఖితముకాని బాల సారస్వతంలో చేరుతవి

నాటుకధలు కొన్ని జాతీయ కధలనే పేరుతో రామాకంపెనీవారు ప్రచురించారు బులుసు పాపయ్యశాస్త్రిగారు కొన్ని ప్రకటించారు కొన్ని వాచకాలలోని కెక్కినవి కొన్నింటిని "బాల" పత్రిక ప్రకటించింది కొన్ని ముసళ్ళవద్దనూ, బాలురవద్దనూ నిలిచి ఉన్నవి

అద్భుత కధలు కొన్ని పైని పేర్కొన్న జాతీయ కధలనే గ్రంధములో నున్నవి తెలుగు అద్భుత కధలు గ్రంధరూపములోకి వచ్చినట్లు కనబడదు

బాల గేయాలూ, స్త్రీల పాటలూ రాజమహేంద్రవరం ప్రాంతంలో ఉన్న నేదునూరి గంగాధరంగారు ఊరూరూ తిరిగి కొందలకొద్ది సమకూర్చారు అవి యింకా గ్రంధరూపాన్ని పొందలేదు బాలగీతావళి, గీతా మంజరి, పిల్లల పాటలు, పాత పాటలు అనే పేళ్ళతో ప్రచురించబడిన చిన్న గ్రంధములలో ఈ గేయాలు కొన్ని ఉన్నవి

తెలుగు దేశములోని ప్రతిగ్రామానికీ వెళ్ళి, అక్కడి ముసళ్ళ దగ్గిరనుంచీ, పిల్లలదగ్గిరనుంచీ కధలూ, గేయాలూ, సంగ్రహించవచ్చును ఇంకా మిలిగియున్న బాల సారస్వతాన్ని సంపాదించడాని

కిది ఒక మార్గం లేదా బాలవంటి పత్రికలు గ్రామస్థులనూ, పిల్లలనూ ప్రోత్సహించి, అట్టికథలూ, పాటలూ మొదలైనవి తెప్పించి ప్రకటించవచ్చును ఇట్టి కథలూ, పాటలూ ఉన్న దున్నట్లు వ్రాసుకొని ప్రకటించవలసినదే కాని, స్వంతకవిత్వాలు పెట్టకూడదనే సంగతి గ్రహించాలి

ఇక లిఖితరూపము వహించి, గ్రథస్థమై ఉన్న బాలుర గ్రంధాల్లో ముఖ్యముగా చెప్పుకోదగ్గది పంచతంత్రము, ఇది బాలుర కొరకు ప్రత్యేకంగా ఉద్దేశింపబడ్డ గ్రంధము మన దౌర్భాగ్యంవల్ల దీనిని పెద్దలు తమ వశం చేసుకొని బాలురకు దక్కకుండా చేశారు దీనిని ప్రాచీన కవు లిద్దరు పద్యకావ్యాలుగా తయారుచేసి పాడుచేశారు చిన్నయసూరి, వీరేశలింగము, వెంకటరత్నము బాలురకు అలవిగాని భాషలో వచనముగా వ్రాసి, పండితులకుమాత్రమే పనికివచ్చే గ్రంధంగా చేసుకొన్నారు పంచతంత్రంలో కథలన్నీ బాలురకు పనికివచ్చే నీతికథలు, అసలవి బాలురకు విష్ణుశర్మ చెప్పిన కథలు బాలురకు విద్యబోధించే పద్ధతులు ఎట్టివై ఉండాలో విష్ణుశర్మకు బాగా తెలుసును మన తెలుగు గ్రంధకర్తల దృష్టిలో బాలురే లేరు వారి దృష్టిలో ఉన్నది - ఆత్మపాండిత్యప్రకర్ష ఒక్కటే ఇట్టివే ఈసప్ కథలున్నూ - వీటినికూడా పద్యాల్లో బంధించిన్నీ, కఠిన కృతకవచనాల్లో బంధించిన్నీ బాలురకు పనికి రాకుండా చేశారు ఇట్టి వే విక్రమార్క కథలు, బేతాళ కథలు, భోజ కథలు మొదలైనవి

వెనుకటి కాలంలో స్త్రీలనూ, బాలురనూ దృష్టిలోపెట్టుకొని, వారికి పనికివచ్చేటట్టు గ్రంధములు వ్రాసిన బుద్ధిమంతులు లేక పోలేదు వారిలో ఎన్నుకోదగ్గ పండితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి పంచతంత్రము, ద్వాత్రింశ త్సాలభంజికల కథలు ఈయన పిల్లలకోసమే వ్రాశాడు గద్యచింతామణి చూస్తే పలువురు పండితులు వెనుకటికాలంలో పిల్లల కుచితమైన గ్రంధాలు వ్రాశారని గ్రహించవచ్చును నే డట్టి సంప్రదాయం మారడంవల్ల పిల్లలకు తీరనినష్టం సంభవించింది. వెనుకటి పుస్తకాలు మళ్ళీ అచ్చుపడి బాలుర చేతులోని కెక్కవలసియున్నది

మరిన్నీ, పెద్దల పుస్తకాలుకూడా పిల్లలకు పనికివచ్చే విధంగా సంస్కరించి వ్రాయవలసియున్నది అట్టి పనికి ఎవరూ, యింకా పూనుకోలేదు భాష పిల్లలభాషగాను అనగా పిల్లల కర్థమయ్యే భాషగాను, విషయము పిల్లల అనుభవాలకు సరిపోయేటట్టుగాను ఉండాలి

ఇట్లా మార్చదగ్గ మన కావ్యాలన్నీ న్యాయానికి అద్భుత కథలే మానవ జీవితమును దేశకాలానుగుణంగా ఉన్న దున్నట్లు వర్ణించిన కావ్యాలు మనకు లేవు మనుచరిత్ర, కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం ఇత్యాది గ్రంధాల్లో గంధర్వులు వస్తారు పర్వతాలూ, నదులూ, పక్షులూ, జంతువులూ మనుష్యులవలె మాట్లాడతారు మనుష్యులవలె ప్రవర్తిస్తారు ఈ కథల్లో అనేక విధములైన గారడీలు జరుగుతవి మనుష్యులు జంతువులవుతారు దేవతలు మనుష్యు లవుతారు ఈ లక్షణాలన్నీ అద్భుత కథల లక్షణాలే ఇక మన పురాణ కథలుకూడా అంద్భుత కథలే అర్జునుడి భూప్రదక్షిణం, భీముడు రాక్షసులను చంపడం హనుమంతుడి సాహస కార్యాలు, రాముడి అమానుషక్రియలు మొదలైనవన్నీ పిల్లను సంతోషబెట్టే విషయాలే

ఇట్లే నేటికాలవు యాత్రలు, సాహస కార్యాలు కధలుగా వ్రాసి పిల్లల కందియ్యవచ్చు

సౌందర్యగ్రహణము పెద్దలకువలెనే పిల్లలూ చేస్తారు కావ్యానందాన్ని పెద్దలకువలెనే పిల్లలూ పొందుతారు అట్లాజరగడానికి విషయమూ, భాషా వారి అందుబాటులో ఉండాలి వారి చిత్తవృత్తుల కనుగుణంగా రచన జరగాలి గ్రంధస్థములు కాని నాటుకధలు మొదలైనవి ఆ విధంగానే ఉన్నాయి ఇక ముందు వ్రాసే గ్రంధలుకూడా అట్లే ఉండాలి

చిన్న పిల్లల మనస్సును ఆకర్షించే ప్రధానరసం అద్భుతరసం వీర, కరుణ, శాంత, హాస్యరసాలుకూడా పిల్లల నాకర్షిస్తాయి శృంగార, భయానక, బీభత్సాలు పిల్లలకు పనికిరావు

ఏడు సంవత్సరముల వయస్సు వచ్చేవరకూ పిల్లలు ఆట పాటలతో కాలక్షేపం చేస్తారు ఇట్టి ఆటపాటలద్వారానే వారికి ఇంద్రియశిక్షణ జరుగుతుంది ఇంద్రియములతో జ్ఞానార్జన చేసుకుంటారు తరువాత వీరికి విద్యాభ్యాసం ప్రారంభంకావలసి ఉంటుంది ధారణాశక్తిని వృద్ధిచేసుకోవడం, పరిశీలనాశక్తిని వృద్ధి చేసుకోవడంద్వారా విద్యాకార్యాలు జరుగుతవి

చిన్నపిల్లలకు తగిన గ్రంధాలు వ్రాయడం గ్రంధకర్తల మనుకునేవారి విధి చిన్నపిల్లకోసం గ్రంధాలు వ్రాయడంలో న్యూనత లేదని యీ క్రింది Tolstoy వాక్యాలు చదివితే బోధపడుతుంది

To compose a fairy tale or a lullaby or to make a sketch which will delight dozens of generations or millions of children or adults is incomparably more important and more fruitful than to compose a novel or a symphony or paint a picture of the sort which will divert some members of the wealthy classes for a short time and then be for ever forgotten

"ఒక నవల రచించుటవల్లను, వాద్యకృతిని కూర్చుటవల్లను, చిత్రమును గీయుటవల్లను ధనవర్గమునకు చెందిన కొద్దిమంది మాత్రము తాత్కాలికానందము జెంది, తరువాత వాటిని విస్మరించుదురు అంతకన్న గొప్పవిషయము ఒక అద్భుత కధనుగాని, జోలపాటనుగాని, ఒక స్కెచ్చినిగాని వ్రాసిన, వేలాది చిన్నలు, పెద్దలు తరతరాలు ఆనందింతురు ఇట్టి కార్యము ఫలవంతముకూడా"

చిన్న పిల్లలచేత వారికోసం ఉద్దేశింపబడ్డ గ్రంధాలు చదివించడం తల్లిదండ్రుల విధి

ఎవడైతే, చిన్నపిల్లల పాటలు విని హర్షించడో, ఎవడైతే లట్టి పాటలు వినడానికి ఏవగించుకుంటాడో, ఎవడైతే చిన్నపిల్లలను వారి పాటలు పాడుకోకుండా అరికట్టుతాడో వాడు పిల్లల అభిరుచు లెరుగడు

* * *

# తెలుగు బోధనాపద్ధతులు

## మాతృభాష

దేశభాషలు - మనము నివసించు దేశము ఇండియా మన దేశములో అనేక దేశభాషలున్నవి బెంగాలు రాష్ట్రమున వంగభాష వాడుదురు ఓఢ్రదేశవాసుల భాష ఓఢ్రభాష, బొంబాయి రాజధానిలో మహారాష్ట్రభాష దేశభాష. ఉత్తర హిందూస్థానమున హిందీ పలుచోట్ల భాషింతురు చెన్న రాజధానిలో తెలుగు, అరవము, కన్నడము, మళయాళమను దేశభాషలు వ్యవహారమందున్నవి

ఈ భాషలలో తెలుగు ఒకటి "దేశభాషలందు తెలుగు లెస్స" అని శ్రీకృష్ణదేవరాయలన్నారు

బెంగాలు రాష్ట్రము వారికి వంగభాష మాతృభాష అయినట్లే తదితర భాషలు కూడ ఆయా దేశవాసులకు మాతృభాషలై యున్నవి తెలుగు దేశమున నివసించు మనకు తెలుగు మాతృభాష.

**తెలుగుదేశము :- (ఆంధ్రప్రదేశ్)**

శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలును, 1956 నవంబరు మొదటి తేదీని ఆంధ్రప్రదేశావతరణ ఫలితముగా నైజాము రాష్ట్రమందున్న హైదరాబాదు, మహబూబ్‌నగర్, నల్లగొండ, ఖమ్మంమెట్టు, వరంగల్, మెదక్, నిజామాబాదు, కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాలును కలిపి ఆంధ్రప్రదేశ్ అనుపేర బరగుచున్నవి ఇట్టి నూతన రాష్ట్రములోని జిల్లాలు 20 వైశాల్యము 1,10,000 చ మైె జనాభా 3,22,00,000 ఆంధ్రప్రదేశ్‌నందేగాక అరవనాడులోను, చెన్నపురిలోను, బొంబాయి, మైసూరు ప్రాంతములందును కూడ తెలుగువారున్నారు తెలుగుదేశమున నున్నవారును, తెలుగువారును నిత్యము వాడుకొను భాష తెలుగుభాష. ఇదియే వారి మాతృభాష.

హిందూదేశములో తెలుగు మాతృభాషగా గలవారు సుమారు రెండున్నర కోట్లమంది ఉన్నారు

మాతృభాష - అనగా తల్లిభాష. మన పురోభివృద్ధికి తల్లివలెనే మాతృభాషకూడ తోడ్పడును పుట్టినది మొదలు తల్లిమాటలను బట్టియు, తన యింటిలోనున్నవారి మాటలను బట్టియు, శిశువులు మాటలాడుట నేర్చుకొనును ఇట్లు నేర్చుకొన్న భాషయే మాతృభాష.

**విద్యాభ్యాసము, మాతృభాష -**

మాతృభాష ద్వారానే విద్యనభ్యసించుట సహజము, ఉత్తమము, సులభము

1 ప్రాథమిక పాఠశాలలలో మాతృభాష మూలముగానే విద్యను బోధించవలెను ప్రాథమిక పాఠశాలల పాఠ్యప్రణాళికను బట్టి విద్యార్థులు నేర్చుకోవలసిన పాఠములు - 1 తెలుగు, 2 లెక్కలు, 3 చరిత్ర, 4. భూగోళము, 5 పౌరధర్మములు (సివిక్సు), 6 ప్రకృతి పరిశీలనము, 7

ఆరోగ్యవిషయములు, బాలబాలికలకు కుట్టుపని మొదలగునవి, 8 వ్యాయామము, 9 చేతిపనులు, 10 సంగీతము

పై పాఠములన్నియు తృప్తికరముగా నేర్చుకొనుటకు తోడ్పడునది మాతృభాషయే కాబట్టి ప్రాథమిక పాఠశాల ప్రణాళికలో మాతృభాష ప్రథమస్థాన మాక్రమించుచున్నది

2 ఇతరుల అభిప్రాయములను తాను గ్రహించుటకును, తన యభిప్రాయములను యితరులకు తెలియజెప్పుటకును భాష ఒక సాధనము ఈ కార్యము నోటితో పలుకు మాటలద్వారాను, వ్రాత ద్వారాను జరుగుచున్నది చదువను, వ్రాయను, నేర్చినవాడే తన యభిప్రాయముల నితరులకు చక్కగా తెలియజెప్పగలడు ఇతరుల యభిప్రాయములను తాను గ్రహింపగలడు. మాతృభాష బాగుగా నేర్చినవాడే, గ్రంధములు, వార్తాపత్రికలు, అర్జీలు మున్నగునవి చదువగలడు ఉత్తరములు మొదలైనవి వ్రాయగలడు కాబట్టి జీవితమున నిత్యవ్యవహారములను సక్రమముగా జరుపుటకు భాషాజ్ఞాన మవసరము

3 పూర్వ కవులు మాతృభాషలో ఉత్తమ గ్రంధములు వ్రాసియుంచిరి నన్నయాదులు భారతమును, పోతన భాగవతమును, కావ్యములను, వీరేశలింగము మొదలగువారు వచన గ్రంధములు వ్రాసిరి ఇట్టి గ్రంధసముదాయమునకు వాఙ్మయమందురు మాతృభాషలో ప్రజ్ఞ సంపాదించినవారు ఆంధ్రవాఙ్మయమును చదువగలుగుదురు ప్రాచీన కవుల ఉత్తమ గ్రంధములను పఠించుటవలన జ్ఞానాభివృద్ధియగును సత్ప్రవర్తన మలవడును అన్నిటికన్న ప్రధాన మానందము కలుగును

కారణములను బట్టి చూడగా విద్యాభ్యాసము సరిగా జరుగవలెనన్న మాతృభాష చక్కగా నభ్యసించవలెనని తేలుతున్నది

**సారాంశము** ·

1 విద్యాభ్యాసమున మాతృభాష ప్రథమస్థానము నాక్రమించుచున్నది

2 ప్రణాళికలో పాఠములు తృప్తికరముగా నేర్చుకొనుటకు మాతృభాషా జ్ఞానమవసరము

3 ఇతరుల యభిప్రాయములను గ్రహించుటకును, స్వాభిప్రాయములను ప్రకటించుటకును మాతృభాష సాధనము

4 మాతృభాషా పాండిత్యమున్న ప్రాచీన కవుల గ్రంధములను చదివి జ్ఞానాభివృద్ధి చేసికొనవచ్చును సత్ప్రవర్తన నేర్చుకొనవచ్చును ఆనందమును పొందవచ్చును

**కిండర్గార్టెను పద్ధతి -**

ఇది చిన్నపిల్లలకొరకేర్పడిన పద్ధతి ఆటల ద్వారా చదువు చెప్పుట దీని ముఖ్యోద్దేశము దేశభాష బోధించుటకే కాక సిలబసులోని యితర పాఠములు బోదించుటకును ఈ పద్ధతి పనికివచ్చును

ఈ పద్ధతి ప్రకారము బోధించువారు పిల్లలకు కధలు చెప్పుదురు తరువాత నా కధలను

నాటకమాడింతురు  పిల్లలకు పరిచయమున్న విషయముపై వారితో ప్రసంగములు జేయుదురు అభినయ గీతములు నేర్పుదురు  తెలుగు బోధ యీ విధముగా క్రీడావిధానము ననుసరించి జరుగును

మరియు ఆటలనాడింతురు  కిండరు గార్డెన్ పనులను గూడ పిల్లల చేత చేయింతురు బంకమట్టిపని, పుల్లలు పెట్టు పని, కాగితము మడచు పని, కాగితములు కత్తిరించుపని, చాపలల్లుపని, డ్రాయింగు మున్నగునవి కిండరు గార్డెన్ పనులు

### ఆటపద్ధతి వలన ప్రయోజనములు .-

1 ఈ పద్ధతి ప్రకారము బోధించుచుండిన యెడల ఉపాధ్యాయుడు ప్రతిదినము పిల్లలను ప్రోగుచేయవలసిన యవసరముండదు  పిల్లలే బడికి ఆత్రుతతో వత్తురు

2  పిల్లలు ఉత్సాహముతో చదువు నేర్చుకొందురు

3  పిల్లలు త్వరలో యెక్కువ విషయములు నేర్చుకోగలుగుదురు

4  ఈ పద్ధతి వలన కౌతుకమను సహజాతము, నిర్మాణమను సహజాతము, అహంకృతి యను సహజాతము, ఆర్జన అను సహజాతము, సాంఘిక సహజాతము వికాసమునందుటకు సావకాశము అధికముగా నున్నవి

### II ఉద్యమ పద్ధతి

ఉద్యమ పద్ధతిని యెత్తుగడ పద్ధతి యని కూడ అందురు

ఉపాధ్యాయుడు చెప్పు విషయములను బాలుడు విని నేర్చుకొనుట సామాన్యముగా జరుగుచున్నది  అట్లుగాక బాలుడు స్వయంకృషివలన తాను స్వయముగా పనులు చేసి నేర్చుకొన్నచో, వానికట్టి చదువు బాగుగా అబ్బును  ఉత్సాహముతో కూడ నేర్చుకొనును

ఒక సమస్యను బాలుని ముందు పెట్టి దానిని పరిష్కరించుమని చెప్పిన యెడల బాలుడు స్వయముగా ఆ సమస్యను పరిష్కరించ బూనుకొనును

గాలిపటమును కట్టుటను గూర్చి ఉపాధ్యాయుడు పారము చెప్పిన, పిల్లలా జ్ఞానముతో గాలిపటమును కట్టలేరు

గాలిపటమును కట్టుకొమ్మని అందుకై కావలసిన కాగితము, పుల్లలు, దారము, జిగురు, కత్తెర యిచ్చిన వారు స్వయముగా ఆ పనిచేయుటకు ప్రయత్నింతురు  అందు వచ్చు సమస్యలను పరిష్కరింప బూనుకొందురు

అందువచ్చు కొన్ని సమస్యలేమనగా  తీసుకోవలసిన కాగితము పొడుగు, వెడల్పులు యెంత యుండవలెను  పుల్లలు యెంతెంత పొడవుండవలెను  ఎన్ని పుల్లలుండవలెను  దారము నెంత తీసుకొనవలెను  ఎక్కడ కట్టవలెను మొదలైనవి  ఈ సమస్యలన్నింటిని పిల్లవాడు, తాను స్వయముగానో, యితరుల సహాయముతోనో పరిష్కరించుకొని, గాలిపటము తయారు చేసికొనును

ఇట్లు చేసి నేర్చుకొనుట, విని నేర్చుకొనుటకన్న శ్రేష్ఠమైనది  వడ్రంగుల వద్ద పనిచేయు బాలురు, వ్యవసాయదారుని వద్ద పనిచేయు పిల్లలు యీవిధముగానే పనులు చేసి ఆయా

విద్యలనభ్యసింతురు ఇట్లు నేర్చుకొన్న విద్య జీవితమున పనికివచ్చును

ఉద్యమ పద్ధతి యనగా "చేసి నేర్చుకొను" పద్ధతి

అనేక సమస్యలతో కూడిన ఒక పనిని సహజపరిస్థితులలో చేయుట ఉద్యమ మనబడును

పై నుదాహరణముగా నిచ్చిన "గాలిపటమును కట్టుట" ఒక ఉద్యమము అందు యెన్నో సమస్యలున్నవి ఈ సమస్యలను బాలుడు యెదుర్కొనును ఉపాధ్యాయుని సహాయముతోనో, పెద్దవారి సహాయముతోనో ఆ సమస్యలను పరిష్కరించును గాలిపటమును, కావలసిన వస్తువులతో తాను స్వయముగా కట్టును సహజ పరిస్థితులలో ఈ కార్యమును నిర్వహించును ఇట్లుగాక బోర్డుమీద ఉపాధ్యాయుడు గాలిపటము బొమ్మను గీచి, దానిని గురించి బోధించిన యెడల అది వారికి ఉత్సాహకరముగా నుండదు తాను స్వయముగా, స్వేచ్ఛతో ఆ పనిని చేయునప్పుడే వారి కుత్సాహముండును

ఉద్యమ పద్ధతి ప్రకారము తెలుగు, లెక్కలు మొదలగు పాఠములన్నియు బోధింపనగును ఒక ఉద్యమమును నిర్వహించుటకు పిల్లలు పూనుకొన్నప్పుడు ఆ ఉద్యమమునకు సంబంధించిన చదువు, వ్రాత పనులు, ఆ ఉద్యమమునకు సంబంధించిన లెక్కలు చేయుట, ప్రకృతి పరిశీలనము చేయుట మున్నగు పనులు పిల్లలే చేయవలసి యున్నది

ఉపాధ్యాయుని సలహాతో బాలురందరు నొక యుద్యమము నిర్వహింప బూనుకొందురు పిమ్మట వారాయుద్యమము నిర్వహించుటకు కావలసిన పరికరములను సంపాదింతురు ఆ యుద్యమమును గూర్చి జ్ఞానము సంపాదించుటకు అందుకు సంబంధించిన పుస్తకములను చదువుదురు ఆ యుద్యమము కొనసాగుచున్నపుడు, కొనసాగిన పిమ్మటను, తాము చర్చ చేసికొందురు ఆ యుద్యమమునకు సంబంధించిన లెక్కలను తామే చేసికొందురు అందుకగు జమాఖర్చును తామే వ్రాయుదురు ఉద్యమము కొనసాగుచున్నప్పుడును, కొనసాగిన పిమ్మటను, తాము చేయుచున్న, చేసిన కార్యములను వ్రాసి యుంచుకొందురు ఈ విధముగా వారు ఉద్యమము ద్వారా చదువుట, వ్రాయుట, లెక్కలు చేయుట, వ్యాసరచన మున్నగు పాఠములను ఆసక్తితో నేర్చుకోగలుగుచున్నారు

ప్రాథమిక పాఠశాలలో నిర్వహింపదగు ఉద్యమములు

1 బడితోట వేసి పెంచుట, 2 బడిలో దుకాణమును పెట్టి నడుపుట, 3 బడికి ఆటస్థలమును యేర్పాటు చేయుట, 4 గ్రామపటమును తయారుచేయుట, 5 బడిలో తపాలాఫీసు నడిపించుట మొదలైనవి

## III నాటక పద్ధతి

నాటక పద్ధతి ఆట పద్ధతిలో నొక భాగము పిల్లలు నాటకము నొక యాటగా భావింతురు నాటకమాడుట వారి కుత్సాహకరముగా నుండును

అంతేగాక బాలురనుకరణ ప్రియులు. పెద్దలు చేసిన పనులను వారు అనుకరించుచుందురు. అనుకరణము మంచి మార్గములయందు నడచిన పిల్లల ప్రవర్తన బాగుపడును పిల్లలయందు

గోచరమగు అనుకరణమును సహజప్రవృత్తిని సన్మార్గములయందు ప్రవేశపెట్టుటకు నాటకములు సహాయభూతముగా నుండును

రెండవ తరగతి నుండియు పిల్లలచేత చిన్న చిన్న నాటకములాడించుచు రావచ్చును.

నాటకమునకు పనికివచ్చు కధావస్తువు పిల్లల వాచకములనుండియే గ్రహించవచ్చును

పిల్లలు నేర్చిన కట్టుకధలుగాని, ఈసపు కధలుగాని, పంచతంత్రమలోని నీతికధలనుగాని, పురాణకధలను గాని, నాటకమాడించవచ్చును. ఆయా కధలను సంభాషణ రూపముగా వ్రాయవలసిన బాధ్యత ఉపాధ్యాయునిదే పిల్లల కర్ధమగు భాషలో దీర్ఘసంభాషణములు లేకుండ ఉపాధ్యాయుడు సంభాషణలను వ్రాయవలెను లేదా పిల్లల కొరకు ప్రత్యేకముగా వ్రాయబడిన చిన్న నాటకములున్న, అట్టి నాటకములను పిల్లల చేత ఆడించవచ్చును.

ఇంతేగాక ఉపాధ్యాయుడు విద్యార్థులకు కధలు చెప్పుచుండును ప్రతి కధ చెప్పి, తరువాత పిల్లలచే చెప్పించును పిమ్మట కధలు నాటకముగా నాడించుట యుత్తమము పిల్లలను పాత్రలుగా నుపాధ్యాయుడు యేర్పరచును పిల్లలు తమ సొంతభాషలోనే సంభాషణలు సాగించునట్లు చేయుట మంచిది ఇట్లు చేసిన, పిల్లల వాక్య రచనాశక్తి వృద్ధియగును

పిల్లలాడు నాటకములలో చిన్న పాటలుగాని, అభినయ గీతములుగాని ఉండునట్లు చూడవలెను

నాటకము లాడునప్పుడు దుస్తుల విషయమై యెక్కువ పట్టింపు పెట్టుకొనవలసిన యవసరము లేదు సాధారణముగా చిన్న నాటకములను సంభాషణలును, ప్రత్యేకమగు దుస్తులు లేకుండగనే వేయించవచ్చును

నాటకములాడించుట వల్ల అనేక లాభములు పిల్లలకు చేకూరుచున్నవి పిల్లల కుత్సాహ మినుమడించును పాఠశాలపై వారికి ప్రీతి జనించును కాన సక్రమముగా బడికి వత్తురు అభిప్రాయ ప్రకటనము చేసికొనుటకు పిల్లలకు నాటకములుత్తమ సాధనములగుచున్నవి బాలుర ఉచ్చారణ బాగుపడును భాష యభివృద్ధి జెందును పాఠ విషయములు వారికి బాగుగా జ్ఞాపకముండును

తెలుగు భాషాబోధ లాభకరముగా జరిపించుటకు నాటకములు సహాయకారులుగా నుండును కాన నుపాధ్యాయుడవకాశము చిక్కినపుడెల్ల పిల్లలచేత నాటకముల నాడించుచుండవలెను

## IV వ్యక్తి పద్ధతి

"డాల్టన్ పద్ధతి"యని చెప్పబడునది వ్యక్తిపద్ధతి

ప్రతి పిల్లవాడును స్వయంకృషి వలన జ్ఞానము పొందుటకై యీ పద్ధతి బడులలో నవలంబింతురు

ఒక తరగతిలో నుండు పిల్లలనేక తరహాలుగా నుందురు కొందరు సూక్ష్మబుద్ధులు,

కొందరు మందబుద్ధులు, తెలివితేటలలో అందరు నొకే మాదిరిగా నుండరు  కాన తరగతి కంతకును ఉపాధ్యాయుడు చెప్పిన పాఠముల వల్ల బాలురందరును సమాన లాభమును పొందగలుగుదురు  కొందరు బాలురు స్వల్పకాలములో కొన్ని విషయములు గ్రహింతురు కొందరి కావిషయములే గ్రహించుటకు మరికొంతకాలము పట్టవచ్చును  పర్యవసానమున అందరు బాలురును అన్ని విషయములును తెలిసికొనుటకు వీలున్నది

డాల్టను పద్ధతి ప్రాధమిక పాఠశాలలో ప్రవేశపెట్టుటకు సాధ్యము కాదు  కాని యిప్పుడు సిలబసు ప్రకారము చెప్పుచున్న పాఠములతో పాటు అప్పుడప్పు డవకాశము చిక్కినపుడు వ్యక్తి పద్ధతి ప్రవేశపెట్టు చుండిన బాలురకు లాభకరముగా నుండును

ప్రతిపిల్లవానికి స్వయముగా పనిచేసుకొనుటకు ఉపాధ్యాయుడు కొన్ని సాధనముల నేర్పాటు చేయవలెను  వ్యక్తి పద్ధతిని నడిపించుటకు ఉత్తమసాధనము పిల్లలు స్వయముగా చేయవలసనినపని ముందుగా నిర్ణయించి కాగితముల మీద వ్రాసి యిచ్చుట  ఇట్లు వ్రాసి యిచ్చిన కాగితమునకు ఎసైన్‌మెంటు అందురు  ఎసైన్‌మెంట్‌లో బాలుడేపని చేయవలెనో, అందు కొరకై యేయే పుస్తకములు చదువవలెనో తెలియజేయుదురు  ఉపాధ్యాయుని సహాయముతోను, పుస్తకముల సహాయముతోను ఎసైన్‌మెంటులో నిర్ణయింపబడిన పనిని బాలుడు పూర్తిచేసి, వ్రాసి, ఉపాధ్యాయునకిచ్చును  ఇంతకాలములో ఈ పని ముగియవలెనను నియమమున్నను, బాలుడు తనకు కావలసినంత కాలమును ఎసైన్‌మెంటు పూర్తిచేయుటకు వినియోగించుకొనును  బాలుడు వ్రాసి యిచ్చిన కాగితమును బట్టి యతడు విషయ గ్రహణము సరిగా చేసినది, లేనిది ఉపాధ్యాయుడు తెలిసికొనును

ఎసైన్‌మెంటు పిల్లల శక్తిసామర్థ్యముల ననుసరించి యుండును  అది ప్రశ్నల రూపముగా నుండును. అందులోనే సలహాలు కూడ యుండును  ఈ ప్రశ్నలు పిల్లలు చదువు పాఠములకు సంబంధించి తెలుగు, లెక్కలు, ప్రకృతి పరిశీలనము మొదలగు పాఠములపై వేర్వేరు ఎసైన్‌మెంటు లుండవచ్చును  ప్రశ్నలకు జవాబులు బడిలోను, యింటిలోను కూడ బాలురు తయారుచేసికొనవచ్చును  ప్రతి ఎసైన్‌మెంటుకును ఉపాధ్యాయుడు కాలపరిమితిని యేర్పాటు చేయవచ్చును  కాని ఆ కాలములో బాలుడు ఎసైన్‌మెంటు పూర్తిచేయలేకున్న మరికొంత కాలము నుపాధ్యాయుడు వానికిచ్చును  బడిలో నున్నప్పుడు బాలుని సందేహముల నుపాధ్యాయుడు తీర్చుచుండును  బాలురు తమకు కావలసిన గ్రంథములు పాఠశాల భాండాగారమునుండి తీసికొని చదువవచ్చును

ఎసైన్‌మెంటు పూర్తియైన పిమ్మట ఉపాధ్యాయుడు దిద్ది మార్కులు వేయును  పిల్లవాడు గ్రహించినది లేనిది తెలిసికొనుటకు ఉపాధ్యాయుడు కొన్ని ప్రశ్నలు వేయును  పిల్లవాడు చేసినపని తృప్తిగా నున్నట్లు తోచిన రెండవ ఎసైన్‌మెంటు వానికిచ్చును

# అనుబంధం

# ప్రస్తావన

ఈనాడు ఇంకా దీక్షితులుగారి పుస్తకానికి ఓ ప్రస్తావన కావాలనుకోడం చిత్రంగా వుంది ఇప్పటి తెలుగు సారస్వతశాఖల కెన్నిటికో ఆయనే ఉపోద్ఘాతం

దీక్షితులుగారి పుస్తకానికి చలం ఉపోద్ఘాతామా? సారస్వత పితృదేవతలకి ఆ లోకాలలోనైనా శాంతినివ్వరా?

ఈ పుస్తకంలోని వ్యాసాల్ని నేనిదివరకు చదవలేదు, వినడమే గాని ఆయన ఈ విషయమై చేసిన కృషి నాకు స్వయంగా తెలీదు ఆయన మెచ్చుకునే ఈ పాత వాంగ్మయంగాని (అసలు వాఙ్మయం అనే spelling నేను వొప్పుకోను) ఆయన తీసివేసే ప్రబంధ వాంగ్మయం గాని నా మనసుకెప్పుడూ దగ్గిరిగా రాలేదు అసలు "పాత, పూర్వం" అనేప్పటికే నా మనసులో విరోధం ఏర్పడుతుంది Anyhow they have to prove their merits to wine my favour

ప్రబంధాల్లోనూ, పాతపాటల్లోనూ, గొప్ప flashes of beauty వున్నాయి, కొందరు ముసిలమ్మల చిరునవ్వులో మల్లే, రెండూ సెంటిమెంట్ల పుట్టలు ప్రబంధాల్లో సెంటిమెంట్లు అసహజం, అబద్ధం, అప్పుడప్పుడు అసహ్యం ఈ పాటల్లో అందాలన్నీ సెంటిమెంట్లతో అల్లుకుని హృదయాన్ని సమీపిస్తాయి అట్లాంటివి దీక్షితులుగారిని అప్రయత్నంగా ఆకర్షిస్తాయి వాటిల్లో అందం వున్న చోట కూడా ఆ అందాన్ని కనిపించుకోను నేను నన్ను పీఠిక వ్రాయమని ఆజ్ఞ

నా బాలమిత్రుడొకరు యిటీవలే దీక్షితులుగారిని చూడ్డానికి వెళ్ళి నాకు రాశాడు "ఆయనచుట్టూ ఒక ఆధ్యాత్మిక వాతావరణం ఆవరించివుంది మీరున్న అరుణాచలం వంటిది అనుకున్నాను ఆయనని చూస్తే ఎన్నడన్నా జీవితంలో ఈయన కోపమనేది ఎరుగునా?" అనిపించింది

అవును, ఆయన కోపమనేది ఎరగరు లోకాన్ని కోపపడవలసిన అవసరం ఆయనకి రాలేదు ఎంతవరకైనా ఆయన కోపాన్ని చూడగలిగింది యీ సహజమైన భాషని పైకి రానీక అణగతొక్కే పండితుల మొండితనం ఆయన దిగులంతా దిక్కులేక నశించే అందమైన యీ పాత వాంగ్మయంపైన

ఆయన ఎప్పుడూ ఈశ్వరభక్తులు
ఆయనకి ఎప్పుడూ-
God is in His Heaven
All is right with the world

సర్వజ్ఞుడైన ఈశ్వర స్వరూపం ఈ ప్రపంచం దాన్నీ, దాని పద్ధతినీ ప్రశ్నించవలసిన అవసరంగాని, అర్థంగాని, ఆయనకి కనపబడలేదు నేనా? నన్ను ఈశ్వరుడు ఒక question mark చేసి సృజించాడు ఆ question mark తన సృష్టికర్తకే ఎదురునిలిచి "ఏమిటి ఇదంతా? ఏమన్నా బుద్ధీకరుణావున్న వ్యవహారమేనా?" అని ప్రశ్నించింది

'ముళ్ళల్లోంచి గులాబిపువ్వు వొచ్చింది, చూడు ఈశ్వర మహిమ!' అని దీక్షితులుగారు.

"ఇంత అందమైన పరిమళమైన పువ్వుచుట్టూ ఈ ముళ్ళేమిటి? ఆ సృష్టికర్త కేమన్నా బుద్ధివుందా?" అని నేను

ఇట్లా ఆలోచించడంతో ఆయన దృష్టి పువ్వుమీద నిలిచి మృదుత్వాన్ని పొందింది సరే, నేను ఎంతమందికి ఎంత లోతుగా గుచ్చుకొన్నానో వ్రాయనక్కర్లేదు

ఈ పాతపాటలు విషయమై కూడా మా కదే భేదదృష్టి

"చూడండి! ఈ అందాలు ఎంత లాలిత్యమో, ఎంత హృదయం పెట్టారో వీటిల్లో, ఎంత సహజంగా, సులువైన మాటల్లో చెప్పారో?" అని ఆయన కొట్టుకొంటున్నారు ఈ పుస్తకమంతా

"నిజమే, నేనూ చూస్తాను ఆ కవిత్వం, ఆ అందం, కాని ఆ పాటలుపాడే ముసిలమ్మలూ, తల్లులూ వాళ్ళ ప్రేమలో ఆ చీకటీ-"

జోలపాటలో తల్లిప్రేమకన్న ఆ ప్రేమను పిలిచిన పిల్ల ఏడుపు వినపడుతుంది ఎక్కువగా నాకు

"ఎందుకేడవాలి ఆ పిల్ల?" అని మండిపడతాను నేను

నా చిన్నప్పుడు అర్ధరాత్రులు పసిపిల్లలు నా తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ ఏడుస్తోవుంటే, నిద్రకళ్ళతో మా అమ్మ లేచివొచ్చి ఈ జోలపాటలు పాడుతోవుంటే ఆ పిల్ల ఏడుపు,

"ఇంకా పడుకొవేంరా?"

అనే తల్లి అరుపు

రాత్రి తరువాత రాత్రి విని, ప్రతిరాత్రీ "ఎన్నడూ పిల్లల్ని కనకూడదు" అని శపధాలు చేసుకున్నాను నాకీ పాటలతో సానుభూతి ఎట్లా వొస్తుంది ఈనాడు

ఏడ్చే పిల్లమీద, కన్నతల్లి మీద, తల్లినంత బుద్ధి తక్కువదాన్నిగా చేసిన సంఘంపైన, దీనికంతా కారణమైన ఈశ్వరుడిమీద ఎంతో కోపం!

'ఆ ఏడుపే లేకపోతే తల్లిప్రేమని పాప ఎట్లా పిలుచుకుంటుంది? ఇంత అందాలపాటలు ఎట్లా సృష్టి అవుతాయి?' అని చల్లగా అంటారు దీక్షితులుగారు

అందం వుంటే వుంది యీ పాత బూజు పురాణపు తుక్కునంతా పడేసి నరకమనే నా వీరాలాపాల్నీ, యీ పాటల్లోని చిన్న చిన్న హాజాకుల్నీ రెంటినీ తన ఆలింగనంలోకి తీసుకోగలిగారంటే, ఆయన హృదయ వైశాల్యం తెలుసుకోవొచ్చు

"నేను literary cosmopolitan ని" అన్నారు దీక్షితులుగారు ఆ నా రచనల్నే కాదు, cosmopolitanism నా ఆచారాలన్నీ, నన్నుకూడా ఆదరించగలిగినంత వైశాల్యమై పెరిగింది

నేను రాసిన మొదటి కథనించి నన్ను ఆయన Merit వున్న రచయితగా గుర్తించగలగారంటే, ఆయన కంటిని ఏ ముళ్ళల్లోని అందమూ తప్పించుకొలేదని తెలీదా? అట్లాంటప్పుడు యీ పాటలకు స్పందించకుండా వుంటుందా ఆ మార్దవ హృదయం

ఈ కృతకభాషావాదులు పూర్వాచారపరులకన్న అంధులు వాళ్ళకి ఏది చూసినా శత్రుత్వమే పూర్వాచారాల్లో నిలిచిపోవలసినవి చాలావున్నాయి కాని ఈ కృతకభాషలో ఉండిపోవలసింది ఏదీలేదు వీరికి తమకన్న పాతవీ పనికిరావు తమకన్న కొత్తవీ పనికిరావు దురదృష్టవశాత్తూ ఈ కృతకవాదులే అధికారంలో వుంటోవుంటారు

కాలం మార్పుని తనంతట అదే తీసుకొస్తుంది అంటారే అదెంతవరకు నిజమో కాని, మూర్ఖత్వంలోనూ Vested interests లోనూ మార్పురాదు

"ఇప్పటికీ బ్రహ్మ -
మూర్ఖ చిత్త విస్ఫురణ మడంపలేక
తలపోయుచున్న వాడొగిన్"

Fashions మార్తాయి కాని, మూర్ఖత్వమూ, కదలనితనమూ నేర్చుకో నిరాకరించే మంకుతనం, అంధత్వం, స్వార్థం, అట్లానే నిలిచివుంటాయి.

ఈ పాటల్ని విన తటస్థించినప్పుడల్లా వాటిల్లోని రసాన్ని గుర్తించి, అసలు తెలుగుభాషా, భాషామార్దవమూ, కవిత్వలక్షణమూ వీటిల్లోనే వుందని గ్రహించి వాటి పునరుద్ధరణకోసం దీక్షితులుగారు తహతహపడ్డారు ఏ కఠిన పదజాలాన్నీ కావ్యాలంకారాల్నీ, అసహజ పాండితినీ, ఎరువు తెచ్చుకోక, హృదయంలోంచి వొచ్చే ప్రేమకీ, అందానికీ, రంగులుపూయక స్వచ్ఛంగా, సూటిగా పాడిన ఈ పాటలకన్న కవిత్వం ఎక్కడవుంటుంది? ఎప్పుడూ నా నిశ్చితాభిప్రాయం ఏమిటంటే, సులభమైన భాషలో చెప్పడానికి శక్తిలేనివాడే కష్టమైనభాషని ఉపయోగిస్తాడని వచనంలో చెప్పలేనివాడు పద్యంరాస్తాడు సహజంగా అందంవున్న స్త్రీకి, విలవైన బట్టలూ, నగలూ అనవసరం మనుషులు ఏవిధంగా తమ శరీరపు అందవికారాల్ని అందమైన బట్టలకింద దాచుకొంటారో, తమ మానసికపు వంకర్లని రంజకమైన మాటలవెనక మరుగుపరుచుకుంటారో, అట్లానే చాలాసార్లు తమ భావశూన్యత్వాన్ని పద్యాలంకారాల వెనక మాయపుచ్చాలని చూస్తాడుకవి ఇది అమితంగావుంది తెలుగు సారస్వతంలో అక్కడక్కడ భాగవతాన్నీ చాలావరకు భారతాన్ని, పూర్తిగా పాత ఎంకిపాటల్ని తప్పిస్తే, తక్కిన తెలుగు కవిత్వం ఈ విమర్శకిందికి వొస్తుంది.

ఈ పాటల్ని పాట లవనమేగాని, వీటికి కవిత్వరసమే గాని దోషమేమాత్రమూ పట్టలేదు ఎన్ని ఏళ్ళనించో యివి తల్లి ప్రేమలో, భార్య పాతివ్రత్యంలో, చిన్న పడుచుల కలల్లో, పసిపిల్లల చిరునవ్వుల్లో, నాని, నాని, మెరుగు తీసుకుని ఎన్నివేల హృదయాల తపనల్లో పోగుచేసుకుని చిత్రికపడి యీ రూపాన్ని పొందాయి

ఏడవకు అబ్బాయి ఏడవకు తండ్రీ

అంటే, ఆ మాటల్లో ఏమీలేదు కాని, మన చెవులకిమాత్రం - ఆ ఏడుపును భరించలేని తల్లి ఆవేదన, ఆమె ప్రేమ నిస్సహాయత్వం, "నే నున్నాను భయం లేదమ్మా, నువ్వు దిక్కులేని వొంటరిలోకంలోకి

రాలేదు చీకటిని చూసి భయపడకు నే నున్నాను కదూ" అనే తల్లి యిచ్చే ధైర్యం, అన్నీ వినపడతాయి "అమ్మా" అనే తన అర్ధరాత్రి పిలుపుకి ప్రతిసారీ యింత అందమైన పాటలస్వరంలో బదులు పలికే తల్లి కంఠస్వరం బిడ్డ స్వభావంలో ఎంతలోతుకి యింకి అతని జీవితంలో ఎన్ని పువ్వులుగా వికసిస్తుందో ఎవరెరుగుదురు? తల్లి, బిడ్డలమధ్య అల్లుకునే ప్రేమకి శబ్దంలో, గానంలో రూపం తీసుకున్న యీ పాటల్నీ, ప్రతి యింటోంచీ, ప్రతి రాత్రీ విని, విని నక్షత్రాలే ఎన్నడూ విశ్రమించని తమ నిరీక్షణా గుణాన్ని యీ పాటల కాపాదించాయి ఏదోషమూ ఆవరించని చిన్న పిల్లల హృదయ మార్దవం, ఏ లౌకికానుభవపు చిక్కుల్లోనూ మొద్దుబారని సూన్నత స్త్రీ స్వభావంలోని నిర్మలత్వమూ, లోకాతీతమైన పురాణపురుషుల చరిత్రానుభవాన్ని తమదోసెట్లోకి, యిళ్ళల్లోకి తెచ్చుకుని యిముడ్చుకోవాలనే ముగ్ధల ప్రయత్నమూ యీ పాటల్లో ప్రతిబింబిస్తాయి పెళ్ళికి, నలుగుకి, భోజనాలకి, వేళాకోళాలకి, ఏ సమయానికి మనసులోంచి ఏ భావం వొస్తే ఆ భావం పాటలకింద మారింది యీ స్త్రీల నవ్వుల్లో, కన్నీళ్ళలో కలిసి

ఈ నాడిట్లా అయింది గాని, ఇంటోకి పాప రావడమంటె ఇంకో లోకంనించి తమని ఆశ్వాసి పెట్టడానికి, ఉద్ధరించడానికి దిగివొచ్చిన సౌదర్యరేఖగా చూసుకునేవారు ఈ పాటలు వింటోవుంటే, తల్లి సంతోషం, ఎట్లా ఎక్కణ్ణించి ఈ ప్రేమమూర్తి తన పాప వొంటిరంగు, చిరునవ్వు, చూపు అన్నీ ఇంటికి వెలుగు అతను దీపం అతన్ని చూసి సంతోషపడనివారు అసంభవం ఆమె కంటికి తాను గొల్చే దైవమే తన కోసం రూపంపొంది తన చేతుల్లో వాలాడు ఈనాటి నాగరికతా స్త్రీలలోనైనా కాన్పు అనేది సంతోష మివ్వకండా పోలేదు పిల్లల భారమనుకో వొచ్చు ఇంకో పిల్లను ఎట్లా పోషింవచడమనే దిగులుపడవొచ్చు కాని పాలివ్వక పోవాలనుకున్నా, పాలుపడడం ఎట్లా తప్పదో, అట్లా పిల్ల కలగడం ఇష్టంలేక పోయినా ఆ మాతృభావం కలగకమానదు ఆ ప్రేమా, సంతోషమూ మనసుని ఆవరించకమానవు పిల్లని జాగ్రత్తగా చూసే వోపిక లేకపోయినా, ఆబిడ్డప్రేమని ఆనందించే తీరుబడివా లేక పోయినా, ఎప్పుడో ఏ నిముషాన్నో బిడ్డనించి ఏఏడుపో, ఏ చిరు~నవ్వో తల్లి హృదయాన్ని తబ్బిబ్బుచెయ్యకమానదు పొరుగమ్మతో కబుర్లో, క్లబ్బులో చీట్లపేకో, సినీమా చూడడమో పిల్లకన్నా ఎక్కువ అయినా, ఆ పిల్ల పిలుపు మనుసువెనుక ఎక్కడో, పీకుతో వుండక మానదు పిల్లనికని ఆ బిడ్డని అనాధని చేసి ఏడిపించే తల్లులకి ప్రత్యేకంగా నరకంలో ఒక పేట reserve అయి వుండాలని నా ఆశ

తన వాళ్ళేవ రెటుబోయినా, తాను దరిద్రురాలైనా, తనని గౌరవించేవాళ్ళు పలకరించేవారెవరూ లేని ఏకాకిఐనా, అందరికీ తాను లోకువైనా తనపిల్ల తన స్వంతం, తన వేపే చేతులు జాస్తుంది. తననితప్ప ఎవరినీ "అమ్మా" అని పిలవదు తనే దిక్కు. తన లోపాలు పిల్లకి కనపడవు, తనని అసహ్యించుకోదు. తను పిల్లకి అందం, దైవం అదీ తల్లితృప్తి తల్లి హృదయంలోని [illegible]వ్వారా ఈ పాటల్నంతా ఆవరించింది

ప్రియుల ప్రేమా, తల్లి పిల్లల ప్రేమా ఈ సృష్టి ప్రోద్బలానికి చాలా సన్నిహితాలు. ఎంత సృష్టించినా ఈశ్వర హృదయానికి ఎట్లా తృప్తిలేదో, అట్లానే ఈ ప్రేమల్లో ఎంతకీ తనివితీరడమనేది లేదు, ప్రియులకీ, తల్లులకీ అందువల్లనే నక్షత్రాలమల్లేనే "ఎప్పటికి?" అనే ప్రశ్నతో అనాదిగా ప్రియులూ, తల్లులూ వెతుకుతున్నారు ఈ విశ్వపు అంచుల్ని ఆ నిరంతరాన్వేషణావేదనే కవిత్వమై ఇట్లా హృదయాన్నించి హృదయానికి, కంఠాన్నించి కంఠానికి పలుకుతోంది

పిల్లలకి పాటలు రాయడమంటే సామాన్యమైన పనికాదు మహాకవి కావడం చాలా సులభమైనపని దానికన్నా ఈ లోకాన్ని కొత్తగా తాను చుట్టూ చూసి, అర్థమయ్యీ అర్థంకాకా, తనతో దోబూచులడే ఈ మాయాచ్ఛాయల్లోని ఇంద్రజాలానికి అద్భుతపడి దాన్నంతా తనలోకి తీసుకోవాలని చూసే పిసిబిడ్డ ఆతృతని తిరిగి ఏ కవి జీవించగలడు ? ఏవొక్క దీక్షితులూ, ఏవొక్క టాగూరో తప్ప!

రంగులూ, గానాలూ విని పిల్ల, పూర్వజన్మస్మృతులవల్ల ఎక్కడో చూశానే అనే దూరపు జ్ఞాపకాలతో యీ అందాన్ని సమన్వయించుకోవడం, అనుమానం, భయం, అసహ్యం, ద్వేషంలేని హృదయంతో ప్రతిసృష్టి స్పందనానికీ ఎదురు పలకడం, ఏ మొద్దు పదజాలం వ్యక్తపరుస్తుంది ? చివకి టాగూరు కవిత్వమైనా సరే?

తల్లి ముఖం పిల్లకి మొదటి ఆటబొమ్మ తల్లి వొడి వుయ్యాల, తల్లి కావిలింత మొదటి Welcome, తల్లి చిరునవ్వు ఆత్మకి మొదటి వెలుగు తల్లి మొదటి పిలుపులోంచే అందుకుంటుంది పిల్ల, నిద్రలోంచి తనలోకి మేలుకోమనే సృష్టి ఆహ్వానాన్ని. ఈనాటికి, ప్రియులసనాతనావేదనకి నండూరి సుబ్బారావుగారు, పిల్లల నవ్వులకి దీక్షితులుగారూ, బి వి నరసింహారావుగారూ, తల్లుల హృదయస్పందనాన్ని పలికేందుకు దీక్షితులుగా రొక్కరూ జన్మించారు తెలుగు దేశానికి

ఈ పాతపాటలు తాళపత్రాలలో లేవు వీటికోసమై ఒక ఆఫీసు తెరిచి, పెద్దజీతాల్నిచ్చి, పండితుల్ని నియమించి ఏడాదికి నాలుగు పేజీలు ఓ పత్రికలో ముద్రించే ఏర్పాటు ఎవరూ చెయ్యలేదు ఈ పాత భాండాగారమంతా స్త్రీ హృదయంలోనే నిలిచిపోయింది ఆ హృదయం నశ్వరమైన శరీరంలో యిరికివుంది అందువల్ల దీక్షితులుగారి తొందర ఈ పాటలు జనాంగీకారాన్ని పొందడానికి కాలమూ, పండితులూ అభ్యంతరాలు

కాలం మారిపోతుంది చలం ధర్మమా అని, ఈనాడు ఉయ్యాలలూపి పిల్లలకి జోలపాటలుపాడే తల్లులు లేరు విద్యావిధానం ధర్మమాఅని ఈ పాత పాటల్ని బళ్ళలో చేరనీరు వీరేశలింగంగారి ధర్మమా అని వితంతువులు తెల్లారకట్ట పాటలు పాడడమే మానివేసి సినిమాల్లో చేరుతూన్నారు ఈ నవీన నాగరికతలో వేదంమల్లేనే ఈ పాటలూ నశిస్తాయని దీక్షితులుగారి భయం పండితులు వీటిని చేరనీరు పామరులూ వీటిని నిరసిస్తారు ఇవి Fashion కాదనీ, పాతకాలపు నాటివనీ, వీటికి గౌరవంలేదనీ, తెల్లారకట్టే ముగ్గులు పెట్టి మజ్జిగ చేసే కాలానికి సరిపోయినాయికాని, కాఫీ కప్పులముందుకు రమ్మంటే ఈ పాటలే వొప్పుకోవు రావడానికి

రాలేదు చీకటిని చూసి భయపడకు నే నున్నాను కదూ" అనే తల్లి యిచ్చే ధైర్యం, అన్నీ వినపడతాయి "అమ్మా" అనే తన అర్ధరాత్రి పిలుపుకి ప్రతిసారీ యింత అందమైన పాటలస్వరంలో బదులు పలికే తల్లి కంఠస్వరం బిడ్డ స్వభావంలో ఎంతలోతుకి యింకి అతని జీవితంలో ఎన్ని పువ్వులుగా వికసిస్తుందో ఎవరెరుగుదురు? తల్లి, బిడ్డలమధ్య అల్లుకునే ప్రేమకి శబ్దంలో, గానంలో రూపం తీసుకున్న యీ పాటల్నీ, ప్రతి యింటోంచీ, ప్రతి రాత్రీ విని, విని నక్షత్రాలే ఎన్నడూ విశ్రమించని తమ నిరీక్షణా గుణాన్ని యీ పాటల కాపాదించాయి ఏదోషమూ ఆవరించని చిన్న పిల్లల హృదయ మార్దవం, ఏ లౌకికానుభవపు చిక్కుల్లోనూ మొద్దుబారని సూనృత స్త్రీ స్వభావంలోని నిర్మలత్వమూ, లోకాతీతమైన పురాణపురుషుల చరిత్రానుభవాన్ని తమదోసెట్లోకి, యిళ్ళల్లోకి తెచ్చుకుని యిముడ్చుకోవాలనే ముగ్ధల ప్రయత్నమూ యీ పాటల్లో ప్రతిబింబిస్తాయి పెళ్ళికి, నలుగుకి, భోజనాలకి, వేళాకోళాలకి, ఏ సమయానికి మనసులోంచి ఏ భావం వొస్తే ఆ భావం పాటలకింద మారింది యీ స్త్రీల నవ్వుల్లో, కన్నీళ్ళలో కలిసి

ఈ నాడిట్లా అయింది గాని, ఇంటోకి పాప రావడమంటె ఇంకో లోకంనించి తమని ఆశ్లిష పెట్టడానికి, ఉద్ధరించడానికి దిగివొచ్చిన సౌదర్యరేఖగా చూసుకునేవారు ఈ పాటలు వింటోవుంటే, తల్లి సంతోషం, ఎట్లా ఎక్కణ్ణించి ఈ ప్రేమమూర్తి తన పాప వొంటిరంగు, చిరునవ్వు, చూపు అన్నీ ఇంటికి వెలుగు అతను దీపం అతన్ని చూసి సంతోషపడనివారు అసంభవం ఆమె కంటికి తాను గొల్చే దైవమే తన కోసం రూపంపొంది తన చేతుల్లో వాలాడు ఈనాటి నాగరికతా స్త్రీలలోనైనా కాన్పు అనేది సంతోష మివ్వకండా పోలేదు పిల్లల భారమనుకో వొచ్చు ఇంకో పిల్లను ఎట్లా పోషించవచడమనే దిగులుపడవొచ్చు కాని పాలివ్వక పోవాలనుకున్నా, పాలుపడడం ఎట్లా తప్పదో, అట్లా పిల్ల కలగడం ఇష్టంలేక పోయినా ఆ మాతృభావం కలగకమానదు ఆ ప్రేమా, సంతోషమూ మనసుని ఆవరించకమానవు పిల్లని జాగ్రత్తగా చూసే వోపిక లేకపోయినా, ఆబిడ్డప్రేమని ఆనందించే తీరుబడివొ లేక పోయినా, ఎప్పుడో ఏ నిముషాన్నో బిడ్డనించి ఏఏడుపో, ఏ చిరునవ్వో తల్లి హృదయాన్ని తబ్బిబ్బుచెయ్యకమానదు పొరుగమ్మతో కబుర్లో, క్లబ్బులో చీట్లపేకో, సినీమా చూడడమో పిల్లకన్నా ఎక్కువ అయినా, ఆ పిల్ల పిలుపు మనుసువెనుక ఎక్కడో, పీకుతో వుండక మానదు పిల్లనికని ఆ బిడ్డని అనాధని చేసి ఏడిపించే తల్లులకి ప్రత్యేకంగా నరకంలో ఒక పేట reserve అయి వుండాలని నా ఆశ

తన వాళ్ళేవ రెటుబోయినా, తాను దరిద్రురాలైనా, తనని గౌరవించేవాళ్ళు పలకరించేవారెవరూ లేని ఏకాకిఐనా, అందరికీ తాను లోకువైనా తనపిల్ల తన స్వంతం, తన వేపే చేతులు జాస్తుంది. తననితప్ప ఎవరినీ "అమ్మా" అని పిలవదు తనే దిక్కు. తన లోపాలు పిల్లకి కనపడవు, తనని అసహ్యించుకోదు. తను పిల్లకి అందం, దైవం అదీ తల్లితృప్తి తల్లి హృదయంలోని [illegible] ఈ పాటల్నంతా ఆవరించింది

ఏర్పడ్డామన్న యీ విశ్వవిద్యాలయాలు, dornocratic ఈ ప్రజా సంస్థలు, ఇవిమాత్రం ఎవరూ మాట్లాడని, అర్ధంకాని, కృతక కుళ్ళు, కంపుభాషనే విద్యార్ధులపైన వేసి రుద్దుతున్నారు పాత వాంగ్మయం పేరన్నా ఎత్తరు ఇంకా ఈ పాటలు పామరులవీ, స్త్రీలవీ, పిల్లలవిగానే నిలిచిపోయినాయి "మీరు తక్కువ వారు, మీ మొహాల కీ పాటలు చాలు అన్నారా" ఈ నాటి స్త్రీలు మడమ ఎత్తుల చెప్పులు విసురుతారు స్త్రీలని సాంఘికంగా న్యూనత చెయ్యడానికి ఎవరికీ గుండెలు లేవు ఆస్తికూడా వాళ్ళ పరమౌతోంది కాని ఈ పాటలుమాత్రం అట్లాగే అణగారిపోతున్నాయి

ఈనాడు పామరులకీ, స్త్రీలకీ ప్రత్యేకం పాటలూ అక్కర్లేదు, కధలూ అక్కర్లేదు కావలిస్తే పండితుల్నే ఒకరు రాసింది ఇంకోరికి అర్ధంకాకుండా పాండిత్యం చూపుకునే ఉద్గ్రంధాలు రాసుకోమంటారు

ఎటొచ్చీ పిల్లలకి వాళ్ళ కేంకావాలో, అక్కర్లేదో చెప్పుకోనూలేరు, చెప్పుల్ని విసరనూలేరు వాళ్ళకి నిర్ణయం కావాలి, దిక్కులేనివాళ్ళు కనుక పాటల్ని మించిన అందాలూ, పిల్లల హృదయాలకూ అనుభవాలకూ దగ్గిరన పాటలూ, కధలూ సృష్టి ఐతే వీటిని పునరుద్ధరించవలసిన అగత్యం కనపడక పోవొచ్చు

కాని, అది ఎంత అసాధ్యం?

ఎంతమంచి పోపుపెట్టినా, పాత చింతకాయ పచ్చడిలోని, జాడీలో నెలలు వూరిన పరిమళం, కొత్త చింతకాయ పచ్చడికి రాదు ఆ పరిమళం ప్రత్యేకం వందల కొలది ఏళ్ళల్లో ఏర్పడి, పోయిందిపోగా, వాటి మెరిట్ వల్లనే నిలిచిన ఈ పాటలతో సరైనవి రాయడం కష్టం ఈనాడు బి వి నరసింహారావుగారు రాసినా, వాటిని కొన్ని వందల ఏళ్ళు వూరేస్తేనేగాని, పాత Wine లో వుండే superior flavour వాటికి పట్టదు

అందువల్ల ఇప్పుడు చెయ్యవలసిందేమిటంటే, ఈ వాంగ్మయాన్నంతా తెలుగు సారస్వతంలో, కలిపెయ్యడం దానికి అభ్యంతరం చెప్పగల గుండెవున్న వాళ్ళు ఈనాడు లేరు, దీక్షితులుగారి అకుంఠిత కృషివల్ల కాని ఆ వోపికా, ఉత్సాహమూ, ఆ పాటల అందానికి ఎదురుపలికిన ఆయన హృదయం, ఎవరికి వొస్తుంది, మళ్ళీ ఏ యుగానికో ఇంకో దీక్షితులు పుడితేతప్ప! పునర్జన్మ రాకుండా చెయ్యాలని ఆయన ఎంత ప్రయత్నించినా ఆయనకి అది తప్పదు ఆయన వంటివారు యుగ యుగానికీ తిరిగి తిరిగి అవసరమౌతోనే వుంటారు ఈ లోకానికి.

అరుణా చలం — **చలం**

12 - 12 - 55

# 'చింతా దీక్షితులు'

"భారతభూమి నా మాతృదేవత నా సర్వస్వము ఆమె పెట్టినభిక్ష ప్రపంచమున కామె ఒక ఉత్కృష్ట సందేశమును గొంపోవనున్నది యూరపు దేశమును ఆమె గుడ్డిగా అనుకరింపజాలదు '' - గాంధీజీ

ప్రతివ్యక్తిని పొగిడేవారు కొందరు, తెగిడేవారు కొందరూ వుంటారు దీక్షితులుగారు మాత్రం దీనికి మినహాయింపు ఆయనవంటి ఉత్తమ సంస్కారులు ఆంధ్రులలో అరుదు

దీక్షితులుగారు కధకులలో ప్రధములు గాకపోయినా ఆదిగురువుగా అంగీకరింపబడినవారు కధకులలో పలు పోకడలు పోయిన ప్రధములు, కధకు లందరకంటెను అధిక ప్రశంసపొందిన అదృష్టవంతులు

వీరు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా దంగేరులో 1891 న జన్మించారు రాజమహేంద్రవరములో పట్ట పరీక్షయందు ఉత్తీర్ణులై చెన్నపట్టణములో యల్ టి చదివారు పరీక్ష పంతులుగా (డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్) ఆంధ్రదేశములో అనేక ప్రాంతాల పనిచేశారు తరువాత ఉద్యోగం విరమించుకొని నరసాపురములో చాలా కాలం వుండి 1960 లో కీర్తిశేషులయ్యారు

ఆజానుబాహువులు, మేలిమి బంగరు చాయనుగలిగి బక్కపలచగా ఉండేవారు జుట్టూ, బొట్టూ, కట్టూ అంతా పురాతన పద్ధతే నిండుదనం, నిర్మలత్వం, నెమ్మది ఆయన సిరిసంపదలు డాబూదర్పములేని పండంటి బ్రాహ్మణులు, నిరాడంబర జీవితము, ఉన్నత ఆలోచనలు వీరి ఆశయాలు సాధు సజ్జనులు, భక్తులు, అరుణాచల క్షేత్రమందుండి అధిక ఖ్యాతిగాంచి, అందరి దృష్టికి పాత్రులైన రమణ మహర్షి భక్తులు. సర్వజన సులభులు

వాడుక భాషాప్రచారానికి తన శక్తి యుక్తులు ధారపోసిన గిడుగు రామమూర్తి, వాడుక భాషలో గ్రంధరచన చేసిన గురజాడ అప్పారావు గార్లను గురుతుల్యులుగా భావించిరి

నవనాగరికతవల్ల, మన జాతి నానాటికి భ్రష్టమైపోతున్నది కాన, తిరిగి మనము ఆర్షసాంప్రదాయాను యాయులము కావాలని వీరి ఆకాంక్ష, ఇదే వీరి రచనలలో ద్యోతకమగును

## శంకర దీక్షితులు

ఆంధ్ర సాహిత్యరంగములో జంటకవిత్వానికి ఆదర్శకులైన తిరుపతి వెంకట కవులను అనుకరిస్తూ, అనేకులు జంటకవులయ్యారు అది ఒకనాడు ఫాషన్ అయినది

అలాగే చింతా భీమశంకరం, దీక్షితులుగారలు కలసి చింతా శంకరదీక్షితులనే పేరుతో కవిత్వం చెప్పసాగారు గద్యం, పద్యం, హృద్యంగా చెప్పారు కొన్ని కధలు నవలలు కూడా రచించారు 1912 నాటికే వీరు గ్రంధరచన ప్రారంభించారు. ఆంధ్రములో ప్రప్రధమముగా రచింపబడిన అపరాధ పరిశోధక నవల "చిత్రలేఖ" వీరిదే

1920 ప్రాంతాల సాహితీసమితి తెనాలిలో ఏర్పడినది తల్లా వఝ్ఝల శివశంకర శాస్త్రిగారు దానికి అధ్యక్షులు ఆయన "సభాపతి" పేరుతో ప్రసిద్ధులైనారు నవ్యసాహిత్యానికి సభాపతిగారు అధిక ప్రోత్సాహమిచ్చారు సాహితీసమితి సభ్యులలో ఆయన పిల్లలకోడి

ఆనాడు రచయిత తన పేరుకు చివర సాహితీ సమితి సభ్యుడు అని చేర్చుట సంప్రదాయం సాహితీసమితి సభ్యులై నేడు సాహిత్య వీధులలో విఖ్యాతులైన వారెందరో ఉన్నారు దీక్షితులుగారు ప్రధమ సభ్యులలో ఒకరు

సాహితీసమితి సభ్యులలో వయస్సువల్లను, వర్చస్సునుబట్టి, వర్తననుబట్టి, వస్తువును బట్టికూడా వందనీయులు దీక్షితులుగారు

## ఆధునిక ఆంధ్రసాహిత్యములో అఖండ కృషి

అనేకులు వీరిని కధకులుగా ఎరుగుదురు ఆధునిక ఆంధ్రసాహిత్యములో వీరు చేసిన కృషి ఎరిగినవారు ఎందరున్నారో? వీరెంత దీర్ఘకాయులో, సాహిత్యములో చేసిన కృషి అంతకన్న తక్కువకాదు ఆధునికాంధ్ర సాహిత్యశాఖలన్నింటా సంచరించారు వీరి ప్రతిరచన ప్రత్యేకత కలిగిఉండును

వీరు వార్తా పత్రికలలో వ్యాసరచన చేయలేదు సభాసమావేశాల్లో చేరి ఒకరిని దూషించి ఎరుగరు మరొకరిని భూషించలేదు తమకు తోచినరీతిని సాహిత్యసేవ చేసిరి

## గేయకవులు

గురజాడవారి పద్ధతిని వీరు సులభసుందర గేయరచన చేసిరి అంబరవీధిని అల్లల్లాడే భావాన్నయినా అలాగ్గా అందుకొని అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు చెప్పగల చతురులు ఉత్తమశ్రేణికి చెందిన గేయాలు రచించారు

## బాలవాఙ్మయబ్రహ్మ

మనలో బాల వాఙ్మయంలేదనే చెప్పవలసి ఉంటుంది మన ప్రాచీనుల మధురకవితలో బాలవాఙ్మయం లేకపోలేదు బహు రమ్యముగా ఉన్నది అట్టివన్నీ సేకరించి ప్రకటించు బాధ్యత పెద్దలకు కలదు "నవ్వులు పువ్వులు" అట్టి శ్రేణిలో చేరినదే ( దేశికవితా మండలి, గవర్నరుపేట విజయవాడ) ప్రభాకరశాస్త్రిగారి బాలభాష ఎన్నదగినదే

ఆధునిక గేయరచయితలలో ఒక్కొక్కరు ఒక్కొక్క దానిలో విశిష్టత సంపాదించారు. బసవరాజు అప్పారావు గేయాలలో విఖ్యాతి గాంచెను యెంకిపాటలద్వారా ఎనలేని కీర్తిగాంచారు నండూరివారు జానపదగేయాలలో విశిష్టత గాంచారు బాపిరాజు విషాదగేయాలలో విఖ్యాతుడయ్యాడు కృష్ణశాస్త్రి శ్రవణసుఖాన్నిచ్చే గేయరచనలలో గణన గాంచారు శివశంకర శాస్త్రిగారు కిన్నెరసాని పాటలద్వారా కీర్తిపొందాడు విశ్వనాధ విప్లవపంధాను వీరవిహారంచేసి వినుతికెక్కాడు శ్రీశ్రీ ఇట్లా ఎందరో ఎన్నో విధాల విఖ్యాతిగాంచారు

మన దీక్షితులు పిల్లల పాటల్లో ప్రసిద్ధి చెందాడు నవనీతమువంటి బాలురహృదయం భక్తుల నెందరనో ఆకర్షించింది. లీలాశుకుడు తానుశైవుడయినప్పటికి తన మనస్సు గోపబాలునే కోరుతుందన్నాడు ఏసుక్రీస్తుకు పిల్లలయందు ప్రేమ అధికమనుసంగతి అందరెరిగినదే, స్వర్గరాజ్యానికి పసిపాపల హృదయములవంటి హృదయములు గలవాళ్లే అర్హులని ఆయన అన్న మాటలలో అర్థము లేకపోలేదు విశ్వకవి రవీంద్రుడు కూడ పిల్లల కొరకు కొన్ని గేయాలు రచించాడు

జానపద వాఙ్మయంలో తీయదనాన్ని తెలిపి స్త్రీలకు, పిల్లలకు తెలుగు సంపదను పంచిపెట్టారు. పాతమాటలను సంతరించి, ప్రకటించి అధికలాభం చేకూర్చారు

దీక్షితులుగారు "లక్కపిడతలు" అనే పేరుతో చిన్న పిల్లల కొరకు కొన్ని గేయాలు గ్రంధ రూపేణా ప్రకటించారు, దీనిలో బాలుర మనస్తత్వమంతా అందచందాలతో అలంకరింపబడినది వీరి రచనలకు ముందు తెలుగులో కొద్దిగా బాలవాఙ్మయం లేకపోలేదు కాని వీరి గేయాలు గ్రంధరూపేణా వచ్చిన తర్వాత వీరిని అనుసరిస్తూ అనేకులు గేయరచన చేయసాగారు అందుకనే వీరు 'బాలవాఙ్మయ బ్రహ్మ' అయినారు కాని వీరి రచనల మాదిరి రాణించినవి తక్కువ వీరి గేయాలలో చక్కని జాతీయభాష, సులభశైలి, మంచిమెట్లు, హాయిగా పాడుకునే అనుకూలత, పిల్లలకు అనుకూల వస్తువు, వాతావరణం ఉంటుంది కవిరావు బొమ్మరిల్లు బాలవాఙ్మయము ఒకనూతన యుగోదయమునకు కారణమైనది

## నాటికలు

ఆంగ్ల సాహిత్య సంపర్కంవల్ల మనకు ఖండకావ్యం, నవల నాటిక, కధానిక లభించాయి నాటికకు పునాదులు వేసిన ప్రముఖులలో దీక్షితులుగా రొకరు వీరు అనేక నాటికల్లో శర్మిష్ఠ, వరూధిని, చక్రవాక మిధునం, దసరాదిబ్బ, రేణుక, శ్రేష్ఠములు, శ్రీ కృష్ణుడు సర్వోత్తమము

'శర్మిష్ఠ' లో పురాణాల్లో పూడిపోయిన వింత విషయాలు విజ్ఞులు మెచ్చేటట్లు విశదపరిచారు

పెద్దనగారి ద్వారా ప్రసిద్ధిచెందిన వరూధినీ ప్రవరుల వృత్తాంతాన్ని ఉజ్జ్వలముగా ఉన్నతభావాలతో, వ్యాఖ్యానము చేశారు 'వరూధిని'లో,

'చక్రవాక మిధునం' నాటికారూపంలో ఉన్న ఉత్తమ వచన ఖండకావ్యం దీని సౌందర్యం సమగ్రం ఊహలు ఉజ్జ్వలములు దీక్షితులుగారి అనుభవమంతా దీనిలో దేదీప్యమానముగా ప్రకాశించింది

'దసరాదిబ్బ' బ్రతికిచెడ్డ విజయనగర సామ్రాజ్య రాజధానిలో పేరోలగ ప్రదేశము. ఇందులో వీరి భావ తరంగాలు బహుళంగా బహిర్గతమవటం మనం కానవచ్చు

ఇరువది ఒకమారు శత్రువులను హతమార్చినశక్తి బ్రహ్మఋషి కుమారుడగు పరశురామునికి ఎలా వచ్చిందో సమాధానం సవిస్తరముగా 'రేణుక'లో చెప్పబడింది.

బాలుర మనస్తత్వం వీరికి బాగా తెలిసినందువల్లను, భక్తులగుట చేత "శ్రీకృష్ణ" సర్వాంగ సుందరమైన నిదర్శనము శబరి, హనుమంతుడు, ఇత్రి పాత్రలు బహు మనోహరంగా చిత్రింపబడినవి సరసమైన సంభాషణలు, మృదుమధురమైన గేయాలు కలిగి ముచ్చటగా ఉన్నదీ రూపకం

## కథా సాహిత్యము కథావీధిలో దీక్షితులుగారి దీప్తి

ఆధునిక ఆంధ్రకవిత్వానికి, నాటకానికి ఆదిగురుషుడు గురజాడ అప్పారావుగారే అన్నసంగతి అందరకూ తెలిసిన విషయమే చిన్న కథకు కూడా పునాదివేసింది ఈ పుణ్యాపురుషుడే 'దిద్దుబాటు ' 'మీ పేరేమిటి?' అనే రెండు కథలు ఆయననుండి మనం అందుకొన్నాము చిన్నకథకు ఉండతగిన లక్షణాలన్నీ ఈ రెంటిలోనూ ఉన్నవి ఈ రెండూ రెండు మణులవంటివే కవిత్వాన్ని, నాటకాన్ని సంఘప్రయోజనానికి సాధనగా ఉపయోగించిన కళాశిలి గురజాడ వాల్మీకి కథలను ఆ పద్ధతిలోనే నడిపించాడు

అయితే అప్పారావుగారి అనంతరము ఆయన కథా సాహిత్యప్రభావం పరులపై పడలేదు ఆయన అనంతరము కొందరు తెలుగులో కథానికలు వ్రాసినవారు లేకపోలేదు కాని, కథానికకు రూపురేఖలు దిద్దినది దీక్షితులుగారే ఆంధ్ర సాహిత్యములో దానికి ప్రాముఖ్యము కల్పించినవారు కూడా వారే సాహితి, సఖి పత్రికలలో ప్రప్రథమమున వారు ప్రకటించిన కథలే ఇతరులకు మార్గదర్శకములైనవి

కాని ఈ విషయంలో మరొకసంగతి చెప్పక తప్పదు కథా రచనలో ఆంగ్లసాంప్రదాయం అంతగా పాటించినట్లు కనపడదు ప్రతి సాహిత్యములోను కథారచనకు ఒక్కొక్క పద్ధతి వుంటుంది పద్ధతే గాదు, ఒక వడికూడా వుంటుంది ఆ కథలు చెప్పడములో వాక్యాలు ఊహలు పేర్చినట్లు రానురాను స్థిరపడిపోయి అవ్యక్తమైన ఒక వడిని సంపాదించుకుంటవి

ఆ కథలన్నీ మననము చేసుకొని, వాటిని చెప్పడములో సొగసు మనస్సుకు పట్టించుకొని, వీరు కథా రచనకు పద్ధతి నిర్మించుకొన్నట్లు కనపడుతుంది

చలంగారికి ముందే వీరు కథలు వ్రాయడము, చలంగారు వీరికి వారి కథలు చూపించటం వాటిని మెచ్చుకుని ఆకథలను పత్రికలకు పంపి ప్రోత్సహించటం గమనింపతగిన విషయము

పెక్కుపోకడలు

అంబర చుంబితమైన హిమాద్రిని ఆవాసం చేసే మహేశ్వరుని మొదలు మన్యంలో అజ్ఞాతంగా జీవించే సుగాలీ వరకు ఆయన అద్భుతంగా చిత్రించారు వీరు కథానికకు ప్రాముఖ్యమిచ్చుటేగాక కథలు పెక్కు విధాలుగా వ్రాసిన ప్రతిభావంతులు, స్వీయచరిత్రగానూ, చరిత్రగానూ సంభాషణాత్మకముగానూ కూడా కథలల్లారు

"నేను వ్రాసిన ఈ కథలన్నీ చింతా దీక్షితులుగారికి చదివి వినిపించాలి, ఏమంటారో ఆయన

ఇదివరకే చాలా కథలు ప్రచురించారు ఆయనకే తెలుస్తుంది వీటి విలువ " (ప్రేమలేకలు 1 వభా.పే 86-చలం)

చలం వుత్తరాల్లో కూడా ఒక కథకుణ్ణి సృష్టించింది దీక్షితులుగారేనని పై విషయాన్నే పేర్కొన్నారు

వీరు ఘటనా ప్రధానమైన కథలేగాక భావప్రధానమైన కథలు కూడా వ్రాశారు. ఇంతేకాదు, వర్ణన ప్రధానమైన కథలు, పాత్ర ప్రాధాన్యమైన కథలు విరచించారు వీనుల కింపుగా

ఒకే వ్యక్తిని పాత్రగా పెట్టుకొని పెక్కుకథలు వ్రాసింది శివశంకరశాస్త్రిగారి తర్వాత వీరే వటీరావు, బాలానందం, శీర్షికలతో పెక్కు కథలు రచించారు

పెద్దలకు కథలు వ్రాసినట్లే పిల్లల కథలు వ్రాసిందికూడా దీక్షితులుగారే

వివిధ దృక్కోణాలనుండి పరిశీలించి పెక్కు కథలు వ్రాసింది వీరే

వీరు ఏ సంఘజీవితం చిత్రించినా దానిని చక్కగా అవగతము చేసుకొని చిత్రించుటలో చతురులు

వీరి కథలలో వైవిధ్యము అధికం, ఉదాత్తవస్తువును తీసుకొని ఉపజ్ఞతతోను, ఊహాపుష్టితోను, ఉత్తమభావాలు రేకెత్తించగల ఉత్తమ కథకులు దీక్షితులుగారు వారి కథలు స్వయం పాకమువలె పవిత్రములే గాక భీమసాకమువలె స్వాదిష్టములు కూడా

ఎట్టివిషయ మెత్తుకున్నా హాస్యాన్ని పోషించగల దిట్టలు శృంగారములోను, కరుణములోను కాకలుతీరినవారే భిన్నరుచులు చూపించగల రసనిష్ణాతులు

ప్రణయము, విరహము,బాహ్యప్రకృతి, ఆంతరిక సౌందర్యము, భక్తి, విరక్తి, దేశభక్తి వర్ణించిన విఖ్యాతులు

నైతిక సత్యాలను తేటతెల్లముగా తెలిపి మరల ఉన్నత పథానికి తీసుకొని పోగలిగిరి ప్రకృతిగాథలు చిత్రించి, పరమానందం గలిగించ గలిగిరి కష్టజీవుల కథలు చెప్పి కన్నీటి కాలువలు కట్టించిరి ఆటవికుల అమాయిక స్వభావాన్ని చిత్రించి అనందాబ్ధిని ఓలలాడించిరి నవనాగరిక శిరోమణుల కథలతో నవ్వుపువ్వు ననిపించగలిగిరి శిశుకథలల్లి శిరఃకంపము చేయించగలిగిరి వీరికథల్లో ఆధిక్యం ఉట్టిపడుతుంది వేయేల? దీక్షితులు సర్వదక్షులు.

**పంచవిధాలుగా పంచవచ్చు :** వీరి కథలలో వైవిద్యం విశేషంగా ఉన్నా, పంచవిధాలుగా పంచవచ్చు ప్రకృతి సంబంధాలు, ప్రణయాత్మకాలు, వినోదాత్మకాలు, తాత్వికాలు, పిల్లలకు సంబంధించినవి

**వర్ణనలు :** వీరు అంగాంగివర్ణనలు అసలే చేయరు, ప్రకృతి వర్ణనలకు పెట్టిందిపేరు ఆంతరిక సౌందర్యాన్ని వర్ణించుటలో అందెవేసిన చెయ్యి

పాత్రలు పలువిధాలు : వీరి కథలలో పిన్నా, పెద్దా, పండితులు పామరులు, పల్లెటూరివారు, పట్నవాసులు, ఆటవికులు, నవనాగరికులు, సనాతనులు, కష్టజీవులు, ఉద్యోగులు, అన్ని తరగతులవారు ఉందురు

పాత్రలలో ముఖ్యమైనవి . వీరి పాత్రలలో భైరవిశాస్త్రి, వటీరావు, చెంచుదంపతులు, చెంచురాణీ, సూరీ, సీతీ, వెంకీ, కళ్ళల్లో కాపురాలు చేస్తాయి

కథాసంపుటాల పరిచయము : దీక్షితులుగారు పెక్కు కథలు వ్రాశారు గ్రంథరూపేణా వచ్చిన వాటిని ఎరుకపర్చి తర్వాత విడికథలు వివరిస్తా.

ఏకాదశి : ఏకాదశంటూ తిథితో సంబంధం అనుకోకూడదు పదకొండుకథల సంపుటి ఏకాదశి అంటే సంప్రదాయార్థం ఉపవాసమన్నమాట కాని ఈ ఏకాదశి ఆంధ్రులకు ద్వాదశి

ఈ సంపుటిలో, 'శ్యామల', 'ముద్దు', 'చెంచుదంపతులు' అధికంగా పేర్కొదగినవి వీటిలో చెంచుదంపతులు కథ అన్నిటికంటే అధిక ఆదరణీయమైనది

దీక్షితుల కథలు · ప్రథమ సంపుటి ఏకాదశి ఇది యన్నచో దశమి అది 1925 సం॥ లోనూ, ఇది 1940 సం॥లోనూ ప్రకటింపబడ్డవి

దీక్షితులుగారు సంప్రదాయకులు మొట్టమొదటినుంచీ వీరి ప్రథమ రచనలో కూడా ఆ సంప్రదాయ భావం లేకపోలేదు కాని ఆ సంప్రదాయకత కళను మింగలేదు ఈ సంపుటిలో సంప్రదాయక భావం అధిక మగుటే గాక విచిత్రమైన విరక్తిభావం విశదమౌతున్నది నాగరికత అంటే, నవీనకాలపు చదువు అంటే నగుబాటుగా కనపడుతుంది

'పెద్దమేడ ' 'గోదావరి నవ్వింది' ఈ స్కెచ్‌లలో ఇది విస్పష్ట మవుతుంది

దాసరిపాట మన వయోజన విద్యాప్రచారకుడై ప్రబోధకుడై మనకు ఆనందాన్నిచ్చే తెలగదాసరి కథనాన్ని గురించి కవితాగానం చేశారు (ఇది దీక్షితులుగారికి ప్రియమైన కథ) "ఊరుపేరు"లో పరిహాసం పరికించతగినది "కిష్కింధలో కోతి" కిమ్మత్తైనది. అందులోని వ్యంగ్య మాధుర్యాన్ని అందుకొని ఆస్వాదించాలి

"అభిప్రాయభేదం" - యానాదిమనిషికి పిల్లయందుండే ప్రేమ, ఆ పిల్ల అలంకరణయందు ఆమెకుగల అభిమానం అందంగా అందించారు

"భార్యమృతి" లో పాదుషా పకీరుల దుఃఖసామ్యం చిత్రించారు.

"గోదావరి నవ్వింది" దీనిలో గ్రామీణ జీవనం చిత్రించారు

"పెద్దమేడ"లో ధనికునియెడల అయిష్టం, దరిద్రులయెడల ప్రేమ పరికించగలం

" చెంచురాణి"లో శ్రీశైల పర్వతాలలోని చెంచుజీవితము వారి వివాహాచారములు చక్కగా చిత్రించారు

"సుగాలీ కుటుంబము" లో లంబాడీల నిత్యకష్టాలు నిపుణతతో నిర్వహించి కరుణాజనకంగా చిత్రించారు వామహస్తోద్ధారక సంఘం, బ్రాహ్మణేతరోద్యమమును గురించి వ్యంగ్యంగా చర్చించారు

# వటీరావు కథలు

సంస్కర్తలైన వీరేశలింగం ప్రభృతులు పుర్వాచారా పరాయణులను హేళనచేస్తూ ప్రహసనాలు వ్రాసినట్లే, దీక్షితులుగారు ఆంగ్ల ఆచారాలకు దాసులైన ఆధునాతన విద్యావతులైన అంగనామణుల ఉద్దేశించి వ్రాసిన కథలు ఇవి, కథాషట్కము

హాస్యకథలు - దీక్షితులుగారు పైకి ఎలాకనపడ్డా హాస్య ప్రకృతిగలవారు స్వభావములో అటువంటి గుణము లేకపోతే హాస్యరచనలు చేయలేరు వీరేశలింగముగారు ప్రహసనాలు వ్రాశారు గాని, వారు హాస్య ప్రకృతి గలవారుకారు వారు కలాన్ని ఖడ్గంగా ఉపయోగించిన సంస్కర్తలు, సాహిత్యశస్త్రులు

సహజంగా హాస్యమంటే హేళన, వెక్కిరింపు అనుకొంటారు నవ్వించకుండా నవ్వించడమే సరియైన హాస్యం, అట్టి హాస్యరచనలు వీరి హాస్యకథలలో అధికంగా ఉన్నవి

"ఆంధ్రదోమల సభ", "పాకశాస్త్రపరీక్ష", "అగ్రసనాధి పత్యము", "నీతిసారము", "మాయింట్లో పిల్లి" మొదలగునవి

నిత్యమూ మనకు అనుభవమయ్యే అల్పవిషయాలను తీసుకొని నవ్వువచ్చేటట్లు చమత్కారంగా చెప్పటంలో ఆది గురువుగా వీరిని గ్రహించాలి

వీరు స్వయంగా హాస్యకథలు వ్రాయటమేగాక "బారిష్టరు పార్వతీశం" రచించి ఖ్యాతిగాంచిన మొక్కపాటి నరసింహశాస్త్రిగారిని హాస్య రచనకు ప్రోత్సహించనివారు వీరే ఈ సంపుటిలో పదిహేను కథలు కలవు

విడి కథలు గ్రంధరూపేణా రాని కొన్నికథలను గురించి కూడా పరిచయపరుస్తాను

"గురుదక్షిణ" ' (ప్రతిభ) "శిల్పి" (భారతి) " దేవాలయస్తంభము (భారతి) "శిలా ప్రతిమ" (భారతి) మన పాత భావాలను పదిలపర్చేవి కథకుడుగాగాక, బోధకుడుగా కన్పిస్తారు వీటిల్లో

"తాటివనము" (సఖి) ఈ రచన దీక్షితులుగారి ప్రత్యేక కృషి, దీన్ని ప్రశంసించక తప్పదు ఈ తాటి వనాన్ని ఋతువులను హృద్యమముగా వర్ణిస్తూ, మానవుని బాల్య యౌవన వార్ధక్యదశల భావాలను సహజంగానూ, సుకుమారంగాను చిత్రించారు బాల్యములో ఆటపాటల యందుండే ప్రేమ, యౌవనములో యువతలయందుండే అనురాగము, వృద్ధాప్యములో వైరాగ్యం, విన్నాణముగా వర్ణించారు, ఇట్టి కథలు వీరు తప్ప ఇతరులు రచింపలేరు ఆ దృక్పధం వీరికే ఉన్నది ఇందులోని భాష భావానికి తగినట్టు గంభీరమైనది

"ఈ మాట నిజం" (ప్రబుద్ధాంధ్ర) రసవద్రచన నన్నయ భట్టును ఒకరు రాజమహేంద్ర వరంలో దర్శించటము ఇతివృత్తం దీక్షితులుగారి భావుకత్వం దీనిలో అద్భుతంగా అతిశయించింది నన్నయభట్టు యజ్ఞయాగాది క్రతుసందర్భాల్లో ఆవేశపరుడై ఎలా వ్రాశాడో దీక్షితులుగారు అలాగే వ్రాశారు ఔను, వీరు అపరనన్నయ్యేగా!

**పిల్లల కథల్లోను పెద్దే :** భూ పతనానంతరం శిశువునకు మధురధ్వని వినుటకు మక్కువ ఎక్కువయగును అందుచేతనే తల్లులు పాటలు పాడి వారిని ఆనందింపజేతురు పిల్లలకు నిద్ర ఎక్కువ అవసరము గనుక, తల్లుల జోలపాటలకు తన్మయులై వారు హాయిగా నిద్రపోవుదురు

ఆ మధురమంజులవాక్య కళాగీతములు నేటి మన నవనాగరి కతామతల్లులకు మోటయ్యేగదా! మాటలు వచ్చినది మొదలు పిల్లలు కథలకై కాళ్ళకు సంకెళ్ళు వేయుదురు తల్లో, ముసలమ్మో, ఎవరో ఒకరు మన సంప్రదాయక కథలు చెప్పసాగింతురు పేదరాశి పెద్దమ్మ, చేపలవేట, పేనుకథ, ఈగకథ మొదలగు కథలెన్నో వీనులకు విందుగా విని నిద్రబోవుట ఆరోగ్యవంతులగు బిడ్డల నైజము ఈ విధంగా కథలకు చెవులొగ్గే పిల్లలు పుస్తకము పట్టినతర్వాత చదివే కథలు మనతెలుగులో లేవనే చెప్పవచ్చు ఆ లోపము తీర్చుటకే దీక్షవహించారు దీక్షితులుగారు. వీరికిందులో అభిరుచితో పాటు అర్హతకూడాకలదు,

పిల్లల హృదయాలను చిత్రించుటలో ప్రథములు ప్రవీణులు, ప్రఖ్యాతులు.

విశ్వకవి రవీంద్రుడు నెలవంక (Cresent Moon) పసి పాపల ముద్దుమాటలలోను, చేష్టలలోను, విశ్వమంతా నిండి నిబిడీకృతమైన ఈశ్వరుని లీలలుగాంచి, ఇతరులకు విప్పిచెప్పెను

ఇంతేగాదు, "గల్పసల్ప" అను గద్యపద్య గ్రంధాన్ని పిల్లల కొరకు వంగ భాషలో రచించి పథ ప్రదర్శకుడయ్యాడు రవికవి బాలానందం శీర్షికలో దీక్షితులు గారు భారతిలో పెక్కు కథలు ప్రకటించారు సూరీ,సీతీ, వెంకీ పాత్రలద్వారా వీరు రచించిన కథలు హృద్యమైనవి పిల్లలేగాక తలిదండ్రులుకూడా తప్పక చదివి తన్మయం పొందగల కథలవి

వీరు పెద్దలకై వ్రాసిన కథలను గురించి అభిప్రాయభేదాలు వుంటే ఉండవచ్చునుగాని, పిన్నలకై వ్రాసిన వాటిని గురించి భిన్నాభిప్రాయము వుండనే ఉండదు

"భారతి" లో 'బాలానందం' శీర్షికతో వ్రాసిన పెక్కు కథలేగాక "బంగారు పిలక" (భారతి) "గోపీమోహిని", "శరబాల", "శంపాలత" (కళ), "లీలాసుందరి" మొదలగు కథలు వీరు వ్రాసి పిల్లల కథల్లో పెద్దపేరు పొందారు.

"లీలాసుందరి" శంపాలత, గోపీమోహిని, సూరి, సీతి, వెంకి, గ్రంధరూపేణా వచ్చినవి

దీక్షితులుగారు మొట్టమొదటగా బాలుర మనస్తత్వానికి అనుగుణముగా కథలు రచించారు వారి రచనల తర్వాతనే అనేకులు అనేక రచనలు చేయసాగారు నేడు పిల్లలకొరకు పెక్కు పత్రికలు కూడా ప్రకటింపబడుట ప్రశంసార్హమే. వీరిని యీ కథలకు ప్రోత్సహించింది గిడుగువారిని ప్రతీతి

తదితర కథలుకూడా మన పిల్లలు పఠించి పరమానందం పొందేదెప్పుడో?

చిన్నపిల్లల అమాయికత్వ మనస్తత్వాన్ని హృదయ సౌకుమార్యాన్ని వీరు నివేదించినట్లుగా, ఇంకొకరు నివేదించలేదనడం అతిశయోక్తి కాదు

లక్కపిడతలకి కేంద్ర గవర్నమెంటు రూ 500 బహూకరించినది

బంగారు పిలకకు రు 200లు యిచ్చినది ఆంధ్రగవర్నమెంటు

కథకు పూర్వకాలములో తలాతోక ఉండేది పరిణామదశలో,నేడు అవి రెండూ పోయినవి మన పిట్టకథలలోను, పిల్లలకథలలోను, పుక్కిట పురాణాలలోను,అనగా అనగా అనేది కథకు తల కథ కంచెకి వెళ్ళింది అనేదితోక పూర్వం కాంచీనగరము సమస్త విద్యలకు కళలకు నిలయము. ప్రవీణులు అక్కడ అన్ని శాఖలలోను వుండేవారు కథ కంచికి వెళ్ళింది అంటే అక్కడ కళావేత్తల అంగీకారం పొందింది అన్నమాట

కథలలో ఎంత వైచిత్రి వున్నా ఇట్లా తలాతోకా ఉంటేగాని పిల్లలకు, సాధారణ జనానికి కథ ఆరంభం, అంత్యం అర్థంగాదు వారికి తృప్తి అయ్యేపద్ధతి ఇదే

నేటి కథానికా రచన ఇటువంటిది కాదు, ప్రారంభం ఏ మధ్యలోనో ఎత్తుకొని, పాఠకునకు ఉత్సుకత కలిగించి వ్యంగ్య విధానంతో ఉపసంహరింపబడుతుంది పూర్వపు కథలో కథ కథకు ప్రాధాన్యం, నేటి కథానికలో కథనానికి ప్రాముఖ్యం

దీక్షితులుగారు పూర్వపు పద్ధతిని అనుసరించి పిల్లలకు అర్థమయ్యేటట్లు వస్తువును, వాతావరణమును కల్పించి బహుమనోహరంగా కథలు రచించిన బాలవాఙ్మయబ్రహ్మ

## భాష - శైలి

రచనా సౌందర్యానికి పర్యాయపదమే శైలి రచయిత ఉపయోగించే శబ్దములకూర్పు, వాక్యరచనా విన్యాసం మొదలగునవి శైలి మరొకవిధంగా చెప్పవలసివస్తే మనలోని భావాలను, కల్పనలను, అభిప్రాయాలను, సంస్కారయుక్తముగా చెప్పటమే శైలి, శ్రవణ సుఖమైన శబ్దాలనేకాక అర్థవంతమైన మాటలను ఆయాచోటుల ఉపయోగించుటవల్ల మంచిశైలి ఏర్పడును

వాక్యాల్లో అర్థ ంస్పష్టంగా వుండి, భాష సులభసుందరముగా ఉండి, వాక్యాలు చిన్నవిగా ఉంటే అధిక జనామోదం పొందుతుంది

ఇక దీక్షితులుగారి భాష ఎటువంటిదో విశదపరుస్తాను వీరిది వాడుకభాషే. కాని మధ్యమధ్య గ్రాంధికం వస్తుంది వీరి కథల పసందును నాటికలనాణ్యాన్ని వాడుకభాషమధ్య గ్రాంధికం వచ్చి పాడుచేసింది

కథ్ ధాతువుకు చెప్పడమని అర్థము పూర్వము కథలు చెప్పడమే గాని రచించుట వుండేదికాదు ప్రతి దర్బారులోను కూడా కథకుడు ఉండేవాడు, సారాంశమేమిటంటే కథలు చెప్పుతూవున్నట్టుండాలి వాడుక భాషకు, కథకు ఉన్న సంబంధము ఇది మరొక సంగతేమిటంటే వాడుక భాషలో ఉంటే

అందరకూ అర్ధమౌతుంది కనుక కధకులందరు భాషా విషయములో తప్పక శ్రద్ధ తీసుకొని వాడుకభాషను విన్నాణముగా వాడాలి

గ్రాంధికం వ్రాయటం కష్టం అని , వాడుక భాషారచన సులభమని భావిస్తారు కొందరు కాని నిజమాలోచిస్తే వాడుక భాషరచనే కష్టం, వాడుక భాషలో గ్రంధరచన చేయటానికి కృతనిశ్చయులైన 'ఉన్నవ' వారే, వారు కృతార్ధులుకానట్లు " మాలపల్లి" లో పేర్కొన్నారు కారణము లేకపోలేదు ఎంత వాడుక భాష వ్రాయాలని పూనుకొన్నా మనము ఇది వరకు చదివిన గ్రంధాలు నేటి కొన్ని గ్రంధాలుకూడా గ్రాంధికంలోనే ఉన్నవి అందుచేత కొంతవరకు మనం కృతార్ధులంకాలేము కృతకభాష ఏర్పడుతుంది

మనమేకాదు, పూర్వము శివకవులగు (దేశికవులు) నన్నె చోడుడు, పాల్కురికి సోమనాధుడు, సంస్కృత పద భూయిష్ట రచన పనికిరాదని మార్గకవితను తెగతిట్టి, వారుకూడా సంస్కృత పదభూయిష్ట రచన చేయకపోలేదు కొంతవరకైనా, ఇది కాల ప్రభావం అలాగే దీక్షితులుగారిలోనూ యీ దోషం ఏర్పడింది

**ఉత్తమ కధలు :** వీరి కధలు విశేషంగా సాహితి, సఖి, కళ, భారతిలో కలవు గోపీమోహిని, శంపాలత, శరబాల, లీలాసుందరి పిల్లల కధల్లో ప్రఖ్యాతి చెందినవి

ఇక యితర కధల్లో 'చిన్న' శ్యామల' కోమలత్వాన్ని గాంచదగింది, 'ముద్దు' అందరికి ముద్దే, ఎవరు వద్దని మూతిముముడుచుకుంటారు 'చెంచు దంపతులు' చూడతగినవారు 'దాసరిపాట' వినతగినది 'చెందురాణి' కీర్తించతగింది 'కిష్కంధలో కోతి'కి కిమ్మత్తు కట్టే షరాబులేడు 'తాటివనము' లో ప్రవేశించి 'వనమాధుర్యం' గమనింపతగింది 'మిస్సుల బహుమానం' పుచ్చుకో తగింది 'దేశభక్తి' లేకపోతే ఎట్లా?

వీరి కధలు ఇంకా సంపుటాలుగా రాదగినవి చాలా ఉన్నాయి

పర భాషల్లోకి పరివర్తనాలు వీరి కధలు కొన్ని ఇంగ్లీషులోకి, హిందీలోకి పరివర్తనము చేయబడి ప్రఖ్యాతి గాంచినవి "చెందుదంపతులు" త్రివేణి ద్వారా ఖండాతరాల్లో కూడా ఖ్యాతిగాంచింది

## పర్యాలోకనము

భాషా విషయంలో కొన్ని లోటులున్నా భావనాపటిమ గలవారే కధనంలో కన్నా, కల్పనంలో అధికులు వాస్తవికతకన్నా వైచిత్రి కొన్నిటహెచ్చు

మనస్తత్వ నిరూపణ పిల్లల కధల్లో చూపించగలిగినట్టు పెద్దల కధల్లో చూపించలేకపోవటానికి కారణమేమిటో!

## కధకుని ఆశలు, అభిమానాలు, రాగద్వేషాలు

దీక్షితులుగారి రచనలో మతప్రభావం అధికం, వీరి నాటికలు నాటకాలు కూడా పౌరాణికాలె వీరి కధలలో కూడా ఆ ప్రభావమే అధికం

కధాలహరిలో ఇది వీరి కధల్లో ఉత్తమమైనదిగా ప్రకటింపబడింది

వీరు పూర్వాచారమందు అభిమానులు, అందుచేతనే పల్లెటూరి నాగరికత అనగా మనసంప్రదాయాల యందుండే అభిమానం, నవనాగరికతయందుండే ఏవగింపు ఆధునిక విద్యావిధానమందయిష్టం, నిరాడంబరులైన పల్లె ప్రజలయందు ప్రేమ, పేదలగొడ్ల అనురాగం, ధనికుల యెడనిరసనభావం వీరి రచనల్లో గోచరిస్తవి

వర్ణనలు కూడ రచయిత అభిమానాలు, అయిష్టాలు, శక్తిసామర్థ్యాలు తెలయజేస్తవి దీక్షితులుగారి ఈ దిగువ వర్ణన దీనికి దీటైన నిదర్శనము

"సాయంకాలము పెద్ద ముత్తైదువలాగ సూర్యుడు పసుపుకుంఖం పూసుకొని గోదావరి లో మునుగబోతున్నాడు పక్షులు గూళ్ళు చేరుకుంటున్నవి పశువులు ఇళ్ళకు మళ్ళుతున్నవి నాగరికత గర్వమెరుగని జానపదులు కూడా తమ ఇళ్ళకు పోతున్నారు నాగరికులు క్లబ్బులకు వెళ్ళుతున్నారు (దీక్షితుల కతలు పేజి 43)

ఈ సాయంసమయ వర్ణనలోకూడా వీరి సంప్రదాయక అభిప్రాయాలే మనకు సరిగా కనపడుతున్నవి వీరి అయిష్టాలు కూడా ఇందులో ఇమిడి వున్నవి నాగరికత గర్వమెరుగని జానపదులు అని జానపదుల యందుండే ప్రేమ, పట్టణ వాసులయందుండే అయిష్టత వెల్లడించారు

చలంగారికి అన్నిటా ప్రేయసీప్రియులు కన్పిస్తారు మునిమాణిక్యం వారికి ఆకాశములో కూడా భార్యాభర్తలు కన్పిస్తారు వృద్ధ బ్రాహ్మణులైన మన దీక్షితులుగారికి ముత్తైదువలే కన్పిస్తారు ఇదీ వరుస వారి వారి మనోభావాలే ప్రకృతిలో కూడా వారు చూచేది

"ఈతపండ్ల నక్కడక్కడా పోగుచేసుకుని వచ్చి వాని నెండబెట్టి తరువాత దంచి గింజలను పారవేసి ఆ పొట్టుతో రొట్టెలను గాల్చుకొనుచున్నారు రూపల్‌నాయక్ కుటుంబం మార్గం లేనివారికి భగవంతుడు ఒక మార్గము కల్పించక మానునా?" (దీక్షితుల కధలు . పేజి 99)

అయినదానికి కాని దానికి భగవంతుని తీసుకురావటం, ఏమి ఔచిత్యం? ఔను, భక్తులకు అంతట భగవంతుడు కనిపిస్తాడు కదా? దీనిలో భగవంతుని ప్రమేయ మేమున్నది? శతకోటి దరిద్రానికి, అనంతకోటి ఉపాయాలు ఆ దరిద్రస్థితే వారినలా చేయిస్తే ఈ భక్తుడు దీనిని భగవంతునికి అంటగట్టుతాడు దేనికి?

"ఈ మాట నిజం" (ప్రబుద్ధాంధ్ర) ఇదివరకే విన్నవించాను నన్నయభట్టు అంటే వీరికెంత అభిమానమో ఇందులో విదితం కాగలదు ఆవేశం కలిగినప్పుడు వీరెట్టి భావగద్య వ్రాయగలరోకూడ దీనిని బట్టి కూడా తెలియగలదు, వీరి భావుకత్వం గోదావరివలె ఎలా పొంగి పొరలిందో పరికించండి

"రాజరాజనరేంద్రుడు మహావైభవములో రాజ్యము చేసిన రాజమహేంద్రవరము తొమ్మిది శతాబ్దులు దాటినపిమ్మట ఏలాగువున్నదో చూడడానికి వచ్చాడు కాబోలు ఆదికవి తన్ను పోషించిన

మహారాజుతో తాను విహరించిన పుణ్యస్థలములను నేడెట్లున్నవో చూడవచ్చాడు కాబోలు ఆ బ్రాహ్మణుడు సార్వభౌముని వైభవముతో పెనవేసుకొని విజృంభించిన తన వైభవానికి ఆకరమైన రాజధానిని దర్శింపవచ్చాడు కాబోలు ఆంధ్రకవితాపిత, మదపుటేనుగుల ఘీంకారములతో రణహయముల వేషలతో, రథనేముల వబ్దములతో, వీరహుంకారములతో మారుమ్రోగే ఘంటాపథములను తిరుగచూడ మనసుపుట్టి అవతరించాడు కాబోలు ఈ దేశాభిమాని, వేదఘోషలలో, వీర ఘోషలతో, పండిత వాదములతో, కవి వాక్కులతో, వనితల గానముతో, కలకల లాడే తన పురరాజము నే డెట్లున్నదో చూచుకోవచ్చినాడు కాబోలు రాజరాజు కుల బ్రాహ్మణుడు ''

కవి తన కభిమానవిషయం వచ్చినప్పుడు అధిక హృద్యంగా చిత్రించగలడనుట గమనింపదగిన విషయము

"ఆదికవీ, మీ కాలమున భారతము ప్రారంభమైనది, మా కాల మున పూర్తియైనది మీ కాలమున వ్యక్తి స్వాతంత్రము లేదు నేడు అది మా సొమ్ము మానవుని సుఖములను పెంపొందింపజేసే వాహనములు, కాలమును జయించే వాహనములు మీకు కొత్తలు '' నేను పూర్తి చేయకమునుపే, నన్నయ్యభట్టు నడిపించుకు పోయాడు నా నోటికి తాళము పడ్డది. కాని నా ప్రశ్నలకు అతని సమాధానం మాత్రం నా హృదయానికి తట్టింది అది ఇది, "మురికికాలవలో బ్రతికే పురుగు తలయెత్తి సూర్యుణ్ణిచూచి ధిక్కరిస్తోందా అని.''

దీక్షితులుగారు సంప్రదాయకులు ఈ సంప్రదాయకోటి అంతా నిరాశావాదులు వీరికి ఆశాజ్యోతి ఏమీ కన్పించదు మన పూర్వుల గొప్పను మన అధోగతిని చెప్పి వాపోవటం దప్ప వీరికి మార్గాంతరం తెలియదు వీరు మనకు కల్గించేది విషాదయోగమే కర్మయోగము వీరి కవసరంలేదు కాని మనకు కావలసింది కర్మయోగము మన ఆధునిక కవులలో అగ్రేసరుడైన అమరకవి గురజాడ ఒక్కడే మనకు సందేశమిచ్చింది.

" వెనుక చూచిన కార్యమేమోయ్
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగెయ్
వెనకపడితే వెనకేనోయీ''

"పురోహితుల ఆశీస్సుల బలమును పొంది మహారాజు సంకల్పములు, మంత్రులుద్వారా సత్కార్యములు ఫలించి ప్రజల సంతోషమునకు పాత్రమయ్యేవి '' (శిల్పి)

ఆ పురోహితుల ఆశీస్సుల బలము లేకపోవటమువలన, మనము ఇంతకాలము శతాబ్దములుగా పరప్రభుత్వ పాలయ్యాము కాబోలు వారేలనశించిరో? ఆశీస్సుల బలము అంతరించుటకు కారణమేమో? కనుగొనాలి మన పరిశోధకులు!

## సింహావలోకనం

దీక్షితులుగారు నవ్యసాహిత్య శాఖలన్నిటా సంచరించారు ' కాని వారు కధకులుగానే ఖ్యాతిగాంచారు తెలుగు కధకుల్లో పెక్కు పోకడలు పోయినవారు. పిన్నలకు పెద్దలకుకూడా కధలు వ్రాసినవారు వీరు

వీరు సుమారు 100 కధలు వ్రాశారు మొదటికథ " మా అబ్బాయి" గ్రంధరూపేణా రాతగినవి ఇంకా చాలా వున్నవి చిన్న ప్లిలల కధలే నాలుగు సంపుటాలు కావచ్చు

దీక్షితులుగారి భావాలు కొన్ని ఆయనవేకాదు, ఇట్టివారు మన రచయితల్లో అధికంగా ఉన్నారు సంప్రదాయకులగు పెద్దల అభిప్రాయలన్నీ అట్టివే, ఆయన ఆ శ్రేణికి చెందినవాడు

వ్యక్తుల అనుభవాలు, ఆచారాలు, అభిరుచులు, సంస్కారాలు, భిన్నంగా ఉండుటచేత వారి వారి దృక్పధంలో రచన చేస్తుంటారు, పాఠకుల్లోకూడా భిన్న దృక్పధాలు గలవారు ఉండుటవల్ల వ్యతిరేకించే వారు యేకీభవించేవారై ఉండుట సమాజం, రచయిత తన సంస్కారాన్ననుసరించినట్టే, విమర్శకుడూ తన సంస్కారాన్ననుసరించి విమర్శిస్తాడు దాన్ని వ్యక్తిగతంగా తీసుకొనుట, వేరువిధంగా భావించుట మంచిదికాదు

చలంగారికి పూర్వం, కధాచక్రాన్ని విచిత్రరీతుల త్రిప్పినగౌరవం ఆయనకు కలదు. అసలు చలంగారిని కధకుడుగా ఆంధ్రావనికి అర్పించిన ప్రతిష్ఠకూడా ఆయనకే కలదు ఆయన ప్రభావంకూడా కొందరిపై కలదం. కధక చక్రవర్తియని ఆయన పేరుపొందారు, ఆంధ్ర కధకుల్లో పెద్దగా ప్రశంసింపబడినది దీక్షితులుగారే

ఆయన భావుకుడు, కవి, భక్తుడు, కాని ఇవి ఆయన ఆత్మను లోకానికి తెలపవు ఆయన శిశువు కవిఆత్మ వయోభేద రహితమైనది శిశువు అయినవాడే కవి కాగలడు

చిన్ని పిల్లల అమాయిక మనస్తత్వాన్ని, హృదయ సౌకుమార్యాన్ని దీక్షితలుగారివలె తెలిపినవారు తెనుగు కధా సాహిత్యములో లేరు, బాపిరాజుగారు కేవలం జానపదుడై, జానపద గేయాలను రచించినట్టే దీక్షితులుగారు కేవలం బాలుడై, గేయాలను కధలను చెప్పారు 'బాలానందం' శీర్షికలో 'భారతి' లో ప్రకటించిన వీరి కధలు పిల్లలకేగాక పెద్దలకుకూడా ఆనందం కలిగించేవే, సూరీ, సీతీ, వెంకీ, ఆయనకేగాక అందరకూ అభిమాన పాత్రలే.

పిల్లల కధల్లో - బాలవాఙ్మయములో వీరి పెద్దరికం నిరాక్షేపణీయమైనది, నిరుపమానమైనది

ఈ సత్యాన్నే చలంగారి వాక్యం ఇలా బలపరుస్తూ ఉన్నది.

"నా మార్గము స్త్రీయైనట్లే, మీ మార్గము శిశువుగా వును, మీ కధల నిండా శిశుత్వానికి, నేను ఆ మార్గం అందిస్తానా? స్త్రీ మీది ప్రేమకూ శిశువుమీది ప్రేమకూ - అట్టే భేదం ఉందా? ' (చలం ఉత్తరాలు)

దీక్షితులుగారు ఆంధ్రసాహిత్యంలో సంప్రదాయలోకానికి ప్రతినిధి అందుచేత ఆయన భావాలనుబట్టి భిన్నాభిప్రాయాలు కలవారుండుట సహజము బాలవాఙ్మయములో మాత్రము ఆయన కృషి కొనియాడని వారుండరు

ఆయన రచనలో కొన్ని సంప్రదాయక భావాలు ఉన్నప్పటికీ మొత్తంమీద ఆయన ప్రచారకుడుగా గాక, గొప్ప కధకుడుగా కన్పిస్తాడు

## దీక్షితులు - మాస్తి

మన దీక్షితులవంటి కధక చక్రవర్తి కన్నడ కధకులలో కలరు - 'మాస్తి' అని పేరుతో ప్రసిద్ధుడైన మాస్తి వెంకటేశయ్యంగార్ ఆయన కధలు మనకు అప్పుడప్పుడు 'కృష్ణాపత్రిక'లో కనపడెడివి

## దీక్షితులు - నారాయణమూర్తి

కీ॥శే॥ కొప్పర్తి నారాయణమూర్తిగారు "ప్రారంభవిద్య" పత్రికా సంపాదకులు, దీక్షితులుగారికీ, వీరికీ మైత్రికలదు, ఆ మైత్రే మరికొన్నిటకూడా కలదు, ఉభయులు సాహితీసమితి సభ్యులు, ఇద్దరూ విద్యాశాఖలో పనిచేసినవారే, దీక్షితులుగారి ప్రోత్సాహముచేతనే నారాయణమూర్తిగారు కధారచనకు కడంగినారు. దీక్షితులుగారి పంధాను అనుసరించిన వారిలో వీరొకరు కధా కల్పనలోను, శిశువుక్రీడలను వర్ణించుటలోను, హాస్యరసములోను, దీక్షితులుగారి ఛాయలు చెన్నారినవి నారాయణ మూర్తిగారి 'కధాకల్పవల్లి' కాంచండి

## దీక్షితులు - మరికొందరు

ఆంధ్ర కధకులలో దీక్షితులుగారి వలె ఆర్షసంప్రదాయాభి మతముగా నోరి నరసింహశాస్త్రి, విశ్వనాధ, శ్రీనివాస శిరోమణి, మొక్క పాటి నరసింహశాస్త్రి, టేకుమళ్ళ కామేశ్వరరావు గారలు కొన్ని కధలు రచించారు కాని దీక్షితులుగారి వలె పలుపోకడలు పోయినవారు లేరు

## దీక్షితులు - చలం

దీక్షితులుగారే కధారచనకు దారి చూపించారంటారు కొందరు కాదు చలంగారే కధకు 'టెక్నిక్' భిక్ష పెట్టారంటారు మరికొందరు మొత్తముమీద ఉభయుల వాదుమలోను, కొంత సత్యమున్నది పెద్దలు దీక్షితులుగారి మార్గానపోతే పిన్నలు చలంగారి దారిని నడిచారు

నవ్య కవిత్వములో గురజాడ, రాయప్రోలు ఎటుల మార్గదర్శకులయ్యారో, అట్లాగే కధానికకు వీరిరువురు మార్గదర్శకులయ్యారు

దీక్షితులుగారు సంప్రదాయకులు, నవనాగరికత అంటే ఏవగింపు, పల్లెటూరంటే పట్టరాని అభిమానము భక్తిలో తన్మయులు, వీరితో సంబంధించినది అంతా పవిత్రమే, వస్తువు, వాతావరణము అట్టిదే

చలంగారు విప్లవకారులు, సౌందర్యోపాసకులు, అన్నిటా వారిది నవ్యమార్గము

చలంగారి రచనతో ఎంత అశాంతి, తీక్షణత భౌతికవాంఛ కన్పించునో, దీక్షితులుగారి

రచనలో అంత శాంతి, మార్దవ, ఆముష్మిక చింతన కన్పించును

చలంగారు పతివ్రతలను పరిహాసపరిస్తే, దీక్షితులుగారు నవనాగరిక నారీమణులను నవ్వులపాలు చేశారు

దీక్షితులుగారి రచనలు, దీక్ష కలిగినవి, చలంగారి రచనలు చలనం పుట్టిస్తవి, దీక్షితులుగారి రచనలు హృదయానికి ఆహ్లాదమిచ్చి ఆత్మకు శాంతి చేకూరస్తవి చలంగారి రచనలు ఆలోచనను అశాంతిని ప్రేరేపిస్తవి

వీరిద్దరూ పౌరాణిక నాటికలను రచించారు దీక్షితులుగారు పురాణాల్లో పూడిపోయిన వాటికి సంప్రదాయాను గుణముగా సరసమైన వ్యాఖ్యానాలు చేశారు

చలంగారు పురాణాదర్శాలకు పూర్తిగా వ్యతిరేకంగా స్వీయాదర్శాలకు అనుగుణముగా వ్యాఖ్యానముచేసి విస్మితులను చేశారు తమ నాటికలలో

దీక్షితులుగారి రచన లధికముగా పూర్వకాలపువారికి ప్రియములు చలంగారి రచనలు నవీనభావప్రియులకు అభిమానము వేయేల? దీక్షితులుగారి రచనలు పాత అభిప్రాయములను పదిలపరచును చలం గారి రచనలు పాత అభిప్రాయములను పటాపంచలు చేయును

ఆశ్చర్యకరమైన సంగతేమంటే ఉత్తర దక్షిణ ధృవాలకు చెందిన వారు భయులు ప్రాణస్నేహితులు

వీరి స్నేహం ఆదర్శప్రాయమైనది. వీరుభయులు రమణమహర్షి యందనురక్తులు

కేవలం సంప్రదాయాన్నే అంటిపెట్టుకొని వుండాలనే దీక్షితులు గారి ఆశయం అభినందించతగినదికాదు

సంప్రదాయాన్ని పంపూర్ణంగా సంహరించ తలపెట్టిన చలంగారి కృషి సాగేదికాదు.

కేవలం సంప్రదాయంమీద ఆధారపడ్డ జాతి అధోగతికి పోతుంది

సంప్రదాయం సంపూర్ణంగా ఎన్నడు నాశనం చెందదు

సంప్రదాయం హేతుజ్ఞానం రెండూ రెండు కళ్ళే జాతికి ఆ రెంటిని గుర్తించి పాటించుటే శ్రేయస్కరము

"ఉన్నచోటు చాలును మీకు
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు.
ముందుకుపోతాం మేము" శ్రీశ్రీ

గొట్టిపాటి వెంకట సుబ్బయ్య

(అక్షరాభిషేకం నుంచి)

# చింతా దీక్షితులు కథలు - ఒక అనుభూతి

**ఆ** రాత్రి ఆ నాటకాన్ని ఎవరికయినా వినిపించంది నేను నిలవలేను నా రాత ప్రతిని చేత్తో పట్టుకుని ఆ రాత్రి చీకట్లో గోదావరి ఈదురు గాలిలో దిబ్బ మీది మా యింటినించి వూళ్ళోకి రెండు మైళ్ళు నడిచి చింతా దీక్షితులుగారి తలుపు తట్టాను దీక్షితులుగారు పైకి వచ్చి ఆశ్చర్యంతో చూశారు ఆయన చేతిలోని గుడ్డి దీపాన్ని అక్కడే పెట్టించి మాట లేకుండా నా నాటకాన్ని చదివి వినిపించి యింటికి వచ్చేశాను ''

చింతా దీక్షితులుగారిని గురించి తలుచుకున్నప్పుడల్లా "చలం' ఆత్మకధలోని ఈ వాక్యాలే జ్ఞాపకం వస్తుంటాయి నాకు '20 లలో రాజమండ్రి ట్రయినింగ్ కాలేజీలో పనిచేస్తుండే రోజులలో గుడిపాటి వెంకట చలం గారు తన సహోపాధ్యాయుడు, మిత్రుడు, గురుతుల్యుడు అయిన చింతా దీక్షితులుగారికి 'చిత్రాంగి' నాటకాన్ని వినిపించిన తీరు యిది '-కధ అయినా, నాటకం అయినా ఆ రోజుల్లో చలం రాసిన చాలా రచనలకు తొలి శ్రోత దీక్షితులు గారు. తొలుత చలాన్ని ప్రోత్సహించిన వారూ దీక్షితులుగారే, చలం మొదటి కధ ""రుక్మిణి' విని బాగుందని 'సాహితి'కి పంపించి అచ్చు వేయించినా, ఆ తర్వాతి కాలంలో రమణాశ్రమానికి తీసికెళ్ళి భక్తి 'రుచి' చూపించినా చలం అన్నట్టు ఆ "పల్టీ" లన్నింటికీ కారణం దీక్షితులుగారే!

యింతకూ చెప్పవచ్చేదేమిటంటే - చలానికీ, దీక్షితులుగారికీ భావాల్లో అభిప్రాయాల్లో పోలికలేదు దీక్షితులుగారు సంప్రదాయవాది భగవద్భక్తులు ఆచార వ్యవహారాల్లో నియమాలు పాటించేవారు. సరే - రమణాశ్రమానికి వెళ్లడానికి ముందు చలం సంగతి అందరికీ తెలిసిందే! (నెలరోజుల పాటు కార్తీక సోమవారాలుంటానని పందెం కాని మాట నిలబెట్టుకున్న తర్వాత దీక్షితులు గారిని హోటల్లో పులావ్ తినాలని చలం ఏడిపించడం జ్ఞాపకం వుందా? (చూః స్వీయ చరిత్ర) చిట్టచివరకు చలం దీక్షితులుగారి దోవకే వచ్చాడు కదా అనే విషయం ప్రస్తుతానికి అలా వుంచండి గానీ - యిన్ని భావవైరుధ్యాలు వున్నా వీరిద్దరి మధ్యా స్నేహం చివరి వరకూ నిలవడానికి కారణం కధకుడుగా దీక్షితులు గారి ఆలోచనా విధానంలో వున్న ప్రత్యేకత అనిపిస్తుంది

వందకు పైగా కధలు వ్రాసి చలానికి ముందు తెలుగు కథాసాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని పొందిన పేక్షితులు గారు - తన రచనల్లో వెర్రి తలలు వేస్తున్న ఆధునికతను హేళన చేసి వుండవచ్చు సంప్రదాయం పట్ల మక్కువను చూపించి వుండవచ్చు కాని వెలుతురును చూడలేని గుడ్లగూబ గుణం ఆయన రచనల్లో కనబడదు

క్రాపు చేసుకోవడం కన్నా జుట్టు పెంచుకోవడం మంచిదనీ - ఇంగ్లీషు చదువు చదవడం కన్నా సంస్కృతం అధ్యయనం చెయ్యిడం మంచిదనీ చెప్పి "అన్నీ మన వేదాల్లోనే వున్నాయిని" అంటూ

జబ్బులు చరుచుకునే కథకులు దీక్షితులుగారి సమకాలీనుల్లో చాలా మంది వుండవచ్చు కానీ వాళ్ళెవ్వరూ దీక్షితులు గారిలా "చిన్న" వంటి సొగసైన కథలు రాయలేదు - అని నా అభిప్రాయం

"చిన్న" కథలోని మహాలక్ష్మికి వాళ్ళ బావ రామారావుతో పెళ్ళి నిశ్చయం అయిన తర్వాత అతగాడిని ససేమిరా పెళ్లాడనంటూ ఆ అమ్మాయి భీష్మించుకుని కూర్చోవడం - ఆ కథ చదివిన వారికి జ్ఞాపకం వుందనుకుంటాను యిందుకు కారణం ఆమెకు రామారావు నచ్చక కాదు. కాకినాడ కాలేజీలో అతగాడు యింగ్లీషు చదువు చదువుతూ వుండడం పూర్వకాలం వాళ్లలా జుట్టు పెంచుకోకుండా క్రాపు చేయించుకొనడమూను

యిట్లాంటి పరిస్థితిలో ఆ 'మగమహారాజు ఏంచెయ్యాలి? యింకోడూ, యింకోడూ అయితే ఏం చేసేవారో కాని చిన్నను ఆరాధించే రామారావు మాత్రం ఆత్మపరీక్ష చేసుకొని "భర్త లోకం వేరు, భార్య లోకం వేరు, ఏ ఒక విషయంలో నయినా యిద్దరికీ సమాన దృష్టి వున్నదా? భర్తకు మేజోళ్ళు భార్యకు రవికెలు, భర్తకు మొగం మెరుపు బూడిద, భార్యకు పసుపు " అంటూ ఆలోచించి కాకినాడ కాలేజీ చదువు మానేశాడు విస్సన్న శాస్త్రులుగారి దగ్గర శాస్త్రాభ్యాసము ప్రారంభించాడు గురుకుల విద్యార్థిలాగా జుట్టు పెంచాడు మహాలక్ష్మి (చిన్న) మనసు దోచుకోగలిగాడు ఆమె మెచ్చుకోలుగా యిచ్చిన పువ్వును ఆప్యాయంగా జుట్టులో పెట్టుకున్నాడు కూడానూ!

యింతకూ - ఈ కథ గురించి యిక్కడ ప్రస్తావించడంలోని ఉద్దేశం - రామారావు ఛాందసం మాబాగా ఉందని చెప్పడం కోసం కాదు ఒక్క విషయాన్ని పాఠకుల దృష్టికి తీసుకురావడం కోసమే యిది వ్రాస్తున్నది స్త్రీ అభ్యున్నతి చాలా గొప్పగా జరిగిందని బాజాలు వాయించుకునే ఈ రోజుల్లో తన మనసులోని అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పి, తనకు నచ్చినట్టు వున్న మగవాణ్ణి మాత్రమే పెళ్ళాడతానని కుండబ్రద్దలు కొట్టినట్టు చెప్పగల ధైర్యం ఎంతమంది అమ్మాయిలకు వుంది? -- ఒక వేళ వాళ్ళకు అంతటి తెగువ వున్నప్పటికీ వాళ్ళ నమ్మకాలను 'గౌరవిద్దామనే' ఔదార్యం, సంస్కారం ఎంతమంది మగవాళ్ళలో వుంది? - అందుకే అంటున్నది 'చిన్న' కథలో వున్నది 'చిన్న' సందేశం కాదని 'గుడ్లగూబ' బాపతు కథకుడు యిట్లాంటి కథలు రాయలేడని.

'చిన్న'కు వున్న గడుసుదనం వటీరావు కథల్లోని వటీరావుకు కూడా వుంది (ఈవిడగారి పేరు 'కళావతి' - యింగ్లీషులో రాస్తే Kalavati - యిక దొరల సంప్రదాయంలో మొగుడిపేరు తోకగా చేరిస్తే 'వటీరావు' - అదీ సంగతి) ధనుర్మాసంలో మొగుడు నగర సంకీర్తన చెయ్యాలని ముచ్చట పడితే - అతగాడి చేత శివుడి ఫ్యాన్సీ డ్రెస్ వేయించి అందంగా 'ఫూల్' చేసి లేడీస్ క్లబ్బు వారి బహుమతి కొట్టేసిన క్లబ్బు భామ వటీరావు జ్ఞాపకం వచ్చినప్పుడు ముసి ముసి నవ్వులు నవ్వుకోకుండా వుండగలమా? పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారి రేడియో ప్రసంగాన్ని విని వటీరావు భారతీయ సంప్రదాయ ధర్మానికి దాసోహం అవుతుందేమోనని భర్తగారు ఆశపడితే వెనుకటి తరంలో పురుషులు స్త్రీలకు స్వహస్తాలతో అలంకారం చేసే వారనే ధర్మసూక్ష్మాన్ని మాత్రమే శాస్త్రిగారి ఉపన్యాసంలో

గ్రహించి " ఫేస్ పౌడరు, లిఫ్‌స్టిక్, స్నో, హెయిర్ క్లిప్స్, వగయిరా వస్తువులన్నీ మీ వద్దనే వుంచి సరియైన కాలంలో వాటిని నా పట్ల వినియోగిస్తూ వుండాలి " అని ప్రేమపూర్వకంగానే అనుకోండి కట్టుకున్నవాడికి శాసనం జారీచేసిన వటీరావును ఆ కథల పాఠకులు మరచిపోగలరా?

అయితే, గమనించదగ్గ విషయం ఏమిటంటే - సంప్రదాయాన్ని ఆరాధించిన మహాలక్ష్మి ('చిన్న' కథలో) ఆధునికుడైన రామారావును తన మార్గానికి తిప్పుకొనగలిగింది కాని - పాశ్చాత్య నాగరికత పట్ల వ్యామోహితురాలైన వటీరావు మాత్రం సంప్రదాయపరుడైన భర్తను తన మార్గానికి మళ్లించుకోలేకపోయింది దీక్షితులు గారి కథల్లోని 'దృక్పథం' గురించి చెప్పడానికి ఇదొక తార్కాణం అనుకుంటాను

'చిన్న' కథలో వ్యక్తిత్వం గల అమ్మాయి వుంది వటీరావు కథల్లో పాశ్చాత్య నాగరికతా బానిసత్వంలో మ్రగ్గే క్లబ్బు భామ వున్నది దీక్షితులు గారు తన కథలో వ్యక్తిత్వం గల అమ్మాయికి పెద్ద పీట వేశారు క్లబ్బు భామను ఏడిపించారు రాజకీయంగా, సాంస్కృతికంగా బానిసత్వంలో జాతి మ్రగ్గుతున్న రోజుల్లో దీక్షితులు గారు తన కథల్లో ప్రసరించిన 'వెలుగు' ఇది

కథకుల్లో భావకవి వంటివారు దీక్షితులుగారు (భావ కవులకు ఇంట్లో టీ పార్టీ ఏర్పాటు చెయ్యడం పట్ల ఆసక్తి గల వటీరావును గేలిచెయ్యడం సంగతి అలా వుంచండి ) చాలామంది రసహృదయుల్లాగానే ఆయనకూ ప్రకృతి అందాలు అంటే ఇష్టం కాని - ఒక విషయాన్ని మాత్రం రాయక తప్పదు

"గొల్లపిల్లలతో బయలుదేరి పశువుల్ని తోలుకుంటూ వెళ్లి, ఏ చెట్టు నీడలోనో కూర్చుని ప్రకృతితో ఊసులాడుకుంటూ వుంటే ఎంత బాగుంటుంది! చద్దిమూటలు విప్పుకుని చెట్లనీడల్లో తిని పశువులతో పాటు ఆ గోదావరి నీరు త్రాగి ఆ చెట్లలో ఆడుకుంటూ వుంటే! ప్రకృతిలో అక్కడే నిద్రపోతే!" ('గోదావరి నవ్వింది' కథలో) అనే కలవరింపులో భావకవిత్వపు వాసన వుండవచ్చు కాని, కథకుడుగా దీక్షితులు గారు సాగించిన ప్రయాణం అంతటితో ఆగలేదు పెట్టుబడిదారీ సమాజపు తీర్పుకూ, స్వార్థపు తడి అంటని ఆలోచనకూ మధ్య వున్న 'అభిప్రాయభేదాన్ని' ఆవిష్కరించగల శక్తి కూడా ఆయన కలానికి వున్నది

'అభిప్రాయభేదం' కథలో కన్న కూతురును రకరకాల పువ్వుల మాలలతో అలంకరించి మురిసిన ఓ యూనాది మనిషి - బంగారు కంటె సొగసేమిటో చూద్దామని కలవారి ఆభరణాన్ని తీసి కూతురుకు అలంకరించిన తర్వాత "తంగేడు పువ్వుల వల్ల కలిగే అందం కంటె ఈ బంగారు కంటె వల్ల ఏమి ఎక్కువ ఆనందం కలిగింది?" అనుకొనడంతో కడుపు నిండిన కవితాత్మక పేలాపన లేదు అచ్చమైన నిజాయితీ వున్నది

ఒకరి వస్తువును మరొకరు తియ్యడం జరిగింది కాబట్టి యూనాది మనిషిని 'దొంగ' అన్నది సమాజం ఒకసారి తీసి చూచి బంగారపు అల్పత్వం తెలుసుకున్నంతలో దొంగతనం

ఏమున్నదనుకున్నది ఆ బీదరాలు ఈ 'అభిప్రాయభేదం'లోనే పెట్టుబడిదారీ వ్యవస్థ మూలకధ వున్నది సమకాలీన సమాజంలోని వికృతుల పట్ల వెనుకటి తరానికి చెందిన కధకుడు వ్యక్తీకరించిన ఆవేదనకు అక్షర రూపం ఈ కధ

చింతా దీక్షితులు గారి గురించి రాసేటప్పుడు తప్పనిసరిగా చెప్పవలసిన మరో అంశం - బాల వాఙ్మయబ్రహ్మగా ఆయన రచించిన మరపురాని పిల్లల కధలు దీక్షితులు గారి పేరు చెప్పేటప్పటికి - ఒకప్పటి భారతిలో ఆయన నిర్వహించిన 'బాలానందం' శీర్షిక. 'లీలాసుందరి', 'శరబాల' వంటి పిల్లల కధలు, 'సూరి, సీతి, వెంకి' వంటి బాలపాత్రలు మనోవీధిలో మెదలుతాయి "వెనుకటి కాలం నుంచీ తెలుగుదేశంలో బాల బాలికల కోసం ఉద్దేశించబడిన సారస్వతం ప్రచారంలో వుంది. కాని కవులు, గ్రంధకర్తలూ, కావ్యనాటకాదులు తాటాకుల మీద వ్రాసి వున్నట్టుగా బాలసారస్వతం వ్రాసి వుండలేదు లిఖిత రూపము వహించి గ్రంధస్తమై వున్న బాలుర గ్రంధాలలో ముఖ్యముగా పేర్కొనదగ్గ పంచతంత్రమును మన దౌర్భాగ్యం వలన పెద్దలు తమ వశం చేసుకుని బాలురకు దక్కకుండా చేశారు చిన్నయసూరి, వీరేశలింగం, వేంకటరత్నము బాలురకు అలవిగాని భాషలో వచనముగా వ్రాసి పండితులకు మాత్రమే పనికివచ్చే గ్రంధంగా చేసుకున్నారు" అంటూ దీక్షితులుగారు వ్యక్తం చేసిన ఆవేదన ("ప్రజా వాఙ్మయము" అనే పుస్తకంలో) బాల సాహిత్యాభిమానులు మరచిపోలేరనుకుంటాను

1960 సంవత్సరంలో దీక్షితులు గారు మరణించేనాటికి ఆయన రాసిన (సుమారు) వంద కధల్లో కొన్ని మాత్రమే "ఏకాదశి", "హాస్యకధలు", "వటీరావు కధలు", "దాసరి పాట" వంటి మకుటాలతో పుస్తక రూపంలో వచ్చాయి మిగతావి "భారతి", "ప్రతిభ", "సఖి", వంటి ఆనాటి పత్రికలలో వుండిపోయాయి పుస్తక రూపంలో వచ్చినవి కూడా చాలా వరకు ప్రస్తుతం మార్కెట్‌లో అలభ్యం ఒకప్పుడు (1956లో) "దాసరి పాట" అనే పేరుతో వచ్చిన కధా సంకలనం మాత్రం ఇటీవల "చింతా దీక్షితులు కధలు" అనే పేరిట పునర్ముద్రించబడింది గాని, దీక్షితులు గారి కధలన్నింటినీ పుస్తకరూపంలో తీసుకువచ్చే ప్రయత్నం చెయ్యవలసి వుంది అది వీలుకాని పక్షంలో - కనీసం ఆయన కధల్లోని మంచి కధలను, ఆయన దృక్పధానికి ప్రాతినిధ్యం వహించే కధలను ఏరి ఒక సంపుటిగా వెలువరించవలసి వుంది దీక్షితులుగారి శతజయంతి సంవత్సరం (1991)లో ఆ పని జరగగలదనే ఆకాంక్షిద్దాం

- కోడూరి శ్రీరామమూర్తి

(1991 చింతా దీక్షితులు శతజయంతి సంవత్సరం సందర్భంగా
ఆంధ్రజ్యోతి దినపత్రిక 4 3 91 సంచికనుంచి)

# బాలవాఙ్మయ బ్రహ్మ
# చింతా దీక్షితులు

చింతా దీక్షితులుగారి పేరు చెబితే వెంటనే బాలవాఙ్మయం గుర్తుకు వస్తుంది బాల సాహిత్య సౌరభాలు గుభాళిస్తాయి వారి విశిష్ట రచనలు లక్కపిడతలు, సూరీ సీతి వెంకీ, హనుమంతుడితోక తదితరాలు గుర్తుకు వస్తాయి బాలవాఙ్మయబ్రహ్మ చింతా దీక్షితులుగారి శతజయంతి ఉత్సవాలను జరుపుకుంటూ వారి సాహిత్య సేవలను స్మరించుకుంటున్న సందర్భంలో - ముఖ్యంగా బాలవాఙ్మయరంగంలో వారి కృషి విశేషాలను కొన్ని ముచ్చటించుకుని, వారిని స్మరించుకోవడం సముచితంగా ఉండగలదు

లిపి, రాత, రచన ఎప్పట్నుంచి ప్రారంభం అయ్యాయి అనేదానికి ప్రౌఢసాహిత్యంలో శాసనాలు, చారిత్రక శకలాలవంటి కొన్ని ఆధారాలు లభిస్తాయి కాని బాల సాహిత్యాకి అలాటి ఆధారాలు లేవు లాలిపాటలు, జోలపాటలు ఏనాటివో ఇతమిత్థంగా ఎవరూ చెప్పలేము ఈ పాటలకు కర్తలెవరో తెలియదు బిడ్డల మనసెరిగిన తల్లులు, తల్లిప్రేమకు పాత్రమైన బిడ్డల రచనలను ఆలంబనగా పరిగణిస్తున్నారు ఈ అంశాన్ని బలపరుస్తూ చింతా దీక్షితులుగారు "బాలవాఙ్మయంలో చాల పాటలకు తల్లిహృదయమే కర్తృత్వం వహిస్తుంది' అంటారు వాల్మీకి ఆదికావ్యానికి ప్రేరణ విషాదం ఐతే - బాల సాహిత్యానికి ప్రోత్సాహకారి తల్లి హృదయం దీన్ని అంగీకరిస్తే తల్లి, తల్లిఒడి, బిడ్డలు భువిమీద ప్రభవించిన కాలం నుంచీ బాల వాఙ్మయం ఉందని ఒప్పుకోవాలి వాఙ్మయంలో తొలిరచనలు బాలలగీతాలే అని అంగీకరిస్తే - భాషాభివృద్ధి, పదజాలం, భావసంపద పెరిగాక మౌఖికరూపంలో, రాతరూపంలో వెలుగులోకి వచ్చిన ప్రౌఢసాహిత్యానికి తల్లివేరు బాల వాఙ్మయం అనే విషయం ఆలోచింపవలసిన అంశం

**చారిత్రక నేపథ్యం :**

విదేశీపాలనలో దేశం పలురంగాలలో పతనాన్ని చవిచూచింది సామాజిక, ఆర్థికవ్యవస్థలు ఛిన్నాభిన్నమయ్యాయి నిర్జీవమైన సాంప్రదాయాలు, నేలలో కూరుకుపోయి శిలారూపం దాల్చిన ఆచారాలు, అర్థం పర్థం లేని ఆనవాయితీలు, మూఢనమ్మకాలు - అవిద్య, జాతి జీవన ప్రవంతిని ఇంకిపోయేటట్లు చేశాయి దీన్ని అరబిందో, "మహాక్షయం" (Great decay) అన్నారు ఈ తరుణంలో భారతీయ పునరుజ్జీవన దూతలుగా రాజారామ్మోహనరాయ్ వంటి వారు రంగప్రవేశం చేసి - ముందెవ్వరూ ప్రయత్నించని రీతిలో ప్రాక్పశ్చిమ సంస్కృతుల సమన్వయాలకు కృషిచేశారు సామాజిక స్పృహపై కనువిప్పు కలిగించారు ప్రజాఉద్యమాలకు బీజావాపనచేసి అన్నిటికీ వెన్నుదట్టి

దన్నుగా నిలిచారు దీనికితోడు వెన్నెలకంటి సుబ్బారావు (1784 - 1839) గారి సూచనలను అనుసరించి మద్రాసు స్కూల్ బుక్‌సొసైటీ పాఠ్యగ్రంథాల రచనలో చేసిన మార్పులు, వ్యవహారిక రచనలకు దోహదం, వీరేశలింగం పంతులుగారి సంఘసంస్కరణ ఉద్యమాలు, విద్యారంగంలో వచ్చిన మార్పులు, గ్రంథాల ప్రచురణ, రాజకీయ స్పృహ బాలసాహిత్యరచనకు ప్రోత్సాహకాలుగా పునాదులు వేశాయి

**బాలవాఙ్మయ వైతాళికులు :**

తల్లుల, బిడ్డలపరంగా అనాదిగా జాలువారిన గేయాలు, కథలు, పొడుపుకథలు తదితరాలతోబాటు, గత శతాబ్ది తుదిపాదం నుంచి రచయితల పరంగా బాలసాహిత్యం వెలువడింది. ప్రౌఢవాఙ్మయ రచనలో లబ్ధ ప్రతిష్ఠులైన కందుకూరి వీరేశలింగం (1848 - 1919), గురజాడఅప్పారావు ((1862 - 1915, ఓలేటి పార్వతీశకవి (1882 - 1955), బాలాంత్రపు వెంకటరావు (1881 - 1973), వావిలికొలను సుబ్బారావు (1883 - 1936), గిడుగు వెంకటసీతాపతి(1885 - 1968), ఏటుకూరి వెంకటనరసయ్య (1911 - 1949) ప్రభృతులు పిల్లలకోసం ఎన్నో ఉత్తమ రచనలు చేశారు ఐతే - న్యాయపతి రాఘవరావు (1905 - 1984), న్యాయపతి కామేశ్వరి (1908 - 1980), ఏడిద కామేశ్వరరావు (1913 - 1996) తొలిదినాలలో బాలుల కోసమే ప్రత్యేకంగా రచనలు చేశారు ఈ తొలితరం ప్రముఖులలో బాలవాఙ్మయంలో, విశిష్ట రచనలుగా ఎంచదగిన రచనలు చేసిన చింతా దీక్షితులుగారి కృషి ప్రత్యేకమైనది.

**దీక్షితులుగారి ప్రవేశం :**

బాల సాహిత్యరంగంలో చింతా దీక్షితులుగారి ప్రవేశం, ఆరంగానికి జవ, జీవాలు, గుర్తింపు సమకూర్చింది ఆ రంగంలో వారికొక సుస్థిర స్థానం ఏర్పడింది వారు చేసిన ఉపాధ్యాయవృత్తి ఈరంగంలో మరింత చొరవగా పనిచేయడానికి, బాలల మనోభావనపు లోతులు పరిశీలించడానికి అవకాశం కలిగింది దీక్షితులుగారు తూర్పుగోదావరి జిల్లా దంగేడు గ్రామంలో 1891లో ఒక సంప్రదాయ కుటుంబంలో జన్మించారు స్వగ్రామంలో ప్రాథమిక విద్య పూర్తి చేసుకుని, రాజమండ్రిలో బి ఎ , ఎమ్ టి పూర్తిచేశారు పిన్నవయసులో ప్రభుత్వశాఖలో ఉపాధ్యాయపదవిలో చేరి అందు పలు పదవులు నిర్వహించారు అందలి ఆనుపానులు గ్రహించారు 20 ఏళ్ల ప్రాయంలో రచనలు ప్రారంభించారు తొలుత చిత్రలేఖ - అనే నవల, కవికన్య - అనే గేయాలను రాశారు నేడివి లభ్యం కావడంలేదు తదుపరి వారి దృష్టి బాలవాఙ్మయం మీద ప్రసరించింది బాలల కోసం ఎన్నో గేయాలను రాశారు పల్లెల్లో పిల్లలు పాడుకునే పలు గేయాలను సేకరించారు వీటిని తొలుత ఆంధ్రపత్రిక దినపత్రికలో, వార పత్రికలో ప్రచురించారు పిల్లల చిత్తవృత్తులను పరిశీలించి వారు చదువుకుని ఆనందించే రీతిలో సూరీ, సీతీ, వెంకీ - శీర్షికలో కథలు రాసి భారతి - మాసపత్రికలో 1931నుంచి ప్రచురించారు ఆనాడు పిల్లలకోసం ప్రత్యేకంగా పత్రికలు లేవు గనుక పిల్లలు 'భారతి'

చదువుకుని ఎంతో ఆనందించేవారు అనంతరం బాలసాహిత్య రచన జీవితాశయంగా పెట్టుకుని అపారమైన సంఖ్యలో రచనలు చేశారు నేడు ముద్రితరూపంలో బాలవాఙ్మయంలో ఈ దిగువ చూపిన గ్రంధాలు లభ్యమౌతున్నాయి

1 లక్కపిడతలు - బాలల గేయాలు (హనుమంతుని తోక - అనే గేయ కధతో సహా)
2 నివేదన - రమణమహర్షికి నివేదనలో బాలగేయాలు
3 సూరీ - సీతీ - వెంకీ - పిల్లల కధల సంపుటి
4 ఎన్నో చేస్తాను - పిల్లల కధల సంపుటి
5 బంగారు పిలక - వినోదాత్మక పెద్దకధ
6 లీలాసుందరి - పిల్లల పెద్దకధ
7 గోపీమోహినీ - అద్భుత పిల్లల నవల
8 శంపాలత - అద్భుత పిల్లల నవలిక
9 లీలావాచకం - ప్రాధమిక విద్యా వాచకాలు

ఇవిగాక పెద్దలకోసం ఎన్నో కధలు, నాటికలు రాశారు ఇతర రచనలు చేశారు మినూ మాసానీ రచన "అవర్ ఇండియా" ను మన భారత్ పేరుతో అనువదించారు భారత మాజీ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ రచన ప్రపంచచరిత్రలో కొంతభాగం అనువదించారు. రమణమహర్షి చెంతచేరాక గేయరూపంలో భగవద్గీత రాశారు ఇలా ఎన్ని రచనలు చేసినా 'బాలవాఙ్మయ బ్రహ్మ' గా సాహిత్యంలో స్థిరపడిపోయారు వారి బాలసాహిత్య రచనలు కొన్ని పరిశీలిద్దాం

**లక్కపిడతలు**

ఇది పూర్తిగా బాలల గేయసంపుటి, ఇంతకు పూర్వం భారతి, అనసూయ, ఆంధ్రపత్రిక, ప్రతిభ - మొదలగు పత్రికలలో అచ్చయిన బాలల గేయాలు 1947లో తొలుత తారాజువ్వలా గ్రంధరూపంలోకి వచ్చింది 1949లో బాలసాహిత్యరచనలో భారత ప్రభుత్వ ప్రధమ బహుమతి అందుకున్న ప్రశస్థ రచనల సంపుటి ఇది బాలసాహిత్యంలో మణిపూస ఈ సంపుటం పిల్లలు సులభంగా చదువుకుని, ఆడుకుని పాడుకొనే గేయాలు ఇందు చాలా ఉన్నాయి

బాజాలురా నాన్న, బాజాలు
బాజాలు వచ్చాయి బాజాలు
అమ్మనీ పిలువరా బాజాలు
అక్కనీ పిలువరా బాజాలు - ఇంకా
గంధం మెడకూ పూసుకునీ
పసుపు కుంకుమ పెట్టుకుని

కంటికి కాటుక పెట్టుకుని

ఆడవె ఆడవె అమ్మణ్ణి!

వంటి గేయాలు బాలలలోకంలో ఎంతో ప్రచారమయ్యాయి ఈ సంపుటిలో మరో మంచిగేయం హనుమంతుని తోక ఇందు రామాయణంలోని లంకాదహనఘట్టాన్ని ఆధారంగా తీసుకుని బాలలలో ఉత్సాహం ఉరకలు వేసి, ఆనందడోలికలలో తేలియాడేలా రాశారు రామాయ్దణసుందరకాండకు ఈ గేయం చక్కని ప్రతిరూపం లక్కపిడతలు - గ్రంధంలోని ప్రతిగేయమూ బాలలను హత్తుకొనే రచనే

**నివేదన .**

ఇది దీక్షితులుగారి రచనలలో మెరుగైన రచన దీక్షితులుగారు రమణాశ్రమానికి చేరువైన పిదప కూడా బాలవాఙ్మయానికి దూరం కాలేదు రమణమహర్షి ప్రేరణలతో కొన్ని గేయాలను, అనుభవాలను, అనుభూతులను రాసి నివేదన పేరుతో ప్రచురించారు

ఎంత పిలిచినా

ఓయని పలుకవు

ఏమి చేతురా

ఓ రమణా!

ఎక్కడ నుందువో?

ఎట్లు పిలుచుటో?

చెప్పరాదురా

ఓ రమణా!

ఆటలు నీవే

పాటలు నీవే

అన్నీనీవే

అవునా రమణా?

ఆటలనాడీ,

పాటలు పాడీ

నిన్ను కొలిచెదము

రారా రమణా!

ఇలా రమణ మహర్షి నివేదనలో గేయరచన సాగుతుంది

## సూరీ సీతీ వెంకీ .

పిల్లలకోసం ప్రత్యేకంగా సామాజిక నేపథ్యంలో వారు చదువుకొని ఆనందించే కథలు లేని తరుణంలో చింతా దీక్షితులుగారు భారతి మాసపత్రికలో ప్రజోత్పత్తినామ సంవత్సరం నుంచి మాసం మాసం బాలానందం శీర్షికలో సూరీ సీతీ వెంకీ కథలను ప్రచురించారు ఇందు పేరంటం, తీర్థం, పొడుపు కథలు, బొమ్మరిల్లు, భట్రాజు, సంకురాత్రి, జైలు ప్రవేశం, గుజ్జెన్నగూడు, అమ్మనన్నెందుకు కొట్టాలి?, సూపరెంటు కూతురు మొదలగు కథలు గ్రంథరూపంలో కూడా వెలువడ్డాయి

ఈ కథలు తెలుగు సంస్కృతీ స్రవంతికి దర్పణాలు ఇవి తెలుగువారి పండుగలు, పబ్బాలు, తీర్థాలు, పేరంటాలు, కట్టు - బొట్టు, నగా - నట్ర, జీవితవిధానం, కుటుంబవ్యవస్థ తదితర అంశాలకు అద్దం పట్టాయి ఈ కథలలో తొలి కథ పేరంటం సూరి అరుగుచివర కూర్చుని కాళ్లు వేళ్ళాడేసుకుని ఊపుతూ, ఎదురుగుండా గడ్డిమేస్తున్న మేకపిల్లలకేసి చూస్తూ ఇలా పాడుకుంటోంది

అమ్మా నాకు తలదువ్వే
కాళ్ళకు గజ్జెలు కట్టవుటే
పేరంటానికి వెళతాను
కాళ్లకు పసుపూ పూస్తారు
చుట్టూ పారాణి పెడతారు
శనగలు వాయనం ఇస్తారు
అప్పుడు ఇంటికి వస్తాను
పశువులు ఇంటికి వచ్చాక
పాలూ బువ్వా తింటాను

పేరంటం, పసుపు, పారాణి, శనగలు, వాయనంతో ఈకథలో గ్రామీణ జీవితం రేఖాచిత్రంగా వివరించారు పొడుపుకథలు అనే కథలో పిల్లలు పొడుపుకథలను పొడుచుకుంటూ - విడుచుకుంటూ ఎలా ఆనందంగా గడిపేతీరు ఎంతో వినోదాత్మకంగా వివరించారు ఇందలి గొలుసుపాట (దీన్నే తొక్కుపలుకు అంటారు ) పిల్లల భాషా సంపద, పదజాలాన్ని పెంచడానికి తోడ్పడుతుంది సంకురాత్రి కథ - ముఖ్యంగా పల్లెపట్టులలో వైభవోపేతంగా జరిగే సంక్రాంతి రోచిస్సులను వెదజల్లుతుంది సంస్కృతీ విజయపరంపరను ముందు తరాలవారికి అందిస్తుంది ఈ సంకలనంలో మరో మంచికథ "అమ్మ నన్నెందుకు కొట్టాలి?" అనేది ఈ కథ బాలల మనోవిశ్లేషణకు నిలువెత్తు అద్దం అమ్మ కొట్టాక సీతి అలిగింది మూల కూచుంది ఏడ్చింది ఇలా అనుకొంది "అమ్మ నన్నెందుకు కొట్టాలి? నేనేం చేవానేమిటి? నన్నెందుకు కొట్టాలి? నాన్నొచ్చాక చెప్పనా ఏమిటి? నాన్నా నాన్నా అమ్మ నన్ను కొట్టింది ఊరికే ఉత్తి పుణ్యాన్నే కొట్టింది నేనేం చెయ్యందే కొట్టింది నాన్నా' అని చెబుతుందట అపుడు నాన్న "మీ అమ్మను నేను కోప్పడతాలే ఊరుకో" అని ఊరడిస్తారని

అనుకుంటుంది సీతి  ఇలా పిల్లల మనోసాగర పారమ్యాన్ని చూడడం దీక్షితులుగారికే చెల్లు  ఈ సంకలనంలోని ప్రతికథా పిల్లల ఆలోచనలకు, అలవాట్లకు దివిటీ చూపింది

## ఎన్నో చేస్తాను :

దీక్షితులుగారిది మరో కథలసంపుటి "ఎన్నో చేస్తాను" అనేది  నాన్న చూడకుండా ఉంటేనా ఎన్నో చేస్తాను అంటాడు ఒక గడుగ్గాయి  ఆ గడుసుపిండం ధోరణి ఇలా ఉంటుంది. నాన్న ఇంట్లో లేకపోతే "నాన్నగదిలోకి పిల్లి పిల్లలాగ చప్పుడు చెయ్యకుండా వెడతాను. ఆపళంగా లోపల తలుపు గడియ వేస్తాను  నాన్న పంచ కట్టుకుంటాను  నాన్న పెద్దకోటు వేసుకుంటాను  పెద్ద బూట్సు, జోడు సులోచనాలు పెట్టుకుంటాను  చేత్తో కర్ర పుచ్చుకుంటాను  నాన్న వాచీ చెవి దగ్గర పెట్టుకుని చూసి ఒక్కమారు గిర్రున తిప్పేస్తాను  అప్పుడు కోటు జేబులో వేసుకుంటాను  గది తలుపు తీసి వీధిలోకి షికారు వెడతాను  తిన్నగా బొమ్మల దుకాణం దగ్గరకు వెళ్ళి ఆ బొమ్మలన్నీ కొనేస్తాను " ఇలా సాగుతుంది ఆ బాలుని ఆలోచన  కాస్త ఊతం ఇస్తే ప్రతిపిల్లవాడూ ఇలాగే ఆలోచిస్తాడు  ఇలా పిల్లలలోకి దీక్షితులుగారు పరకాయ ప్రవేశం చేసి అచ్చం వారిలాగే మాట్లాడారు  ఆలోచించారు బాలల లోకంలో సేదదీర్చుకున్నారు  నీతిపారము - అనే కథలో పిల్లలకు తగిన సమయంలో, తగిన విధంగా నీతి బోధించవలసిన అవసరాన్ని ధ్వన్యాత్మకంగా వివరిస్తారు  ఇలా ప్రతికథను పిల్లలు హాయిగా చదువుకోవచ్చు  వారి ఆలోచనా పరిధిని పెంచుకోవచ్చు

## లీలాసుందరి .

దీక్షితులుగారి రచనలలో బాగా ప్రచారం పొందిన నవలిక లీలాసుందరి. పిల్లల మనస్తత్వాన్ని యీ నవలిక చిత్రిస్తుంది  ఇది ఫాంటసీ రచన  వనబాల అనే రాక్షసి తన కుమార్తెను పోగొట్టుకుంది కనుపించిన ఆడపిల్లలను ఎత్తుకొని పోయి, వాళ్ళను తన మాయోపాయంచేత చిలుకలుగా, గోరువంకలుగా, జింకలుగా - ఎలా కావాలంటే ఆలా మార్చుకుని ఆడుకునేది  వనబాల లీలాసుందరి అనే బాలికను అలాగే అపహరిస్తుంది  బంధిస్తుంది  ఐతే లీలాసుందరి వనబాల నుంచి కొన్ని రహస్యాలు గమనించి, ఆమెవద్ద బంగారుకడ్డీని అపహరించి - రాజమౌళి అనే రాకుమారుని సాయంతో బయట పడుతుంది  తల్లిదండ్రులను చేరుతుంది  రాకుమారుని వివాహం చేసుకుంటుంది బుద్ధిబలం, సాహసం ఉంటే మాయావులను సైతం మట్టుపెట్టి బయటపడవచ్చుని ఈ నవలిక చెబుతుంది  ఇది చక్కని కాల్పనిక రచన  ఇందలి గేయాలు కర్ణపేయాలు

## గోపీమోహిని :

ఇది కూడా దీక్షితులుగారి మరొక ఫాంటసీ నవల "అద్భుతగాధలు, దేవతల కథలు" ఎక్కువగా చదివిస్తే - వారిలో ఆలోచనా పరిజ్ఞానం పెరుగుతుందని" షార్లెట్ బూహ్లర్ వంటి విద్యావేత్తలతో దీక్షితులుగారు ఏకీభవిస్తూ ఈ రచన చేశారనిపిస్తుంది  గోపీమోహిని - నవలలో శివనాయకుడు ఒక రాకుమారుడు  అతనికి ఇంద్రజాల విద్యలు నేర్చుకోవాలనిపించింది  ఒక రోజు

అతనికి ఒక ముదుసలి కనిపించి "నీవు హిమాలయపర్వతాలకు వెళితే అచట ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉంటాడు అతని వద్ద వెళ్లి శిష్యరికం చేస్తే ఆ విద్యలన్నీ చెబుతాడు" అని సలహా ఇచ్చాడు ఆ ప్రకారం రాకుమారుడు పలు కష్టాలకు ఓర్చి హిమాలయాలను చేరుకుని మునివద్ద ఇంద్రజాల విద్యలు నేర్చుకుంటాడు సమీపరాజ్యంలోని గోపీమోహినిని చెరనుంచి విడిపించి ఆమెను వివాహం చేసుకుంటాడు పట్టుదల ఉంటే ఏదైనా సాధించవచ్చు అందుకు సాహసం, ఓర్పు, త్యాగం కావాలని చెబుతుంది ఈ అద్భుత నవల కథ చెప్పడంలో దీక్షితులుగారు పిల్లలందర్నీ మరోలోకానికి తీసుకువెళతారు అది దీక్షితులుగారి కథాకథన కౌశలం

**శంపాలత**

దీక్షితులగారి మరో ఫాంటసీ నవల శంపాలత ఒక ఊళ్ళో ఒక రైతు ఉన్నాడు అతనికి బిడ్డలు లేరు ఒకరోజున రైతు భార్యకు మల్లిఖార్జున స్వామి కలలో కనిపించి, ఎవరైనా ఆమెకడుపున పుట్టేందుకు అంగీకరిస్తే ఆమెకు సంతాన ప్రాప్తి జరుగుతుందిని చెప్పి అంతర్ధానమౌతాడు అందుకామె అంగీకరిస్తుంది బ్రహ్మరాక్షసులు వారికడుపున పుడతారు వారిని శంపాలత, నీరదశ్యాముడు అని పిలుస్తారు ఈ ఇద్దరు పిల్లలు ఒక రోజున పొలంలో ఆడుకుంటూ మాయమౌతారు వారికి నాగకన్య బంగారం, రత్నాలు ఇస్తుంది తల్లిదండ్రులను వెతుక్కుంటూ శ్రీశైలం చేరతారు గట్టుమీద శంపాలతను కూర్చుండబెట్టి నీరదశ్యాముడు పాతాళగంగలో మునుగుతాడు నాగకన్య అతన్ని నాగలోకానికి తీసుకువెళ్తుంది నాగకన్యకు నీరదశ్యాముడికి నాగలోకంలో వివాహం జరుగుతుంది శంపాలత గట్టుమీదే కూర్చుని అన్నకోసం ఎదురుచూస్తుంది అన్నరాడు ఇలా ఏళ్ళూ పూళ్ళూ గడిచాయి చివరకు నిరాశతో మరణించి, పక్షిగా పునర్జన్మ ఎత్తుతుంది అడవుల్లో సంచరిస్తూ "ఓ అన్నా ! ఓ అన్నా!" అని పిలుస్తూ ఉంటుంది ఈనాటికి ఈ మాటలు వినబడుతూనే ఉంటాయిని కొందరంటారు ఇలా ఎంలో ఉత్సాహంగా అనేక కల్పనలతో ఈ నవల సాగుతుంది పిల్లలు ఈ నవలను ఎంతో ఆసక్తిగా చదివి మరోలోకంలో కొంతసేపు విహరిస్తారు ఈ ఫాంటసీ నవలలు పిల్లల ఆలోచనా శక్తిని, సృజనాత్మక శక్తిని పెంచుతాయని విద్యావేత్తల విశ్వాసం

**లీలావాచకం :**

1950వ శకంలో ప్రాథమిక విద్యాస్థాయిలో పాఠ్యగ్రంథాలను ప్రయివేటు ప్రచురణ కర్తలే ముద్రించేవారు ఆ తరుణంలో బాగా ప్రచారంలో గలది ఒకటినుంచి ఐదు తరగతులకు నిర్దేశించిన లీలావాచకం దీన్ని దీక్షితులుగారు రూపొందిచారు. రచయితగా ఉపాధ్యాయుడుగా తన అనుభవాలను మేళవించి ఈ వాచకాన్ని రూపొందించినందున వీటిని ఉపాధ్యాయులు, విద్యార్థులు ఎక్కువగా వినియోగించారు ప్రచారంగల పిల్లల జానపదగేయాలు, వాడుక భాషలోగల పదాలను ఎక్కుగా చేర్చడం ఈ వాచకాల ప్రత్యేకత

**దీక్షితులుగారి ప్రభావం :**

దీక్షితులుగారు "బాల వాఙ్మయం" అనే వ్యాసం రాస్తూ "మన తెలుగు గ్రంథకర్తల దృష్టిలో

బాలురే లేరు వారి దృష్టిలో ఉన్నది ఆత్మ పాండిత్యప్రకర్ష ఒక్కటే". ఈ లోపాన్ని సరిదిద్దడం కోసం దీక్షితులుగారు సరళమైన వాడుకభాషలో, పిల్లలకు అర్థమయ్యే రీతిలో, సున్నితమైన ఆలోచనలతో పలురచనలు చేశారు ఈ రచనలను పిల్లలు ఆనందించారు దీక్షితులుగారి కథలు, నవలలు చదువుతూ పిల్లలు ఊహాలోకంలోకి వెళ్ళిపోయారు పిచ్చుకలతో పలికారు చిలుకలతో మాట్లాడారు తివాచీ ఎక్కి కూర్చుని మబ్బుల్లో మాయమైనారు నాగలోకానికి వెళ్ళి నాగకన్యను వివాహం చేసుకున్నారు వింత వింతలోకాలు చూశారు ఈ రచనలు పిల్లలలో చదివే అలవాటును పెంచుతాయి పలుకుబడిని నేర్పుతాయి. మాతృభాషాభిమానాన్ని, జాతీయతను పెంచుతాయి మంచి కథలు చదవడంతో, వినడంతో వారిలో సిగ్గు, సంకోచం తొలగిపోతాయి లోకజ్ఞానాన్ని, జిజ్ఞాస పెంచుతాయి చైతన్యం విరబూయిస్తారు బాల సాహిత్య ప్రయోజనం ఇదే ఇది దీక్షితులుగారి రచనల వలన చాలా భాగం నెరవేరిందనే చెప్పాలి అంతేగాదు, దీక్షితులుగారి రచనలు తరువాతి తరం రచయితలకు మంచి ఒరవడి చూపాయి బాలసాహిత్యశిక్షణాశిబిరాలలో ఆధారగ్రంథాలుగా వినియోగపడ్డాయి వారు మరణించి మూడు దశాబ్దాలు దాటినా నేటికీ పిల్లలో వారి రచనలు ప్రచారంలో ఉన్నాయి అది రచయిత ప్రతిభకు, ప్రభావానికి, వారు ఆశించిన సామాజిక ప్రయోజనానికి గీటురాయి

బాలల ఉజ్జ్వల భవిష్యత్తుకై మనం వారికి అందించగలవి మంచిభాష, భావాలు గలవి, సంస్కృతీ, సంప్రదాయానికి వారసులుగా నిలిపే రచనలూ అందించాలి అది పెద్దల బాధ్యత

Let us give children the books

They need for better world

ఈ మార్గంగా చింతా దీక్షితులుగారి రచనలన్నీ తరతరాల బాలబాలికలకు ఎంతగానో వినియోగపడతాయి వారి సర్వతోముఖాభివృద్ధికి పరమపదసోపానాలుగా నిలుస్తాయి

**- వెలగా వెంకటప్పయ్య**

**ఆధారగ్రంథాలు**

1 దేవకి, యం కె తెలుగు బాలగేయసాహిత్యం, అనంతపురం రచయిత్రి, 1983 386 పు

2 ధనలక్ష్మి పి తెలుగులో బాలల నవలలు శ్రీకాళహస్తి మోహనరూప పబ్లికేషన్స్, 1986 244 పు

3 ప్రభావతి, గుడివాడ బాలకథాసాహిత్యం - విద్యావిలువలు గుంటూరు రచయిత్రి, 1994 31 పు.

4 రఘురామ్, మద్దాళి (సేకర్త) బాలసాహిత్యం - లక్షణాలు హైదరాబాదు కిన్నెర పబ్లికేషన్స్, 1981 54 పు

5 వెంకటప్పయ్య, వెలగా బాల సాహితీ వికాసం విజయవాడ సిద్ధార్థ పబ్లిషర్స్, 340 పు

# దీక్షితులుగారి చింతా

ఆ పేరులోనే ఉంది ఆ రచయిత వ్యక్తిత్వం అంతా చింతా దీక్షితులుగారు సుగృహీత నామధేయులు

నీతిగా బతకడం ఒకటి, నీతిగా బతకండ్రా అనడం ఇంకొకటి - ఈ రెండు పనులూ దీక్షితులుగారు తన ఒక్క చేతిమీద చేసినవే చలంగారిని "భగవాన్" సన్నిధికి చేర్చినందుకైనా ఈనాటి కుర్రకారు దీక్షితులుగారి పేరు గుర్తుంచుకుంటుంది నిజానికి మంచి గురించీ మేలిమి గురించి ఆయనకుగల దీక్ష సహజదీక్ష మాత్రమే ననిపిస్తుంది 'చెడ్డ'ను వదలి 'మంచికి' వచ్చి చేరుకునేందుకు ఆయన కంటకావృత మార్గాలలో పయనించలేదు పశ్చాత్తాపాగ్ని పరీక్షలకు లోనుగాలేదు "ప్రాడిగల్ సన్" కానూలేదు పరివర్తనంగానీ పురోగమనం గాని అక్కర్లేని యధాస్థితిలోనే ఆద్యంతమూ ఉండిపోయారనిపిస్తుంది

సోమయాజుల సంప్రదాయానికి జన్మతః వారసత్వం పుచ్చుకొని కూడా చింతా దీక్షితులుగారు సంసారాన్ని కంటగించుకున్నారు అమృతాంధసులనూ, అచ్చరలనూ, అందాన్నీ, ఆనందాన్నీ కంటగించుకోరేమోగాని, సురాభాండాన్ని మాత్రం బద్దలుకొడుతారు గాంధీగారు 'అవతరించక' ముందే దీక్షితులుగారు గాంధీప్రబోధాన్ని నోటబెట్టారు కల్లుదుకాణాల, సారాపాకల పికెటింగులింకా మొదలుకాకముందే, అక్షర పికెటింగు సాగించారు "కల్లు మానండోయి బాబూ!' అంటూ మొత్తుకుంటున్నారు

" అయ్యా,

మనదేశమం దదేమి పాపమోగాని పాశ్చాత్య సంసర్గము నానెనుండియు సురాపాన మధికమగుచున్నది పాశ్చాత్యులనేక లాభముల మన కొదవజేసిరి గాని సురాపానమును మాన్పనేమియు కృషి జేయఁకుండుటయేగాక వాని నభివృద్ధిలోనికి దెచ్చుటలో వారు ప్రధమ గారణులై యున్నారు మన పూర్వులెన్నడును విననట్టియు గనపట్టియు 'విస్కీ', 'బ్రాంది' మొదలుగాగల పెక్కు ద్రావకముల వారు దెచ్చుటయు వానిం జూచి ఆకసమునుండి దేవతలచేఁగొనితేబడిన యమృతమనియో లేక మోక్షదాయకంబగు మంత్ర జలంబనియో దలచి మన దేశీయులు కొందరు వెడగులై వాని నుపయోగించి యుచ్చైస్థితినుండియు నడుగంటుటఁజూడ మిగుల విచారమగు విషయముగ నున్నది గౌరవముగాంచి వన్నెకెక్కిన వంశములెన్ని దీనివలన నీటగలసినవి? నిరతము సంతోషనిలయములగు గృహములెన్ని గూఁలినవి? ఆరోగ్యభాగ్యము గలిగి సుఖించెడి మనుజులెందరు దీనివాతబడి దుర్బలులైరి? శ్రోత్రియులును తపోగరిష్టులగువా రెందరు దీనిచే శుచిశూన్యులై మనోబలరహితులై మన్నుగలసిరి? ఎందరు తృష్టబుద్ధిగల యౌవనులు తమ బుద్ధిబలమును గోలుపోయి విచారసాగర నిమగ్నులైరి? అక్కటా ! ఇట్టి దుర్గుణ నిలయంబగు సురాపానంబును ఏమఁ-టకేల ..ందియము సూనుదురు? మనోబల బుద్ధిబలముల బ్రేరేపించుననియు, శరీరమాంద్యత నశింపజేయుననియు బిచ్చియూహ నొకదానిని మనమునఁ బెట్టుకొని, యేలనిట్టి యగాధమందుబడి కృశించెదవు? ఓ దేశీయ సోదరుడా! ఏలనిట్టి చేయరాని కృత్యముల నొనరించి శరీరదార్ఢ్యమునను బోగొట్టుకొనియెదవు? 'శరీరమాద్యంఖలుధర్మ సాధన'మ్మను యార్యోక్తి మరచితివా? లేనియెడల శరీరారోగ్యమున

కాటంకము గలుగజేసెడియు,వాయుఃక్షీణత గలిగించునట్టియు పానమేల మానవు? అయ్యది పంచమహాపాతకములలో వొక్కటియని మరచితివా?

ఓ బ్రాహ్మణుడా! భూలోకదేవతయగు నీకిట్టి కృత్యము తగునా? నీ పూర్వుల చారిత్రమైన జ్ఞప్తికిఁదెచ్చుకొని సుఖంబుండరాదా? కర్మగరిష్టుండనయి సతతము నారాయణుని పాదారవిందమువలె శరణుఁజొచ్చియుండక నిట్టి కార్యమాచరింప శ్రేయస్కరమా? దేశలాభము కొరకైన నీ వట్టి కృత్యము మానవలదా? మతోద్ధారకులును, తపోగరిష్టులునునగు శ్రీశంకరాచార్య, శ్రీ రామానుజాది మహాపురుషులు నీ పూర్వులైయుండఁ వారి చరిత్రమునైనఁ దెలిసికొని బాగుపడుటకు మారుగా నిటులనుండ నుత్తమమా? ఓ క్షత్రియుడా? పౌరుషమున్న బేరుబెట్టిన నీ కిట్టి కార్యము ధనబల యశోవినాశముఁ గలిగింపదా? నీ రూపరేఖవిలాసములు నశింపవా? ఓ వైశ్యుఁడా! వాణిజ్య విద్యయందు వన్నె కెక్కుటకు మారుగా ధనమున్నదని తప్పుదారుల చరింపడగునా? పెద్దలు నిన్ను జూసి నిందింపరా? నీకీర్తికి భంగము కలిగించు కార్యముల నాచరింపశ్రేయమా? ఓ చతుర్ధవర్ణ సంజాతుఁడా? పున్నెము కొరకు దేశదేశముల దిరుగు నీ కిది పరమార్ధమున కేదైన త్రోవఁజూపించునా? అగ్రవర్ణ సంజాతుఁడను గాను కదా నాకేమియని నీకు నిరక్ష్యమా? హానికరములగు పనులదెస నీవు పోనగునా? సురాపానమోహితులగు వో దేశీయులారా! ధనమును కోలుపోవుటయె గాక శరీరదార్ఢ్యమును కూడ నీటఁగలిపి మీరేల సురాపాన మోహితులయ్యెదరు? కావలసిన భగవంతునిచే మన కొరకని నిబడిన యారోగ్యకరములగు పానీయముల నుపయోగింపవలదా? ఇట్లుజేయక సురాపానమొనరించిన మిమ్ము మీ యంతరాత్మ వేధించుట లేదా? ఏల నిష్కారణముగ నేమియు నెరుగని సతీపితల హృదయములు నిర్భిన్నములు గావింతురు? కాన నా సోదరులారా! ఇప్పుడైన మెలకువ గలిగి ధర్మాచరణ నిపుణులై, దేశము కొరకు పాటుపడుచు సురాపానాది దుష్కృత్యముల నొనర్పక వర్ధిల్లెదరు గాక! శుభమొదవుగాక!

రామారావు పేట — ఇట్లు, విధేయుఁడు
కాకినాడ — చింతా దీక్షితులు."

కృష్ణాపత్రిక (జనవరి 21వ తేది 1910 సంవత్సరం)లో సంపాదకలేఖ ఇది అచ్చుకి మచ్చుగా, అసలు దోషాలతో అచ్చుదోషాలతో సహా ఉన్నది ఉన్నట్లుగా అందించడమైనది

"దీక్షితులు"గారి చింత అంతా కల్లుముంత గురించే కాదు "ధార్మిక" జీవనం గురించి మాత్రమే

ప్ర సా దు పేరిట ప్రభుత్వ సారా దుకాణాలూ, లక్షలకొలదీ సారావేలంపాటలూ, బారు బుద్ధులూ బాహాటంగా పెరిగిపోయిన ఈ రోజుల్లో ఎవరు వింటారు పాపం చింతా దీక్షితులుగారి సోది?

తన "ధర్మం" తాను నెరవేర్చారాయన విని చెడినవారు లేరు. వినకచెడిపోతే పోయేరు అన్నట్లుగా తాను చెప్పవలసింది చెప్పారు అందుకే ఆయన దీక్షితులయ్యారు!

-- రాంభాణం

(ఆంధ్రజ్యోతి వారపత్రిక 15 2.74 నుంచి)

# బాల సాహిత్యము - బాలబంధు శ్రీ చింతా దీక్షితులు

**బా**ల సాహిత్య సృష్టి బహు విచిత్రమైనది అది తల్లుల దాదుల నోళ్లనుంచి అప్రయత్నంగా సహజంగా జాలువారి పుట్టుకొచ్చింది. పాటలూ, కథలు మొదలగు వాని రూపంలో నోటిమాటల్లో పుట్టి నోటి మాటల్లో పెరిగి ఆదరణనూ, ఆత్మీయతనూ ఆనందాన్ని అందించాయి అచ్చుయంత్రాలు వచ్చిన పిదప అవి పుస్తక రూపం దాల్చాయి

ఎంతో వ్యాప్తిగాంచిన ఈ వాఙ్మయం కొంతవరకు వెలుగు చూసింది శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారూ, శ్రీ గురజాడ అప్పారావుగారు, శ్రీ గిడుగు సీతాపతీ, శ్రీ వెంకట పార్వతీశ కవులూ మొదలగువారు బాలసాహిత్యవైతాళికులు వారి అడుగుజాడలలో నడచిన మహానుభావులు అందరూ చిరస్మరణీయులు

ఎంత కష్టమయినదానినయినా సరళ జాను తెలుగులో మధురంగా చిన్నారుల మనసులకు హాయిని కలిగించేటట్లు రూపొందించడంలోనే రచయిత నేర్పు, ఓర్పు ఇమిడి ఉంది దాన్ని పరిశ్రమించి పరిశోధిస్తే అది పైకి వస్తుంది బాలల్లో సృజనాత్మకతని, ఆలోచనాశక్తిని రేకెత్తించడం వలన అది రాణిస్తుంది

చింతా దీక్షితులుగారు అలాంటి బాలసాహిత్యాన్ని అత్యంత మధురంగా మృదువైన పలుకులతో మన చిన్నారుల కందించి తన మహనీయతను చాటుకొన్న చిరంజీవి తల్లీ బిడ్డల మధ్య అల్లుకునే అనురాగాన్ని జిలిబిలి పలుకులతో ఒకసారి వినినంతనే హృదయాలు స్పందించేటట్లు, ప్రతి ఇంట్లోంచీ ప్రతిరాత్రీ మినుకు మినుకుమనే చుక్కలకాంతిలో వినిపిస్తూ వీనులవిందు చేస్తున్నాయి

ఇంతటి మహోన్నతమైన మధురమైన సాహిత్యాన్ని సృష్టించి తెలుగుబాసలోని వెలుగులను అందరికీ అందించిన ఘనత శ్రీ దీక్షితులుగారికే దక్కింది తెలుగు సారస్వతశాఖల కెన్నింటికో ఆయన ఉపోద్ఘాతం కథకచక్రవర్తి అయిన ఆయన్ని గురించి చింతాకంతయినా తెలియని తెలుగువారుండరు ఆయన ఎప్పుడూ దిగులు అనేది ఎట్లాగుంటుందో ఎరుగక చిరుమందహాసం చిందిస్తూ ఆత్మీయతకు ప్రతిబింబంలా కనిపించేవారు బాలలకు ఎంత మేలు చేసామనే తపన తపస్సుతోనే ఆయన జీవితాన్ని తరింపచేసుకున్నారు పరమాత్మస్వరూపులయిన పిల్లలే కొలిచే దేవుళ్లని తనసర్వస్వం వాళ్లకే అంకితం చేశారు పేదలూ, అనాథలంటే ఆయనకు జాలి జాస్తి బురదలోనించి పుట్టిన కమలాలను కూడా ఎంత చక్కగా చిత్రించారోమరి.

"చిట్టి చిట్టి కమలాలు
చెరువులోని కమలాలు
నవ్వేటి కమలాలు
నాకు తెచ్చిపెట్టే
అమ్మ తెచ్చిపెట్టే ఆడుకుంటాను"

చిన్నికృష్ణుడంటే ఎక్కువ మక్కువ చూపని తల్లులే ఉండరు ఆ చిన్ని కృష్ణయ్యని ఎంత కమనీయంగా కన్నులకు కట్టేట్టు వర్ణించారో కాస్త వినండి

వీడేనమ్మా కృష్ణమ్మా
వీడేవీడే కృష్ణమ్మ
కాళ్లకు గజ్జెలు చూడండి
మొల్లో గంటలు చూడండి

మెళ్లో హారం చూడండి
తల్లో పింఛం చూడండి
వీడేనమ్మా కృష్ణమ్మా
వీడేవీడే అల్లరికృష్ణమ్మ

మధురిమకు మారు పేరయిన ఆ మధురానగర వాసుల లీలలు ఎన్నోరకాలుగా వర్ణించారు

చిన్ని కృష్ణుడు పుట్టాడు
చిట పట పువ్వులు కురిసాయి
చిన్ని కృష్ణుడు నవ్వాడు
తళ తళ మెరుపులు మెరిసాయి

చిన్న పిల్లలకు చిన్ని చిన్ని లేగదూడలతో ఆటాడుకోవడమంటే ఎంతో సరదా శ్రీ దీక్షితులుగారు ఎలా సెలవిచ్చారో గమనించండి

ఫక్కున సూర్యుడు నవ్వాడంటే
పట్టపగలు ఈ లోకమునకు
ఫక్కున చంద్రుడు నవ్వాడంటే
చల్లని వెన్నెల జగములకు
ఫక్కున పాపాయి నవ్వాడంటే
పరమానందం నీకూ నాకూ

అలానే రామాయణంలోని హనుమంతుని తోకను కూడా రమణీయంగా వర్ణించారు

రాముని బంటు హనుమంతులవారు
హనుమంతుడి కొక తోక ఉన్నది
అందమైన తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
పొడుగుపాటి తోక

ఇలాంటి మధుర మకరందాలనేకం దీక్షితులుగారు రచించిన లక్కపిడతలలో చవిచూస్తాం

అనాది నుండి తల్లులు తమ పిల్లల అందచందాలు చూసి మురిసిపోతుంటారు దోబూచులాడే అమాయకత్వాన్నంతా "లీలాసుందరి" కథలో ప్రతిబింబింప జేశారు ఆ కథ ఒక్కమారు చదివితే చాలు జీవితాంతం మరచిపోలేము ఇంకను వారి రచనలైన శంపాలత, సూరి, సీతి, వెంకి, బంగారు పిలక మొదలగునవి మళ్లీ మళ్లీ చదవాలనిపించే మధుర గుళికలుగా బాలసాహిత్యంలో చోటుచేసుకున్నాయి

సృష్టి సౌందర్యానికీ, మానవ ఔన్నత్యానికీ ప్రతిబింబాలూ, ప్రతి ఫలాలూ బాలబాలికలు సమాజపు మంచి చెడ్డలకు దిక్సూచికలు పిల్లలు పాలబుగ్గల పసిపాపలు రాబోవుతరం వారసులనే నిజాన్ని మరచిపోయింది నేటిసమాజం ఆ విషయాన్ని మరచి క్రూరత్వాన్ని, హింసని అసభ్యతను నాటకాల్లోను, సినిమాల్లోను, గి జా లోను ప్రదర్శించి ప్రచారం చేస్తూ నేటి సమాజాన్ని కొందరు చెడుదారి మళ్లిస్తున్నారు ఈ విషయాన్ని తల్లిదండ్రులూ, పెద్దలూ, మేధావులూ, ఉపాధ్యాయులూ గ్రహించి సమాజానికి తగు మేలు చేయాలి

చింతా దీక్షితులు వంటివారు ఈ లోకానికి యుగయుగాలకు అవసరమౌతూనే ఉంటారు సాహిత్యమనే నందనవనంలో దీక్షితులుగారి రచనలూ గేయాలూ, కథలూ, కృషి కలకాలం నిలిచివుంటాయి

తెలుగు జాతికి ఆయన రచించిన బాలసాహిత్యం మరపురాని, మరువలేని జాబిలి తెమ్మెరలా కాంతులు బాలలున్నంతకాలం విరజిమ్ముతూనే ఉంటుంది

శుభం భూయాత్

**-మద్దులూరి రామకృష్ణ**

# OPINIONS

"The first really creative writer who took keen interest in children's literature is Chinta Deekshitulu Fertile in imagination, quick in emotional responses, highly sensitive to beauty which he could spot even in the most trivial of objects like a broken and for saken doll, he was a perceptive writer a true poet, a born story teller In every thing he wrote there is same thing child like, a sense of wonder, a propensity to dream, a bubbling jest for life He revelled in the company of children, indeed, most of his life was spent amongst them either as a teacher or as an inspector of schools Writing for children was for him almost an act of self fulfilment He wrote for them not as an outsider, but as one who felt like them in every fibre of his being "

**- V.R.NARLA**

(From TRADITIONAL INDIAN CULTURE AND OTHER ESSAYS - page 111, 1967)"

"In course of time appeared the more attractive and more artistic songs and stories of Chinta Dikshitulu His Lakka Pidathalu (Laquered wooden toys) was a collection of his short poems for children.

Suri, Siti Venki attracted little children and his Hanumanthuni Toka (Tail of Hanuman) is a very humourous short poem composedin ballad metre. Lila Sundari is his master piece among short stories in prose for children"

**- DR. G.V. SITAPATI**

(History of TELUGU LITERATURE pages 274, 275 year 1968)

" . . . talented and gifted was Chinta Diskhitulu (1891) wose Lakka Pidatalu (Lacquer Bowls) became very popular among Telugu children Closely associated with child education and child psychology Dikshitulu composed his songs in such a fascinating and capturing language that they naturally fitted on to the lips of the young boys and girls "

**- DR. I. PANDURANGA RAO**

(Children's Literature in Indian Languages Sept 1982 - page 231)

# చింతా దీక్షితులు రచనలు

**I) బాల సాహిత్యం**

1 లక్కపిడతలు
2 సూరి, సీతి, వెంకి
3 గోపీమోహిని
4 శంపాలత
5 ఎన్నో చేస్తాను
6 బంగారు పిలక
7 లీలాసుందరి
8 శరబాల

**II) నాటికలు**

1 అనుమానంమనిషి
2 దీక్షితులు నాటికలు

**III) కథలు, నవలలు**

1 దీక్షితులు కథలు
2 హాస్యకథలు
3 వటీరావు కథలు
4. ఏకాదశి
5 చిత్రరేఖ (నవల)

**IV) కవితలు**

1 హరిణ దంపతులు 1923
2 కవికన్య

**V) శాస్త్రవిజ్ఞానం**

1 పరిణామవాదం
2 శాస్త్రవేత్తలు

**VI) ఆధ్యాత్మికం**

1 నివేదన
2. ఉపదేశామృతం
3 భగవద్గీత

**VII) సాహిత్య విమర్శ**

ప్రజావాఙ్మయం

**VIII) అనువాదాలు**

1 మనభారత్
2. ప్రపంచచరిత్ర

## చింతా దీక్షితులు శత జయంతి ఉత్సవ సమితి

### కార్యవర్గ సభ్యులు

**అధ్యక్షులు:**

మద్దులూరి రామకృష్ణ

**ఉపాధ్యక్షులు**

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య
మద్దిపట్ల వెంకట్రావు
మసూనా
డాక్టర్ రావూరి భరద్వాజ
ఎస్ ఎమ్ కొండయ్య
డి సుజాతాదేవి
టి లీలా వేంకటేశ్వరరావు

**కోశాధికారి:**

రెడ్డి రాఘవయ్య

**కార్యదర్శి:**

బుడ్డిగ సుబ్బరాయన్

**సభ్యులు .**

ఎస్ కృష్ణమాచారి
వల్లూరి శ్రీనివాసరావు
టి కే వి కృష్ణమాచారి
బుర్రా సుబ్రహ్మణ్యాం
చౌక్కాపు వెంకటరమణ

# చివరిగా నా మాట

**మా**దీ నర్సాపురమే కనుక చింతా దీక్షితులు గారిని ఆయన చివరి రోజులలో చూచే భాగ్యం కలిగింది (1960) అంతకు ముందు ఆయన రచనల్ని ముఖ్యంగా - పిల్లల రచనల్ని చదివి ఆనందించేవాణ్ణి. ఆ తరువాత శ్రీ కొత్తపల్లి సుబ్బరామయ్యగారు (కల్చరల్ బుక్స్ లిమిటెడ్) దీక్షితులుగారి రచనల్ని ముఖ్యంగా - 'లక్కపిడతలు', 'ప్రపంచచరిత్ర' ప్రచురించినప్పుడు వాటిని చదివే అవకాశం కలిగింది అప్పుడు ఆయన పట్ల మరింత గౌరవం అభిమానం పెరిగింది నేను బాలల అకాడమీ కార్యదర్శిగా ఉన్నప్పుడు (1976 - 88) దీక్షితులుగారి బాలసాహిత్యాన్ని ఈ తరంవారికి పరిచయం చేద్దామనే ఉత్సుకత సఫలీకృతం కాలేదు, కారణాలేమైనా.

ఇలా ఉండగా, దీక్షితులుగారి శతజయంతి 1991 రావడం వెళ్లిపోవడం కూడా జరిగాయి ఆయన 1891, సెప్టెంబరు 1న జన్మించారు వాస్తవానికి దీక్షితులు గారి శతజయంతి 1991 లోనే జరపవలసి ఉంది కాని కారణాంతరాల వల్ల జాప్యం జరిగింది 108 సంవత్సరాల లోపున శతజయంతి సభ జరపవచ్చునని పెద్దల మాటగా ఇప్పుడు తల పెట్టాము 1994లో బాలబంధు మద్దులూరి రామకృష్ణగారు ఆలస్యమైనా మనం దీక్షితులుగారి శతజయంతి నిర్వహించాలని సూచించారు దీక్షితులుగారి పట్ల ఉన్న అభిమానంవల్ల నాకూ చెవులు మెదిలాయి ఆయన తాలూకు విషయసేకరణకై ప్రయత్నించగా నర్సాపురంవాసి, నా క్లాస్మేటు అయిన అయ్యగారి నర్సింహమూర్తిని సంప్రదించాను ఆయన కొన్ని పేర్లు చెప్పారు అందులో చింతా దీక్షితులుగారి బావమరిది శ్రీ గూడా నరసింహం (నర్సాపురం), గూడా బాలంభొట్లు ప్రభృతులున్నారు మొత్తం మీద అటు (మార్చి 1994) నర్సాపురం వెళ్లినప్పుడు శ్రీ నరసింహంగార్ని కలిసినప్పుడు దీక్షితులుగారి కుటుంబసభ్యుల అడ్రసు లిచ్చారు దరిమిలా మద్రాసు వెళ్లినప్పుడు మాన్య మిత్రులు ఎస్ ఎమ్ కొండయ్యగారి సహాయంతో దీక్షితులుగారి కుమారుడు శ్రీ మల్లికార్జునమూర్తి గార్ని కలిసి వారినాన్నగారి శతజయంతి గురించి ముచ్చటించాను వారు కూడా స్పందించి తోడ్పడుతానని మాట ఇచ్చారు. ఇది ఇలా ఉండగా అసలు శతజయంతి తలపెట్టిన మద్దులూరివారు విదేశాలకు వెళ్లడంతో నా ప్రయత్నం కుంటుపడింది మరల ఆయన 1996లో స్వదేశానికి తిరిగిరాగానే ఏప్రిలులో

దీక్షితులుగారి శతజయంతి గురించి పునరాలోచన చేశాం

ఈ ఏడాది ఏప్రిలు నుంచి ఈ విషయమై తీవ్రంగా పని ప్రారంభించాము అప్పటినుండి నర్సాపురం మిత్రులను సమీకరించి సంప్రదింపులు జరిపాము. ఈ విషయంలో ముఖ్యంగా దీక్షితులుగారి రచనలు ఏవీ ఇప్పుడు సర్క్యులేషన్‌లో లేవు, ఒకటి, అర తప్ప అందుకని ఆయన రచనలలో కొన్నిటిని ఎంపిక చేసి, ఒక సంకలనంగా ఈ శతజయంతి సందర్భంలో ఆవిష్కరింపజేయాలని మిత్రుల సూచన ఈ మేరకు 'బాలసాహిత్య పరిణామమ'నే విషయంపై పరిశోధనలు జరిపి పి హెచ్.డి. పట్టా పొందిన డాక్టరు వెలగా వెంకటప్పయ్య అధ్యక్షతన ఒక సంపాదక మండలి ఏర్పాటు చేశాం. మొత్తంమీద ఈ మండలి కృషి ఫలితంగానే ఈ సంకలనం ఈ రూపంలో వెలువరించగలిగాం. ఈ సందర్భంలో ముఖ్యంగా పేర్కొనదగ్గ విషయం - శ్రీ ఎస్. ఎమ్. కొండయ్యగారు అందించిన సలహా సహకారాలు. వీరు అనూగ్రాఫిక్స్ అధినేతలు. తెలుగు అక్షరాలను వినూత్న ఫక్కీలో రూపొందించి అందించారు వారి చొరవతోనే ఈ సంకలనం ఖర్చును కూడా భరించి ముద్రింపించి శతజయంతి ఉత్సవసభకు మూడువందల కాపీలు అందించారు

ఇక హైదరాబాద్‌లో ఉన్న నర్సాపురవాసులు మద్దిపట్ల వెంకటరావు, టి కె వి. కృష్ణమాచారి, ఎస్ కృష్ణమాచారి, వల్లూరి శ్రీనివాసరావు ప్రభృతులు నాకు ఈ కృషిలో ఎంతో చేదోడు వాదోడుగా ఉన్నారు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ ఉన్నతాధికారి శ్రీమతి టి లీలావేంకటేశ్వరరావుగారు దీక్షితులుగారి పేరు స్థిరస్థాయిగా ఉండాలనే ఉద్దేశంతో శాశ్వత నిధిని ఏర్పాటుచేయడానికి ఎంతో ఉత్సాహంతో పూనిక వహించారు ఆమెకు నా కృతజ్ఞతలు ఈ శతజయంతి తలపెట్టినప్పటినుండీ నా వెంటే ఉంటూ సలహా, సహకారాలు అందించిన బాలసాహితీవేత్త శ్రీ రెడ్డి రాఘవయ్యగారి కృషి లిపిబద్ధం చేయవల్సి ఉంది వారికి నా కృతజ్ఞతలు.

**- బుడ్డిగ సుబ్బరాయన్**

చింతా దీక్షితులు శతజయంతి ఉత్సవ సమితి
తెలుగు బాలల రచయితల సంఘం
సంయుక్త ఆధ్వర్యంలో

# చింతా దీక్షితులు శతజయంతి ఉత్సవాలు



1891 - 1960

**శతజయంతి ఉత్సవ సభ**

బాలసాహిత్య రచయితల సదస్సు,

చింతా దీక్షితులుగారి రచనల సంపుటి విడుదల,

బాలసాహిత్యవేత్తలకు సత్కారం

**తేదీ** 20 సెప్టెంబర్ 96 శుక్రవారం
సా 4 గం లకు

**వేదిక** : లిటరసీ హౌస్
ఆంధ్ర మహిళాసభ, విద్యానగర్
హైదరాబాద్ - 500 007

**ముఖ్య అతిథి**
**ఆచార్య నాయని కృష్ణకుమారి**
వైస్ చాన్సలర్, తెలుగు యూనివర్శిటి